కవిరాజ శ్రీ మహాకవి మండపాక విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ప్రథమ సంపుటము
## (ఆది । సభా, పర్వములు)



మండపాక చినజోగిరాజు

కవిరాజ శ్రీ మహాకవి మండపాక విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ప్రథమ సంపుటము

## (ఆది । సభా, పర్వములు)



మండపాక చినజోగిరాజు

**కవిరాజ శ్రీ మహాకవి మండపాక విరచిత**

# శ్రీమదాంధ్ర మహాభారతము


| | | |
|---|---|---|
| ప్రథమ సంపుటము | : | 24.12.2023 |
| ప్రతులు | : | 100 |
| మూల్యం | : | రూ. 200 |




డి.టి.పి : లాహిరి పబ్లికేషన్స్
డోర్‌నెం.3–33, గోపాలకృష్ణ అపార్ట్‌మెంట్స్,
కుకట్‌పల్లి, హైదరాబాద్ – 500072
సెల్ : 8688553902
మెయిల్ : laahiripublications@gmail.com

ముద్రణ : శ్రీ వారాహి ఆఫ్‌సెట్ ప్రింటర్స్
రామా టాకీస్ రోడ్, శ్రీనగర్, విశాఖపట్నం – 530016

# శ్రీమదాంధ్ర మహాభారతము

## అవతారిక

పూర్వ పుణ్యమ్ము పురుషార్ధ భోగపరత
జన్మ నిచ్చిన తలిదండ్రి జనక గురుడు
వంశ విఖ్యాతి పల్కినా వరదు కరుణ
అడుగు జాడల మది నెంచి నధిక యుక్తి
వారిజాసను హరిహరాద్ వరదు భక్తి
హంసవాహని వాగ్దేవి అభయముంట
కావ్యకర్తగ గణుతింప గడగనౌచు
ఆంధ్ర జనముల భాగ్యంపు అభిమతాన
ఆంధ్ర మహాభారత గ్రంధమ్ము నవతరిస్తి
పారమార్ధిక చింతనం బరగు ప్రీతి

## అంకితము

అంకితమ్మిది యీ జన్మ కాద్యులైన
జన్మ జన్మల తలిదండ్రుల్కు జగతి బర్వ
హరిహరాద్వైత సందీప్త మఖిల తేజ్కి
యేడుకొండల వశియించు యేడుగడకు

**మండపాక చినజోగిరాజు**

**M.Jogiraju**
Head Post Master (Retd.)
Visakhapatnam

## తమ్ముడికి
## అభినందన చందనం

వ్యాస మహర్షిచే రచింపబడిన మహాభారతము భారతీయ సంస్కృతీ సాంప్రదాయ సుహృద్జన జీవనమునకును రాజనీతికిని జీవగర్ర. గొప్ప సాహిత్య గ్రంధము. ఇహపర సాధనానుకూల విజ్ఞాన సర్వస్వము. పంచమ వేదము. గొప్ప ప్రామాణిక గ్రంధము. భారత జాతీయతకే గర్వ కారణము. దీనిని

వ్రాసిన చదివిన విన్నను
ఆసించిన ఫలము లొదవు ఆత్మ ద్యుతియున్
చేసిన పాపములు తొలగు
భాసిల్లును మనుజ జన్మ పావన మగుచున్

క్రీ. శ. 11 వ శతాబ్దిలో రాజరాజ నరేంద్రుడు అనే చాళుక్య చక్రవర్తి కాలములోనే తెలుగు భాషాభివృద్ధికి ప్రాతిపదికగా ప్రారంభింపబడి కవిత్రయము వారిచే అనువదింప బడినది. మరల వేయేండ్ల తరువాత యీ 21 వ శతాబ్దిలో చిరంజీవి మండపాక చిన జోగిరాజు (మా తమ్ముని) చే వ్రాయబడి ఉన్నందులకు ఎంతో ఆనందముగానూ సంతోషము గానూ ఉన్నది. మా వంశమునకు ఎంతో వన్నె తెచ్చిన విషయము.

మన ఆంధ్ర భాష చాలా గొప్పది. ఇందు సంస్కృత భాషలో లేని అష్టావధాన, శతావధాన ప్రక్రియలు కలవు. 15 వ శతాబ్దిలో వినుకొండ వల్లభరాయుడు మరియు ఆంధ్రభోజునిగా పేరుపొందిన బహుభాషా కోవిదుడు

కవి, పండితుడు అయిన శ్రీకృష్ణ దేవరాయలచే **"దేశ భాషలందు తెలుగు లెస్స"** అని వేనోళ్ళ కొనియాడ బడినది. శ్రీ కృష్ణ దేవరాయల వారి పాలనా కాలము ఆంధ్రజాతి ఔన్నతికిని భాషాభి వృద్ధికిని వన్నె తెచ్చిన దనుట నిర్వివాదాంశము. ఈ నాడు తెలుగు – ఆంధ్రభాషలను పెంపొందించుకోనగు ఆవశ్యకత తలయెత్తినది. కావున యావన్మంది త్రిలింగాంధ్రావనీ ప్రజలేకాక విదేశాలలో ఉన్న ఆంధ్ర జాతీయులు అంతా ఏకోన్ముఖులు కావలసిన తరుణమిది. ఇది తెలుగు వారందరి బాధ్యత.

"సర్వే జనా సుఖినో భవంతు"

---------

**కవిసామ్రాట్, కళాప్రపూర్ణ**
**శ్రీ విశ్వనాధ సాహితీ సంఘ ఆవిష్క ర్త.**
**B.A. Rao, (B.A)**
Retd. S.C. Rly**.** Bitragunta

## గురుతర గౌరవాభినందనలు

నా పల్కులు సత్యము లగునట్లుగా శ్రీవేంకటేశ్వరుడు నన్నును మిమ్ములను అనుగ్రహించు చున్నాడనుట స్పష్టమైనది ఈనాడు.

ఉ. ముందుగ వెంకటేశ్వరుని ముచ్చట పెండ్లితొ కావ్యకర్తవై
దెందము నిండ రామ విభుడేమి వరమ్ముల నిచ్చె కందముల్
అందముగా రచిస్తివల అందరు మెచ్చగ ఆది కావ్యమా
చంద్రుడు తారకా గణము చందము వర్ధిలు యెల్లకాలముల్

చ. వరమది రామలింగ కవి వాద చమత్కృతి కృష్ణరాయ తి
మ్మరసుల శౌర్య ధీధితులు మాన్యులు పెద్దన తిమ్మనార్యుడున్
నెరపిన భువ్నవిజ్యమది నీ మది నాటకమై వెలింగె సు
స్థిరమతి భారతమ్ము నిక ధీరత మెచ్చగ పూర్తి గావుతన్

ఉ. శ్రీయుత మూర్తి కేశవుడు చిత్రకళానిధి సాహసుండు శో
భాయుతు జోగిరాజు గుణభాస్కరు పండితు కావ్యకర్తకున్
ఆయువు సంపదల్ అభిమతార్ధత గూర్చుత సంతతాదరా
మేయ కవిత్వ గోష్టులతొ మేదిని గ్రుమ్మరు శక్తి నిచ్చుతన్

---------

**P.Ramamohana Rao**

(M.A.B Ed), Vidvan, Retd Telugu Pandit, Rlys**.**

Hyderabad.

# కృతి, కృతికర్త ప్రశంస

శ్రీ మండపాక చినజోగిరాజుగారు వ్రాసిన శ్రీమదాంధ్రమహాభారతము హిందూదేశ చరితాత్మక సాంస్కృతిక సాహిత్య గ్రంధము. వీరి భాషాసేవ యెంతయో యెన్నతగ్గది. ఈ భారతరచనమును తిలకించిన వీరిపాండిత్య కవితారీతులు పూర్వాంధ్ర కవి, పండితులను తలపించును. మరియు ఈ నాటి జనానీకములకు అర్థమగునట్లు సులభ శైలిలో వ్రాసిరి. నిరాడంబరులు. ఋషితుల్యులే కాదు పేరుకు తగినట్లు యోగవిద్యా సంపన్నుడు. కందమునం అందె గొనిన కవితా గురువు.

క. కవియును పండితు డీతం
డవిరళ గతి పద్యమల్లు ఆఢ్యుడు మరియున్
సవినయుడు జనవినుతుడు
కవికుల సంజాత గురుడు సద్గుణ శీల్డున్

తే. ఆంధ్ర వాఙ్మయ సువిశాల అంతరంగ
పూర్వ పుణ్యమ్ము వాగ్దేవి పూజనీయ
ఆది కావ్యమ్ము భారతమ్మలర జేసి
వ్యాస వాల్మీకి మునివరు వాసికెక్క

ఉపనిషద్సార రచనాభ్యుదయ విదిత–ఆఢ్య **కవిరాజ శ్రీ** బిరుదులందినాడ
ఆంధ్ర భాషాభిజ్ఞు వనగ వినమె–సరస సద్గుణ కవులంత సంస్తుతింప
యోగివరేణ్య మహనీయ జోగిరాజ

---------

Acharya Sarvabhouma
Prof. Vedula Subrahmanya Sastri
.A. Ph.D. (Telugu), M.A. Ph.D. (Sanskrit)
Retired Professor & Former Head of the Dept. of Telugu
Andhra University, Visakhapatnam.

''SaradaPeetham"
D.No.46-15 Dondaprti
Cell: 9490084217

# . ఆప్త వచనం

భారతీయ సంస్కృతి సర్వస్వానికీ మూలం వేదవాఙ్మయం. వేదోక్తి పరమ ధర్మాన్ని కథా రూపంలో వాల్మీకి మహర్షి శ్రీమద్రామాయణంగా, వ్యాసర్షి మహా భారత భాగవతాలుగా లోకానికి అందించారు. "భారతం పంచమో వేదః " అని ప్రసిద్ధి పొందింది.

వ్యాసమహర్షి సంస్కృతంలో రచించిన ఆ మహాభారతాన్ని నన్నయ తిక్కన ఎఱ్ఱన అనే కవిత్రయం చంపూరచనగా అనువదించినారు.ఆ అను వాదం వివిధ భాషలలో వెలువడిన అనువాదాలు అన్నింటిలోమూలానికి సన్నిహితంగా ఉన్నదని విద్వ త్ప్రశంసలు పొందింది. అది ఆంధ్ర జాతికి అపూర్వమైన కల్ప వృక్షం. కవిత్రయ భారతం ఆవిర్భవించిన తర్వాత మర ల పద్య కావ్య రీతిలో అనువదించడానికి పూనుకోడం సాహసమే అవు తుంది. పుంభావ సరస్వతిగా పేర్కో దగ్గ కవి సార్వభౌమ శ్రీపాద కృష్ణ మూర్తి శాస్త్రి గారు అనువదించి కృతార్థులైనారుగాని అది సాహిత్య చరి త్రలోనే నిలిచింది. సాహితీ లోకంలో ప్రచారాన్ని పొంద లేకపోయింది.

మధుర కవిగా వాసిగాంచిన మాన్యులు శ్రీ మండపాక చిన జోగి రాజు గారు గొప్ప సాహితీ ప్రియులు. ఆబాల్యమూ పద్య రచనలో ఎన లేని ఆసక్తిని చూపుచున్నవారు. ఇతః పూర్వం రామ కథను "కంద పద్య రామాయణంగా" శ్రీనివాస కల్యాణ వృత్తాన్ని " వేంకట రమణ శతకం" గా పద్య కావ్యాలు రచించారు. భువన విజయ కావ్య రచన ద్వారా రాయల సాహితీ గోష్ఠిని ఆస్వాదింప జేసారు.

పద్య రచనా వ్యాసంగ ప్రియులు. కాబట్టి నేడు పద్ధెనిమిది పర్వము ల మహాభారతాన్ని పద్య కావ్యంగా ఆసక్తితో రచించి కృతార్థు లైనారు. తొంబది మూడు సంవత్సరాల వయస్సులో ఆరున్నొక్క సంవత్సరాలుగా ఆ భారత సంహితని తెనుగు పద్య కృతిగా రూపొందించిన వారు సర్వ జన సమభినంద్యులు. త్వరలో సంపుటులు అచ్చు వేయించి వెలువరింప నున్నారు. తనదైన అనుభూతి తనది గాన కవిగారి ఈ భారత రచనకి మూలం కవిత్రయ భారతం. అవతారికలో కవిత్రయం వారిని గురువులు గా భావించి వారి మార్గాన్ని ప్రీతితో అనుసరిస్తున్నట్లు పేర్కొన్నారు.

క. నన్నయ తిక్కన నెఱ్ఱన
నెన్నో రీతుల దలపగ నెంతో ప్రీతిన్
యెన్నంగా వ్రాయదలచి
మన్నింపుచు వారి జాడ మద్గురులనుచున్

ఇక ఆది పర్వ రచనా విశేషాలని సమీక్షిద్దాం.

కావ్య రచనకి ప్రతిభా వ్యుత్పత్తి అభ్యాసము అనేవి హేతువులని అలంకారికులు పేర్కొన్నారు కాని జగన్నాథ పండితుడు రసగంగాధరంలో "తస్య చ కారణం కవిగతా కేవలా ప్రతిభా" అని నిర్ణయించినాడు. బాల్యంలో పద్య రచన చేస్తున్న వారిలో పాండిత్య అబ్యాసాలు ఉండవు కదా. అని ఉపపత్తిని ప్రదర్శించి తన వాదాన్ని సమర్థించుకొనినాడు. అ ది సమంజసమే కాని వ్యుత్పత్తి కూడా ఉన్నప్పుడు ఆ కావ్యము ప్రమాణ బద్ధం అవుతుంది. విద్వదామోద ముద్ర పొందుతుంది. " విద్వత్కవయః కవయః" అని నానుడి. మాన్యశ్రీ మండపాక చిన జోగిరాజుగారు తమ కు గల ప్రతిభను పురస్కరించుకొని కావ్య రచనలో నిమగ్ను లైనారు.

ఆదిపర్వములోని కథా భాగములలో కచ దేవయానీ వృత్తాంతం ప్రసిద్ధమైనది. కథలో నన్నయ "వాడి మయూఖములు గల్గువాడపరాంబు ధి క్రుంగె........"అని రచించిన పద్యం ప్రచారంలో ఉన్నది. ఈ రచయిత నన్నయ గురుత్వాన్ని గ్రహించిన వారు కాబట్టి ఆ రచనా విధానం అను సరించి " ఇనుడస్త్రాద్రిని క్రుంగె......" అనే పద్యాన్ని చక్కగా రచించినారు. నన్నయ రచనలో కచునిపై దేవయాని అనురక్తి వాచ్యంగా చెప్పలేదు. ఈ కవిగారు " ఆటపాటలతో గూడి.." అనే పద్యంలో ఆమె చెలిమినిసూచిం

చారు భారతంలో శకుంతలోపాఖ్యానం ఎంతో విశిష్ఠమైనది. దాన్ని ఆధా రంగాచేసికొని దుష్యంతుని పాత్రకు ఉత్కర్ష కల్గేటట్లు దుర్వాసుడనే ముని కోపాన్ని శాప వృత్తాంతాన్ని కల్పించి కాళిదాసు విశ్వ విఖ్యాతి పొందిన అభిజ్ఞాన శామకుంతలం అనే నాటకాన్ని రచింపగా ఆ శాకుంతలం లో ని కథని ఈ భారత రచనలో కవిగారు అధికంగా పెంచి కథను మార్చి రచించడం విశేషం.

భారతంలోని వివిధ పాత్రల తత్వాన్ని చక్కగా ఆకళింపు చేసుకొన్న వారు ఈ కవిగారు. కాబట్టి వాటిని వర్ణించడంలో సామర్థ్యాన్ని ప్రదర్శిం చారు.శంతనుని వ్యక్తిత్వాన్ని "తన బాహు విక్రమ గర్వంబు తెలియంగ.." అనే పద్యంలో వర్ణించారు.మహాభారతాన్ని రచించడమే కాకుండా పెక్కు సందర్భాలలో ప్రత్యక్షమై  కథను నడిపిన మహాత్ముడు వేదవ్యాస మహర్షి ఆ మహానీయుని రూప వైభవాన్ని " అర నెర జడముడి..." అనే పద్యం లో సహజ సుందరంగా అభివర్ణించారు. అట్లే కుంతి సౌందర్యాన్ని గుణ గణాల్ని "అపురూప లావణ్య అపురూప సుందరి.." అనే పద్యంలో వివరి ంచారు. వధువుకి ఉండ వలసిన లక్షణాలని ఆ వర్ణనలో నిరూపించారు పాండురాజు మరణానికి కారణమైన మాద్రీ సంగమానికి ఉద్దీపకంగా ఉ న్న వసంత శోభని నన్నయ " కమ్మని లరాంతములకు మొనసి.." ఆనే ప ద్యంలో లయగ్రాహి వృత్తాలలో నిర్వహించినారు. ఈ కవిగూడా ఆ మా ర్గాన్నే అనుసరించి "ఋతురాజు అమితంపు జగమెల్ల.." అనే లయవిభా తి వృత్తాలలో అభివర్ణించారు. నన్నయ శిష్యత్వాన్ని నిరూపించారు.
బాల్యం నుండి క్రీడలలో   ధార్తరాష్ట్రులకు పాండవులతో వైరం యెట్లు ఆరంభమైనదో " చెడుగుడు పందాలు చేర్చుక్క రేచుక్క.." ఆటలందున ధార్తరాష్ట్రులు అనే పద్యాలలో పరిచయం చేసారు.
కుమారాస్త్ర విద్యా ప్రదర్శన సందర్భంలో అర్జునుని అస్త్రవిద్యా కౌశలాన్ని "ఏకబాణమ్మున దశ శత సహస్ర ఏర్పడ.." అనే పద్యంలో  పరమ రమ ణీయంగా వర్ణించారు.

హిడింబాసుర వధ కథా సన్నివేశాన్ని వర్ణిస్తూ ఆ అసుర రూప భీకర త్వాన్ని, క్రౌర్యాన్నీ "బహుకోప కోపిత బండ బారిన దంష్ట్ర.." అనే పద్యం లో ఈ రచయిత అద్భుతంగా చిత్రీకరించారు. భీముని సౌందర్య గరిమ

ని కూడా " నూనూగు మీసాల నూత్న యౌవనుడౌచు.." అనే పద్యంలో హృదయంగమంగా నిరూపించారు.ద్రౌపది అయోనిజ. యాగాగ్ని సంభూత. అతిలోక సుందరి. స్వయంవర సభలో ఆమె అపురూప వైభవాన్ని " పారాణి దిద్దిన పదములు.." అనే పద్యంలో ప్రబంధోచితంగా వర్ణించార నగరాలలో ఇంద్రప్రస్థం పరమ సుందరమైనది. అని దేవ శిల్పి విశ్వకర్మ నిర్మితం. పాండవులను అడవులపాలు చేయడానికి కారణభూతమైనది దాని అనుపమ రమణీయతను మధురవ బంధంతో " విరబూసిన తరు లతలన్.." మున్నగు పద్యములలో విపులంగా వర్ణించి తమ నైపుణ్యాన్ని ప్రదర్శించారు. ఒడంబడికను అనుసరించి అర్జునుడు గావించిన తీర్థ యాత్రా విశేషాలని రచయిత " దీన నీకు తుతవిధాన కంటె.. మహనీయంబగు" అనే సుదీర్ఘ వచనంలో రచించి వచన రచనలో తమ అసమాన్య ప్రతిభను ప్రదర్శించారు.

ఖాండవవన దహన సన్నివేశ రచనా సమదర్భంలో అగ్ని దేవుడు శ్రీ కృష్ణునకు ఒసంగిన చక్రం యొక్క ప్రాభవాన్ని " మహనీయ మనోజ్ఞ .." అనే పద్యంలో రచయిత అభివర్ణించారు. సీస పద్య రచనలో నిర్వహిమచడం ఈ రచయిత ప్రత్యేకత అని ప్రస్ఫుటం అవుతోంది.ఆది పర్వాన్ని మహాకావ్య పద్ధతిలో రచించడంలో శ్రీ మండపాక చిన జోగిరాజు గార కృతకృత్యులు. మత్త కోకిల, తరలం, ద్విపద, లయవిభాతి వంటి విశేష వృత్తాలు కూడా ఈ రచనకు అందాన్ని చిందిస్తున్నాయి. అన్నుల మిన్న వంటి అందమైన తెనుగు నుడికారాన్ని కుడా అక్కడ
క్కడ రచయిత ప్రదర్శించారు.

ఈ భారత రచనని కవిగారు కవితాధారతో పూర్తి చేస్తూ పదప్రయోగం మాత్రం ఎంతో స్వేచ్ఛని ప్రదర్శించారు. యడాగమ నుగా గమాదులను యదేశ్ఛగా ప్రయోగించారు. అంతే కాదు మేన్మ, తలిదండ్రి, చేయవస్తి, హిడింబ్దు, ఉద్ధరిస్తివి, వాసుదేవ్కు, పుట్రి, వస్త్వి వంటి ప్రయోగాలు ఈ రచనలో అడుగడుగునా దర్శన మిస్తాయి. లక్షణ విరుద్ధమైన ఇట్టి ప్రయోగాలు అవశ్యం పరిహరిణీయాలు.

సహృదయ పాఠకులు పదప్రయో గసాధుత్వంపై దృష్టి సారింపకుండా భారత రచనా చమత్కృతులను ఆస్వాదింతురు గాక! వయోధిక్యాన్ని

లెక్క చేయకుండా పద్ధెనిమిది పర్వాల మహాభారతాన్ని రచించిన కవిగారి కి హృదయపూర్వక నమస్సు మనస్సులు.

శుభం భూయాత్.

**విద్వజ్జన విధేయుడు**

**వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి**

**Dr. H.S.Brahmananda**

**Retd. Professor. Sri Krishna Devaraya University, Anantapur.**

## ఆమోదము

మహాభారతమును తెనుగున వ్రాయుట అన్నది సామాన్యవిషయము కాదు. దైవ కృపతో కూడుకున్న పురాకృత పుణ్యవిశేషము. సామాన్యులకు అలవికానిది. శ్రీ జోగిరాజుగారు దీనిని రచించుటకు యేడుసంవత్సరము లు పట్టినదనినారు. వీరియీ ఆంధ్రమహాభారత గ్రంథ రచనపూర్వ కవు ల రచనలతో సరితూగగలదని నా అభిప్రాయము. రచన బహుసరళము ధారాశుద్ధి, భావార్ధ గాంభీర్యము కలది. వచనము కూడ అలవోకగాసాగి నది. వీరి రచనలో కొన్నిపట్టుల నూత్నపోకడలు కనబడుచున్నవి.కందము లనిన వీరికి యెక్కువ ప్రీతి. కవిత్రయము వారి తరువాత వేయేండ్లనాడు నేడు మరల **ఆంధ్ర మహాభారత పద్య రచన** గావించిన ధీవిశాలి. ఎంత యు ప్రశంసాపాత్రుడు. వీరి కలము నుండి ఇంతకు మించిన గ్రంధము లు వెలువడగలవని ఆశించుచున్నాను.

---------

# శ్రీ మహాభారత రసార్ణవం

డా॥ ఆర్. అమర్‌సింగ్ నాయక్
ప్రొఫెసర్ ఆఫ్ మెడిసన్ (రిటైర్డ్)
ఆంధ్రా మెడికల్ కాలేజ్
విశాఖపట్నం

భగవాన్ వేదవ్యాస మహర్షి కృత శ్రీ మహాభారతం ప్రపంచ వాఙ్మయంలోనే సాటిలేని గ్రంథంగా గణుతికెక్కింది. "భారతః పంచమో వేదః" అని కీర్తింపబడింది. వేదంలో యే ధర్మం బోధింపబడిందో, యే జ్ఞానం పొందుపరచబడిందో, ఆ దర్మాన్ని, ఆ విజ్ఞానాన్ని గొప్ప ఇతిహాసంగా మలచి, ఇక్షురస పానకంగా,సర్వ జనరంజకంగా అందించారు వ్యాస మహర్షి.

మహాభారత ప్రాశాస్త్యాన్ని తెలియజేస్తూ పెద్దలు "యదిహాస్తి తదన్యత్ర, యన్నేహాస్తి నతత్క్వచిత్" "మహాభారతంలో ఉన్నది మరోచోట ఉండవచ్చు కాని, అందులో లేనిది మరెక్కడా ఉండదు" అని సెలవిచ్చారు.

సూక్ష్మమైన ధర్మ విషయాల్ని నిర్ణయించడానికీ, వాద ప్రతి వాదాలు తలయెత్తిన చోటా, ప్రమాణంగా భారత ఇతిహాసమే భాసిస్తోంది.

"వేదములకు నఖిల స్మృతి
వాదములకు, బహుపురాణ వర్గంబులకున్
వాదైన చోటులను దా
మూదల ధర్మార్థ కామమోక్ష స్థితికిన్"

అని తిక్కన గారు, ధర్మార్థ కామమోక్ష సూక్ష్మాంశాల్లో వివాదం తలయెత్తితే, భారతమే ప్రమాణమని నిర్ధారించారు.

అటువంటి విజ్ఞాన సర్వస్వమైన సంస్కృత భారతాన్ని కవిత్రయంగా కీర్తిగాంచిన నన్నయ్య, తిక్కనామాత్యుడు, ఎర్రాప్రెగ్గడ మహనీయులు ఆంధ్రీకరించి, ఆంధ్రభాషకు, తెలుగు జాతికి కావించిన మహోపకారం వేనోళ్ల కొనియాడదగింది.

నన్నయ్యభట్టు ఆంధ్రీకరణలో సంస్కృత భారతాన్ని అనుసరిస్తూనే ఔచిత్య దృష్టితో కొన్ని మార్పులు గావించి స్వతంత్ర కావ్యంగానే సంతరించాడు. భారతం ధర్మ తత్వవేత్తలకు ధర్మ శాస్త్రంగా, వేదాంత విదులకు వేదాంతంగా ఇలాఎవరు యే దృష్టితో చూస్తే వారికి అలానే కన్పిస్తుందని వివరించాడు.

ఇక తిక్కన మహాకవి కవితాశిల్పంలో, పాత్ర చిత్రణలో, నాటకీయ సంభాషణలతో కథను నడపడంలో దిట్ట. దీర్ఘ సమాసాల్ని తగ్గించి, తెలుగు పదాలకు పట్టంగట్టి, ఆంధ్రభాషకు పుష్టిని, తుష్టిని కలిగించాడు. ఆంధ్రీకరణలో కొన్ని చోట్ల మూలాన్ని అతిక్రమించినా, ఆయన స్వతంత్రీకరణ పండిత జనుల ప్రశంసల్ని పొందింది.

అలాగే ఎఱ్ఱాప్రెగ్గడ కూడా ప్రతిభా పాండిత్యంలో నన్నయ్య తిక్కనలకు దీటైనవాడు. అరణ్య పర్వ శేషాన్ని నన్నయ్య పేరునే తెనిగించి, రాజరాజ నరేంద్రునకే అంకితమిచ్చి, నన్నయ్యపై తన భక్తిని చాటుకున్నాడు.

అటువంటి కవిత్రయకృత ఆంధ్ర మహాభారతాన్ని తెలుగువారు ఆప్యాయంగా తలకెత్తుకున్నారు. ఈ మహాకవుల తర్వాత, తిరిగి మహాభారతాన్ని పద్యకావ్యంగా వ్రాయడానికి చాలాకాలం కవులు సాహసంచేయలేదు.

అయితే, 20వ శతాబ్దంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థానకవి, శతాధిక గ్రంథకర్త, ఉద్దండ పండితుడైన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు 'శ్రీకృష్ణ భారతం' పేరున మొత్తం 18 పర్వాలనూ పద్యకావ్యంగా వ్రాశారు. భారతమే గాక రామాయణ భాగవతాలను కూడా ఒక్కచేతి మీదే నిర్వహించిన ఘనత వారిది.

ఇక ఆ తర్వాత వచ్చిందే ప్రస్తుత పద్యకావ్యం శ్రీ మదాంధ్ర భారతగ్రంథం! ఇంతటి మహా గ్రంథాన్ని సరళంగానూ, రసభరితంగానూ, రచించిన వారు 'మహాకవి' బిరుదాంకితులైన శ్రీ మండపాక చిన జోగిరాజుగారు. వీరున్నూ శ్రీపాద వారి వలె భారతంతో పాటు పద్య కావ్యాలుగా రామాయణ, భాగవతాలను,భగవద్గీతను కూడా ఒక్కచేతి మీదే నిర్వహించారు. అంతేగాక ఉత్తర హరివంశం, శ్రీకృష్ణ లీలా తరంగిణి, కుమార సంభవం వంటి అనేక పద్య కావ్యాలను రచించారు. అలాగే పింగళి సూరన 'రాఘవ పాండవీయ' ద్వ్యర్థి కావ్యంలోని రామాయణ, భారత అర్థ తాత్పర్యాలను వివరించి, తమ పాండితీ ప్రతిభను చాటుకున్నారు.

శ్రీ మండపాక వారు కవిత్రయ భారతాన్ని దృష్టిలో పెట్టుకుని, 18 పర్వాల్ని ఉపాఖ్యానాలేవీ వదలకుండా, సుందర సూక్తులతో, మధురోక్తులతో అందరూ సులభంగా ఆస్వాదించడానికి వీలుగా ద్రాక్షాపాకంలో రచించారు. గ్రంథానికి శ్రీకారం చుడుతూ –

'శ్రీకర భారత రచనము
సాకారంబై మనసున సంస్థితమౌచున్
ఓంకార గుణోజ్వలతన్
చేకూర్చుత ముక్తి ధర్మ చింతన ఫలముల్'

అని తన రచనోద్దేశాన్ని వెల్లడించారు. చంపూ కావ్య పద్ధతిలోనే, పద్యాలూ, మధ్య మధ్య వచనాలు నిర్వహించారు. పద్యాలన్నీ సరళంగా శోభిస్తాయి.

మచ్చుకు మోహినీ అవతార వర్ణనలో

సీ. "శ్రీకారమేర్పడు సువిశాల వర్ణముల్
తాంబూల మెరపులా దనరు మోవి
కలువరేకుల బోలు కమనీయ నేత్రాలు
నువు బువ్వు కెనయగు నాసపుటము
రాగిడీ మొగలిపూరత్న కాంతుల శోభ
తలకు సింగారమై తళుకులీన..."

అంటూ బహు పాద సీస పద్యంలో రమణి అందాన్ని రమణీయంగా వర్ణించారు. అలాగే సత్యవతి, తన పుత్రుడు వ్యాసుని తలచుకోగానే, ప్రత్యక్షమైన మునిరూపును వర్ణిస్తూ,

సీ. అరినెరి జడముడి అందాల కురువల్లి
తలకు సింగారమై తనరనెంతొ
దండి కృష్ణాజిన దండకమండలా
లిరుకేల ధరియించి యింపు గదుర...

తే. బూదిరుద్రాక్ష మాలికల్ బొసగ దాల్చి
బవిరి గడ్డంబు మీసంబు బాగుమెరియ
సొంపు కాళ్లకు పాదుకల్ సొబగు మీర
తనిగ ప్రత్యక్షమయ్యెనా తల్లి కెదుర!"

అంటూ వ్యాస మహర్షిని కంటిముందు నిలబెడతారు.

మరొక చోట–అస్త్రవిద్యా ప్రదర్శన సమయంలో అర్జునునిచూచి యువతీమణులు – మత్త. "సుందరాంగుని సుంతచూడవె, చూడముచ్చట కాదటే
అందగాండ్లలొ అందగాడగు అబ్జనాభుని బావటే
సందియంబది లేదు తెల్పగ, సద్గుణంబుల రాసియే"

అంటే పొగడటం, స్త్రీ స్వభావ సహజంగా ఉంది.

అలా పద్యాలన్నీ చాలావరకు సరళరీతిలోనే సాగుతాయి.

శ్రీ మండపాకవారు, కవిత్రయ భారతం సామాన్య పాఠకులకు సుకరం కాకపోవచ్చునని భావించారో యేమో, తాను మాత్రం ఎంతో శ్రమకోర్చి, మరెంతో కాలాన్ని వెచ్చించి, ఆంధ్ర మహాభారతాన్ని సులభశైలిలో తీర్చిదిద్దారు. తొంబై సంవత్సరాల వయస్సులో, ఎంతో పట్టుదలతో ఈ ఆంధ్ర మహాభారతాన్ని బృహత్ గ్రంథాన్ని ప్రచురించినందుకు వారినీ, అకుంఠిత దీక్షతో ఇది సాధ్యపడేందుకు కృషి చేసిన వారి అమ్మాయి శ్రీమతి అచ్యుతాంబ గారిని తప్పక అభినందించాలి.

చివరగా, ఇటువంటి గొప్ప గ్రంథానికి "ముందుమాట" వ్రాయమని శ్రీ మండపాక వారు నన్ను కోరడం, కేవలం వారికి నా మీదున్న ప్రేమయే తప్ప మరేమీ కాదు.

మహాభారతం మీద అపార గౌరవంవలనా, కావ్య జగతిపై ఉన్న అపరిమిత అభిమానం వలనా, వారి అభ్యర్థనను కాదనలేక, నాకు తోచిన ఈ నాల్గుమాటలు వ్రాసేందుకు సాహసించాను. గుణ గ్రహణ పారీణులైన పాఠకులు ఈ గ్రంథాన్ని తప్పక ఆదరిస్తారనే నా నమ్మకం!

"సర్వేజనాః సుఖినోభవంతు"

-------

**A .VEERA RAJU**
Retd. Bank Officer. 502-B Golden Habaitat,
B.P.Raju Marg, Kottaguda, Hyderabad- 500084

నా చేయి పట్టుకొని అక్షరము దిద్దించిన నా మొదటి గురువు మా మేనమామ శ్రీ మండపాక చిన జోగిరాజు గారు. వీరు వ్రాసిన శ్రీమదాంధ్ర మహాభారత పుస్తకము పరిచయము చేయుట సాహసము. అదృష్టము కూడా. వంశానుగతముగా సంచితమైన కవన ప్రతిభా వ్యుత్పత్తులను తన వృత్తిధర్మమైన అధ్యాపక అధ్యయనములచే మెఱుగు పరచు కొనుచు సాహిత్యముపై తనకుగల మక్కువను ప్రకటపరచు సాధనముగా రచన సాగించిరి.

సంస్కృ తాంధ్రములలో విదూషీమణి అయిన మా అత్తయ్య శ్రీమతి చిట్టికాసులు గారు తన సాహిత్య పటిమతో మా మామయ్యగారికి సహకరించిన సహధర్మచారిణి. ఈమె హంపి విద్యారణ్యుల వారు రచించిన బ్రహ్మవిదాశీర్వాద్ గ్రంధాన్ని తెలుగులో యధాతధానువాదము గావించిన దిట్ట. సంస్కృ తాంధ్రములలో అధ్యాపకురాలు.

మా మామయ్యగారి రచన పండిత పామర సామాన్య జనులందరికిని అర్ధమయ్యే రీతిలో లలిత మగు చిన్నచిన్న పద జాలములతో యెంతో భావగర్భితంగా ఉన్నదనుటలో సందేహము లేదు. రచన బహు సరళము

ఉదా: విరాట్‌పర్వంలో ధర్మరాజు విరాట్ కొలువులోనికి ప్రవేశించు సందర్భములోనిదీ పద్యము

సీ. అష్టాక్షరీ మంత్ర మాత్మాభి రామమై
వీనుల విందుగా వినగ బాడ్చు
శిరసున జడముడి సింగారమై యుండ
కాషాయ వస్త్రంబు కట్టి యొడలు
దండ కమండ లాల్ధరియించి యిరుకేల
నుదుట బెట్టిన బొట్టు నొసల బూది
కాళ్లకు పాదుకల్ ఘన ఠీవి నడకయుం
కమ్మనౌ చూపుల కమల నేత్రు

తే. దక్ష మాలతొ యెదుట ప్రత్యక్ష మౌట
ధర్మ తేజంబు తమకునై దర్శనంబు
కనుల పండువు కాదొకో కరుణ మూర్తి
పుణ్య ఫలమిది కాంచనౌ పూజనీయు
సీ. కారణ కన్ముడో కరిరాజ వరదుడో
ఇంద్రాది దేవుడో ఇనుడు మరియొ ........
................ సేవ జేయింతు సమతుల్య శిష్య గరిమ
ఉద్యోగ పర్వంలో –
ద్వి. గీ. స్వాభిమానము వెల్లువై తగ/కాలమే గతి మారుచున్నదొ
రాజ్య ధర్మము యెంచ నేరక/ముందు వెన్కలు యెంచ లేరొకొ
మంచి చేయుడు పంచియీయుడు/అన్న మాటయెపల్కుచుండుట
ఎంత వింతయొ ధర్మమంచును/యెవ్వరేగతి ఆడుకొన్నను
అన్న దుర్యోధనుని అహంభావుకత వెల్లి విరియుట గమనీయము.
మరియును ఈ రచనలో :

**" హభ హభ హభ హభ " గణములతో గల ద్వి.గీ. ఇది వరకు యే ఇతర ప్రబంధ గ్రంధములలోనూ కానరాదు. వీరు రచించిన సరికొత్త ప్రయోగము.**

పాత్రోచిత భాష వాడుటలోను సహజ సుందరంగా వర్ణనలతో రచన సాగించుట ఈయన ప్రత్యేకత. రమణీయత కన్పట్టుచున్నది.
ఉదా: ఉద్యోగ పర్వంలోని అరుణోదయ ప్రాతఃకాల వర్ణన
ఘోషయాత్రా సందర్భములో ధర్మరాజు కౌరవుల యెడ చూపిన ఉదారత భారతీయ సంస్కృతికి మూలమైన భిన్నత్వంలోని యేకత్వము మరియు స్త్రీ జనకుటుంబ గౌరవముల గల ఆప్యాయతానురక్తులు వెల్లి విరియుచుండుట రసజ్ఞుల మనసులను ఆకర్షించుటలో సందేహము లేదు.

ఇంకను మచ్చుకి శాంతి పర్వము లో అర్జునుండు అన్న ధర్మజునకు దుఃఖోపశమనమ్ముగా ఉచితమ్ములగు మాటలు. ఇది జన సామాన్యములో విరుద్ధము. ఐనను అవసరమగు పట్టుల దుఃఖపూరిత మనస్కులను శాంత పరచుటయే ధర్మసమ్మతము.
ఉదా: సీ. ధర్మమ్ము దప్పకీ ధరణిబాలింపుమా!

దివిజేంద్రునకునింటి దీప్తి వెలుగ
ధర్మమ్ము దప్పని ధర్మయుద్ధమునందు
దుష్టత యనుమాడి పుట్టగూర్చి
అడవుల బిడ్డట్టి అగచాట్లు మడినెంచ్క
శుభసౌర్దుతర్ యెంచి సురలు పొగడ
పాపంబుపోవిడ బ్రహ్మవేత్తలగూడి
యజ్ఞయాగాల్సల్పి యలమిగూర్ప

తే. ధర్మపరుడంచు పల్కనాధరని జనులు
విజయ దుందుభౌలెగయంగ వీర తొప్పి
పాల నంబది గొనుటయే భద్రగతుల
శాంతి గూర్చుకుమనుటయే నమ్మతమ్ము

తొంభై వత్సరములు పైబడిన వయసులో కూడా మా మామయ్యగారు ఇంతటి భాషా సేవ చేయుట మా కెంతయో ఆనందదాయకముగానూ ఉత్సాహజనకముగానూ ఉన్నది.

**విధేయుడు,**

**ఆలమూరు వీరరాజు**

.

**Dr. A.V.S.S.ANAND**
Associated Professor,
Geology Dept.
Andhra University, Visakhapatnam.

# మహాకవికిదే వందనం

తింటే గారెలే తినాలి. వింటే భారతమే వినాలి అనేది నానుడి. మన సాహిత్యంలో భారతానికి అత్యంత ప్రాముఖ్యత ఉంది. సంస్కృతంలో వేదవ్యాసుడు రచిస్తే తెలుగులో కవిత్రయం వారు రచించారు. మా చిన్న తనంలో భారతాన్ని తెలుసుకోవడం కోసం సంస్కృత భారతం కన్నా కవిత్రయ భారతాన్ని చదివిన వారే హెచ్చు. ప్రస్థుత యువతరం వృత్తి వి ద్యా నిర్వహణలో తెలుగు భాషను కొద్దిగా విస్మరించారనే చెప్పాలి. కార ణము తెలుగు భాషా పాండిత్యము ధన సముపార్జనకు పెద్దగా దోహద పడక పోవడం కావచ్చు. ఈ రోజుల్లో కవిత్రయ భారతాన్ని కూడా అర్ధం చేసుకోవడం యువతకు అంత సుసాధ్యం కాదు. టీకా తాత్పర్యం లేకుం డా ప్రస్థుత యువత అర్ధం చేసుకొనే పరిస్థితి లేదు.

20 వ. శతాబ్దంలో శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు భారతాన్ని కూడా రచించారు. కానీ పెద్దగా ప్రజాదరణ పొందలేదు. విశ్వనాధవారు అన్నట్లు భారతంలో లేని విషయము ఈ ప్రపంచ సాహిత్యంలో మరెక్క డా లేదనే చెప్పాలి. అందువల్ల భారతజ్ఞానము ఎంతో వ్యక్తిత్వ వికాసాని కి ఉపయోగపడుతుంది.

ఇట్టి తరుణంలో మహాకవి శ్రీ మండపాక చిన జోగిరాజుగారు భార తాన్ని అత్యంత సులభంగా అర్ధమయే రీతిలో వ్రాసి అందిండం చాలా ఆనందించ దగిన విషయము. కవిత్రయంవారు ముగ్గురూ వ్రాసిన మహా భారతాన్ని ఈ ఒక్కరూ ఒక్కచేతి మీదుగా ఆరున్నొక్క వత్సరములు శ్రమిం చినట్లు తెలిపారు. అంతేకాదు. ఈమహాకవి రామాయణ కావ్యాన్ని పూర్తి కంద పద్యాలలోను, భాగవత కధను, భగవద్గీతను పద్య గ్రంధంగాను మరియు ఉత్తర హరివంశము, ఉపనిషద్సారము మొదలైన అనేక కావ్య

ములు అందించారు.

ఈ కవిగారి కావ్యంలో నేను మెచ్చింది అలతి పదాలతో అనల్పార్థా న్ని ప్రతిపాదించడం. ఇంతటి చిన్న పదాలలో మహాభారతం వంటి కావ్య ము వ్రాయడం అనితర సాధ్యము. ఈ కవిగారి రచన ద్రాక్షాపాకం అన డం కంటే తేనెపాకం అనడం సమంజసమేమో. పై విషయములకు ఉదా హరణగా వీరి రచనలోని కొన్ని పద్య పాదములను సందర్భములను చూ పుచున్నాను. పాండవులు అరణ్యవాసానికి వెళ్ళేటప్పుడు ధర్మరాజు వెంట మేమూ వస్తామని వచ్చిన వారిని వారించి పల్కినది.

**క. మీ కేటికి వనవాసము**
**మా కెటు తప్పదు గడుపను మంచో చెడుగో**
**మాకగు నీ చీకాకులు**
**రాకూడదు యేరికైన రావలదంతే**

ఈ పద్యంలో ధర్మరాజు యొక్క బాధాతప్త హృదయము, ప్రజలపై తనకు న్న అభిప్రాయము మనలను ద్రవింప జేస్తాయి. ఇటులనే విరాట్ పర్వం లో కీచకుడు సైరంధ్రితో

**సీ. తనువెల్ల పులకింప సుడిదాకి ఒడిలోన**
**అనురాగమున దేల్తు అబ్జ వదన.....**

ఈయన రచనలో నాటకీయత ప్రస్ఫుటంగా ఆ వ్యక్తి మన కంటికి కని పించినట్లు సాక్షాత్కరించింది.

క్షీరసాగర మథనంలో

**తే. అద్రి సుతరాజు శిరసోర్వి నధివశించి...**

అన్న పద్యంలో శివుని శిరస్సుపై చంద్రుడు నధిరోహించినట్లు కళ్ళకు కట్టి నట్లు కనిపిస్తుంది. రసజ్ఞులు ఆ చల్లదనం గూడ ఆస్వాదించ గలరు. ఆ తరువాత మోహినీ అవతార ఘట్టంలోని

ఉ. మోహన సుందరీ గరిమ మోసపు వేసము వేసి
లోక సమ్మోహన మెంచనా దనరు మోహిని.......

అను పద్యాన్ని ఎంత చక్కగ ఆవర్ణించారో.

సత్యవతీదేవి కురువంశం నిర్వంశము గాకుండా చేయమని వ్యాసుని ప్రా ర్థించు నప్పుడు తల్లి యెదుట ప్రత్యక్ష మగుటను ఈ కవిగారు ఆ వ్యాస మహర్షిని మనకు

**సీ. అర నెరి జడ ముడి అమదాల కురువల్లి.**

**తలకు శింగారమై దనర నెంతొ ....**

అన్న సీస పద్యములో వర్ణించిన తీరు అమోఘము.

ఇక పోతే దుష్యంతుడు శకుంతలను గాంధర్వ విధిని వివాహానికి అర్థిం చే సన్నివేశంలో

**చ. సురుచిర పురువంశ మిల సుస్థిర కీర్తుల నించి చూపనా....**

**...."సుఖింప రాగదే"**

ఇందులో తీయని ఊహల స్పష్ఠత అనురాగత ఆత్మీయ కాంక్ష సుచిస్తు న్నాయి.మహాభారత కావ్యాన్ని వ్రాయడం అత్యంత క్లిష్ఠమైన పని. ఈ కవి గారు వ్రాసిన మహాభారతము ఆయన ప్రతిభా పాటవములను స్పష్టము గా చూపుచున్నది. చాలా పాండిత్యము రచనా కౌశలము శ్రద్ధ ఉంటే త ప్ప సాధ్యము కాదు. విరాట్పర్వంలో కీచక సైరంధ్రిల మధ్య వీరు ప్రద ర్శించిన నాటకీయత ప్రశంసనీయము. ఇలంటి సన్నివేశాలు కవిగారి స్వీ య ముద్ర ను చాటుతున్నాయి.చదువరులు స్వయముగా ఆస్వాదించగల రు.ఈ కవిగారు ఆయురారోగ్య ఐశ్వర్యాలతో వర్ధిల్లుతూ ఇంకా ఎన్నో కా వ్యాలను తెలుగు కగత్తుకు అందించాలని, ఆ శక్తిని కవిగారికి ప్రసాదిం చాలని భగవంతుని కోరుకుంటూ..

**భవదీయుడు**

**ఆనంద్**

# తొలిపలుకు

మహాభారతము కౌరవ పాండవ ఇతి వృత్తముగా ద్వాపరాంత కాలమున విలసిల్లిన మహాకావ్యము. దీనిని తొలుత సంస్కృతములో రచించినది "వ్యాసో నారాయణో హరిః" అనునగు ఖ్యాతి గడించిన వేద వ్యాస మహర్షి. మహాకావ్యములు త్రికాల సమన్వయములు. హిత బోధకములు. భారతీయ సంస్కృతి, నాగరికతలకు మూలము వేద శాస్త్రములు. నాలుగు వేదముల సారము మహాభారత గ్రంధమున నిక్షిప్తమై యున్నది. కావుననే దీనికి పంచమ వేదమని ప్రతీతి. ఆర్య ఋషులు మనకు అందించిన సుసంపత్తి. భక్తి రక్తి ముక్త్యాత్మకము.

ఇందు వేల వేల యేండ్ల పూర్వ చరిత్ర యిమిడి యున్నది. గొప్ప ప్రామాణికగ్రంధము. కావుననే ఇది సమస్త దేశ భాషల లోనికి అనువాదము గొన్నారు. ఇందుమానవతా మనుగడకు అనువైన సమస్త నీతి, నైతిక, రాజకీయ, సామాజిక, ధార్మికవిషయములు యెన్నోగలవు. సత్య, ధర్మ ప్రతిష్ఠితములగు కధలు గూడ గలవు. భారతీయ సంస్కృతికి దర్పణము. ఇది సర్వజన ఆదరణీయ, అనుసరణీయ, శాంతిసౌహార్ధత, మత సామరస్యత సౌభ్రాతృత్వ సౌశీల్యతలతో పరిఢవిల్లినది. భారతమును అన్ని దేశమతముల వారును ప్రామాణికముగా గ్రహించనగుచున్నారు. ఆంధ్రమహా భారతమును వ్రాయగల్గుట నా జన్మ సాఫల్యముగా భావించుచున్నాను. నా పూర్వ పుణ్యము. శారదా దేవికరుణా కటాక్ష వీక్షణము. శ్రీకృష్ణ భగవానుని నిర్దేశముగా భావించుచున్నాను. ఇది నాఆత్మనివేదనానురక్తి. మా ఇలవేల్పు శ్రీ ఆంజనేయస్వామి వారి దయ. నాభాగ్యముగా దలంతును. భారతము నెఱింగినవారు ధర్మార్ధ ప్రబోధకులు కాగలరు. రాజ నీతిజ్ఞులు కాగలరు. భారతము సర్వశాస్త్ర పరిశోధకులకు, శాస్త్రాధ్యయనులకు ఉపకరించు గ్రంధము. ఇంతటి గొప్ప గ్రంధము మరెక్కడను లేదు.

నా యీ గ్రంధ రచన యందు అన్ని విధములా నాకు చేదోడువాదోడుగా ఉంటూ సహకరించిన నా సహధర్మచారిణి శ్రీమతి చిట్టికాసులు (ఉభయ భాషాప్రవీణ) కు యశఃశుభాభినందనలు. మిత్రులు ఆచార్య డాక్టర్. శ్రీ హెచ్.స్. బ్రహ్మానంద, శ్రీ పి. రామమోహనరావు, శ్రీ బి.ఎ.రావు, డాక్టర్. శ్రీ ఆర్. కె. నాయక్, ప్రొఫెసర్. శ్రీ వేదులసుబ్రహ్మణ్యశాస్త్రి గార్లకు, డాక్టర్. శ్రీ అయ్యగారి ఆనంద్, శ్రీ ఆలమూరువీర్రాజు ప్రభృతి పెద్దలకు నమస్కారములు. అందరికిని నా కృతజ్ఞతాభినందనలు. డి.టి.పి చేసి సహకరించిన నా కుమార్తె చి.అచ్యుతాంబ కు అభినందన శుభాశీస్సులు. శ్రీ వారాహి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, లాహిరి పబ్లిషర్స్ వారికి అభినందనలు.

నా ఈ భారత గ్రంధ ప్రచురణకు, ప్రచారానికి గాను ఆర్ధికముగా తోడ్పాటు గావించుకొన్న నా కూతుళ్ళు–అల్లుళ్ళు, అన్న, తమ్ముల కొడుకులు–కోడళ్ళు, కూతు

ళ్ళు–అల్లుళ్ళు, మేనళ్ళుళ్ళకు నా ప్రత్యేక శుభాభినందనలు. మొదటి నుండియు నాతో సహకరించి ఆనందింప జేసిన బంధు, మిత్ర, శ్రేయోభిలాషులు అందరకును నా కృతజ్ఞతాభినందనలు.

గ్రంధకర్త

# విషయసూచిక

**ఆది పర్వము – చతుర్థాశ్వాసము**



**ఆది పర్వము – పంచమాశ్వాసము**

**సభా పర్వము – ప్రథమాశ్వాసము**

**సభా పర్వము – ద్వితీయాశ్వాసము**



---------

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆది పర్వ – ప్రధమాశ్వాసము

శ్రీకర భారత రచనము
సాకారంబై మనసున సంస్ధుత మవుచున్
ఓంకార గుణోజ్వలతం
చేకూర్చుత ముక్తి ధర్మ చింతన ఫలముల్

### ఆంధ్రోర్వి ప్రశస్థి, జనాభీష్ఠ భారత రచనానురక్తి

సీ. ఆంధ్రోర్వి కీర్తిమై నలరారు దొలుదొల్త
వైభవ ప్రాభవ విభవ మంది
సశ్య సంపన్న సత్కీర్తి గుణులతో
వినుతికెక్క ధరణి విభవ మొప్ప
వేద మంత్రాన్విత విజ్ఞాన విదుషులౌ
భూసురాశీస్సుధా పూర్ణమౌచు
నిజతేజ కులకీర్తి నిజమౌచు వెలుగొంద
రాణకెక్కిన మహారాజవరుతౌ
బేరసారమ్ములం భేషన్గ జగతిలో
వైభవోపేతులౌ వైశ్య వరులు
పాడిపంటలు పెంచి ప్రగతికై శ్రమియించు
కామితార్ధ ప్రదుల్ కర్షకులులు

తే. సంసార వృత్తిలో సమయోచనా కర్మ
సంచితార్ధము దిను సదయ వరులు
సర్వ కార్యాలలో సమ దృష్టి జూపించి
పేదసాదల నెల్ల పేర్మి గొంచు

గీ. వివిధ వృత్తుల దనియించు విబుధ గుణులు
భారతమ్మది వ్రాయనా పరమ ప్రీతి

తగుదు రీరని ప్రార్థింప తాత్మ్య దృష్టి
వేడ నన్నెంచి సత్ప్రీతి వేడ్క మదిని

ద్వి. కనకంబరమనా కరక దువ్వలువ
గొని తెచ్చి సభలోన కొండొక్కనాడు
తనియంగ పళ్లాన తాంబూల ముంచి
కవిచంద్ర గొనుడన కార్యంబు నెరిగి

క. అష్టాదశ భావమ్ముల
దుష్టిగ గూడున్న భారతోద్ధతి వృత్తిన్
స్రష్ఠకు బూర్ణంబు నుడువ
గష్టము నను బోలు తక్కు గణ్యుల కనుచున్

వ. నా సన్నిహిత సహచర సహోపాధ్యాయాది గుణ గరిష్టు లెల్లరును సముచిత సమయ సద్గోష్టుల నాతో మిత్రమా! బ్రహ్మైకకుల సంజాతుండవు పురాణ కలిత కథ నాను రక్తియుక్తుండవు వివిధ శబ్దార్ధ భావపరంపరానుచిత రచనా పాటవప్రజ్ఞాధు రీణుండవుపండితుండవు పండితమ్మన్య రామమోహన రావాఖ్యు స్నేహ పాత్రుండవు ఋషి తుల్యుండవు వయోగరిమ సంభావ్య విజ్ఞాన సరససద్గుణుడవు తర్క వ్యాకరణ కుక్షింభరుండవు మహాభారతకథనుపద్య కావ్యముగా వ్రాయగల సమర్ధుండవు అను టయు–

క. నన్నయ తిక్కన నెఱ్ఱన
నెన్నో రీతుల దలపగ నెంతో ప్రీతిన్
యెన్నంగా వ్రాయదలచి
మన్నింపుచు వారి జాడ మద్గురు లనుచున్

వ. శ్రీమదాంధ్రమహాభారత రచనమును ప్రారంభించిన వాడనగుచు.

## ఇష్ట దేవతా ప్రార్థన, గురుజన స్థుతి

శా. శ్రీరుక్మీ ణహృదయాది, నాథ సుమనః సిందూర సంకాశమై
పారావారము భారతమ్ము జగతిం పాపౌఘ విఘ్నంబహో

భారం బెంతయు దెల్పగా న్భగవతీ వాక్యార్థ భావంబులన్గారాబంబున కావుమా కృపతొ నన్కార్యార్థ సంసిద్ధిగాన్

క. శ్రీవాణీ పార్వతి పతు
లేవేళల బ్రోచి గాతు రేగతి కవితా
లావణ్యాన్విత బూర్ణ
దావక ప్రార్థింతు నట్ల ధన్యత గూర్పన్

శా. ఆదిన్బార్వతి మేని నల్గు దిగిచిన్ అద్దానితో నొక్క బొ
మ్మ న్దివ్యా కృతిగా నొనర్చి మదిలో మాతృత్వ మేపార బ్ర
హ్మాదు ల్నేరకనే అనంత మహనీయాధిక్య విజ్ఞాన ప్రా
ణాదు ల్కల్పన జేసెనా గజముఖున్ అశ్రాంతము న్గొల్చెదన్

ఆ. వ్యాస కాళిదాస వాల్మీకి వర్యుల
నన్న్య దిక్క నెఱ్ఱనాది కవుల
తేజికెల్ల మ్రొక్కి తెన్గింప బూను నా
భారతమ్ము పసిడి పలుకు లొలుక

క. శ్రీకర కరుణాకరయుత
రాకేందు యశోవిశాల రాజిత తేజో
భీకర సుగుణాన్వితులౌ
లోకజ్ఞుల నెల్ల బ్రీతి లోగొని దలతున్

## భారత ప్రసస్థి, ఆదిపర్వ ప్రారంభము

తే. నిత్య నూతన ప్రాచీన సత్య పధము
నాడు నేడును రేపట నార్య దీప్తి
భరత జాతీయ సౌభ్రాతృ భవ్య కీర్తి
దేశ దేశాల వెలయించు దీప్తి యౌచు
ఆర్య సంస్కృతి శుభ శాంతు లరయ నగుచు
జాతి మనుగడ కిది యెంతొ జీవగఱ్ఱ

భవ్య చరితమ్ము భరతోర్వి భద్ర మౌగ
సర్వ సౌజన్య సందీప్త సత్య గీత కృష్ణ పరమాత్మ సందేశ వృష్టి యగుచు
ధర్మ ధర్మేతరంశాల దర్శనమ్ము
ఆత్మ పరమాత్ము జేర్చియున్ ఆర్తి గాచు
భవ్య కథనమ్ము ఆంధ్రోర్వి భారతమ్ము

వ. మరియును విశుద్ధ విజ్ఞాన గుణైక జనాను మోద చరితార్థప్రదమ్మునై తొల్లి కృష్ణ ద్వైపాయనముని ప్రోక్తమ్మును త్రికాల యుక్తి యుక్తమ్మును పంచమ వేదమ్మును పాప హరంబును యశ స్సంపన్నంబును విజ్ఞాన సర్వస్వమ్మును నానానేక విఖ్యాతాఖ్యానస మృద్ధమ్మును మోక్ష ప్రదమ్మును అద్వైత ప్రమాణంబును ఆచంద్రార్క యశోవిలసన భారతకుల సుప్రసిద్ధ చరితమ్మును సుగమ్య ప్రమోదమ్మును శుభోత్కరమును పుణ్య ప్రదమ్మును కామ్యార్థ సిధ్యర్థ్యభివృద్ధమ్మును మహా పవిత్రమ్మును అగు భారత కథను గతాను గతిక శ్రవణానంద సంధాయక సూతశౌనకాది ముని సముద సమాస్వాదన క్రమమ్మున వచింపనగు నా భారత రచనా కథాక్రమం బిదియన. తొల్లి జంబూద్వీప భరత ఖండ నైమిశారణ్యంబున శౌనకుండనుమునిసత్తముండు బ్రహ్మ ఋషి మునిగ ణ సంసేవ్య మానసుండై త్రిలోకహితార్థంబ ద్వాదశవర్ష సత్ర యాగం బొనర్చుచుండ వ్యాసశిష్యుండై రోమహర్ష కుమారుండైన (ఉగ్రశ్రవశుడను సూతుడు) రౌమర్షివచ్చి భ క్తి యుక్తి పురస్సరముగా నమస్కరించిన అతని వలన వివిధకథలు విను వారలై అత ని ననేకంబుగా బూజించిన, నతండును సమయజ్ఞ్నుధా కథనంబుల ప్రొద్దులు బు చ్చుచు నావలన యింక యెక్కథ వినవలతు రన నత్సూతునకు శౌనకాదు లిట్టులని–

క. ఇహపర సంపూజితమై
విహితంబై ధరణి చెలగు వివిధోర్వీశుల్
మహి నేలిన గణ్య పథము
సహనోద్ధతి ధర్మ యుతము ఎమ్మత మనుడున్

వ. సూతుండు శౌనకాదుల నుద్దేశించి ఆదియుగంబునందు కృష్ణ ద్వైపాయనుండను మహర్షి వేదంబు లేకీకృతంబులై సుగమ్యంబుకాక యుంట ఋగ్యజుస్సామధర్వణ ములుగావిభజించి శిష్యులైన పైల వైశంపాయన సుమంతు జైమిను లను నియమిం

చి తచ్చతురాగమ సూత్రంబులుగా నివర్తిల్లింప జేయుటచే వేదవ్యాసుండు నా బరగి నిజ తపోనిష్ఠా గరిష్ఠ మహత్వంబులం త్రికాలజ్ఞుండై బ్రహ్మచే ననుజ్ఞాపితుండై కృత త్రేతా యుగాంత వేళల చతుర్దశ భువన ప్రవృద్ధంబైన దేవాసుర రామరావణ సంగ్రామంబులం బోలె ద్వాపరాంతమ్మునంగూడు పాండవ కౌరవానీకంబుల నడుమయిరు వన్నొక్క వేయి ఎనిమిదివందల డెబ్బది తొమ్మిది రథంబులును, రథంబున కొక్క ద్విరదంబును, ద్విరదంబుల త్రిగుణంబునౌ అశ్వంబులును, లక్షా తొమ్మిది వేల మున్నూట యేబది అరివీర భట సందోహక సంఖ్యానకంబౌనొక అక్షౌణీ చొప్పున లెక్కకు వచ్చు అష్టాదశక్షౌణీ బలంబు లిరుగడలంగల్గి మహారణం బుప్పతిల్లుటాదిగాగల విషయంబులెల్ల వైశంపాయనుని వలన యెరింగిన విధంబుగాయిట్లువివరింప దొడంగె. అట్టి ఘోర వీర మహా భారత రణ రంగంబు నందు కౌరవ పక్షంబున పదు నొకండక్షౌణీ సైన్యంబుల కధినాధులై –

క. పది దినములు భీష్ముండును
మది నొప్పగ నైదు నాళ్లు మాన్యులు ద్రోణుల్
తుది మూట రెంట కర్ణుడు
గదిసియు పోరాడ్రి శల్య కౌరవ యోధుల్

వ. పాండవులు సప్తక్షౌణీ సంఖ్యానకంబై దృష్ట ద్యుమ్న విరాట్ భీమ ద్రుపద మహానాయకత్వంబున శ్రీకృష్ణ పరమాత్మ నాదరాభిమాన నియుక్తు లై ధర్మ యుద్ధంబు గడంగుటయు విన, విని శౌనకాది మహామునులు యిమ్మహాభారత కథాశ్రవణ కుతూహలురగుటయును తొల్లి, పుడమి నరాజరికమ్ము చేయంబూని జామదగ్నుండు–

క. ముయ్యేడు సార్లు రాజుల
దుయ్యగ నీ భువి రుధిరలు దోసిలి తోడన్
చెయ్యన బితరు ఋణంబులు
క్రయ్యల నైదింటి దీర్చె గర్వోన్నతుడై

వ. అట్లుపశమిత క్రోధుం డగుట నాటంగ్రోలె నా ప్రదేశంబు శమంత పంచకంబు నాబరగె. అక్కురు క్షేత్ర మహా భూవలయంబునందు పాండవవంశ వివర్ధనుండును

పరీక్ష దాత్మజుండును యైన జనమేజయుండు అజేయపరాక్రమవిక్రమంబున రాజ్యం బేలుచుసర్వశుభాభి వృద్ధింగోరి సత్రయాగము చేయునెడ, నటకు సరమయను దేవ సుని కుమారుండుసారమేయుండను కుక్కుటకుమారుండు క్రీడార్థంబ నేగుదెంచి గ్రు మ్మరుచుండ, జనమేజయు ననుజన్ములు శ్రుతసేన భీమసేన ఉగ్రసేనులను వారాసా ర మేయు నడచిన అది అరచుచుం బరతెంచి తమ తల్లికిందెల్ప నా సరమయు అతి కోపోద్రిక్త స్వాంతయయి జనమేజయుని కడ కేతెంచిరాజా!

ఆ. మంచి చెడుయు లేక వంచన మతులయి
కరుణ లేక నాదు కడమ తనయు
ననప రాధు సాదు నడప బాడియె నీదు
అనుజు లెంత గొప్ప అధిపు లయిన

ఆ. పాడి వీడి సాదు బీదకు సుంతైన
పాపభీతి లేక పరము గొనక
యెగ్గు సేయు మతుల కెక్కుడు పాపంబు
భయము భీతి క్షోభ బడయు నంచు

ఆ. పల్కి మాయమైన ప్రభుడు విస్మితు డౌచు
సత్ర యాగమైన సత్వరంబ
శాంతి జరుప నెంచి సహ జన్ములకు భీతి
బాధ లొలుప సరమ ప్రమద మంద

వ. అట్లు తగు పురోహితు నన్వేషించుచు నానా మునిగణ నికాయా శ్రమంబుల కుం బోయి బోయి నొక పల్లెయందు శ్రుత శ్రవశుండను మహామునిం గని నమస్క రించి–

ఆ. తనుజు నిమ్ము నాకు తగ బురోహితు గాగ
నీతి నియమ శాస్త్ర నిష్ఠ పరుని
అనుచు వేడ మునిని అధిపుండు శోమ శ్రు
వెంట రాగ దెంచె వేగపురికి

వ. శోమశ్రు ననేక విధ సత్కారముల బూజించి సంతుష్టుం గావించి త దుపదేశం

బున శాంతి పౌష్ఠిక క్రియలు నిర్వర్తింపుచు దేవ బ్రాహ్మణ ప్రజాహిత నిరతుండై స
మస్త దానమ్ములు కావించుచున్నెడ–

## ఉదంకోపాఖ్యానము

తే. పైల శిష్యుం డుదంకుండు ప్రజ్ఞశాలి
పౌష్యు దీవించి తగు రీతి బౌష్యు తోడ
అర్థి నిటు వస్తి గురు పత్ని ఆజ్ఞ యగుడు
కరుణ నీ దేవి కుండలా ల్గడగి దేవ

తే. అనుచు వచియించె తనగాథ యంత దనుక
సకల భూదేవు లెల్లరు సంతసింప
దాన యజనాది సత్కర్మ ధర్మ పాత్రు
కోర్కె సఫలంబు గావింప కోరి పలుక

వ. అంత పౌష్యుండు ఇట్టి వానిం కృతార్థుని చేయుటే కృతార్థంబుగా నెంచి సంత
సించి నయ్యుదంకునితో–

తే. ఆర్య! గొని పొండు మద్వాక్య మనుచు వేడి
యిపుడ నవ్వాని మద్దేవి యిచ్చు ననగ
కడగి పురమేగి యద్దేవి కాన లేక
పౌష్యు పాలికి తిరిగిరా పౌష్యుడిట్లు

గీ. భూసురోత్తమ తమ తోడ భాసురంబ
పల్కుచుంటిని యెగ్గేమి పలుక వలదు
అశుచి కనుకంట పడదు ఆ యబ్జ వదన
పరమ సువ్రత శుచుడవై మరల బొమ్ము

వ. అనగా మునిసత్తమ భూసురోత్తముండు ఆత్మగతుండై మధ్యే మార్గమున నొక ది
వ్య పురుషావలోకనా వశంబున వెన్నంటి బోవుచు అద్దివ్య పురుషు డధివసించి నేగు
వృషభ మయ మాలిన్యా ఘ్రాణనా అశుచిత్వంబు మది నెంచి శుద్ధోదకంబుల పునీ
తుండై యాచమించి శుచిర్భూతుండై మగుడి చనిన వాడగుట పౌష్యాను వర్తినియ
గునద్దేవి మునికి నమస్కరించి కుండలమ్ము లిచ్చి–

క. తక్షకుడీ తొడవులకై
వీక్షణుడై నుండు నెల్ల వేళల యందున్
రక్షణ గావించుకొని సు
రక్షితముగ బొమ్మ టనగ రాగము నొలుకన్

వ. పౌష్యుండు, ఆర్యా ! అతిధులై వచ్చిన వారలాతిధ్యము గొనక వెడలు టుచితం బు గాదు. కాన భుజించి చనగ నగునన నొడం బడికుడుచుచో పాయసాన్నంబు కే శ పాశంబై యున్నంత కినిసి అంధుండ వగుమని శాపంబిచ్చిన అల్ప దోషంబునకు శాపం బిచ్చినాడవవుట ననపత్యుండ వగుమని ప్రతిశాపం బిడిన ఉదంకుండు క్రమ్మ రింపుమన పౌష్యం డిట్లనియె.

క. శాపం బీయను ద్రిప్పను
నోపంగా జాల్రు విప్రు లూర్జిత తపసుల్
శాపం బీయుటె చేతగు
నాపంగా జాలడన్యు డధికుం డైనన్

వ. కావున, నీవిచ్చిన శాపం బుపశమింపం జేయుడన, ఉదంకుం డట్ల కాగ యని శాపమోక్షమనుగ్రహించి కార్యార్ధ సంసిద్ధుండుకా,సంతుష్టాంతరంగుండై గురుగృహాభి ముఖుండై అరుదేరి మార్గ మధాహ్నోదిన యర్ఘ్యాదులర్పింప నొక్క జలాశయంబు చేరి కుండలంబు లొకచో భద్రపరచి యాచమించు సమయంబున వెన్నంటి వచ్చు తక్షకుండు తగిన సమయంబ కానెంచి మారురూప ధరుండై కుండలంబులం గొని పారుచుండ నయ్యుదంకుండు తక్షకు –

క. వెన్నంటి రాగ పట్టగ
కన్నం బొకటన జొరబడి కార్యా చరణుం
డెన్నం నిజ రూపంబున
సన్నంగా జారు కొనియె సర్పావనికిన్

వ. అట్లతనిని వెన్నాడుచు నయ్యుదంకుండు నాగ లోకంబున కేగి అట –

తే. ఆది దేవుడు శ్రీవిష్ణు నబ్జనాభు
పాల సంద్రాన దేలింప బాన్పు యైన

ఆది శేషుడు నహిరాజు లాదిగాగ
శంభు సర్వాభరణ భూషణం బౌచు
దేవ దానవు లొకటిగా తేజరింప
పాల కడలిలొ మంద్రాద్రి పట్టి జుట్టి
లచ్చి చంద్రు లాద్య మృతాల్దచ్చు నాడు
ఉచ్చువై యుంటి లోకార్తి నుత్సహించి
వాసవాదులు గొల్చునా వాసుకేంద్రు
పన్నగాదుల తక్షక ఫణి ఫణాది
సర్ప శేషాహి కర్కోట సర్ప జాతి
నాగ జాతుల సైదోడు నల్ల ద్రాచు
మొదలుగా గల చిలువల మొనసి గొల్చి

వ. అందొక మహాతేజో దివ్య పురుషన్ కాలాంతర్గ తుహ్యా పరివేషణ చక్ర మధ్యం బునంపరివేష్ఠింపం బడి అతి వేగాన్విత సత్వ సంపన్నమగు నొక్క ఘోటంబధిరోహించి యున్న వానింగని సద్భక్తియుక్తి యుక్తంబులగు పల్కుల స్ధుతియించిన అద్దివ్య పురుష ననుగ్రహంబున తద్వచనా చరణుండైన నాక్షణంబ చతుర్దశ భువనైక దశదిశాదిచ్చక్ర భూవివర వలయము లంబర్వుచు న్భయ భీతావహ్ని ప్రస్ఫుటాగ్ను లుత్పన్నమై విస్ఫురాశ్చర్య విభ్రాంతులై ఉరగు లల్లాడగా తక్షకాద్భుజగాది నాధు లెల్లరుం మనంబు లన్ఖేదిల్లకల్పాంత సంకాశమోయనం దోప తక్షకుండు తన తప్పిదంబునకుంబెక్కువగచి స్వజాతి నాశంబు గాకుండమున్నుగా పెక్కు చింతించి పశ్చాత్తప్త చిత్తుండై తత్తక్షణంబ కుండలంబులం దెచ్చి యుదంకునకుం యిచ్చి చనియె. ఇట్లు నాగకులంబుల నెల్ల మహాక్షోబంబు గావించి కుండలంబులం వేగ కొంపోయి గుర్వర్థంబుగా గురపత్ని కీయ తెరం గవలోకించు చున్నెడ నద్దివ్య పురుషుండు మగుడి ప్రత్యక్షంబై తన తురంగం బెక్కి చనుమిది వాయువేగ మనో వేగముల నతి క్రమించి చనం గలదన నుత్సహించి ప్రాంజలిఘటించి నిజకార్యావసర మగ్నుండై తురంగం బధిరోహించిన మరుక్షణం బగురు నాశ్రమ వాకిట నిలవం బడియుండుటకుం నత్యాశ్చర్య ప్రమోద భరిత సంతుష్టాంతరంగుండై ఘోటక రాజంబునకు ప్రణమిల్లి సెలవొసంగి కుండలం

బులం గురుపత్నికీయ నామె మహాదానంద స్వాంతయై వానిం ధరియించి తత్సంక ల్పిత కార్యార్థంబులు నిర్వర్తింప సంతుష్టుండై గురుండు నయ్యుదంకుం గల వివరం బు లరసి విస్మితుండై అంతరంగి తావగాహుడై ఆదివ్య పురు షుని ఇంద్రునిగాను, తురగ రాజము నైరావతము గాను మిగిలినవారాతని నంటి యుండు అగ్నిమున్నుగా గల్గు ఋతువత్సరాయన మాసాది కాల పురుషులనియుం దెల్పి వానిం గొనియాడి గు రుదక్షిణ ఫలంబని గ్రహించి దీవించి సుఖంబుండ పుత్తెంచె. అంత నయ్యుదం కుండు పెద్ద కాలము తపం బొనరించి తక్షకుడు చేసిన దుష్క్రియకు ప్రతికృతిగా జ నమేజయు పాలికింజని తనయదంతం బంతయుం దెల్పి మరియు నీ జనకు విష గతుం జేసిన తక్షకాద్యురగ జాతి నశియించు నట్లు సర్పయాగోన్ముఖుని గావించె న నుటయును, తొల్లి సర్పకుల జననియైనకద్రువశాపకారణంబున సర్ప సంతానంబుల కొయ్యెడ జనమేజయుడు చేయయాగము వలన గల్గు నుపద్రవంబును భృగు వంశ జుండగు రురుండుగావించు సర్పఘాతంబు సహస్రపాదు డుడిగించునట్లు జరత్కారు సుతుండైన ఆస్తీకుడు డిగించె. దీని వివరంబు దెల్పెద వినుండని భృగు నాస్తీకు చరి తంబులు దెల్ప దొడంగె.

## భృగు వంశము

క. భృగుడను తాపస బాపడు
మగువ బులోమ నతి దాంతి మాన్య చరిత్రన్
వగ లనురాగముల దనుప
మగనాలియు చూలు దొడరి మహితోద్ధతి తోన్

తే. భృగు సతి బులోమ హెూమాగ్ను ్న రగుల్గొల్పు
సమయ మందొక్క దతికాయ సలుగు రూప
ధారు డున్మత్తు బులోము డర్గుదెంచి
అగ్నిహెూత్రుని నిలదీసి అతివ యీమ
యెవని సతి దెల్పు నిజమని యిరకటింప
అనృత భాషణ పంకిలం బంటు వెరచి
నిజము భృగు పత్ని యీమంచు నెమ్మి బల్క

దొల్త వరియింప బడె నాకు యీ తోయజాక్షి
అనుచు నతి వేగ నాయింతి నదిమి పట్టి
పర్గు పర్గున బోవుచో ప్రమద కుక్షి
చ్యుతము నాయె నాక్షత బిడ్డ చ్యవనుడాయె

వ. పదంపడి నా వరాహ రూప దుస్తరోన్మత్తు డబ్బాలు కుపిత కోపోద్రిక్త సహస్రాంశు ద్విగుణీకృత తీక్ష్ణదృగ్జ్వాలంబుల మ్రగ్గి మసియై నశియించుటను. బులోమ-

క. నిజ జనకు బోలునా శిశు
సజలిత నేత్రాభిరామ సాంజలి బద్ధున్
గజగజ లాడుచు గొనిరా
సుజనుండా భృగు డతివతొ సుతునిం గొనియున్

వ. వివరం బడిగి తెలిసి కొన్న వాడతిరోషుండై అగ్నిని సర్వ భక్షకుండవు కమ్మని శాపం బిచ్చిన అగ్ని భట్టారకుండు-

క. ఎరిగిన యర్థం బొరునకు
పరగంగా దెల్పనట్టి పాపియు నొకడున్
మరియును నన్నృత భాషణుడును
నరకంబున గూల్రు రనరె నయనిధు లెంతన్

వ. కావున, యదార్థము వచియించినాడ. అంతియె కాని నీయనిన అభిమానము లేక కాదు. మరియునుం సర్వ కర్మసాక్షి నైయుండి యెట్లనృతంబులాడి దోషమొడిగట్టు కొందునని నీవు బ్రాహ్మణుండ వయ్యు నాకు శాపంబిచ్చి లోకంబుల కెల్ల చెడు జేసితివి. ఐనను నిన్నేమియు అనదలచు వాడనుగాను. సర్వభక్షకుండనై అశుచిత్వ మొంద దేవ బ్రాహ్మణహవ్య కవ్యాది క్రతుయజ్ఞ యాగాది క్రియా కలాపంబులందెట్లు నివర్తిల్లు వాడనని చింతించి తనతేజో రాశి నుపసంహంరించినంత, సమస్త భూ భువన జనంబులు తల్లడిల్లుటయును మునిజనంబులు మొదలుగా గల్గుదేవ పౌరాణికులు బ్రహ్మాదుల వద్ద కేతేర భృగశాపనిమిత్తమున యింత వాటిల్లు టెరింగి అగ్నిభట్టారకు రావించి సముచిత భాషణముల సమభావ సమోపేతుగావించి అమ్మహాముని వచనంబు లనుల్లంఘనీయంబు లగుట సర్వ భక్షకుండవయ్యును శుచిర్భూతుండ

వౌదని పరమ పవిత్రుండ వగుదువనియు నిజకార్యమగ్నుగావించుటయును అగ్రపూజ్యుం డగునట్లును లోకోపకారార్థ మనుగ్రహించుటయును, భృగుపుత్రుడైన చ్యవనునకు సుకన్య వలన ప్రమతియు, ప్రమతికి ఘృతాచికిని రురుండు పుట్టుటయును, రురుడు విశ్వావశు మేనకల కుదయించిన ప్రమద్వరయను కన్యతో వివాహనిశ్చయముగావింప బడుటయును ఆట లాడుచున్న అవసరంబున నామె సర్ప ద్రష్ఠ యగుటయును, రురుడు తన పుణ్యఫలము దారబోసి బ్రతికించు కొనుటయు, దివ్యవాణి చెప్పిన చొప్పున రురుండు తన యాయు వర్ధంబు నామె కిచ్చుటయును అట్లు పెద్దకాలంబు సుఖంబుండి తన సతికి చేసిన పనికిగాను రురుండు సర్పజాతుల మడియించు చుండుటయును ఆతడట్టు నొక పుట్ట నున్న డుండుభమును కొట్టబోవ, నా డుండుభము మునియైసముచిత భాషణంబుల తాను సర్పరూప ధారుడైన కారణంబు వినిచి బ్రాహ్మణులు శాంతి స్వరూపు లనియును శమదమాది నిగ్రహ శాంతి సహనములు ప్రతిష్ఠించుటచే లోక కళ్యాణమును చూరగొన గల్గునట్లు చూచుట బ్రాహ్మణులకే సొంత మనియును మున్నుగా పల్కి శాంతపరచి ఆగ్రహ ముడిపి నీవంటి కారుణ్య మూర్తులు ఒరులు చేయు హింస వారింప వలయు ననియును, ఆస్థీకుని వలన జనమేజయుడు జేయు కద్రూశాపంబున గల్గుసర్పకుల ప్రళయం బుపశమింప బడుటయును సర్పకుల వైరమును విడనాడింప జేయుటయును తెల్ప విని, శౌనకాది మునులిట్టు లనిరి.

తే. తల్లి రైవత స్వరూప తనయు లెడల
కోప కారణ మేమయ్య? కోరి శాప
మిడగ వినగ వలదె మేము యిద్ధ చరిత
తెలుప నెంచితె దెల్పుమా తేట పడగ

**ఇది శ్రీశ్రీ వాణీ వరప్రసాద లబ్ధ సుకవి జనప్రియ సాధుజన విధేయ శ్రీ కవిత్రయ స్ఫూర్తి ఆర్వేల నియోగి బ్రాహ్మణ మండపాక వంశోద్భవ వీర్రాజు పౌత్ర, సూర్య ప్రకాశం సత్యనారాయణాంబాతనయ విరచిత**

**–: శ్రీమదాంధ్ర మహాభారత ఆది పర్వ ప్రథమాశ్వాసము:–**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆది పర్వ – ద్వితీయాశ్వాసము

శ్రీ మహనీయ గుణాకర

సామాన్యా కరుణ జూచు సదమల కీర్తి

సామద గజరాజ వరద

సామాన్యుడ కీర్తివంత సంస్థవనీయా!

**కద్రూ వినతలు సంతానంబు వడయుట**

క. కద్రూ వినతలు కశ్యపు

చిద్రూప విలాస కేళి చేరిన వారై

చిద్రోర్వీ వాసకులను

భద్రంబౌ రెండు గ్రుడ్ల బడసిరి వరుసన్

వ. అంత, వినత పెద్దకాలంబు తనదు అండాంతర్భవ సంతానంబులు బయలు పడకుండుటకుం చింతిల్లి యెట్టకేలకొక అండమునుచిదుప నందుద్భవించిన బాలుండ నూరుండుగా నుండియుండుటచే–

క. కుపితుండై శపియింపుగ

తపియింపను సవతి యొద్ద దాస్యము సలుపన్

సఫలం బొందెదు మరియా

సుఫలంబౌ యండదుద్భ్వ శూరుని వలనన్

వ. అని, మార్తాండ రథసూనునిగా నరిగిన పెక్కేండ్లకు రెండవ యండంబు సుఫలప్రదంబై విచ్చుకొనిన, అందుండి మహా జవసత్వంబుల రెండవ ఇంద్రుండోయనునంతటి సువిశాల చెంచూ పర్ణసంభూతుండైన గరుడుం దుద్భవించి తల్లికి నమస్కరించు చందాన రెక్కలల్లార్చి ఆకశంబున కెగయు నవసరంబున భూ నభోంతరాళములు తద్వాయు సంఘాతమున వడకం జొచ్చె. నంత ఇంద్రుం డిదేమి వైపరీత్యం బొడగూడెనన దేవ గురుడైన బృహస్పతి యిట్లని చెప్పం దొడగె. తొల్లి, కశ్యప ప్రజాపతి

పుత్రార్థియై పుత్రకామేష్ఠిచేయు సమయంబున నీవు నీకొలది అంగుష్ఠమాత్ర దేహుల వాయు భక్షకుల వాలకిల్యాది మహామునులు జేయు సహాయ సంపత్తు లత్యల్పము గా భావించి నగిన అమ్మునులు కినిసి నీకంటెమహా బల సత్వ సంపన్నుండును, గుణాన్వితుండును, వీర్యవంతుండును, అజేయుండును రెండవ ఇంద్రుం డయ్యెడు వాడు పుట్టునట్టి మహా మంత్రంబులు వేల్చుచున్నంత కశ్యపు పాలికిం బోయి నాకుం గరుణింపుడని ప్రార్థించిన కశ్యప ప్రజాపతి అమ్మునులకుం సమ్మ త మగునట్లు నీవ చనంబు లమోఘములు కావున యింక నాకుం బుట్టు పుత్రుడు–

క. అక్షయ జవ సత్త్వుండును
రూక్షిత చంచూ విశాల రూపిత పర్ణుల్
రాక్షస దైవత తేజుడు
పక్షి కులేంద్రుండు నాగ బరగెడు ననుచున్

వ. వారల నొడం బరచి, నీ ఇంద్రత్వంబు యేకాధిష్ఠితంబు గావించె.ఆ పుట్టిన వాడె పోఇంతకుం గారకుండు. పుట్టిన తక్షణంబ తల్లికి మ్రొక్కుగా రెక్క లల్లార్చి నొక్కపరి నింగి కెగయ నింతయయ్యె. నెయ్యంబుండ దగిన వాడెపో. ఇటకే వచ్చు చున్నాడన, ఇంద్రుండెదురేగి గాఢాలింగనము గావించుకొని సుఖోపవిష్ఠుం జేసి బాంధవ్యంబుం నెరపి సంతుష్ఠుం జేసి పుత్తెంచె. నంత గరుడుండు మరల భూమండలమున కెగసివచ్చి ఇంటికి వచ్చు తన తల్లిని యెందుండి వచ్చుచున్న దానవని యడుగుట యును, ఆమె అతి దీనాననయై నాయనా! రేపకడ మీపెదతల్లి యింట దాస్యంబుడిపి వచ్చుచున్న దాననని వచియింప గరుడుండు తన్నిమిత్త మేమి యని ప్రశ్నింప వినత వైనతేయునితో –

## క్షీర సాగర మథనము

తే. దేవ దానవు లొండొరుల్ తేజరించి
జ్ఞాతి సంబంధ మధిక జిజ్ఞాస రేప
క్షీర సాగర మథన సంకీర్ణ మతులు
గుజ్జు రూపుని గణనాధు గొల్చి మొదల
బ్రహ్మ రుద్రాది దేవుల వరుస గొల్చి

వేలు పదియొక్క యోజన పరిమితంబు
నిడివి మూలము కైవార నిధనమైన
మంద్రగిరి దెచ్చి కవ్రగా మధ్య నునిచి
వాసుకిం దెచ్చి త్రాడుగా వరుస జుట్టి
దానవాదులు తలతట్టు దనర బట్టి
అదితి తేజుల నల్ప బలాదు లవల
తోక బట్టియు ద్రచ్చగా దుస్తరంబ
పాదు కొని పోవ మంద్రాద్రి పాల కడలి
ఉడుపగా రాని దుస్తరంబుడుప దగును
విష్ణు డొక్కడె కాపాడ ప్రజ్ఞు డనుచు
మోఱ లెత్తియు నొకటిగా మ్రొక్కు లిడుచు
పాహి పాహ్యంచు శ్రీవిష్ణు పాద కమల
ధ్యాన నిరతులై ప్రార్ధింప తప్ప దనుచు
ఉన్న పాటున దిగి వచ్చె నుద్ధరింప
కమఠ రూపంబు దగియుండ కరుణ తోడ
క్షీర పాదోది క్రిందుగా జేరి గిరిని
నొక్క ఉదుటున దేలింప నొనర బిగిచి
నిండు చూలాలి చేతులం నెనరు బట్టి
గర్భ రత్నోదయంబు లావిర్భవింప
ముందు వెన్కల కొదుగులా మంద్రగిరిని
కొమ్మ గోపమ్మ వెన్నలం నెమ్మి జిల్కు
పగిది గవ్రన గిర్రన పట్టి దరువ
వెచ్చ వెచ్చని సెగలలా పెచ్చు పెరిగి
గరళ సంబోధ్భవంబాయె గగన పర్య
సంకటం బొచు త్రిభువన సర్వ జగతి
కొట్టు మిట్టాడి అల్లాడ పట్టు బట్టి

పండు మాదిరి దిగ మ్రింగె పరమ శివుడు
సర్వ జగముల గాపాడ శర్వుడగుట
సంభ్రమంబున ముల్లోక సర్వ ప్రాణి
ఈశు పరమేశు గరళేశు ఈప్సితంబ
వేడుకొని యాడి వేడుకల్ వెల్లడింప

వ. వెండియు అందుండి జ్యేష్ఠయు, చంద్రుండును, కల్పవృక్షంబును, కామధేనువు, ఐరావతంబును, కౌస్తుభరత్నంబును, లక్ష్మియుధన్వంతరి, ఉచ్ఛైశ్రవమును, ఆదిగా నుద్భవించిన కడను జరామరణ విచ్ఛేదనంబును, ధృఢ దారుఢ్య ప్రవృద్ధంబును, అ జేయ శక్తి ప్రభవమ్మును, గ్లాని శ్వేద శయ్యాన్న పానాది క్లేశనాశంబును యగు అమృ త కలశ ఉత్పాదితంబు లగుటయు, నయ్యెడ –

గీ. అద్రి సుత రాజు శిరసోర్వి నధివశించి
తాప ముడిగింప చల్లగా తనదు చలువ
గంగ సైదోడు గానుండి గగన వీధి
మూడు లోకాల వెన్నెల్లు ముచ్చటింప
చందురుం డేగె భువి లోని జనులు బొగడ

తే. అస్తు సమస్తమ్ము గావించు కౌస్తుభమ్ము
లోలి పదునాల్గు భువనాలలో వెలుంగు
లచ్చి కెనయగు మణిరాజ లక్ష్మి యగుచు
నభవు నుర సీమ తన దీప్తి అహరహంబ
సర్వ శుభముల కాణాచి సద్గుణంబు
నౌచు హరియును సంప్రీతమౌచు చెల్వ
తగిలి వశియించి ధన్యమౌ తపసి జనులు
పూని గొల్వంగ యెంతేని పూజ దనరి
లక్ష్మి తోడన శ్రీహరి వక్ష మందు
మొనసి వశియింప సుస్థితం బౌచు నరిగె

వ. అంత, నిజశక్తి మహిత తపోధన్య మహనీయ సంసేవ్యమానంబులును, నాకలోక నిధనంబులును, అనిర్వచనీయ మనోహర శోభితమ్ములును, కామ్యార్ధ సంసిద్ధం బొనర్పం జాలునవియు అగుచు సర్వకాల సర్వావస్థల యందును దివ్య రుచ్యభిరామ శోభితంబునుపూదొడిమ పుష్ప ఫల సుందరానంద కల్పధృమంబును, అమృతోపమాన రుచిరమ్య నిర్మల పరిశుద్ధ పరిమళ ఘుమ ఘుమారావ క్షీరధారల నొలికించు దివ్యలోక సందర్శనా విశేష తపఃఫల తపసిజను లడిగినంతనే తృటికాల వ్యవధానముననే కామ్యార్థ ప్రదమ్ము నై కమ్మనౌ పదార్థంబు లలయించు కామధేనువును, మహామేరు సంకాశధృడ తరంబును విశుద్ధ శ్వేత రోమాంకుర సంభూతమైన కాయంబును ధగద్ధగాయమాన తేజోవిలసత్ సువిశాల శ్వేత వింజామరలం బోలు అవిరామ సంచలన కర్ణ విక్షేపంబుల తోడను వజ్రశక్తి సంపన్నమై దండధరు దండంబోయనజెల్లు సుస్థిర దంతాంకురంబుల తోడను భూమ్యాకాశంబుల సంధించు మహాక్రతు స్తంభంబులుగా నొప్పి మహాసత్వ సంపన్నమై దశ దిశావకాశవిశాల తొండంబును సుదీర్ఘ కైవార పదచతుష్ఠయంబునుం కల్గి విశ్వకర్మ చేతి కుంచెయోఅనం జెల్లు వెల్లనై అల్ల నల్లన నడయాడించు వాలంబునుం గల్గి మహా మహిమోపేత విజృంభమాణైక సంసిద్ధమౌ ఐరావతంబును మహా జవసత్వంబులు గల్గి వాయువేగమనోవేగంబుల నధిగమించు వేగసంపత్తి గల్గి రెల్లుపూ ప్రభా భాసమాన, గళాంతర్జనిత జాలువారు జుంజురు తోడను, విశ్వ విశ్వంభరాంతర్గత విహారంబులుం గల్గి సహజ సోయగ శోభాయ మానంబగు మేనికాంతుల రూప లావణ్యంబుల నింపారుచు తెలిశోభల అభ్యంగనానంతర అలివేణులు దడియార్చు నళిన సంభవు రాణి వేణీ వాల్లభ్యంబు నధిగమించువాల సౌంధర్య మింపార తరిణి బట్టిన విశుద్ధ దంత పుంగోళ్లోయన నెనరు దోప నందాలు చిందించు పద చతుష్ఠయంబు తోడను ముద్దు లొలుకు రూప లావణ్యము చిందించుఅశ్వరాజ ముచ్ఛై శ్రవంబును మొదలుగా గల్గు ఘనాఘన సంచయంబు లెల్ల నాకపతికింజెందుటయును, జ్యేష్ఠ శనైశ్చర్యం చేపట్టుటయుం, అమృత భాండమ్మును అసుర వరులు చేకొనెడు నంత, సర్వ జగద్రక్షకుండైన శ్రీమన్నారాయణుండు–

## మోహినీ మోహనావతారము

ఉ. మోహన సుందరీ గరిమ మోసపు వేసము వేసి లోక స
మ్మోహన మెంతనా దనరు మోహిని రూపము దైత్య దేవతా
వాహిను లెంతయుం యెదల వ్యాకులమందుచు వెంటనంటు లా
సాహస మొప్పగా నగుచు సాగెను దగ్గరి కంత కంతకున్

సీ. శ్రీకార మేపారు సువిశాల కర్ణముల్
తాంబూల మెరుపులా దనరు మోవి
కలువ రేకుల బోలు కమనీయ నేత్రాలు
నువు బువ్వు కెనయగు నాస పుటము
రాగిడీ మొగలిపూ రత్న కాంతుల శోభ
తలకు సింగారమై తళుకులీన
నునుసోగ లావణ్య నొక్కు నొక్కుల జుట్టు
వరుస లల్లిన బొద్దు వాలు జడయు
నిండు జవ్వని సిగ్గు నెమ్మోము సౌందరుల్
చెక్కు టద్దాలపై చెల్వు లీన
కుంకుమా కస్తూరి ఘుమఘుమంబుల బొట్టు
సొగసైన సిందూర సోయగమ్ము
రంగు మేనియ తోడ రాజిల్లు పాలిండ్లు
కంతు పూబంతులో కనక గిరులొ
గోరింట రంగుతో కొమరారు హస్తాలు
మురువు చేతుల కెంతొ ముద్దు గొల్ప
నడుము సుంతయు గల్గి నాభ్యంతరాళమ్ము
చిన్న కస్తురి చుక్క చెన్ను దనర
పైట పావడ బొందు పైచేల బురిటీల
సుందరాంగియు చాల సుద్దు లొలుక
జఘన సౌందర్య సంచలన రీవులా

గజరాజ యానమ్ము గడలు గొనగ
ఊరు శోభల శౌరు లుర్రూత లూగింప
మనసు ఊయల లూగి మదన పడగ
గజ్జ లందియ మ్రోత ఘల్లు ఘల్లని మ్రోవ
నిముస మోర్వగ రాని నెనరు దోప
పారాణి దిద్దిన పదము లొండొరు వేగ
ముందు వెన్కల దూగి ముదిత నడువ

గీ. చేష్ఠ లెల్లయు వీడి యా చెలియ వైపు
దేవ దానవు లెల్లరు దోసి లొగ్గి
మంత్ర ముగ్ధులుగా జూచ్రి మతులు వీడి
కంజముం గొన పద్మాక్షి కడవ తోడ

వ. ఇట్లు చెంచలాక్షి ముసిముసి నవ్వుల ముద్దు లొల్క దానవానీకంబుల వంచిం పం దలచిన దౌట, వారల మొగంబై కను సన్నల మనసెరిగి మసలు దానివలె మ రల మరల నగవు లొలికెడి జూపుల నయనాభి రామయై నవ్వించి కవ్వించి కడవ నెత్తియుజూపుచు కాలోచిత స్ఫూర్తి నటియించి, నయవంచన గావించుచు అయ్యు మృతంబు కాస్తను సురానీకంబుల నడుమ బంచుచుండ, దానవుం డొక్కడు సూర్య చంద్రుల నడుమకుం జొచ్చి కూర్చుండి అమృత పానంబు గావించుటను గ్రహించిన సూర్యచంద్రులు పట్టిపట్టి దెలుప స్త్రీరూప ధరుండైన నారాయణుండు తనచక్రమును ప్రయోగించుటచే ఆరక్కసుని తల మొండెము వేరయ్యును అమృత స్పర్శచే రాహు కే తువులుగా సూర్యచంద్రులతో వైరంబు గ్రహణంబులుగా వర్తిల్లు చుండుటయును.

## దేవాసుర సంగ్రామము

క. దైతేయులు బలి గూడియు
వాతోద్ధతి మించి గొప్ప వాహిని కాగా
చేతో మోదము దనరగ
భీతాన్విత చేష్ఠలగుచు భీకర తెంతన్

తే. ఈటె బరిసెలు గొడ్డంద్రు యిద్ద కోల

మొదలుగా గల్గు వివిదాయుధాద్యనేక
మారణాయుధ భీకర మార్గులగుచు
దేవతానీక సముదయ తేజమడప

తే. అదితి తేజు లనల్పులై అనువుగాక
ధర్మ మార్గానుగాములై తడయకపుడు
పోరి కురుకంగ త్రైలోక్య పోరు యగుచు
భీషణంబౌచు బాణాగ్నుల భీతి గొలుప

క. శస్త్రాస్త్ర జాల విద్యల
శాస్త్రీయంబగు రణమును సాహస ఫణితిన్
విస్తరించి నెగడ జేయుచు
సస్త్రీ బాల ముది వృద్ధ సమరణి ద్రెళ్ళన్

వ. ఇట్లనేక విధములుగా మహా క్షోభంబు వాటిల్లుటయును, అందు దేవదానవు లొండొరులపై పెచ్చు పెరిగిన క్రోధానల ద్వేషాగ్నులు మిన్నంటి అసూయ ప్రవృద్ధంబ గుటయు అత్తరి దితిసంతతు లనేకంబులగు మాయా జంతుజాల రూపధరులై మొక్క వోని సాహస బలపరాక్రమంబుల విక్రమింప, సర్వ సద్గుణ సంపన్నులరగు నా దితే యు లాధాటికోర్వని వారలై నారాయణ నామ సంకీర్తనముగావించుటయును–

శా. నారీరూప ధరుండదే విధముగా నా పోరి మధ్యమ్మునన్
ధీరోద్ధారత తేజరిల్లి చెలగన్ దీనార్తులై రాక్షసుల్
వేరే మార్గము గానరాని మదులై విఖ్యాతు లెంతేనియుం
పోరాడిం అసురారితో విముఖులై పోరాటముం వీడుటన్

వ. అంత అద్దేవతానీకంబు లన్నారీ రూపధరుండగు శ్రీమన్నారాయణుం అనేక విధంబులుగా కొల్చి మ్రొక్కు లిడుకొన్న వారలగుటయును, శ్రీమన్నారయణుడుచెప్పిన చొప్పున వాసుకికి ప్రణమిల్లి ప్రత్యుస్థానంబు నెరపి మందర నగంబును యథాస్థితి స్వస్థానంబున నునుచుటయును చేసి సుఖంబు నుండుటయును. అంత–

**కద్రూ వినత లుచ్ఛైశ్రవంబును జూచి పందెములు వైచుట**

క. కద్రూ వినతలు తమలో

నిద్రాణంబౌ సవతిమ నెగయుట తోడన్
సాంద్రాటవి నడి సీమల
నిద్రాకృతి మేత వదలి నిలచిన వాజిన్

వ. వాహ్యాళి కేగి గృహాభి ముఖులై మందస్మిత గమనాంతర సీమ దృగ్విలాసంబుల నడయెడ నడయాడించుచు వచ్చువారొక కనుజూపు మేర దృష్టి సారించి ఆలోచనా మగ్న మానసు లగుటయును, వినత దృగ్విక్షేపము గావించుచు–

తే. చూడవో యక్క యీ ఘోట్క సోయగమ్ము
మచ్చు కైనను లేదొక్క మచ్చ యనగ
చాలు చాలించు నీమాట చాలు నింక
మచ్చ లేకుంటె నీదాస్య మిచ్చగింతు

వ. ననుచు కద్రువ యన–

తే. మచ్చ కలదేని నీసేవ నిచ్చగింతు
ననుచు వినతయు పందెంబు లాడి పలుక
చూచి వత్తము రమ్మిదే చోద్య మిపుడ
ప్రొద్దు క్రుంగుట చూడవో ముద్దరాల
రేపు చూతము యేమౌగ రేయి లోప్ల
ననుచు సవతులు పందెంబు లాడి వేగ

వ. తమతమ నివాసంబుల నేగుటయును, కద్రువ తన సంతానంబుల రావించి పందెంబు లొడ్డిన ప్రకారము సవిస్థరముగా వివరించి బల్కి తెల్లవారు లోపలదేవ ఘోటకమున కెట్టులైన మచ్చ ఆపాదించి తనకొనర్పం జాలు. మేలువినిచినంత, వారల య్యధర్మ వర్తనంబున కియ్య కొనక విముఖత్వముం జూప, కద్రువ కోపోద్రిక్త మానసయై ఒకప్పుడు జనమేజయుడు చేయు యాగాగ్నుల నాహుతి యగుదురుగాక యని శాప వచనంబులు పల్కుటయును, ఒక్క కర్కోటకుండు మాత్రము తల్లికి ప్రీతి పదంబుగా వర్తించువాడనని పల్కి వరువాత లేచి చని ఉచ్ఛైశ్రవ నశ్వరాజ వాలంబున గల కేశపాశంబుల నడుమ నల్లనై కన్పట్ట నొదిగి యుండుటయును, రేపకడ సవతు లిద్దరు నేగి చూచుటయును, కద్రువకు అప్పటి నుండియు వినత దాస్యంబుడుప

నియ్యకొని వర్తించు చుండుటనాదిగా గల్గు సమస్తంబును వినిచి కన్నీరునించి అనూరు శాప కారణంబును శాపమోక్షంబు నీవలన కల్గునట్లు నుడువుటయును వైనతేయుండు పెదతల్లి కడకేగి–

గీ. దాస్య మోక్షంబు ప్రార్ధింతు దయ దలిర్ప
తల్లి కష్టంబు దీర్పని తనయు డేల
మూడు లోకాల జనులంత మోదమంద
కష్ట మెంతేని సాధించి కడగి దీర్తు
ననగ మేలెంచి నాయింతి అనియె నిట్లు
గరుడ గంధర్వ దేవతా గణము గెల్చి
అమృత భాండంబు గొని వచ్చి అర్పితంబు
జేయ మీదైన దాస్యంబు చెల్లనౌను
ఇచ్చు గలదేని గొనివచ్చి యిచ్చి బొమ్ము

వ. అనగ గరుడుండు సత్వరంబ, తల్లి అనుమతిం గొని అమృతంబు గొనితే నిశ్చంయించితల్లి కడకేగి విషయంబు దెల్పి మ్రొక్కిన సంతసిల్లి కొడుకుం కౌగలించకొని దీవించి పనుపు నవసరంబున నవ్విహగేంద్రుండు తల్లితో తనకు వలయు జవసత్వంబులు వృద్ధికల్గునట్టి మార్గ మధ్యాంతర బోనంబు నియ్యకొన నడుగుటయును, వైనతేయునితో తల్లి విషద్వీప నివాసితులై భూవలయ ప్రాణికోటికి విషమ సంకటమై వర్తిల్లు అసంఖ్యాక నిషాద గణముల నాహారంబుగా భక్షింపు మనుటయును, అట్టి యెడం గూడ బ్రాహ్మణుని పరిహరించునది గాను చెప్ప, యెట్లెరుంగందగునో యన, మ్రింగువడక గాలమువలె కంఠ బిలమ్మున దగుల్కొని అగ్నివలె యెవ్వండు ప్రజ్వలించు చుండునో అట్టివాని బ్రాహ్మణుండుగా యెరుంగ నగునది యన, వల్లెయని సత్వర గతుండై కడలీ మధ్యంతర విషద్వీపమున నున్న బహు సహస్ర సంఖ్యానీక నిషాద గణంబుల నొక్కపరి మృత్యు గహ్వర మహాబిలంబునం బోలు తన కంఠ బిలంబున నిరికించి దిగమ్రింగు చుండుటయును, అందునొక్కండు మ్రింగు వడక కంఠంబున కడ్డు తగుల్కొని భీషణాగ్ని చందమ్మున నెగడుటయును, అవ్వాని బ్రాహ్మణునిగా నెరింగి వెలువడి వచ్చులా ప్రార్ధించుటయును బ్రాహ్మణుండు వెలికి వచ్చి–

క. ఇహపరములు చెడ గానగు
సహవాసుల జావ విడిచి చనియెడు వార్కిన్
విహగోత్తమ నాగూడిన
సహచారిణి నెంత చెడ్డ సమ్మతె? విడువన్

క. అనవుడు బాపల గూడిన
కననౌదురు పూజ్యులగుచు కలుషితులైనన్
వినమే శంకరు దొడమిన
పెను బావులు పూజలొంది ప్రియమగు పగిదిన్

వ. అనిన ఆ వైనతేయు కార్యావసర శూరుగా సమయోచితానుగ్రహ పాత్రుగా నెరింగి నిషాదితో దిగి వచ్చిన బ్రాహ్మణుండు గరుడు ననేక విధ కార్యార్థ సంసిద్ధిగా దీవించి చనిన గరుడుడు కశ్యపు పాలికి జని పిత్రభివాదము గావించి అంత దనుకం గల తన వివరంబు లెరింగించి ఆకలి పోవకున్నదన కశ్యపుడు వైనతేయునితో నాయానా! గజ కచ్ఛప రూపంబుల వశుపుత్రు లిర్వురు శాప వశంబున వీడని వైరమూని జవసత్వ సమృద్ధులై ఉన్నవారలు నీ కాహారంబు కాగలరు. దినుమన గరుడుండు వాయు వేగమనో వేగంబున గగన వీధి నేగుదెంచి ఆ గజ కచ్ఛపంబుల రెంటని నెరుగాళ్లం గ్రద్ద కుక్కుట సంతానంబులంపట్టి నెగురు చందమ్మున కాలిగోళ్ల మధ్యంబున ఇరికించుకొని నభోవీధి కెగసి ఎగురుచూదశ సహస్ర యోజన కైవారంబును శత సహస్ర యోజన నిడివియుం గల్గు నొక్క మహా భూరుహ శాఖపై నుపవిష్ఠుండగుట నా తరుశాఖ ఫెళ ఫెళారావ ధ్వనులతో విడి వడుటయును తత్ శాఖోపశాఖల నానుకొని తలక్రిందులుగా వేలయేళ్లుగా ఘనతుషార మార్తాండు చండ ప్రచండ కిరణాన్నపానులై తపం బొనరించు వాల కిల్యాది మహామునుల కే నొప్పిదము రాకుండుటకునై ఆ తరుశాఖను క్రింద పడకుండు లాగున కులిశ సమాన్విత బలిష్ఠంబైన తన నాసాగ్రంబున కరచి పట్టి గగన తలంబున అంతరిక్ష మధ్యంబున మహాఘన సందోహ చందమ్మున యెట దిగుటకుం దోపక కశ్యపుస్థావర ఆకాశమధ్యంబునకుంజని వలయంబులుగాతిరుగుచు తరుణోపాయంబునకై మనంబున కశ్యపుని ప్రార్థింప కశ్యపుడు వాల కిల్యాదుల సవినయ భక్తి యుక్తి యుక్తంబున సమా

స్వాదించి గరుడ కుమారుని కర్తవ్యోర్ముఖునిగా అనుగ్రహింప వేడుటయును తద్వచనంబున గరుడుండు మహామహిమోపేతమగు హిమవన్నగరాజ శిఖరాగ్ర భాగమ్మున భద్రాసనుండగుటయును, వాలకిల్యాదులు తత్తరుశాఖా విముక్తులుగా దొరంగుటయును తదుపరి అత్తరుశాఖను నిర్జన ద్వీపంబున విడుచు నట్లనుగ్రహించుటయును గరుడుండట్ల చేసి గజ కచ్ఛపంబుల హిమవన్నగసానువుల నునుచుకొని భక్షించి యక్ష రాక్షస కిన్నెర కింపురుషాది సురాసుర సర్వ ఖేచరగణంబుల నెల్ల నొలయిం పందగి ఇంద్ర బలంబుల వామపక్షంబు సేయనౌ బలసత్వంబుల సంతరించుకొని అమృత కలశంబు దే నింద్రలోకంబునకు యెగయుచున్నెడ, అట–

## ఇంద్ర గణంబులు గరుడునితో బోరుట

క. పటుతరమౌ ఇంద్ర వ్రజము
జఠిలత సమరోద్ధతులై చయ్యన గదిసిన్
తృటి కాలంబున కనలిరి
కఠినంబౌ వజ్ర తుల్య ఖగపతి ఘాతన్

వ. ఇటుల గీటు వడిన ఇంద్ర వ్రజము నధిగమించి దేవేంద్రాయుక్త నిక్షిప్తంబైన య్యమృత భాండంబు కడకు గరుడుండు జన తద్ఘటంబు ఘన పటుతర పరివేష్ఠితచక్ర మధ్యంబున భద్రగతి మహావిషాగ్ని జ్వాల తేజో విరాజిత రత్న మణిమయ శిరోధార్యంబులౌ రెండు ఫణి రాజంబులచే పరివేష్ఠితం బగుచు సంరక్షింపం బడియుండుట గాంచి దైవాయుక్తంబుగా దలంచి నవ్విహగేంద్రుండు దేవేంద్రు నొద్దకుంజని తన తల్లి దాస్యంబుడుప నెట్టైననుం నయ్యమృత భాండంబును గొనిపో వచ్చిన వాడనని యెరింగించుటయును, ఇంద్రుండునుం గూడ ఇవ్విహగేంద్రు స్నేహించుటే సమయోచితంబుగా దలంచి అమృత భాండంబు నియ్యకొన నెరింగించు వాడయ్యును ఉపాయంబున మరల నయ్యమృత భాండమునుపుత్తెంచుకొను విధంబుగా కాల వ్యవధానంబుండు నట్లుగా నురగ మాతకు సెలవీయ వేడుకొనుటయును అట్లగాయని అమృత భాండమ్మును గొని వచ్చి గరుడుడు పెదతల్లి కిచ్చితన తల్లి దాస్యంబు విడి

పించుకొని సుతుల శుచిర్భూతుల గావించి భుజింప జేయుమని పెదతల్లికిం జెప్పి నయ్యమృత భాండమ్మును నొక తృణావృత తిన్నెపై నునిచి, తల్లి తోడ నిజేచ్ఛం జను టయును, కద్రువ నురగ కుమారులకు స్నానాదికంబులు చేయించుచున్న తరిఇంద్ర సైన్యంబులు ఆకాశ మార్గమున వచ్చి అమృత భాండమ్మును నురగులు చూచుచుండ గనే విను వీధి కెగయుటయును, యెంతేని చింతించిన వారలగుచు అమృత మంద లి తృణమంత ఆశచే నాగులా తృణచయంబుల తమ నాల్కలతో సమాస్వాదింప ఆ నాల్కలు రెండుగా చీలియుండె ననుటయును, మరియును అమృత స్పర్శ జెంది కా రణముగా మహా పవిత్రముగాను పూజాద్రవ్య సంపత్తిలో నొకటిగా చోటు చేసుకొన్న వి. ఇట్లీ సౌపర్ణోపాఖ్యానమును విన్న చదివిన వారెల్లరును సిరి సంపదలతో కామ్యా ర్థ సిద్ధినొందుటయే కాక నాగ భయ విముక్తులు కాగలరనుటయును శేషుడు తనత ల్లి అన్నదమ్ముల అధర్మ నిర్భాగ్యత్వంబులకు వగచి వారల విడచి గంధమాదన బదరీ గోకర్ణ హిమవంత మాదిగా గల సమస్త పుణ్య నదీనద క్షేత్రంబుల వర్తిల్లుచు బహు కాలంబు తపం బొనర్చి బ్రహ్మవరంబునఅనుజ్ఞాపితుండై భూ భారంబు దాల్చ నియ్య కొని వర్తిల్లుటయును.

క. వాసవు తోడం జెలిమియు
భాసుర గతి జేసి శేష్దు భాసింజెందన్
వాసుకి వగచెను జననీ
నిస్వన శాపాన యెంతొ నిర్దయ ఫణితిన్

వ. మరియును జనమేజయు జేయు సర్పయాగ ముడుప సవ కట్టి సహోదరులతో నాలోచించి–

మత్త. సాహసింతము సర్వభంగుల సర్పయాగము మాన్పగా
మోహరించియు ముందు వెన్కల ముప్పు తిప్పలు పెట్టుచున్
దేహి యంచును ప్రార్థనంబిడి దేహత్యాగము సల్పనా
వాహి బ్రాహ్మణ రూపులం దొగి వచ్చి చూతము దెల్పగాన్

మత్త. అంతలోననె నాగరాజుని అన్గు బిడ్డడు హేలుడా
వంత విండొగి విన్నవించెద విన్నదంతయు పూర్తిగా

వంత పొడగ నాగ వంశము సుంత కావగ నెంతయున్
అంతమౌనని సర్పయాగము ఆస్థికుండను మౌనిచేన్

వ. అని బ్రహ్మ పలుకగా నయ్యాస్థీకుం డెవ్వడెట్లు కన్పట్ట నగునని వాసుకి అనేక భంగుల వితర్కించు చుండునంత నయ్యురగాధిప శూనుడు వెండియు యిలవాసుకి చెల్లెలు జరత్కారువునకు జరత్కారుండను మహా మునిపుంగవునిచే కల్గెడువాడు అధిక తేజోవంతుండగు ఆస్థీకుండను వాని వలన జనమేజయు చేయు సర్పయాగము నుడుపగానౌనని బ్రహ్మవాక్కుగా తెల్పుటయును–

**జరత్కారుని చరిత్ర**

త. నియమ బద్ధము బ్రహ్మచర్యము నిత్య మీవిధి బ్రహ్మకున్
నయము వేడుక చేయు చుందురు నమ్మి కెంతయు బ్రాహ్మణుల్
నియమి తాశ్రమవాస మందున నెమ్మి జేయగ దొల్తనన్
నియమ వేదులు యెంద రెందరొ యేర్పరించిన ద్రోవయున్

మ. నిత్య కర్మగ జేయువానికి నిద్ధరాతలమందునన్
సత్య మెంతయు కోర్కె లన్నియు సమ్సిపోవుట తద్ధ్యమౌ
పత్యమెంతయు బ్రహ్మవేత్తకు బాహ్య చేష్టలు వీడగా
సత్య శౌచము జ్ఞాన మార్గము సామ్య వాదుల దృష్టిలో

తే. నియమ నిష్ఠా గరిష్ఠుండు నీతిశాలి
జ్ఞాన వైరాగ్య మార్గ విజ్ఞాన ఖనియు
నౌ జరత్కారుడను మౌనియౌత జ్ఞాని
బ్రహ్మచర్యము పాటించి బరగుచుండె

వ. ఇట్లా జరత్కారుండు నిత్య నిష్ఠా గరిష్ఠుండై తపస్వాధ్యాయన బ్రహ్మచర్య వ్రతంబును వీడని వాడునై కాలంబు వెడల నడచుచుండు నవసరంబున నామమాత్రా వశిష్ఠంబైన నొండొక్క మాని కొమ్మల నంటి–

మత్త. తల్లక్రిందుల తప్పు జేయుచు తల్లడిల్లెడు పక్షులై
నల్ల గబ్బిల బూషి పిట్టలు నౌచునుండెడు ఋష్యులౌ
వెల్లనౌతగ గోచిపాతతొ వేలలాడుచు నెండలో

అల్ల భానుని కిర్ణ జాలము లారమై యిల మ్రగ్గుచున్

వ. ఉండు వారింగని యిది యేటి తపంబు ఆనతీయ వలయు. నేనుం గూడ ఆచ రింప గోరుచున్న వాడనన అనఘ! మంద భాగ్యులమగు మావంశంబున జరత్కారుం డను వాడుజనించి అవివాహితుడుగా నుండిన నయ్యనపత్య దోషంబున పురిషెడు నీళ్లకు కరవై యేడు తరంబుల వార మిట్లు కొన యాశతో నిమ్మాని చందమ్మున ఉం డుటో ఊడుటో అనునట్లు తల్లక్రిందులుగా తపస్సులు చేయువారలమై యుంటిమి గాని వేరు కాదు. మీ ముఖారవిందమ్ములు పరికింప మహానుభావులుగా కన్పట్టుచు న్నారు. మావంశాంకురమైన ఆ జరత్కారుడు మీకెందేని కానబడిన మాకు పురిషెడు జలంబులిడి నరకప్రాప్తినుండి రక్షింప వలయునదిగా గృహస్త్రాశమము స్వీకరింపున దిగా అనుగ్రహింపుడని దీనాతి దీనముగా వాక్రుచ్చుటయును, విన్న జరత్కారుండు అతి కారుణ్య విహ్వాల చిత్తుండై గృహస్త్రాశమము స్వీకరింప కృత నిశ్చయుండై తన పితృపితామహా ప్రపితామహ వర్గంబుల కెల్ల నమస్కరించి యిట్లనియె.

తే. తొల్లి పొసగదు యిష్ఠమ్ము యెల్లి వేగ
నిజము మిము జూచుమీదట నిక్కవంబ
ఉద్వహంబాడ మనసెంతొ నుత్సహించె
ఉద్ధరింతును కులమెల్ల ఉత్సహింప

వ. అనుచుంబల్కి ఆద్యులైన వంశ వర్గంబులకు ప్రణమిల్లి ఆశీస్సులంగొని వివాహ కార్యోన్ముఖుండై సనామ్ని కన్య కై వెదకుచు ఊరారా దిరుగుచుండె. అవ్విధంబుం దె లిసిన వాసుకి పరుగు పరుగున యేతెంచి జరత్కారునిం దోడ్కొని పోయి తనచెల్లియ జరత్కారువునిచ్చి వివాహము గావించుటయును కతిపయ దినములకు ఆమెయందొ క సుమూహూర్తంబున బాలసూర్య ప్రభాభాసుండగు కుమారునిం గనుటయును ఆ స్తీకుండను నామకరణము గావించి జరత్కారుండు తొల్లిటి నియమ ప్రకారంబ భార్య ను కుమారుని వాసుకి కడ నునిచి తపోవనమున కరిగె నంత నాస్తీకుండు దినదిన ప్రవృద్ధి చెందుచు చ్యవనముని కుమారుండగు ప్రమతితో సమస్త శాస్త్ర జ్ఞానములను గురు ముఖమున గ్రహించుచు సత్వ గుణ సంపన్నుండు కాదొడంగె. అటజనమే జ యుండు తక్షక విషాగ్నుల తన తండ్రి పంచత్వము నొందుట ఉదంకుని వలన విని

న వాడై మంత్రులం జూచితత్కారణం బేమియని సవిస్తరముగా తెల్పుమని ప్రార్థించు టయును మంత్రులు–

## పరీక్షిత్తునకు గల్గిన శాప వృత్తాంతము

సీ. ఉత్తరాభిమన్యుల కుదయించి నీతండ్రి
ధర్మార్థ కార్యముల్ దవిలి జేసె
శ్రీకృష్ణ ప్రభ చేత సేమాన నుండిన
పాండవాన్వయుడైన ప్రజ్ఞశాలి
పరిరక్షితుండై ప్రభవించి నట్టియా
బాల్పరీక్షితుడునా బరగు వాడు
అరయ రాజ్యంబేలె అరవదేండ్లిల లోన
రాజవృషభుడౌచు రాణకెక్క

గీ. సరస సద్గుణ నీయట్టి సౌమ్యు బుత్రు
గాగ బడసిన పుణ్యుండు కర్మయోగి
నియమ నియతుండు యెంతేని నీతిశాలి
మహిత మహిమోన్నతుండునై మహిని యేలు

వ. కాలంబుల నొక్కనాడు

తే. వేటలందవ్లి బహుముఖ వేటలాడి
ఒక్క కోలను కిటిమేయ నేటువడ్డ
సలుగు పారెను తుప్పలన్ సాగి వేగ
వెంట నంటిన యారాజు వెంట నడువ

గీ. నేగి యందొక కోనలో నిల్చిచూచి
యెందు బోయిన దోయంచు యేర్పరింప
నేర కాదరి కూర్చున్న నేక నిష్ఠ
పరుని మౌన్వర్యు కిటియెట్లు పర్వెననుచు

తే. నిలిచి ప్రశ్నించె నామౌని నేరడేమి
జ్ఞానమగ్నుండు యిహమందు ధ్యాసలేదు

ప్రభుడు కోపాన దరినున్న బాము శవము
మౌని మెడలోన పడవైచి మగిడి చనియె

వ. నా వృత్తాంతము శమీక తనయుండు శృంగి కృశుడను వాని వలన విని కోపో ద్రిక్త మానసుండగుట, యెవ్వండిట్లు నా జనకు నవమానించిన వాడు యేడు దినం బుల నాడుతక్షక విషాగ్ని జ్వాలల దగ్ధుండగునని మంత్రజలంబులం విడిచె. అంత సంధ్యా సమయంబగుడు శమీకుండు స్వస్థత గాంచి కనులు దెరువ శృంగి నమస్క రించిన వాడై జరిగిన విషయము నెరింగించుటయును విని, శమీకుండు దివ్యదృష్టిం జూచిన వాడునై కొడుకు నుద్దేశించి–

గీ. ఎంత పని జేసితివి నిజ మెరుగవైతి
కోపమెంతేని కీడగు కోపి తపము
అడవి గాచిన వెన్నెలే యగును జుమ్ము
తగిలి శపియించి నాడవా తక్షుకు చేత
జావగా నగు రాజు ప్రజాహితుండు
మౌని వర్యులు శాంతులై మన్నుటెంతొ
ప్రభు పరీక్షితుచే గాదె పాహి పాహి
అనుచు శిష్యు నొక్కని బిల్చి నని పె నపుడ
రాజు కడకేగి దెల్పనా రాజుకంత

వ. మంత్రులంత చాల విచారించిన వారలై రాజానుమతంబున జలార్ణవ మధ్యం బునందొక్క హర్మ్యంబు నిర్మింప జేసి రాజందు సుఖంబు నుండ అనేకానేకంబైన జా గ్రత్తలు కొన్నవారలైరి. ఐనను పరీక్షితుండు చావును గూడను ప్రతీక్షించుకొన ువాడ నై మునిశాపముతప్పదనుట నెరింగి మహానుభావులగు పురాణ పురుషుల వలన ఆ సప్తదివసంబుల లోనభగవంతుని భాగవతుల చరిత్ర అనబడు మహాభాగవత పురా ణమును విన నుత్సహించినవాడగుచు భూసురోత్తముల కనేకానేక దానధర్మములొ సంగుచు వారి వలన ఆశీస్సులు గొనువాడునై మంత్రులచే నియోగించబుచ్చె. నట–

## కాశ్యప మౌనికి తక్షకుడు ధనం బిచ్చి మరల్చుట

చ. ఉరగుల వల్ని బాధలవి వోసరుపాయ మజుండు చొప్పిలన్

అరమర లేకె కాశ్యపుని నట్లమితోద్ధతి సంక్రమించుటల్
కరుమరుదై విషాగ్నులవి కష్ఠము కల్గజేయకుండుటన్
వరముని జీవకోటులవి వర్ధిలుచుండెడు నెంతొ పెంపునన్

వ. అగుడు తా విన్న బ్రహ్మర్షి శృంగి శాపంబున పరీక్షితుండు తక్షక విషాగ్నుల దగ్ధుండుకాకుండ రక్షింప నెంచిన కాశ్యపుడు తన విద్యా బలంబు పెంపు మెరయ యెంచి వచ్చుటను గనిన తక్షకుడు వృద్ధ బ్రాహ్మణ రూపధరుండై అడ్డు పడి మునీంద్రా! యెటు బోదు రేమి కారణంబు నిమిత్తమో మేమెరుంగనై నదై సెలవీయుండన, కాశ్యపుడు తా విన్న విషయంబు సవిస్థరముగా విన్నవించి తన విద్యా ప్రభావ ముచే అనన్య సామాన్య మహామహీ పాలకునిన్ మగుడి సజీవితుం జేసి సుఖంబుండ జేతునని మరియును అమ్మహారాజు వలన యెనలేని విత్తంబులు బహూకృతిగా బడయంగలవాడ ననుటయు అంత బ్రాహ్మణ వేషధారి తక్షకుండు తననుతన్నుగా నెరింగించుకొని–

క. అనఘా! తొల్గగ చేయుదు
నరియెడు తక్షకు విషాగ్ని ఔనే నీచేన్
అని నీ వటముం మరలను
కనుపడ జేయుము ఘనతర కరమౌ విద్యన్

వ. అనుచు తక్షకుడా తక్షణంబా వట వృక్షముం గరచిన

గీ. భస్మమయ్యెను వృక్షంబు విస్మయంబ
ఆకు దొడిమలు కొమ్మలుం మ్రాకుతోడ
కాశ్యపుండంత మంత్రోద్క కలశ విసరె
వటము చివురించె మ్రానితో వహ్వా యనగ

వ. అంత తక్షకుండు మహాత్మా! మీ మంత్రము లమోఘములయ్యును విప్రశాపంబును క్రమ్మరించి పరీక్షితుం బ్రతికింప నేరవు. కావున, వారిచ్చు ధనంబుకంటెఅధిక ధనములు నాయందు చేకొనుండన, ఆత్మ గతంబున విచారించి తక్షకుడిచ్చు ధనంబులుగొని గృహోన్ముఖుడై చనియె. ఇది అన్యులెట్లెరింగిరని అడుగుదురేని వినుండు. ఆనాడు ఇంధనంబులకై నొక పారుండు వనంబున కేగి అమ్మహా తరుశాఖ లం

దెక్కి ఎండు మ్రాకుల గోయు వాడట్లె నిహతుండై మరలబ్రతికిన వాడు ఇంటింటికిం బోయి యెల్లరకుం భార్యానుజులకుందెల్ప అటనట పెద్దగా వినుకలి అగుటయు అం దరకుం దెలియ గల్గెనను టయును–

## తక్షక విషాగ్నుల పరీక్షితుండు దగ్ధుండగుట

వ. తక్షకుండు తన జాతి నాగుల నెల్లరం బిలిచి వారికి చెప్పనగు తెరంగు లెల్లం జెప్పి మునిశాప ఘటిత కాల మాసన్నమగుడు–

గీ. పొండు మీరలు విప్రరూపొండు దాల్చి
పండు ఫలముల గొంచు వేదండపురికి
రిత్త బోవునె కోపాగ్ని తప్పు గాగ
తొండ మాదిరి హర్మ్యమ్ము తోడ ప్రభుని
మండ జేయుదు సూక్ష్మనై పండు నొదిగి

వ. అని అట్లు తన విషాగ్నులచే హర్మ్యంబు తోడ నందున్న వారెల్లరు దగ్ధులగుట యునువివరించిన వార లట్లు మజ్జనకులు దివ్యత్వము నొందుటయు యధావిధి పర లోక క్రియలు నిర్వర్తింప బడియె నంత.

## జనమేజయుడు సర్పయాగము చేయుట

ఉ. అన్వయ రాజ్య భారమును ఆదరమొప్పగ స్వీకరించియున్
సూన్వయ శాస్త్ర సాధనలు సూక్ష్మపు తోవల సంతరింపగా
కణ్వుడు విశ్వమిత్రముల కమ్మని గాధల సచ్చరిత్రలై
అన్వయ మెల్లరుం బొగడ అద్భుత వీర్య పరాక్రమంబునన్

క. యాగము లెన్నియొ జేసియు
త్యాగధనుండను యశమును ధారుణి దాల్చిన్
జోగుల యోగుల గాచియు
భోగిల జేసిన జనవర భూధవ కావే

ఆ. తధ్యమిపుడ జేయు తాత్మ్యమెంతన నీవు
సర్ప యాగమిపుడ సత్వరంబ
భూపతు లనేక భూజనుల్ సుఖియింప

సర్ప జాతులెల్ల సమయు నట్ల

వ. అనుడు విని జనమేజయుండు వారల మాటచొప్పున సర్పయాగము చేయసమ కట్టిన వాడునై పౌరాణికులవల్ల విన్నయట్లు శాస్త్ర సమ్మత మగునట్లు కాశికాపురీధీశు పుత్రిక వపుష్ఠ యను దానిని ధర్మ పత్నిగా గ్రహించి సర్పయాగ దీక్షితుండై యజ్ఞోప కరణ నానానేక వస్తు సంభార సముదాయముల్ ధనధాన్య సమృద్ధమ్మును మహా నిధనంబునుయై యొప్పి ధగద్ధగాయ మాన విరాజితంబును సువర్ణమణిమయ భాం డాగారమ్మును మునిగణగురుజన విరాజితమ్మును బుధవిబుధులరగు బ్రాహ్మణ సం ఘ పరివృతుండునైన రాజునకునొక వాస్తు విద్యా శిల్పాచార్యుండైన పౌరాణికుం డిట్లనియె.

క. అనఘా! వినుమిక బహుముఖ
జననాయక మణిమయులచె జరుపగనుండిన్
కనరాదీ జన్నము తుద
జనగా బోవదని తెల్పి చెచ్చెరనేగెన్

వ. ఆ వచనం బాకర్ణించిన రాజానువర్తనులైన మంత్రి పురోహిత దండ నాధాది మహా నాయకు లెల్లరును మహామహులైన తపోధనులు చండభార్గవ పింగళకశార్ఙవ కౌత్సులు హొూతహోను అధ్వర్య బ్రహ్మ ఉద్గాతలు గాను వ్యాస వైశంపాయన పైల జై మిని సుమంత శుక శ్వేతకేతు మౌద్గల్యోద్దాలక మాండవ్య కౌశికకొండిన్య శండిల శాండిల్యా వామటఖ కోహ లసిత దేవర నారద పర్వత ఆత్రేయ కుంద జఠర వాల ఘట వత్సల శృతశ్రవో దేవశర్మ శర్మద రోమ శోదంక హరిత రురు పులోమ సోమ్ర శ వసులాదిగాగ ల మహామునులు సదస్యులుగాధూమ సంవర్తక రక్తవర్ణ నయనులై న యాజ్ఞకులు అగ్నిముఖంబు చేసి వేల్వం దొడంగిన తన్మంత్ర వాక్య వాచ్య ప్రభా వంబుల వివశులై సమస్త నాగ ముఖ్యులును ఒకరొకరిం బిల్చుకొని భయాతురునై యజ్ఞకుండాగ్నుల నాగకులు లెల్ల దశ శతసహస్ర సంఖ్యలుగా గుములు గములుగా గూడిన అహినాగోరగ సర్పకాలకూట కర్కోటకాది యేక త్రిక పంచ సప్త నవ నానా ము ఖులైన సర్పజాతులెల్లరును భుంభుం నిస్వన ఆర్తులునై దొరంగిరి. అట తక్షకుం డు ఇంద్రు పాలికింజనిన ఇంద్రుండు బ్రహ్మ వచనంబులుగా వాసుకాది ప్రముఖుల

కీ సర్పయాగ గండంబు లేకుండుటెరింగించిన వాడు గాన ఆస్తీకుని కడకుబొమ్మనిన తత్తక్షణంబ తన చెలియలగు కరత్కారు కడకుంజని స్వకులసమానులమగు మాతృ వంశజులను గావ వలసిన అవసరము ఆస్తీకునిచే నొనరింప బడుటె రింగించిపుత్తెం చుటయును తల్లి వాక్యముగా ఆస్తీకుండు సర్పయాగ ముఖముగా నేగి –

## ఆస్తీకుడు సర్పయాగము నివారించుట

వ. అట యాగ కర్తలగు వారికిని ఋత్వి క్రృవర్యులగు వారికి సభాస్థారులైన భూసు రోత్తమ సదస్యుల కెల్లర కును శుభోత్కరముగా స్వస్తి వాక్యములు పల్కుచు–

తే. కరము వెలుగొందు బహుమఖ కర్తవయ్య
ప్రజల దయతోడ పాలించు ప్రభుడవయ్య
తాత దండ్రుల దలపించు దాతవయ్య
కావుకావంచు నాగుల కావుమయ్య

గీ. నింగి నేలయు నిండెను నీదు కీర్తి
ధర్మదీక్షోర్వి పరతంత్ర ధార్మికుండ
యెన్నగా దగు నీకోర్కె మిన్నదైన
విడవగా దగు నికనైన విజ్ఞులరయ

క. శ్రీకర పాండవ వరకుల
ప్రాకటముగ నీదు కీర్తి పాకెడు దిశలన్
వీకదె అహి మఖ మంటల
సాకల్యము జావజేయ సర్పులనెల్లన్

తే. గౌరవాన్వయ రాజేంద్ర కర్మయోగ
యెన్ని మఖములు జేస్తివో యేమి చెపుదు
చాలు చాలించు నీ చేయు సర్పయాగ
మింత ఆపుమ మమ్ముగావ సుంత బ్రోచి

గీ. పరుల గాచెడు వాడెపో పరమ ఘనుడు
ఆర్తివర్యుల గాచుటే ఆర్తరక్ష
దీన జనులను గాచేటి దీక్షకుండ

శాంతి పథమున నడువుమో శాంత పురుష

వ. అనుచు బహుభంగుల ప్రస్తుతించి ప్రశాంతచిత్తుని గావించుటయును సదస్యుల రగు భూసురాన్వయు లెల్లరును ఆస్తీకు ననుగ్రహించి శాంతచిత్తంబున సర్పయాగ ముడుప సముచిత వాక్య పరంపరల ప్రభు సమ్మత మగునట్లు నుచితభాషణములు పల్కుచు నాస్తీకుననేక ప్రకారంబుల కీర్తింప జనమేజ యుండుసర్వ జనానుమోద ప్ర దమ్ముగా సర్ప యాగ ముడిగించుటయు నట్ల జననీ శాపపీడితులై దహింప బడకుం డ నాగకులంబు రక్షింప బడియె నని, మరియు ఇన్నాస్తీకు చరితంబు విన్న వారెల్లరి కిని యే యురగ బాధలు లేకుండు నట్లును సర్వ పాపక్షయం బగునని శూతుండు శౌనాకదులకుం జెప్పె.

**ఇది శ్రీశ్రీ వాణీ వరప్రసాద లబ్ధ సుకవి జనప్రియ సాధుజన విధేయ శ్రీ కవిత్రయ స్ఫూర్తి ఆర్వేల నియోగి బ్రాహ్మణ మండపాక వంశోద్భవ వీర్రాజు పౌత్ర, సూర్య ప్రకాశం సత్యనారాయణాంబా తనయ విరచిత -: శ్రీమదాంధ్ర మహాభారత ఆది పర్వ ద్వితీయాశ్వాసము :-**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆది పర్వ – తృతీయాశ్వాసము

### వ్యాసుడు జనమేజయునకు భారత కథను దెలుప వైశంపాయను నియోగించుట

ఇట్లు జనమేజయుండు సమస్త భూదేవుల బూజించి ఆశ్రితుల కెల్లం గోరిన దెల్లయు ఇచ్చిపుచ్చి విద్వజ్జన గోష్ఠి నుండి నొక నాడు వ్యాసుని బూజించి భారత కథాశ్రవణ కుతూహలుండై వినుచుండు నవసరంబున –

చ. విమల తపోధనుం డపర విష్ణు సనాతను బాదరాయణున్
అమలిన భక్తి పెంపెసగ నర్చన జేసి మహాత్మ మీరలున్
అమర నదీసుతుండు మరి అంధనృపుండును అందరుండగా
సమరము జేయగా యెటుల సాహసులయ్యిరి కౌరవాన్వయుల్

వ. ఐనను యిట్టి గోత్రకలహము పాండవ ధార్తరాష్ట్ర విబేధన కారణం బేమి కతన వచ్చెనానతిండన కృష్ణ ద్వైపాయనుండు మహాభారత కథ ఆద్యంతములు సవిస్తరం బుగా దెల్పుమని వైశంపాయను నియోగించి చనిన–

### భారత ప్రశస్థి

సీ. తోయజాక్షుని చేత తొలొల్త బ్రహ్మకు
నవల నారద వ్యాస్లు నయము దెలియ
వినువీధి నెనరుగ విస్తరించిన దొచు
అవతరించిన గాధ అద్భుతంబు
సురుచిర ప్రదమౌచు సుస్థిర మెంతేని
చెవిసోక విన్నను చెప్పికొన్న
విపులార్ధ బహుముఖ విజ్ఞాన నిధనంబు
బహు పుణ్య ఫలమౌచు భారతమ్ము

గీ. బహుళ కథనమ్ము ఆద్యంత పాండవాన్వ్య
పరమ పుణ్యమ్ము యెంతేని పాప విఘ్న

దేశ దేశాల జనులచే దీప్తి గొన్న
విశ్వ విఖ్యాత జనకంబు విమల గాధ

వ. అని భారత కథ ప్రసస్థి నుగ్గడించి వైశంపాయనుండు జనమేజయునకు –

**పాండవ కౌరవ బేధ కారణము**

సీ. భారతాన్వయ కథా భవ్య జన్మలు నయ్యు
ధృతరాష్ట్ర తనయులు దుర్నయంబ
పాండు కుమారుల ప్రజ్ఞకు నిరసించి
దాయాదు లగుటచే దాయ బుద్ధి
ఇంతింత అనరాని యెంతేని కీడులు
శకుని కర్ణ కౌరవ శక్తు లకట
భీమసేను నొకట బిర్రుగా గట్టియు
నీట ముంచుట గూడ నిష్ఫలింప
లక్కయింటను బెట్టి అక్కజంబగు త్రోవ
మంట బెట్టను జూచ్రి మత్సరంబ
విదురుపాయాంతర విభ్రాంత మార్గులై
ప్రాణాలతో మిగిలిరా పాండు సుతులు
ఘోర హిడింబాసురు బరిమార్చి భీముడు
ఏక చక్ర పురిని యేసె బకుని
యేమి చెప్పగ వచ్చు యిట్టిదట్టి దనుచు
దైవంబె తోడుగా ధైర్యఫణితి
దురిత విధుల నెల్ల దొలగుచు వచ్చిరి
కృష్ణ పరమాత్మ హిత బుద్ధి కృపతొ యెంతొ

ఆ. పాప చింత్న లేక ప్రఖ్యాత గుణులౌచు
అస్త్ర విద్యలందు ఆధ్యులగుత
మత్స్య యంత్ర విధిని మగవ పాంచాలితో
చేవ దనరి యెంతొ సేమముంట

వ. ఎరిగి ధృతరాష్ట్రుండు పాండు కుమారుల రావించి అర్ధ రాజ్యంబిచ్చి ఇంద్రప్రస్థ పురంబున అభిషిక్తుల గావించి అందుండ బుచ్చిన -

సీ. అనుజ భీమార్జున నకుల సహదేవులు
అక్కజంబగు ప్రేమ నంటియుండ
ధర్మ తత్పరుడౌచు ధార్మిక బుద్ధితో
ధరణి బాలించు నా ధర్మరాజు
నెల మూడు వానలు నెనరుగా గురియుచు
ధరణి బండెడు యెంతొ ధాన్యతతులు
సుఖశాంత పరులౌచు సుఖియింప జనులెల్ల
పాడి పంటల తోడ ప్రభదలిర్ప
అన్యాయమనుమాట అట గాన రాదయ్యె
భీత భయము లెల్ల పాత బడియె
మాట దప్పుటె నేరమా వీటి జను లందు
ఆడియు తప్పటాడు టచట వినము

తే. పంచ భర్తృక పాంచాలి భవ్య చరిత
యేటి కొక్కని వొంతనా యేలికొనగ
సమత గూర్చుచు వారల సముచితంబ
వన్నె కెక్కిన చెల్లియా వాసు దేవ్కు

వ. ధర్మరాజుతో కూడియుండు కొండొక్క సమయంబున బ్రాహ్మణ గో సంరక్షణార్ధ ముగాఅస్త్రములు గొనిపోవ నయ్యింటి లోనికిం జని నియమభంగ వర్తనుండైన పాండవ మధ్యముండు గోరక్షణ గావించిన తక్షణంబ నియమ వర్తనానుసారముగా భూ ప్రదక్షిణ గావించుచు ద్వారకాపురి కేగి వసుదేవ సుతు నను(గహంబున బలరామ కృష్ణుల తోబుట్టువు సుభద్రను పెండ్లియాడి ఆమె యందు అభిమన్య కుమారునిం బడసె. మరియును అగ్నిభట్టారకు ననుగ్రహంబున దివ్యరధంబును దివ్యాశ్వములను గాండీవ దేవదత్తములను అక్షయ తూణీరంబును బడసి ఇంద్ర తనయుండు ఇంద్రు నిచే అర్ధ సింహాసనారూఢుడునై పెక్కు వరంబులం బడసె. మరియును మయుడను

గంధర్వ కుమారునిచే యెనలేని మహామహిమోన్నతా విభవ సంపన్నంబైన సభాంత రంగ ప్రాంగణ ప్రాప్తుడాయె. ఇక భీమసేనుండు తొల్త హిడింబి యందు ఘటోత్కచ కుమారుని గన్నవాడయ్యెను. వెండియు ఘన భుజబల దర్పంబులచే జరాసంధాదుల జయించె. నకుల సహదేవు లిర్వురును తమకొలంది నయ్యయి రాజన్య కుమారులం గెలిచి సార్వభౌముండైన ధర్మరాజు రాజసూయ మహాధ్వరంబు గావించుటకు తోడ్ప డె. ఇవన్నియు సహింపని దుర్యోధనుండు శకుని కైతవంబున మత్సర గ్రస్థుడై మా యాద్యూతమున ధర్మరాజును పరాజితుం జేసి పండ్రెండే ళ్లరణ్య వాసమును నొక్క యేడు అజ్ఞాత వాసమును చేయ సమకట్టి అరణ్యంబుల పాలుజేయ, అందువసిం చుచు ఫలభక్ష్యాది కందమూలముల దినువారునై నుండుసమయంబున పార్థుండు.

తే. ఈశు సేవించి యెదురొడ్డి యీప్సితార్థ

పాశుపతమను నస్త్రంబు పరగ గొనియు

అన్న మాటకు తలయొగ్గి అడవు లుండి

తొలగి తమ రాజ్య భాగంబు దొడరి యడుగ

ఆజి చేయంగ రమ్మని ఆజ్ఞ సేయ

తగిలి వచ్చిరి పాండవులు తప్పదనుచు

వ. ఇదియ పో మహాభారత కథా రణ రంగమునకు మూలంబని వచించి.

## ఉపరిచర వసు మహారాజు వృత్తాంతము

వ. వెండియు తన్మూలంబైన శ్రీ వేదవ్యాసుని జననము సవిస్థరముగా చెప్పెదవినుం డని,తొల్లి వసువను చేదినాధుండు గొప్ప తపంబుజేయ ఇంద్రుండు మెచ్చి యెన్ని యో వరంబులను దేవతా వస్తుచయంబుల నిచ్చె. నాట నుండియు నవ్వసురాజు ఇంద్రోత్సవమును ప్రతి వర్షంబునం జేయుచు ఇంద్రాది మహేశ్వరుల ప్రీతిపాత్రుం డునై ఇంద్ర విమానంబున ఉపరిచరుం డగుట ఉపరిచరుండు నాబరగి బృహ ద్రథ మణివాహన సౌబల యదు రాజన్యు లనియెడు యేవురుపుత్రులం బడసి వారలన య్యై రాజ్యంబుల కభిషిక్తుల గావించి తాను తన రాజ్యంబేలు చున్నెడ, తన రాజ్య స మీపముగా సుక్తిమతి అను మహా నదిని కోలాహలుండను పర్వతరాజు కామించి అ డ్డగించిన దాని తన పాదంబున తలగందోచినసుక్తిమతికి తత్పర్వత సమాగమంబు

వలన వసుపదుండను కొడుకును, గిరికయను కూతురును బుట్టిరి. వారల నామె వ సుమహారాజుకు కానుకగా బెట్టె. అతడు వసుపదుం తనకుసేనానిగా జేసుకొని గిరిక ను ధర్మపత్నిగా స్వీకరించెను. ఆమె ఋతుమతియైన తరి మృగయా వినోదమున కేగి నరాజు వీర్యంబు వనాంతరమున పడ, నద్దాని భద్రపరచి ఆకాశమార్గమున గిరికకు పంపుచుండ, మార్గ మధ్యమ్మున గాలివాటున రెండుచుక్కలు యమునలోబడియె. అ ద్దాని బ్రహ్మ శాపంబున మీన రూపంబున నున్న అద్రికయను దేవయోని మ్రింగుట యును నవమాసంబులు నిండిన పిదపొక కొడుకును ఒక కూతురు నుద్భవించుట యు జాలర్లు వారల గొనివచ్చి దాశరాజున కిచ్చుటయును అద్రిక శాపమోక్షమును పొందిదేవలోకంబున కేగుటయును, ఆ ఆడుబిడ్డను దాశరాజు పుత్రికగా స్వీకరించి పెంచుకొనుటయు అది పెరిగి పెద్దయగుచుండు కొలది–

## మత్స్య గంధి వృత్తాంతము

వ. ఆమె తోడం గూడనా మత్స్య పొలయు దినదినాభివృద్ధి నొందుచుండుటయు నుకరము చింతించి దాశరాజు కూతురునా యమునా నదిం నావ నడుపు పనియం దు నుంచె నంత నొకనాడు–

క. అరిది తపోనిధి జ్ఞానియు
పరాశరుండను మునివర బ్రహ్మోన్వయుడున్
సురుచిర తేజో నిధియై
వరలిన వాశిష్ఠ పౌత్రు పరహిత కరుడున్

వ. ఆదారిన వచ్చువాడునై తన దివ్యావలోకనంబున అక్కన్నియ పుట్టు పూర్వోత్తరం బులరసి ఆమె వలన కుమారుం బడయ నెంచి–

క. అరిగెడు వాడా యమునా
దరిచేరి అవల దరిగొను ధార్మిక కన్యన్
అరమర లేకన జూచుచు
సరిసరి తన దోవ మరచి సరసకు జేరిన్

తే. తాప మాపగ లేకెంతొ తపన పడుచు
తత్వవేది యయ్యునా మౌని సత్వరంబ

బాల జేరియు తన మనోవాంఛ దెల్ప
అట్టులనుచు గూడె నతని నతివ ప్రీతి

వ. అటుల అమ్ముని వరేణ్యుండు సుముహూర్తం బవలోకించి అప్పటి కప్పుడే తన తపో మహత్వంబు వలన కరకిరణు ప్రచండ కిరణముల మరుగుపరచి చీకటిసంధించి పిండోత్పత్తి క్రమంబు నెరపి సద్యోగర్భంబున నవఘడియావృత కాలవ్యవధానమున నొక దివ్య కుమారునిం గని తల్లిచే పుణ్యాహ వచనంబులు గావింపం జేసి విద్యార్థునిగా నొనర్చుకొనితనతోడం గొనిపోవువాడయ్యెను నమ్మునివరుండు ఆ మగువ కన్యాత్వంబు చెడకుండునట్లు వరంబిచ్చి నీవు వసుమహర్షి వీర్యసంజాతవు కాని సూతకులజవు కావనిచెప్పి మత్స్యపొలగంధం బపనయించి యోజనగంధి (సువాసనా భరితము) గా నొనర్చిన పరాశ రాత్మజుండైన వ్యాసుండు (కృష్ణ ద్వైపాయనుండు) తల్లియైన సత్యవతికి నమస్కరించి తలచినప్పుడు తల్లికి ప్రత్యక్షంబగు వాడనని అనుగ్రహించి తండ్రితో తపోవనంబుల కరిగెనంత.అట్లుయోజన గంధిగా మారిన సత్యవతి దాశరాజ దంపతుల కెంతయు మోదమ్ముగా పెరుగు చుండె.

## వేదవ్యాసుని వృత్తాంతము

వ. ఇట తపోనిష్ఠలో కాలంబు గడపుచు వ్యాసుండు బహు తపో మహత్వసిద్ధి నొందుటవలన త్రికాలజ్ఞుండైన కృష్ణ ద్వైపాయనుండు యేకీకృత వేదపుంజము దురవగాహంబు లగుట తలంచి చతుర్వేదములుగా విభాగించి వేదవ్యాసుండు నాప్రసిద్ధి వడసి జగంబుల వెలిగించి పంచమ వేదమో యనం దగునట్లు భరత వర్ష భారతీయ చరితంబును మహాభారత కధాసంహిత నుడివెనని–

## భీష్మాదులు దేవ దానవాది అంశంబుల బుట్టుట

వ. భీష్మాది మహా వీరులుగా దేవ దైత్య దానవ ముని యక్ష పక్షి గంధర్వాదులు భారత యుద్ధ నియుక్తులుగా పుడమిం బుట్టిరనియు భారతరణంబున భూభారంబు పశమింపుదనిఅజుడు పల్కుటయును మరియును బ్రహ్మ మానస పుత్రులగు మరీచి ఆంగీరస అత్రి పులస్త్య పులహుండు క్రతువునుం బుట్టిరి. వారల యందు మరీచికి కశ్యప ప్రజాపతి బుట్టె.

వాని వలన మర్త్య లోకంబున యీ చరాచర భూతరాశి జనించుటయును, బ్రహ్మ దక్షిణాంగుష్ఠంబున దక్షుండును, వామాంగుష్ఠంబున ధరణి బుట్టుటయు వారలకు క్రమానుగతముగా దక్ష తనయులు యేబది మంది యందున పదుగురకు ధర్ముండును మనువు తోను, అశ్విన్యాదులు యిరువది యేడుగురకును చంద్రునితోను, పది ముప్పురకు కశ్యప ప్రజాపతితోను వివాహంబులయ్యె. అందు దితికి హిరణ్య కశిపుడును అతనికి ప్రహ్లాదుండును బుట్టిరి. ప్రహ్లాదుని మనుమడు బలి. బలి కుమారుడు బాణాసురుడు. ధనువను దానికిబుట్టునవారే దానవులు. సింహిక అను దానికిరాహువుబుట్టె. మినియను దానికి గంధర్వులును, కపిలయను దానికి అమృత గోబ్రాహ్మణులును, ఘృతాచి, మేనకాద్యప్సరసలును బుట్టిరి. వినతకు అనూర గరుడులు పుట్టిరి. అనూరునకు సంపాతి, జటాయువులును, కద్రువ యనుదానికి శేష వాసుకి, ఉరగాద్యనేక నాగ సంతతులును పుట్టె. అంగిరసునకు బృహస్పత్యాదులు పుట్టిరి. బృహస్పతి దేవ గురుండాయె. అత్రికి మునిగణంబులు బుట్టె. పులస్త్యుకు రాక్షసగణంబులు బుట్టె. పులహునకు కిన్నెర కింపురుషాదులు పుట్టిరి. క్రతువునకు పతంగ సహచరులును, ప్రజాపతియునుం బుట్టె. వానివంశంబు లనేక విధంబులుగా వృద్ధిల్లనయ్యె. ప్రభాసుర వసువునకు బృహస్పతి చెలియలు యోగసిద్ధికిని విశ్వకర్మ బుట్టె. బ్రహ్మ హృదయంబున భృగుండు బుట్టె. వానికి గవ్వి, వానికి శుక్రుండును బుట్టి అసురగురుండయ్యె. వానికి చండామార్కులు బుట్టి అసురులకు యాజ్ఞికులైరి. భృగువునకు చ్యవనుండు బుట్టె. ఈ వంశంబు వాడే జమదగ్ని. పరశురాముడు కడమ వాడుగా జనించె. మరియును ధాతా విధాతలు బ్రహ్మ సహాయులు. వారి వంశ క్రమంబున సమస్త వృక్ష పక్షి గో గజాశ్వరాజములును లతా గుల్మాదులను బుట్టె. నిదియ సకల భూత సంభవ ప్రకారంబని జనమేజయునకు వైశంపాయనుడు యెరింగించుటయును. మరియును–

## దేవ దానవ అంశంబుల బుట్టిన కురు పాండవ యుద్ధవీరుల క్రమము

క. ద్రోణుడు భీష్ముడు కర్ణుడు
బాణాన్విత విద్యలందు భాసురు లగుచున్
గణ్యులు పల్వురు పుట్టిరి

అణ్వరతులు యుద్ధవీరులాయత సిద్ధుల్

క. రధి వాసుదేవ బలరా
మ్ముదితులు జననంబులైరి మర్త్యావనిలో
ముదమిల లక్ష్మియు రుక్మిణిగ
ధృతి మిగులుగ జనియించె గర్వోన్నతిమై

క. త్రేతాయుగి మునులరు తమ
ఆతాయిత కామ్య కోర్కె నడుగగ రామున్
యీతరి యదుకుల భామలు
గా తగ బుట్టి తమ కోర్కె గడపగ నెంతోన్

క. జననం బంది రనేకులు
అనునాయక యుద్ధవీరు లాతరి పృధ్విన్
వినరా దెంతటి వారలొ
అనవరతులు దేవ దాన్వ యంశంబులనై

వ. మరియును, ద్వాపరాంశంబున శకునియు, అరిష్ఠాపుత్రుండగు కంసుండును, గంధర్వాంసయందు ధృతరాష్ట్రుండును, మతికన్య గాంధారియును, యేకాదశ రుద్రాంశయందు కృపుడును, కామక్రోధాదుల యంశచే అశ్వద్ధామయును, కలియంశంబున దుర్యోధనాదులును, హిరణ్యకశిపుండు శిశుపాలుని గాను, ప్రహ్లాదుండు శకునిగాను, విప్రచిద్దానవుండు జరాసంధుడుగాను, కాలనేమి కంసుండునై, స్త్రీపుంసధరుండైన గుహ్యకుండు శిఖండిగాను, వివిధ ధనుజాంశ సంభవులుగా కౌరవానీకంబులును పుట్టిన మరుద్గణాంశంబున పాండురాజు బుట్టె. సిద్ధియు బుద్ధియు కుంతి మాద్రులుగా బుట్టిరి.

క. మరుతుల యంశల బుట్టిరి
విరాట్ ద్రుపద సాత్యకీ సు విఖ్యాతులిలన్
పరమై పాండవ యోధము
అరయంగా ప్రబలమౌగ ఆహవ భూమిన్

తే. శమన వాయు వింద్రాశ్వనీ సురుల కృపను

క్రమత బుట్టిరి కామ్యమొప్ప
ధర్మ భీమార్జున నకుల సహ్దేవులనగ
పాండవాన్వయ బిడ్డలై పాండు రాజ్కు

వ. కాలవిధి కౌరవ పాండవ సేనావాహినీ నికర యూధంబులుగా దేవ దానవ యక్ష రాక్షస కిన్నెర కింపు రుష గంధర్వ కుకుర గ్రోధ ధూమ్ర దామ్ర శార్దూలసింహ సురభి గ్రద్ధ కాక నికరాంశములం జననం బొంది–

క. ఇరుగడలై బోరదొడరి
కరమరుదగు కాంక్ష దీర కార్యోన్ముఖులై
భరతాన్వయ రణభూమిని
కురుపాండవ యుద్ధమనగ కొమరిన కోర్కెన్

వ. అనిచెప్పిన వైశంపాయనునకు జనమేజయుండు వెండియు, తమ పూర్వుల నెరిగింపమనుటయును.

## కౌరవ వంశ వివరణ

వ. తొల్లి దాక్షాయనియైన అదితికి కశ్యపుని వలన మనువు లుధ్భవించుటయును, వారివలన కుల క్రమా గత వసువు లేర్పడుటయును, కలివశంబున కాలగతులు తలక్రిందులగుటచే తమలో తాము కలహించుటయును మనుపుత్రియైన యిల అను దానికి బుధువలన పురూరవుండు బుట్టి చక్రవర్తి యగుటయును,నూరు అశ్వమేధమ్ములు చేయుటయును, ధన లోభమ్మున విప్రధనంబులపహరించుటయును వినినంత బ్రహ్మనియుక్తులై దివిజమునులు పురూరవు కడకురాజనుటయును, రాజ్య మధాంధుండునై పురూరవుండు వారికి దర్శనం బీయకుండుటయును, అందుకు కినిసి దివిజ మునులు వాని నున్మత్తుగా శపించుటయును, మున్నుగా గల విషయములన్నియు నుగ్గడించుచు వానివంశంబున బుట్టిన నహుషుండు రాజ్యాభిషిక్తుం డగుటయును, తాతమాడ్కి ఆతడు నూరుఅశ్వమేధ యాగము లనర్చుటయును ఇంద్రత్వమును పొందుటయును జెప్పి నహుషునకు యయాతి, అతనికి శుక్రపుత్రి దేవయానియందు యదుతుర్వసులును, వృషపర్వుపుత్రి శర్మిష్ఠయందు ద్రుహ్యుసు పూరులను ముప్పురు పుత్రులుదయించిరి. యయాతి విషయోప భోగలాలసుండగుట కొడుకులం బిలిచి

తన ముసలితనమును స్వీకరించి వారి యవ్వనత్వమును తన కెవ్వరిత్తురో వారలే యీ రాజ్యమున కధిపతులు కాగల రనుటయును, కడగొట్టు వాడైన పూరువు తండ్రి మాటచొప్పున తన యవ్వనమును అతనికిచ్చుటయును జనమేజయడు వైశంపాయ నుని కిట్లనియె.

## యయాతి మహారాజు చరిత్ర

తే. దేవ! యెటుల నయ్యయాతి దేవయాని
 విప్రసుదతిని బెండ్లాడె? విశదముగను
 వినగ నభిలాష నొడమెడు వినగ జెపుమ
 ధర్మమార్గాన వర్తిల్లు తత్పరుండు

క. మృతసంజీవిని మహిమను
 మతిమంతుడు అసుర గురుడు మాన్యుడు యెంతన్
 మృతి జెందిన దానవులను
 బ్రతికింపుచు నుండునంత పదపడి సురలున్

క. అతిలోకోత్తర సురగురు
 సుతు గచు వినయాన్వితమతి సుందర రూపున్
 బ్రతిమాలి పంపుటయును
 అతులి తసాధ్యుడు గొనగ నమృతసంజీవిన్

వ. అతండు వల్లెయని వారల మాటచొప్పున వృషపర్వు పురంబున శుక్రువీటికరిగి అభివాదనల్ ఘటియించి మహాత్మా! యేనుకచుండనువాడ. బృహస్పతిసుతుండ. మీ రల శిష్యరికంబు గోరి వచ్చినవాడ. అనుగ్రహింపుడన శుక్రాచార్యుండు వల్లెయన వి నయ విధేయతా గరిమంబున గురుచిత్తం బలరించు నటుల మరియును గురుసతి సుత ప్రీతిపాత్రం బగునట్ల ప్రీతి ప్రేమ పదంబులగు తెరంగుల వర్తింపుచు గురు మ తినెరింగి తదనుగుణ కార్యానుగుణుండై తావచ్చిన పనియేమరక అప్రమత్తుండై వర్తిం చు చుండుటయును విద్యా సంపన్నుండు కాదొడంగుటయు నోర్వలేని యసుర కు మారులు నొండొరు లాలోచించుకొని తమలోతాము అనేక విధంబులుగా అనుకొని

నొక్కనాడేకతంబ దవ్వుల నడయాడుబీడు భూముల హెూమధేనువులం గాచుచున్న యా సురగురు కుమారు కచునిం వధియించి మారుమూల నొకమానికిం బంధించి చనుటయు నంత చిరు చీకట్లు క్రమ్మినను ధేనువుల వెంట కచుండు రాకుండుటకు చింతించుచు గురుపుత్రి దేవయాని ప్రేమపూర్వక ప్రీతిపాత్ర మనస్క గావున–

క. ఇనుడస్త్రాద్రిని క్రుంగెను
కనువిందుగ నాలమంద క్రమ్మరి రాగా
వెనువెంట నడచి వచ్చుచు
కననాయెడు కచుడు నేడు కనుపింపడొకో

వ. అని అటునిటు చూచుచు ఆదుర పాటు దోప బహువిధముల చింతించుచు–

గీ. ఏమి కారణ మేమొచ్చె నింత దనుక
స్వామి కార్యము మరచెనా స్వామి కచుడు
యక్ష రాక్షస బాధలో యెవ్వ డెరుగు
యేటి బాధకు గురియయ్యె యేకతంబ

తే. ఆటపాటల తాగూడి యాడువాడు
భావ సౌందర్య గాంభీర్య బ్రహ్మచర్య
వ్రతుడు పుటుతర ధీయుక్తి ప్రాభవుండు
చెలిమి జేయంగ నెంతేని సరస గుణుడు

వ. అని తండ్రికడకుం బోయి కచుడు రాని వృత్తాంతం బేమయ్యుండ నోపునోయ న గూతు సమ్మానించి ఆ అసుర గురుండు తన దివ్యదృష్టిం కచుండు దనుజకుమారులచే నిహతుండగుట ఆదిగా నెరింగి మృతసంజీవినిం బిలచి కచునిం గొనిరా ని వేదించిన అది ప్రసాదంబని తత్తక్షణంబ వనమధ్యంబున విగతుండైమారుమూల కట్టబడి యున్న కచుని దివ్య ప్రభాభాసమాన సజీవితుంగా జేసి తీసికొనివచ్చి శుక్రున కర్పించగా దేవయాని సంతుష్ఠాంతరంగితయై యున్నంత కొన్నిదినంబులకు వెండియు నొక్క నాడు దనుజ వ్యాపారాదితాంగులైన దనుజ కుమారులు పెక్కురుం బ్రొద్దులు చింతించి కచుంజంపి బూడిదగావించి ఆ బూదిని సురయందు గల్పి సురసేవ్యమాన సంతుష్ఠాంతరంగుండు గానున్న అవసరంబున అయ్యసుర గురున కిచ్చుటయును–

క. తొల్లిటియట్ల గచుండటు
మళ్లి గృహంబ్ము నటు రాక మానుట తోడన్
కొల్లలుగా కూతు వగవ
బల్లిదమౌ నసుర పనిగ భృగుండెంచిన్

వ. దుఃఖా క్రాంతయయ్యున్న కూతుతో వగవకుమని పగతోడం దనుజ కుమారులే వధియించి యుందురని నిహతుండయ్యును నతడుసుగతిం జెందునులే యనివచి యింప–

తే. ఆఢ్య జదువరా మనయింట అంతమొంద
యూరకుండుట పాడిగాదూహ జేయ
అసుర ఘాతుక వ్యాపార మంచు జగతి
చెప్పు నాచంద్ర తారార్క చిరము గాగ
మాన్య శిష్యుండు మీకు సమ్మానితుండు
దేవగురు కుమారుండును ధీరగుణుడు
రాగమయతేజ మోహాను రాగమయుడు
నిజము నామది కెంతేని నెమ్మి గూర్ప
తెమ్ము సంజీవినీ విద్య తేజమొప్ప

వ. అనుచు పట్టువట్టి చుట్టచుట్టుకొని కుడువరా నొల్లని కూతు మదికి ప్రసన్నుండై ప్రీతి పూర్వకంబుగా యోగ దృష్టిం బరికించి చతుర్దశభువన లోకాలోకనా పర్యంత మాద్యంతముల నెందును గచుం గానలేక సురాసమ్మి శ్ర భస్మమయుండునైతన యుదరమ్మున నున్నవానినింగని అసురకృత్య వైపరీత్యంబుల గల్గు అపకారంబుల నెరిగి–

క. సుర తాగుట దోషమనియు
సురతాగిన సర్వదోష సంభవమనియున్
సురతాగిన వాడ్జగతి, న
సురుడనగా జెల్లు మరియు శూద్రత వొడమున్

వ. అని శుక్రుండు సురా పానము మహా పాతకముగా పల్కి తన యుదరంబున నున్న కచుని అప్పుడ సజీవితునిగా జేసిన, అయ్యుదరంబున నున్న కచుండిట్లనియె.

గీ. బ్రతికియుంటిని నీపొట్ట భద్రగతిని
మహిత సంజీవనీ విద్య మహిమ చేత
కరుణ దెల్పుము నాకిప్డు కామ్యమొప్ప
జెగతి జీవింపనౌచు సంజీవ విద్య

వ. అనుచు ప్రార్థింప, నాగచునకు శుక్రుండు వల్లెయని మృతసంజీవనీ విద్యదెల్పుటయును, పొట్టజీల్చు కొని కచుండు వెలికి వచ్చి గురుప్రసాదిత విద్య యగు నాసంజీవనీమంత్రముపాసించుటయు తత్ప్రభావంబున శుక్రుండు సజీవితుండై ఉదయాద్రి ప్రభాసమాన మానుండగు భాస్కరుని పోల్కి వెలుంగుటయును తదుపరి గురునానతి వడసికచుండు నిజనివాసంబున కేగసంకల్పించి గురుపత్నికిని, దేవయానికిని దెల్పుటయును, ఆ పల్కు విన్న దేవయాని బహు చింతాక్రాంతయై తనను వివాహమాడుమని కోరుటయును కచుండిది ధర్మవిరుద్ధమనియు గురపుత్రివి నాకు సోదరి వగుదువనియు, నీ నోట యిట్టి అసంబద్ధపుమాటలెట్లు వచ్చినవని పలుక దేవయాని కినుకతో తన కసంతుష్ఠి జేయు వాడవుకావున నీకుమాతండ్రి ఉపదేశించిన మృతసంజీవని ఫలింపకుండు గాకయని నంతకచుండుకుశాగ్ర బుద్ధియు, ధర్మ పరుండును కానవల్లెయని, నాకు ఫలించని ఆ మృతసంజీవని నాచే ప్రబోధింపబడి న వారికి ఫలించు ననియు, అధర్మ్మ వాడిన దానవు గావున నిం బ్రాహ్మణుం డుద్వాహము గాకుండెడునని ప్రతిశాపంబు పల్కి–

ఆ. దేవపురికి వచ్చి దేవ హితార్థంబు
తానుగొన్న విద్య తనదు వార్కి
వలయు నప్పుడెల్ల వ్యావృతింపుచు నుండె
నియమ బద్ధుడగుచు నీతి దనరి

వ. ఉండునంత నొకనాడు అసురరాజు వృషపర్వు పుత్రి శర్మిష్ఠ తన గురు పుత్రి దేవయాని తోడను యింకననేక చెలికత్తియల తోడను గూడియాడుచు వనాంతర మధ్యంతరమున నున్న సరోవరంబున జలకంబులాడి యాడి మధ్యాహ్నాందినకరుండు నడినెత్తి కెక్కుటయును గృహోన్ముఖ సంభ్రమంబున బిలబిలమనికొలను వెడలి చిందర వందరగా నటునిటు చెదరియున్న తమ పరిధానములతమ కందినవి చుట్టబెట్టు

కొను నెడ దేవయాని పుట్టంబు శర్మిష్ఠ కట్టుకొనియుండ, దేవయాని–

ఆ. ఏమి తెగువ నీకు యేమంత బగరమ్మ
క్రిందు మీదగాన్క గెంతు లిడుచు
నాదు వల్వ గట్టి నాకేది పుట్టంబు
నీదు వల్వ గట్టనేర నేను

వ. అనిన ఆ శర్మిష్ఠ ఆమెతో

ఆ. తెగువ పొగరు అంచు దెల్పంగ నేర్తువే
కూడు గుడ్డ గూడు కోర్కె యిచ్చి
గురువు గురువులంచు కొమరొప్ప కొల్వంగ
లేతినైతి నీకు లెక్కలేక

వ. అనియెగ్గులాడి కోపోద్రిక్తంబున దేవయానిం నొక్క నూతన్ద్రోసి శర్మిష్ఠ చెలులతో పురంబున కేగుటయు నంత–

## యయాతి దేవయాని నుద్ధరించుట

మ. వన మధ్యంబున నూతిలో బడియు నవ్యక్తాశ వాపోవుచున్
కనలిం జెందుచు యిస్సు రుస్సు రను నక్కాంతా సరోజాక్షినిన్
వనవాటీక చరీక సంకులము లవ్యాప్తిం తృణీక్రింపుచున్
జననాధుండు కనెన్ కడుం సరస సౌజన్యా విలోలుండయిన్

మత్త. తొంగి వంగియు చేయినిచ్చియు తోయజాక్షిని లేపుచున్
అంగ సౌష్ఠవమేమనం మది అంగనా మణి జూచుచున్
దొంగ జూపుల యెవ్వవీవన తొంగి పొంగెడు సిగ్గుతో
పొంగుగా వడివచ్చు రోదన పొంగనీయక పంటితోన్

త. అదిమి బట్టియు అవుడు గరుచుచు నయ్యయాతికి నెమ్మదిన్
విదితమౌనటు తన్దు గాధను వెక్కువెక్కుచు రాజుతో
పదిల పర్చెను పద్మినీ ముఖి భావమెల్లయు దేవ్పడన్
ఉదిత చేయిని గొన్న యాతడె ఉర్వి కాంతకు తోడనిన్

వ. పలికి మీ ఉపకృతి మరచు దానను గానని వెసంజని తన జనకునితో జరిగిన దంతయుం దెల్ప శుక్రుండు కూతుం స్వాంత బరుప నెంచి క్రోధాదు లెట్టివారికింద గదు. క్రోధము వలన స్థిమితము చెడును. అస్థిరమతి యైననాడు వివేచన నశియిం చి మంచి చెడునరయ లేరు. స్థిర చిత్తు లెల్ల వేళల ధర్మ తత్పరత గల్గి సుఖింపగల్గు దురు. క్రోధమును వీడిన వాడే గొప్పవాడు. కాన నీ క్రోధమును వీడి సుఖంబుండు మనిన దేవయాని తండ్రిమాటల కీయకొన నేరకమంచి చెడ్డ నెరుగక గర్వోన్నతులైన వారి కడ నుండుటకంటె నికృష్ఠము మరిలేదు. నేనెందేనియు జనుదుకాకన, శుక్రుం డు అమ్మా! నిన్విడచి నేనుండ గలనా. నీ తోడనే యేమును వచ్చు వారము అను చుండు నంత వృషపర్వుండు అంతయును చారులవలన నెరింగిన వాడు గావున పరుగు పరుగున నేతెంచి–

తే. ఆర్య యిది యంత మీ సుకృతంబ కాదె
దైత్య సంఘంబు పెంపెక్కి ధైర్యముంట
తప్పు సైరింపు మాదగు తప్పిదమ్ము
ప్రీతి నొసగెద మీ సుత ప్రీతి గాగ

## శర్మిష్ఠ దేవయానిని గొల్చుట

వ. అనుచు ననేక ప్రకారంబుల నా వృషపర్వు దైత్య రాజేంద్రుండు గురుపుత్రి నొ డంబరచి యేది కావలయు నడుగు మన నంత నా దేవయాని కినుక కోపోద్రిక్త య గుట శర్మిష్ఠ నవమానింప దలచి కార్యా కార్యములు ధర్మాధర్మములు వితర్కింప నేరక శర్మిష్ఠ తన సహస్ర కన్యకా పరివృతంబుతోడ తనకు దాసిగావలయునన వృషపర్వుం డాడిన మాట తప్పుట కీయకొనని వాడు గావున స్థిరచిత్తంబున స్వజాతిమేలు దలం చి ప్రజాభిమానుండై నిస్వార్థ బుద్ధితో తనకూతు శర్మిష్ఠ నొడం బరచి దేవయాని కో రినట్లు శర్మిష్ఠను దేవయానికి దాసిగానిచ్చి చనియె. అట్లు శర్మిష్ఠయు గురుప్రీత్యర్థం బుగా నిత్యము గురు పుత్రి దేవయానిం గొల్చు చుండె. అంత నొక్కనాడు దేవయాని శర్మిష్ఠా సహస్ర పరివారములతో గూడి వనాంతర తీరశోభల నీదుయాడు మత్త మ తంగ యానములతృణీకరించు చందాన నడయాడుచు వేణీ వాల్లభ్యంబులింపుగొల్ప మనోహరంబుగా తిరుగుచు లేజిగుళ్లం ద్రుంచుచు పూరెమ్మల నమలుచు కర్ణ నికు

రంబులింపు గొల్ప మణిమయ తాటంక శోభలు మిణుగురులు క్రమ్మిన కరికర్ణ శోభ ల తళుకొత్తు చందాన ముఖ పద్మంబులు అరవింద శోభల మనోహరంబులుగొల్ప అమ్మీనాక్షులు అక్షిద్వయము మిలమిలా మెరయు మీనంబులునుం బోలియుండ ముంగురుల శోభలు గండు తుమ్మెదల తలపింప నాశికలు సంపగిల రీతి ముద్దుగొల్ప కాలిగజ్జె లందియల మ్రోత వన లక్ష్మీ నడకల మరుగు పరుప ఊర్లు కదళీతరు సమానమై మెరయ, చెక్కుటద్దముల వనశోభ ప్రస్ఫుటించి మెరయ జఘనంబులిసుక తిన్నెలుగా భాసింప ఉత్తుంగ తరంగ శిఖరులుగా పోంగారు పాలిండ్లు చూపట్ట రంగు శింగారుల చిత్ర వస్త్రముల రంగు వనలక్ష్మీ పుష్పితాంతర రంగ వల్లరుల శోభల రయ నవ్వుల కిలకిలారావంబులు సుకపిక శాలికానికర సంకుల కోలాహలంబుగా మెయిపూత లగరు కస్తూరికా నికర సువాసనల్ ఘుబాళింప, పెదవులరవింద సుందరమై ముద్దుగొల్ప,నాభీచక్రమధ్యములు సుళ్లుగా నొప్పియుండ పద వ్రేళులు కూర్మరాజకుంజ శిరో భాగములుగా ముందు వెన్కల దూగులాడుచుండ మధ్యేమార్గంబున వేవిధ విషయా విషయిక సరస సల్లాపంబులు సంకుల వాద ప్రతివాద హుంకార హంకార ఝుంకారమ్ములు వన వాటీ కరినికర ఝింకార ఘీంకారముల నొప్పియుండ నొండొరులు రాచు కొనుచు దోగుకొనుచు పదఘట్టంబుల రాయిడి ఆకశంబున కెగసిన ధూళిధూమిశ్రమము మేఘంబుగా దోప పెద్దకాలంబు వినోదించి విశ్రమించునెడ–

## యయాతి మహారాజు దేవయానిని బెండ్లి యాడుట

తే. భూరి కీర్తన సందోహ భోగివరు య
యాతి వేటలం దవిలిరా యడవి కపుడు
పవనుడేతెంచె మెలమెల్ల ప్రాజ్ఞుడగుచు
ఘుమఘుమారామ సంభ్రమాకులము జెంద

గీ. వచ్చి చేరిన మహరాజు నుచ్చగించి
అర్ఘ్య పాద్యాది విధముల నర్చ జేసి
వన ఫలంబుల దేనియల్ వడ్డ జెసి
ప్రీతి పూర్వక మెంచనా ప్రభువు మెచ్చ

వ. అట్లుపవిష్టుండై సేదదీరి తొల్లి దేవయాని నెరింగిన వాడుగావున ఆమెమొగంబై ఆ చెలి చుక్కల మధ్య చక్కని చుక్కయై యున్నామె రూపలావణ్యాది వైభవంబుల క బ్బుర పడుచు మనంబెరయ తెలియ నడుగ రాజునకు దేవయాని యిట్లనియె.

తే. మున్నెరుంగుదు నాతెరగెన్న వినుము
దాసి కాదగు నాకీమె దానవేంద్రు
పుత్రి, శర్మిష్ఠ యనెడి పూత చరిత
కొల్తురందరు యీమెతో కొమర నన్ను

తే. ఉద్ధరిస్తివి నూతనం యిద్ధ చరిత
పాణిగ్రహించి రత్తరిం పావనుండ
నాటినుండియు నీరూపు నాటె మదిని
ఉద్వహంబాడి సుఖముండు ముర్వి మెచ్చ

క. ధర్మాధర్మువు లెరిగియు
నిర్మలినుండ్వయి వెలుగుచు యెట్లీతరుణిన్
నర్మిలి భూసుర జాతవు
ధర్మమె నుద్వాహ మాడ తగునే నాకున్

వ. అనుడు నయ్యయాతి మాటలకు దేవయాని అనఘా! ధర్మాధర్మ నిరూపణంబెద్ద యగు నా జనకుండు వల్లెయన నీకునుం సమ్మతంబె గాదె యని అప్పుడ శుక్రును రావించి అంతయు విన్నవింప శుక్ర నీతినాజ్ఞాపితుండైన యయాతి దేవయానినిం బెండ్లాడు నవసరంబున, శర్మిష్ఠ విషయమై శయన పరంబగు ఆనబెట్టి పంపిన కొం త కాలమునకు దేవయానికి యదుతుర్వసులను పుత్రులుబుట్టిరి. శర్మిష్ఠయు దాసికా సంపర్క న్యాయముం దవిలి ధర్మవిరుద్ధంబు కాదనితర్కించి అనృత దోషంబు కాకుం డు టెరింగించి ఋతుమతి కాలోచిత వర్తనంబున యయాతింగూడి పుత్రవతియయ్యె అంత కొంత కాలంబున కొక నాడుముమ్మార్తుల నయ్యయాతి రూప లావణ్యంబు లుట్టివడి శర్మిష్ఠతోగూడ వచ్చు బాలునింజూచి దేవయాని వీర లెవ్వరని అడిగి తెలిసి కొని మనంబున మగనిపై కినిసి తండ్రి కడకుం బోయివిలపించిన శుక్రుండు కూతు కభిమతంబుగా–

## యయాతికి శుక్రుండు శాపం బిచ్చుట

వ. యయాతి జరాభార పీడితుండగునట్లు శాపంబిచ్చిన శుక్రుకభి ముఖుండై శాపము గ్రమ్మరింపుమని యయాతి ప్రార్ధింప, అట్లేని నీ ముదిమి నీ తనయులేరికైనను నిచ్చి వారి యౌవనమును గ్రహించి సుఖంబు లనుభవించునదిగా చెప్పుచు నీవెప్పుడైనను మరలా నీముదిమి గ్రహింప గల్గుదువనియును నీకు యౌవనప్రదాతయైన వాడే నీయీభూవలయ రాజ్యంబున కర్హుండగునని వచియించె.అంత శుక్రు శాప ప్రకారము యయాతి జరాభార మగ్నుండగుటయు కొడుకుల రావించి వారి యౌవనము తనకిమ్మనుటయును యదు తుర్వసులిర్వురునుఅందుకిష్ఠ పడకుండుటయును, తుదకు శర్మిష్ట కడుపున బుట్టిన పూరుంరావించి అడుగుటయును, తండ్రి మాటలకియ్యకొని పూరుండు తన యౌవనమునుతండ్రి కిచ్చుటయును, తదుపరి పెద్దకాలంబు గతియింప యయాతి తన ముదిమి తాను గ్రహించిపూరునకు వాని యౌవనము ఇచ్చి రాజ్యాభిషిక్తునిం జేసినియత వృత్తి యయాతి తపోవనమ్ముల కేగి పెద్ద కాలంబు తపమాచరించి తద్వారా దేవ బ్రహ్మ ఇంద్ర ప్రాప్తుండగుటయును, ఇంద్రుండు యయాతి ననేక విధంబుల కొనియాడుటయును, అంత నయ్యయాతి గర్వోన్మత్తుడై మహర్షి తపంబుల నవమానించి కించపరచుటయును, తానొనర్చిన తపంబుల కేవియును సాటికావని గర్వోక్తులు పల్కుటయును–

## ఇంద్రుడు యయాతిని స్వర్గలోక భ్రష్ఠునిగా జేయుట

వ. మహాతపస్వులైన మహర్షులను దూషించిన పాపంబున యయాతి స్వర్గభ్రష్ఠుండగుటయును, యయాతి మనుజ లోకమునకుం బోనొల్లక ఇంద్రుం ప్రార్ధించుటయును, ఇంద్రునభిమతమున అంతరిక్షం బున సద్భువనమేర్పరచుకొని సద్బుధ సంగతి నుండుటయును దిక్కులు వెలుంగ నేతెంచువానింగని తమరెవ్వరని అందుండు వాని మనుమలు యయాతినడుగుటయును, నంతయయాతిపూర్వాపర వర్గ త్రయంబుగా తన్నెరింగించు కొనుటయును, వారలాతని తమతాతగా నెరింగి భక్తి పురస్సరముగా పూజించుటయును, వానినుండిగర్వోన్నతకారణచ్యుతి మొదలుగాగల విషయములెల్ల సవిస్థరముగా యెరింగిన వారలై తమ్మెరిగించుకొని నతనివలన సర్వధర్మార్ధర్మముల నెరింగి జీవన గతుల నెరుంగగోరిన యయాతి వారలకు సుగతి, దుర్గతి

స్వరూప స్వభావంబులతో పాటుజీవుల గర్భోత్పత్తి ప్రకారము వర్ణాశ్రమ వివిధ ధర్మంబులు నెరిగించు నట్ల –

ఆ. సత్య శౌచ జ్ఞాన సద్ధర్మ సంసేవ్న
కర్మలౌచు జగతి కామ్యమొప్ప
భూతహితము గూర్ప బుద్ధేంద్రియముల
మనసు నిల్పుటొప్పు మానవాళ్కి

ఆ. అట్లు గానినాడు అధముండుగా నొప్పి
ఊర్ధ్వగతులు లేక నుర్వి మీద
అధమ యోనిబుట్టు అంధులై చరియింత్రు
కర్మ వశత పాప కర్ములగుచు

ఆ. ఆత్మ శుద్ధి తోడ అవసరంబులు దీర్చి
పాప పుణ్య ఫలము ప్రక్కపోక
తనదు విధుల నెగడు ధన్యుండు జనుడహో
తత్వ విదులు చెప్పు తత్వ మిదియ

ఆ. మనుజుడెంత గొప్ప మహనీయుడయ్యును
క్రోధ మోహ ఆశ కోర్కె వీడ్క
పతితు డగుచు యిలను పాపంబు కర్మల
మరల మరల బుట్టు మర్మమిదియ

ఆ. తత్వమెరుగ లేక తత్వజ్ఞులమ్మని
ఆశ విడువలేక అధము లగుచు
నిజము తెలియ లేక నింద్రియ లోలతం
జన్మ జన్మదవిలి జనుచు నుండు

వ. మరియును–

క. వేద విహిత కర్మ లగుచు
సాదరమతులై సమహిత సర్వము నెంచిన్
ఆదర బుద్ధిం జనునెడ

సాధ్యపడుట దెంత గొప్ప సాయుజ్య మిలన్

వ. అది యెట్లన, యోనికూటంబున స్త్రీపురుష బీజమ్ములు రససంయోగము చెంది పాంచభౌతిక రూపంబు లేర్పడి లబ్ధ జీవులై ప్రవృద్ధంబు లగుచు పంచేంద్రియజ్ఞాన మూలంబులైన మనంబుచే సర్వము నెరుగుచు పూర్వ జ్ఞానుండై మాయచే నావరింపబడి కొట్టు మిట్టాడుచు నవమాసంబులు నిండి బయట పడి మాయాన్విత జ్ఞాన బాహ్యండునై యేద్వందొడంగు, మరియును, తదాది పూర్వ కర్మ లబ్ధులై చరియించుచు దుష్కృత సుకృతంబు లనుభవించుచు, బుద్ధినియుక్తులునై పాప పుణ్య గతులం దవులుదురు. మరియును యుక్తాచారులును నియమ బద్ధులును తత్వ విదులును జ్ఞాన సంపన్నులును గురు శుశ్రూష చేసెడి వారును వేదవిహిత కర్ములును తపస్సంపన్నులును ధర్మ పరులును శమదమాది శౌచంబుల పునీతులై ముక్తిం బొందెదరని యయాతి సర్వమును అనుభవైకయోగంబున నెరిగిన వాడు గావున మనుమలగు అష్టకాదుల కెరింగించె. అట్టి వారలు తమతోపాటు తమతమ అటునిటు పదితరంబుల వారికిని పుణ్యంబీగలరని తెలిపి సత్సాంగత్యమున యెట్టి వారలకును సుకృతి గల్గు గావున మీరు నన్నుద్ధరింప గలరనుటయును, తమకు గూడను సద్గతిప్రాప్తించునన వినిన, వారలు సంతుష్టాంతరంగులై యయాతితో గూడ సద్గతింజెందిసుఖించుటయును, జనమేజయునకు వైశంపాయను డెరింగించినయట్లు శూతుండు శౌనకాది మహామునులకుంతొల్లి దెల్పుటయును.

**ఇది శ్రీశ్రీ వాణీ వరప్రసాదలబ్ధ సుకవిజనప్రియ సాధుజన విధేయ శ్రీశ్రీ కవిత్రయ స్ఫూర్తి ఆర్వేలనియోగి బ్రాహ్మణ మండపాక వంశోద్భవ వీర్రాజు పౌత్ర సూర్యప్రకాశం సత్యనారాయణాంబా తనయు విరచిత**
**-: శ్రీమదాంధ్ర మహాభారత ఆదిపర్వ తృతీయాశ్వాసము :-**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆది పర్వ – చతుర్ధాశ్వాసము

### దుష్యంతుని రాక

వెండియు నట్లయ్యయాతి పుత్రుండయిన పూరుని వంశంబున క్రమముగా వెయ్యి న్నూట పద్ధెనిమిదవ తరము వాడైన దుష్యంతుడు అవక్ర విక్రమ పరాక్రమం బున పితృ పితామహ ప్రపితా మహోద్యు లైన పూర్వ వంశ ప్రభువుల కీర్తి చంద్రికల కమోఘంబు ఘటియించునట్లు చిన్న ప్రాయంబుననే –

ఆ. బంతి యాడు పగిది బండల నెగరేసి
దంతి సింహ చమర దర్ప చటుల
జంతు జాతినెల్ల జంకు లేకుండంగ
పంతగించి కొట్టి బడయ నేయు

ఆ. ఆటపాట లందు ఆధ్యత జూపుచు
సాదురక్ష జేయు సామ్యబుద్ధి
పూరు వంశ కీర్తి పృధ్విని నిల్పగా
కీర్తి చంద్రుడౌట కేమి కొదువ

తే. తరుణ యౌవనుడగుటచే దనర వేట
సింహ భల్లూక శార్దూల చమర కేకి
శుక పికాలాప సందోహ శోభ దనరి
వన్య శోభల పులకితా వదనుడౌట

తే. మనసు యువ్విళులూరించె మధుప రవళి
అంతరాంతర రాగాలు నక్కళింప
వేట విసువెత్త సేదకై వెదుక బోవ
కన్నులంబడి యలరించి కన్నెయొకతె

తే. తేరి చూచుడు క్రీగంటి తూపు విరియ

కోరి కుదయించె కన్యకా కుముద హృదిని
వామపార్శ్వంబు కన్నులుం వడకె రుచిర
రాజు వలరాజు దుష్యంతు రాకతోడ

వ. తోడనే ఆతని రూపు రేఖా విలాసంబుల పరికించి రాజ సమ్మాన్యుండుగా నెరింగి ఆశ్రమాచార ఆదర మర్యాద పూర్వకంబుగా స్వాగతవచనంబులు పలికి అర్ఘ్యపాదోదకా ద్యనేక శీతలకరోపచారంబుల అనుకూలంబులగు చేడియలం నియోగించి నుచితాసనంబుల నునిచి విశ్రమింపజేసి పూఫలతేనియ పాయసాన్నంబుల గారవించుటయు, అట్లనురాగ రంజితగా నెరింగి మనంబెరయ, తెల్లంబగునట్లా శకుంతల కోమల తనూ విభ్రమ రూప లావణ్య తేజో రాజసంబుల కబ్బుర పడుచు తదేక మగ్నుండై చూచుచుండునెడ పరేంగితావగాహమగ్న గావున సిగ్గుదోప నా లతాంగి కొంత యొదిగి కన్నులంజూచుచు చనవు దోపకుశలంబడుగుటయును దుష్యండంత తన్నెరిగించు కొన్నట్లామెతో–

తే. వేటలాడగ వచ్చియు వేసరిల్లి
మునిజనోత్తము దర్శించి ముదము మీర
క్షేమమారయ శుభగోష్ఠి చేయవస్తి
యెందు బోయిరొ యేమంచు యెదురు జూడ

గీ. వచ్చు వేళాయె మారాజ వచ్చు చంద్రు
నీదు జనులము కాదొకో నిజము దెలియ
ఆప్తి గొన్నట్టి స్వజనాళి ఆప్త మిత్ర
రాజు వయ్యుంట్వి నాదెస రాజచంద్ర

తే. అనుడు ఆమాట లాలించి ఆమె తోడ
నామధేయంబు కులగోత్ర నామ మడుగ
కరుణ మూర్తులు మహనీయ కణ్వమునుల
ముద్దుకూతును కానొకో మొదలు తెలియ

తే. అనిన ఆమాట లర్థాంతరంబు గదుర
యేటి మాటలు మీమాట లేటి నిజము

కర్మ బాహ్యులు విజితేంద్రియ కణ్వపాదు
ముద్దుకూతువు యెట్లౌదు ముద్దరాల

వ. నిజము వక్కాణింపుమన, తొల్లి, యీామె యెక్కడిది? యీాకొమ్మ వృత్తాంతమేమని తనతండ్రితో మునివరులాడిన మాటలకు తండ్రి కణ్వ పాదులన్న మాటలు జ్ఞప్తికి తెచ్చుకొన్న శకుంతల, వెండియు నాదుష్యంత రాజచంద్రుతో నిట్లనియె.

**శకుంతల తన వివరములను దుష్యంతునితో చెప్పుట**

క. అనఘుడు రాజస తేజో
ఘన కౌశిక మునివరు తపకాంతికి వెరువన్
అనిమిష విభు దేవేంద్రుడు
కనలుచు మేనకలను బంపె కౌశికు కడకున్

క. మిళమిళ కాంతులు మెరయగ
తళతళ లాడుచును మేన్క తళ్కొ త్త దిశల్
ఝణఝణ గజ్జెలు మ్రోయగ
కళకళ లాడంగనాడె కవ్వింపంగన్

తే. కాలి గజ్జెల రవళులు కళవళింప
చిచ్చుగా మారె మునియెద పెచ్చు గతుల
అక్షలం జూచి మునిముచ్చు తక్షణంబ
లేచి ధవళాక్షి కౌగిట నేచి పట్ట

తే. చిక్కి కౌశిక యొడిలోన చొక్కి నొక్క
నంత కంతకు బంధమ్ము నధిక మగుడు
తపము జపముల మాటలే తలపడాయె
జననమాయెను యీాబిడ్డ జగతి యందు

తే. వదలి వెడలిరి తలిదండ్రి వారివారి
త్రోవచొప్పున యీాబిడ్డ త్రోసిపుచ్చి
రక్ష చేయుడు నాతరి పక్షితతులు
చూచి తోతెస్తిౕ మావీట్కి చోద్యమంది

వ. శకుంత సంతానములచే రక్షింప బడినది గావున శకుంతలయను నామం బిడి కన్న ప్రేమ కంటె మిన్నయౌ ప్రేమతో పెంచు కొన్నవారము. మమ్ములనే నిజ జన కులుగా భావించివర్తించ చున్నదియ అని తన్నెరిగించు కొనుటయు విని, దుష్యం తుం డాత్మగతంబున తనయూహ నిజంబగుట యెరింగిన తక్షణమునుండి ఆమెయం దనుంగబంధుడై ఆమె మనోభావ మెట్లున్నదో యుప లక్షింప నెరింగినవాడై–

తే. తరుణి నీబోంట్ల కీయున్కి తగిన యటుల
లేదు నామది నీరూపు లేర్పరింప
రాజప్రాసాద వైభవ రాణ దనరి
లోలి సుఖభోగ సంస్థుతు లొందవలదె

చ. సురుచిర పూరు వంశమిల సుస్థిర కీర్తుల నించి చూపనా
వరముని రాజసంబు తగ వాసవ భాసుర తేజసోద్ధతుల్
తిరముగ తేజరింపనగు తీయని ఊహల యీప్సితార్థివై
కరమనురాగ రాజ్ఞివై కాంక్షయు దీర్ప సుఖింప రాగదే

వ. మరియు అష్ట విధ వైవాహికానుష్ఠానంబుల గాంధర్వ రాక్షసంబుల గూడను క్ష త్రియ సంజాతులగు వారికి ధర్మ శాస్త్రోప యుక్తి యుక్తమ్ములు. లతాంగు లెన్నటి కైనను పురుషోత్తమ సంభోగుల నంటి చుట్టుకొని పెంపెక్కి తిరుగవలసిన వారలే గాని అన్యంబు గాదు. కాన నీ యిచ్చ వచ్చిన గాంధర్వంబున నారాణివై రమ్మన, మం త్ర ముగ్ధయైన దానివలె మారాడక సిగ్గు దోప మనం బెరయ చిరు నగవులడుగులు తడబడ ముందునకు నడువనుం కించియు, ముందు వెన్కల కూగు లాడుటయును, స్త్రీ సహజ లజ్జా బిడియము ల్భూషణములుగా వెలుంగ అనురా గంబు వెల్లి విరియ చేరువకురా, దగ్గరకు దీసి బుజ్జగించి తన వ్రేలి రాజ చిహ్న ముద్రితా రత్నాంగుళి ప్రదానము చేయుటయు,చేయి పట్టి పాణిగ్రహణము గావించుకొనుటయు, సంభ్ర మా సంచలిత హృదయంబు వెల్లివిరియ శకుంతల దుష్యంతున కిట్లనియె.

## శకుంతలా దుష్యంతుల సమాగమము

క. నరవర నా కుదయించిన

చిరుతకు భూవలయమెల్ల చెంది నృపుండై
సురుచిర కీర్తులు నొందగ
వరమిమ్మిది యొప్పిదమ్ము వాక్మన్ స్ఫూర్తిన్

వ. అనవిని దుష్యంత రాజేంద్రుండు ఆమెతో, తగినవరంబు కోరితివని గారవించి పంచభూతముల సాక్షిగా గాంధర్వంబున యిష్మాను వర్తనుండై వివాహమాడి కొండొ క కాలంబు మన్మథ సుఖంబులనుభవించుచు పరిచయ పరివార జనంబుల వలన పాలనా వ్యవహార ప్రజాకార్యంబులకు కాలలాతీత మగుటెరింగింప బడినవాడై శకుం తలను వీడ్కొను నవసరంబున నక్కోమలితో దుష్యంతుడు–

క. నారాణివి నిను గొనిరా
పరిజనవారంబుతోడ పల్లకి నంపుదున్
ఊరట నొందొగి కాలము
కారుణి చూపించి యుండుమ్మ కణ్వులయింటన్

వ. అని సెలవిచ్చి పరివారంబులు వెంట రా నిజ నివాసంబున కేగుటయును, కొం త తడవైన పిదప కణ్వ మునీంద్రులు ఆశ్రమంబున కేతెంచుడు శకుంతల తొట్రువ డుచు తన తొందరపాటు తనమునకు సిగ్గుపడుచు లజ్జావనత వదనయై యెదుట పడకుండ చాటుమాటున వర్తింపుట గ్రహించి కారణమే మయ్యుండునోయని చేరం బిలిచి తానిట లేనప్పు డేమైనా జరిగినదా? ఎందులకిట్లున్నదానివని అడుగుటయును శకుంతల జరిగిన దెల్లను వివరిం పకనే తన తొందరపాటు తనమును మన్నింపుమ ని వేడికొనుట తోడనే ముని తన దివ్యదృష్ఠిని వీక్షించి సర్వము నెరింగినవాడై కూతు నాశ్వాసించి దీవించి, అమ్మా, నీవు–

తే. చేయకూడనిదేదియు చేయలేదు
నీదుజన్మకు తేజికి నిజము దెల్ప
చేయతగ్గట్టి మంచినే చేసినావు
పుట్టగలడమ్మ రారాజు పట్టి నీకు

వ. సుఖంబుండునది యని తగువారల నియోగించుటయును, శకుంతల గర్భస్థ శిశువు దినదిన ప్రవృద్ధమానంబ గుచు ఐదవమాసముదాటి ఆరవ మాసంబు వచ్చు

టయును, అయినను రాణివాస పల్లకి వచ్చుటను ప్రతిక్షణమును ప్రతీక్షింపుచు గత మును తలచి తలచి చింతించుచు అన్య మనస్కగా నుండు నొకానొక నాడుదయం బున ఆశ్రమప్రాంగణ వాకిటకొచ్చి నిలచిన దూర్వాసమహామునుల నుపలక్షింపకుం డుటచే కుపితుండై కోపమాపుకొన నేరని వాడు కావున అన్య మనస్కగా నున్న యీ మె మనమున నున్నవాడీమెను మరచుగాకని శపించుటయును, అదివిన్న శకుంతల సఖురాండ్రు అతని పాదములపైబడివేడుకొన కొంతశాంతుండై అభిదానము చూచు దనుక శాపము తప్పదని నుపశమనంబు పలికి చనియె. సఖురాండ్రీ విషయమును శకుంతలకు చెప్పరైరి. అంతయు తెలిసిన కణ్వ మహామునులు ఆత్మగతమున విచా రించి కూతుతో నొకనాడు–

క. సతిపతులకు యెడబాటొగి
అతికాలము నుండ తగదు ఆప్తియు తొలగున్
పతికడనె యునికి సతులకు
మతిమంతులు చెప్పినట్టి మాన్యత వినమే

## శకుంతల దుష్యంతుని పాలికిం జనుట

వ. కావున నీవు నీ పతి పాలికిం జనుట ఉచితంబని తగు శిష్యులనిచ్చి శకుంత లను దుష్యంతు కడకు బంపు టయును వారలామెను దోడ్కొని –

తే. నిండు పేరోలగమ్మున దండిగాగ
మంత్రి సామంత బుధకోటి మధ్యనున్న
రాజరాజేంద్రుకు తమయొక్కరాక దెలుప
చూచి యెరుగని వాడుగా చూడసాగె

వ. యెవ్వరీమె? యెందులకు దోడ్కొని వచ్చిరి? యేమి కావలయునని ప్రశ్నింప శకుంతల ఆత్మగతంబున చింతించుచు ప్రకాశముగా –

ఆ. మరచినారె తన్ను మహరాజ చంద్రమా!
వేట లాడ వచ్చి వేసరిల్లి
కణ్వునాశ్రమమున కలియంగ దెలియరే
యేమి చెప్పనౌదు యెరుక లేదె?

ఆ. చేయి చేయి కలిపి చేసిన బాసలు
మనమునందు లేవొ? మాన్య చరిత
నాడు లేరనెవరు నాయమా యిటు పల్క
పంచభూత సాక్షి బరగి చెపుమ

ఆ. కణ్వమునుల మాట కాణాచి కాదొకో
సత్యభాష మరియు సత్త్వ విదులు
వారిమాటకైన వేరెద్ది తెల్పక
కరుణ చూచి నన్ను కావరాదె?

ఆ. కడుపునున్న బిడ్డ కాపాడుకోదగ
వంశకీర్తి ఘనత వాసికెక్కు
బిడ్డ దలచియైన దొడ్డగా చూడవే
భార్యనౌదు నీవు భర్తగాన

ఆ. ఆలినొల్ల నట్టి అధముల కిలలోన
పుట్టగతులు లేవు పూర్వ కర్మ
మెట్టి వారినైన యిరుకున బడవేయ
నాదు ఖర్మ గాదె నాధుడిటుల

ఆ. విడిచి చనిరి తొలుత విధివ్రాత తలిదండ్రి
విడువ బడగ నేడు విభుని వలన
తనదు ఖర్మ మిగిలి తగులునా తనయుకు
నిజము దెలియు వరకు నిల్తు జగతి

ఆ. ఆలి తనువు జొచ్చి అందుద్భవించెడి
జనకు గాదె బిడ్డ జగతి దెలియ
సూక్ష్మ రూపమైన సాక్షి భూతుండౌను
దివ్వె రూపునొప్పు దివ్య తేజి

వ. నా యీ గర్భంబు నందున్న నిశువు నిజము. నీ రూపు గొన్న భవ్య తేజంబు. నీ వంశాంకురంబు. నాతో గూడిన ఫలముగా వీని నాలింగనము చేసికొననగు సుఖం

బునకు సరియగు ఆనందము, హాయి లెందుండ నేరవు. సత్య పథమున వర్తించి ం
ఖరుగడ జనోద్ధరణకు ఉద్ధారకుడ వగుము. సత్య పథమునకు మించిన ధర్మమొం
డు లేదను టీవెరుంగనిది గాదు. నీచేయు క్రతువు లన్నియు గూడను ఒక్క సత్యము
నకు సాటి కానేరవు. సుక్షత్రియ కుల సంజాతులు సత్యమునే మన్నింతురు. వేయేల.
నాడు నాకిచ్చిన మాట మన్నించి నన్ననుగ్రహించి నాయీ గర్భమందున్న నీ బిడ్డడే
భావి భూభరణుడు కావలెనన్న ఒప్పిదమ్ము మరువ దగునే? అనిఅనేక ప్రకారంబుల
వేడుకొని వాపోవుచుండ దుష్యంతుండు–

ఉ. ఎవ్వరి దాన వెవ్వరని యేమిటి కిట్టుల పల్కు చుంటివో
సవ్వడి చాలు నింతకును సాహస మిట్టిద ఆడువాండ్రకున్
నవ్వుల పాలు సేయకిక నచ్చిన త్రోవన యేగ కుండినన్
అవ్వల పార దోలదగు దాఖరు మాటగ జెప్పు చుంటిదే

వ. అనిన పతి మాటలకు దిక్కు తోచక శకుంతల చేయునది లేక అమిత దుఃఖా
క్రాంతయై ఆశవీడి అశనిపాతంబునకు వ్రేటువడ్డ అరటివలె నేల కొరుగబోవు సమ
యంబున ఆమెతో వచ్చిన ఆశ్రమ వనితలు అదిమి పట్టి అక్కున జేర్చి అభిదానము
గా యిచ్చిన అంగుళీయకమును జూపింపుమన అల్లన హస్తంబు పైకెత్తి చూప నుం
కించ నుత్సహింప చూచుడు. నివ్వెర మొగంబున తన వ్రేల అంగుళి లేకుండుటెరిం
గి అపరాధినిగా కనంబడ చింతాక్రాంతయై పరిపరివిధంబుల దలపోయుచు చేయు
నది లేక విధివ్రాత యిదియన కాబోలు ననుకొని అవమానంబుతో అనవలసినది లే
దని అంతరంగమున, అయిన వారలనేగుర్తింపనేరని వారభిదానమును గుర్తింపగల్గు
దురా అనుకొని సభాంతరమున కేగుదేరు నెడ ఆమె వాలకమును జూచి మాటతీరు
వాక్సుద్ధి సత్య సంగతములైన ఉపమాచిత్త వృత్తిగమనించుచున్న అమాత్య శేఖరులు
యీమె పలుకుల యందు యదార్థత గోచరించుచున్నదని గ్రహించిన వారలగుట,
యేమైనను ప్రభు భక్తి యుక్తి యుక్తంబుగా రాజవంశ గౌరవ మర్యాదలు కాపాడుట
యే తమ పనిగా నెంచి యిప్పట్టున ఆమెను గారవించి ఊరటగొల్ప మదింనిశ్చయిం
చి ఆమెను తన కూతుగా దలంచి ఆప్తితో అమ్మా ! న న్నయ్యగా దలంచి యింటికి
రమ్మని అయిన దానికి వగవక అవవలసిన కార్య మేదియో ఆలోచింప వలయును

గదాయని మంచిని బోదించి నిజము నిలకడపై తేలును కదాయని యూరట గొల్పి తగినవారల నియోగించి గృహమునకు పంపుచో శకుంతల వారలతో నేగుచు అంతరంగమున అమ్మ మేనకను తల్చుకొన్న తక్షణమున ఆకాశమార్గమున మేనక వచ్చి శకుంతలను అందరు చూచుచుండగనే తనతో ఆకాశ మార్గమున గొనిపోవ మనమున నూరడిల్లుట తప్ప యెవ్వరును యేమియు చేయనేర రైరి. అట్లు–

ఆ. గగన మార్గమంటి గహానాంతరంబగు
విపిన వాటి సీమ విబుధ మౌని
మహిత సద్గుణ ఖని మారీచు మౌనింట
చేర్చి బోయెనెంతొ క్షేమ మరసి

వ. మరీచమౌనియును శకుంతలను తన కూతుగా భావించి యెట్టి కొరతయును రాకుండ చూడనగు సఖుల నియమించి కంటికి రెప్పగా చూచుకొని కాపాడుటయును కాలక్రమమున శకుంతల నవ మాసములు నిండి ఒక్క శుభముహూర్తమున బాలుని ప్రసవించి తల్లి యైనది. మరీచమహర్షులు అబ్బాలు జననకాల తిథి వారనక్షత్రాది లగ్నంబులు వీక్షించి విధివిధాయక యుక్తంబుగా జాతకర్మాది సంస్కారములు నిర్వర్తించిన వారైరి. మరియును అబ్బాలు జాతకాదులు పరీక్షించి భావి భాగ్యోన్నతుగా నూహించి తదనుకూల అనుగుణ దశవిధ దానాది సుసత్కారము లాచరించిరి. అంత నా బాలుండు శుక్ల పక్ష చంద్రునివలె దిన దిన ప్రవృద్ధమానుండుగా శోభాయ మానంబులగు ఆటపాటల నాడుచు భద్రగతి భూ భరణుండు గాగలవాడుగానుంట భరతుండను నామముంచి పెంచుచుండిరి. మరియు మరీచ మహర్షులు ఆ బాలు రక్షనార్థమై ఆప్తులైన ఆశ్రమ వాసులు తలిదండ్రులు తప్ప యితరు లెవ్వరు తాకినను సర్పమై కాటువేయ గలట్టి మహా మహిమాన్వితమైన తాయత్తు నొకటి మంత్రించి ఆ భరతుని కైదండకు ధరింప జేసి అల్లారు ముద్దగా ఆదరాభిమానములతో మరీచు లాన అతి భక్తి శ్రద్ధ లతో పెంచుచుండిరి. అట్లల్లారు ముద్దుగా పెరుగు చుండిన భరతుండు నాలు గైదేడుల ప్రాయంబుననే–

ఆ. ఆట లాడు నాడె అధికుండుగా నొప్పి
బాహు బలము దెలియ బట్టు పులుల

క్రూర మృగపు తతుల కోర్కెతో మర్దించి
నోటి కోర్ల బెరుకు గోటి తోడ

ఆ. అడవి యేన్గు నెక్కి ఆట లాడుచు నెంతొ
వేట లాడు చుండు ఆట పగిది
అవని యింద్రు డగుట ఆధ్యత జూపును
దీప్తి తోడ నొప్పి తేజరిల్ల

ఆ. చదువు లన్ని నేర్చు సమయ సద్గుణు డౌగ
మునుల బాలు గూడి ముదము తోడ
నీతి శాస్త్ర కధల నేర్పుతో వినుచుండు
భావి ప్రభుడు గాత భరతు డెంతొ

వ. అనుచు మరీచులు తగురీతుల గల్పించి పెంచుచుండ భరతు డాటల నాడుచు నొకనాడు అల్లనల్లన అటవీ మధ్యమున కేగుటయును అట దూర్వాస మహా ముని శాపగ్రస్థుండైన దుష్యంతుండు శకుంతలా సంగమాది విషయంబు లన్నియు మరచి రాచకార్యంబు లెల్లను అమాత్య శేఖరుల అండదండలతో నిర్వర్తించు వాడునై నిర్వి కారుండుగా నుండుటను అనేకానేకంబులుగా చింతించు వారలై మహారాజు దుష్యం తు మనంబు యెప్పటి యట్ల అనురాగ రంజితము గావింప నెంచిన వారలై మృగ యా వినోదము కల్పించుటయునుఆటవిక జనాను గామియై దుష్యంతుడు వన్య మృ గంబుల పట్టి బంధింప నడవుల కేగుటయును, అట శాకుంతలుండు ఆడుచు నొక వల్మీకము నెక్కి చెట్టు కొమ్మ నాని యూయలలూగ నూహించు తరి నొక చిలువ నో ట బడునెడ చూచిన దుష్యంతుండు అతి త్వరితగతిని పర్విడి ఆ బాలు నెత్తి రక్షింపు సమయముననే బాలుం వెదకుచు వచ్చుచున్న ఆశ్రమవాసులది చూచి బాలుం దాక వలదని అరచుచు వచ్చుటయును. విని దుష్యంతుండు ఆబాలుని తన కౌగిలి నుండి దింపి వారల నెచ్చరించుచు ప్రీతి పూర్వకంబుగా చూచుచు వెడలుటయును, వార లా బాలుని దోడ్కొని జరిగిన దంతయును వినిచి తల్లి కప్పగించుటయును, శకుంత ల కుమారు నెత్తి కౌగలించుకొని గతము స్మరించి విచారించుచు మంచి కాలములు రాకుండునాయని కుమారునితో ఆటపాటల ప్రొద్దులు పుచ్చుచుండెనట.

ఇట దుష్యంతుండు అడవి వేటల కేగినప్పుడు తనచే విష సర్ప కాటునుండి రక్షింప బడిన బాలు రూపు రేఖలు పరికించిన నాటనుండియు యేలనో మనస్సటుదిశగా ఆకర్షింప బడుటచే రాచకార్యము లందొకింత శ్రద్ధ లేకుండుటయును, నొకనాడు చోరాన్వేషకులు నైన రాజ భటులు–

లయగ్రాహి.

రాగదర తస్కరుడ సంశయము లేదిదియ రాజు కడ నుండనగు రత్న బటువంచున్
యేగెదవు యింకెకడి యేగుదము రమ్మికను యేమవునొ నీబ్రతుకు యీవరకు రావన్
సాగవుర మాటలిక చేసితివి చావనగు సాహసము నీవనుచు సంకెలల తోడన్
సాగిలగ నీడ్వగని రాజపుడు దెల్పుమన జాలరియు మ్రొక్కిడుచు సొంతమున దెల్పన్

లయవిభాతి.

కథయెల్ల వినిపించె గతమెల్ల తనదైన ఘనమైనవలయందు బరువౌచు దోపన్
యిదియేమొ అరుదైనె పెనుజేప అవునొక్కొ ఇహలేదు కరవంచు యెదగల్గు నూహల్
మది జిల్క విరి కోర్కె లహలెస్స అహలెస్స మహనీయ దినమంచు వలబట్టి దీయన్
పదిమూర సొరచేప మణిదీప్తు లెగయంగ బహు శోభలెగజిమ్మి గణనీయ మగుచున్

క. సొరచేప కడుపు లోపల
నరనాయక నమ్మలేరు నాదగు మాటల్
అరకోడి కడుపు లోపల
తరతమమౌ గుడ్ల వరుస తాత్మ్యము అగుచున్

క. ఎన్నో చేపలు చిన్నవి
కన్నుల కింపౌచు గలవు కాంచగ నందున్
ఎన్నో రీతుల కాంతితొ
పన్నుగ మరి చేప యొకటి ఫణి మణి కాంతిన్

క. రాజిల్లు రంగు లెగయ వి
రాజిల్లెడు పొట్ట కాంతి రమ్యత గూర్పన్
రాజిల్క పంజర మటు
విరాజిల్లె న్వింత కాంతి రసమయ దీప్తిన్

క. గుమిగూడి రెల్ల వారలు
అమితాశ్చర్యం బిదంచు అక్కజ పడుచున్
భ్రమ యేటికి చూడనవుత
సమయంబని మీను పొట్ట సర్రని గోయన్

క. స్వర్ణాంగుళి విద్యున్మణి
కీర్ణద్యుతి దనరె సిద్ధకేదగి పూ రం
గార్ణవ మింపై తేజో
వర్ణిత బహు రాణ్మణిమయ భాసుర కాంతిన్

వ. అంతియ కాని ఈ బటువు మేము దొంగిలించినది కాదు ప్రభూ! ధనమునకై దీనిని విక్రయించుచుండ విఫణి వీధిని వీరు మమ్ము పట్టిబంధించి దెచ్చిరి. ఇది నిక్కము సుండీఅని బహుప్రకారముల ప్రభువులతో విన్నవించుకొన, ఆ రత్నాంగుళిని చూడగానే దుష్యంతునకు గతము జ్ఞప్తికిరా, వారల మన్నింవుడని ఆనతిచ్చి శకుంతలను రావించి తన మతిమరపు తనమును మన్నింపుమని వేడుకొనుటయే కాకకొడుకును గూడి ఆనంద సాగరమున ఓలలాడిన వాడాయెను. అపుడు శకుంతలతో వచ్చిన వారలు దూర్వాసుల శాప వృత్తాంతమును మరీచి మహర్షులు భరతునకు కట్టిన తాయెత్తు సంగతిని వివరించగా, దైవ నిర్ణయములు తపోధనుల పలుకులు అనుల్లంఘనీయములుగా నెరింగిన వారలైకణ్వమహామునుల ఆశీర్వాదములు, మరీచి మహర్షుల ఆశీస్సులు స్వీకరింప నేగిన వారలై దుష్యంతుండు పెద్ద కాలంబు రాజ్య భారము వహించి కుమారునకు పట్టాభిషేకము గావించిరాజ్య భార మప్పగించి తపోవనంబుల కరుగు నంత, భరతుండు వంశ క్రమాను గతి పితృ పితామహ ప్రపితామహాదుల వలె సత్యసంధుండై–

క. బహు యాగము లనరించియు
మహనీయత మంత్రి ముఖ్య మార్గణ చరుడై
సహనోద్ధతి పాటించుచు
ఇహపర సాధన పరుడై యిద్ధరనేలన్

క. కలతలు లేకుండ జనులు

ఇలబండెను సమృద్ధమౌచు ఎక్కుడు కాగా
నెల నాల్గు వాన్లు గురిసెను
ఫలజాతులు పండి పొంగ భరతుని పాల్నన్

వ. ఇట్లు మాహా బల పరాక్రమాది శౌర్య ధైర్యములందు గొప్పవాడైన ఈతని పేరనే ఈ మన దేశమునకు భరతఖండ మను నామము సార్ధకత కల్గినది. ఈ భరతునకు కేకయ రాజ పుత్రియైన సునందకు భుమన్యుండు పుట్టె, వీనికి దాశార్హ పుత్రియైన విజయకు సహోత్రుండు పుట్టె, వీనికి ఇక్ష్వాకు కన్యయైన సువర్ణకు హస్తి పుట్టె, ఈతని పేరనే హస్తినాపురము వెలసె. ఈతనికి వికుంఠనుండును, వీనికి అజామీఢుండును, వీనికి కేకయ గాంధార ఋక్ష దేశ కన్యలైన కైకేయి గాంధారి ఋక్షకలయందు నూట యిరువది నల్గురుసుతులు బుట్టిరి. వీరిలో సంవరణుండు రాజైన, అతనికి తపతి యందుకురువు పుట్టె. ఈతని పేరనే కురు క్షేత్రము విలసిల్లినది. వీనికి విదూరధుండును, వీనికి అనస్యుండును, వీనికి ప్రతిశ్రవుండును, వీనికి ప్రతీపుండునుపుట్టిరి ఈ ప్రతీపునకు దేవాపి, శంతనుడు, బాహ్లికుడు అనువారలు ముట్టురు పుట్టిరి.దేవాపి బాల్యముననే తపో వనంబుల కేగుట తోడనే శంతనుడు కురురాజ్య పట్టాభిషిక్తుండయ్యెను (భరతుమనకు శంతనుడు పధ్నాల్గవ తరము వాడు).

## శంతన మహారాజు చరితము

శంతనునకు గంగాదేవి యందు దేవవ్రతుండైన భీష్ముండు పుట్టె. మరియును దాశంరాజు పుత్రియైన సత్యవతికి (మత్స్యగంధి,యోజనగంధి) చిత్రాంగద విచిత్ర వీర్యులుద్భవించిరి. చిత్రాంగదుడు చిన్ననాటనే గంధర్వుల చేత నిహతుండయ్యె. అంత భీష్ముండు విచిత్ర వీర్యుకు రాజ్య పట్టాభిషేకంబు చేసి కాశీరాజ దుహిత లయిన అంబిక అంబాలికల దెచ్చి వివాహము చేసెను. అంత విచిత్ర వీర్యుండు–

క. రతి సంగత వ్యాపారగు డ
యృతివలతో రేబవళులు అంత:పురిలో
సతులే తన రాజ్యమ్మని
మతి వీడిన వాడగుటను మృతినిం జెందెన్

వ. సత్యవతీ నియుక్తుండయి సకల ధర్మ నిష్ఠుండైన కృష్ణ ద్వైపాయనుండు దేవర

న్యాయంబున అంబిక యందు ధృతరాష్ట్రుని, అంబాలిక యందు పాండురాజును, పరిచారిక యందు విదురుని పుట్టించిన, అందు ధృతరాష్ట్రునికి గాంధారి యందు వ్యాస వరప్రసాదంబున నూర్వురు పుత్రులును ఒక్క కూతును ఉదయించిరి. పాండురాజు నియు క్తంబున కుంతికి ధర్మానిల శక్రుల ప్రభావంబున ధర్మజ భీమార్జునులును, మాద్రికి ఆశ్వినుల ప్రసాదంబున నకుల సహదేవులను యేవురు పుత్రు లుదయించిరి. మరియును పాండవులు యేవురకును ద్రుపదరాజ పుత్రికయైన యేకైక ధర్మపత్ని పాంచాలి (ద్రౌపది) యందు ఉపపాండవు లేవురు బుట్టిరి. మరియును ఒక్కొక్కరి కొకరుగ యేవురు తనయులును భీమసేనునకుహిడింబ యందు ఘటోత్కచుండును బుట్టిరి. ఈ పదునొకండు పాండవుల పుత్రుల యందును సుభద్రార్జునుల కుమారుడైన అభిమన్యుండు వంశ ప్రవృద్ధుండయ్యె. అతనికి విరాట్ పుత్రియైన ఉత్తర యందు పరీక్షితుండు బుట్టె. అతనికి జనమేజయా! నీవుదయించినావు. నీకును వపుషమకును శతానీక శంఖు కర్ణులు బుట్టిరి. అందు శతానీకునకు వైదేహికినశ్వమేధ దత్తుండు బుట్టె. ఇది నీ వంశ ప్రకారంబు అన విని జనమేజయుండు వైశంపాయనున కిట్టులనియె.

తే. పూత చరితాత్మ మా వంశ పుట్టు పూర్వి
యెల్ల యెరిగించి నారలు యెంతొ ప్రీతి
తేట తెల్లంబు చేయుడీ తొంటి యట్ల
గంగ శంతను లెబ్బంగి సంగమించి
చేసికొనిరయ్య పెండిలి చెలగి చెపుమ
భీష్మ జన్మంబు కురు పాండ్వ పేర్మి యెల్ల

వ. తొల్లి ఇక్ష్వాకు వంశంబున బుట్టిన మహాభిషుం దనువాడు శత సహస్రాధికము గు యజ్ఞ యాగాదులం జేసి దేవేం ద్రతుల్యంబుగా ప్రకాశింప దొడంగె. మరియును, దేవతల దనుప దేవలోకంబున కరిగి ఇంద్రాదుల పూజించి, మెప్పించి వారల తోడ గూడి పితామహుండగు బ్రహ్మను గొల్వ నేగె. స్త్రీ రూపధారియగు గంగయును గూడ ఆసభకు యేతేర, నందు–

తే. అంగ రాగంబు వెల్వార్చు గంగ వలువ

గాలివాటున తొడదవ్వు తేలియాడ
విముఖులైనారు వేల్పులు విజ్ఞతెరిగి
అభిలషించియు జూచె మహాభిషుండు
కోపగించిన బ్రహ్మయు శాపమీయ
మనుజులై ఉర్వి బుట్టంగ మాన దనుచు

వ. అంత మహాభిషుండు బ్రహ్మ వాక్కు లమోఘంబు కాక తప్పదని మర్త్య లోకం బున రాజర్షి వంశంబులలో ప్రతీపుండు పుణ్య చరితుండు కావున వాని కొడుకుగా జన్మించెదనని పితామహుని ప్రార్థింప, గంగయును మహాభిషుందవిలి ప్రీతిచే మర్త్య లోకంబునకు వచ్చునది–

తే. ఎదుర యెడ భీతులై దరకి యేగుదెంచు
అష్ట వశువుల నాయింతి యాప్తి తోడ
పల్కరించిన వాసిష్ఠ పరమ మౌని
శాప కారణాన భువి బుట్టి చావ దలచి
వచ్చుచుంటిమి అమ్మ మమ్ము ఉద్ధరించు
నీదు కడుపున బుట్టియు నీల్గ గలము
శాప మోక్షమ్ము ప్రాప్తించు శరణు శరణు
పుణ్యశీలవు నీవమ్మ పూత చరిత

వ. మాలోని అష్ఠమవశువు నీకు పుత్రుడుగా పెద్దకాలంబు పేరుమోసి నీకు పేరుతే గలడు.

క. అనవిని సురనది వసువుల
కనువుగ పలుకుచు మనమున కనలకు డనుటన్
మనమున దలచియు ముదమున
వనితయు సరసపు టడుగుల వలనుగ నడచిన్

వ. పౌరవకుల వర్ధనుండును, ధర్మపరుండును, దేవమనుజ హితుండును, బ్రహ్మేను వర్త్ననియుక్తుండును యమనియమ వ్రత పరాయణుండునై తపంబు చేయు ప్రతీపు కడ కేగి మన్మధ వశంబున, ఆయన దక్షినోరు భాగంబునం దుపవిష్ఠరాలైన దాని

జూచి అచ్చెరువొందిన వాడై ఆమె వృత్తాంతం బడిగినంత –

తే. ఏను జహ్నూతు జాహ్నవి యంద్రు నన్ను
దేవ యింద్రాది గణమెల్ల దీప్తి చెలగ
నీదు గుణగణ తేజంబు నెరిగి వస్తి
ఆప్తి నేలుకో పౌరవ్య ఆలినౌదు

తే. అనుడు ఆ మాట ప్రదీపు డాలకింప
నోపకిట్లేట్కి మాట్లాడ నేమి చెపుమ
అగ్ని సాక్షిగ చేకొన్న ఆలియుండ
అన్యు వరియింప సురలోక కన్యనైన

తే. కోరి వచ్చిన దాన నీ కోర్కె దీర్ప
కోడలిగ గొందు మహభాగ కొడుకులాగ
కొడుకు కూర్చుండు తొడ మీద కూడినావు
ఇంద్ర సన్నిభ సుకుమార చంద్రవదన

వ. అనయా ప్రతీపుండన అటులనే యనిపించుకొన్న యా చంద్రవదన అంతర్హిత యయ్యెప్రతీపుండును పుత్రార్థియై సునందా దేవియుం దానును అనేక పుణ్య తీర్థం బులు చొచ్చి దేవతారాధనలు సల్పి యెన్నియో తపంబు లాచరింపగా–

తే. నందనుండుదయించె ఆనంద మొదువ
కౌరవాన్వయమెంతొ గారవింప
యెందరెందరో సామంత్రు లర్థి గొల్వ
సంతతానంద ఘన కీర్తి శంతనుండు

వ. ప్రతీపుండు శంతనుని సకల విద్యా ప్రదీప్తుండుగా పెంచి పెద్దజేసి ప్రాప్త యవ్వనుండైన తరి సామ్రాజ్య పట్టాభిషిక్తుం జేసి తపోవనంబుల కేగుచు–

క. ఇచ్చిన మాటను నిల్పెడు
సచ్చరితుడు నీదు తండ్రి సమ్మతి మతివై
నెచ్చెలి జల కన్య కొకట
ఇచ్చిన నా మాట పేర్మి నేలుము పతివై

క. కుల గోత్రమ్ములు యేమని
లలనా మణి నడుగ వద్దు లక్షణవతియా
జల జాతయె నా కోడలు
వెలయంగా జేయు కులము విశ్వము లోనన్

వ. తండ్రి మాటకు వల్లెయని శంతనుండు స్వధర్మ పరాయణుండును రాజ కార్య దురంధరుండును ప్రజా హితుండునుయై ఆనంద మగ్నంబుగా విలాస విన్యాసంబు లు సలుపు వాడునై నొకనాడు గంగా సైకతంబుల లలనామణి నొకతెంగాంచి ఆమె వయో రూప లావణ్యముల కచ్చెరు వొంది తండ్రి మాటలు మనమున చింతించి ఆ మెనే జూచుచు యేమియు మాటలాడకున్నెడ ఆమెయు శంతను రూపుంఖా యౌవ న ముఖారవిందముల నవలోకించుచు గతంబు చింతించి ప్రతీపు సంతానంబుగా నెంచి చెంతకు జేరి ఓ రాజన్య కుమారా! నీయందు నామ నమ్ము తగుల మగుచున్న యది. నీయిచ్చ వచ్చినచో నన్ను వివాహంబు గావించుకొని సుఖంబుండు. మది యెట్లన –

## గంగా శంతనుల సఖ్యత

క. ఎదురాడక నుండు దనుక
ఎదురేగను నీకు నెపుడు యేవిధి కా నీ
వెదురాడిన వెన్వంటనె
వదలెద నీతోడు సుమ్మ వావిరి కాగా

తే. అనుడు ఆ మాట లాలించి యామె గొనియు
ఇష్ఠ భోగోప భోగమ్ము లెన్నియేని
సంతతానంద ప్రదమౌగ సంతరించి
రాచమర్యాద లీడేర్చె రాణి గాగ

తే. సర్వ సుఖములు ఒడ గూర్చి సమత కాగ
రాణి కెదురేమి లేకుండ రాజ్యమందు
ఆమె కెదురాడ రాదంచు నాజ్ఞ చేసె
శాంత సౌహార్ధ కాముండు శంతనుండు

వ. ఇట్లు రాణి యగు జలజాంగనా గంగతో అంగాంగ రంగ వైభవో పేతంబుగా అనంగ లీలా వినోదంబుల సంగమించి కాలంబు పుచ్చుచుండ, ప్రతి వర్షంబునను రాణి గర్భవతియై పండంటి పుత్రునిం గనిన వెన్వెంటనే స్వహస్తములలో నుంచుకొని గంగానదిం జేరి ఆ బిడ్డ నందుంచి వచ్చుచుండె. నిట్లు ఇచ్చిన మాట కాదననేరక రేడు ను రాజుతో బాటురాణువ అన్నట్లు రాజాజ్ఞ కెదురాడని వారగుట సమస్త పరివార బంధుమిత్ర గురుపురోహితా మాత్యు లెల్లరు నామె సేత కెదురాడ కుండుటయును ఇట్లు యేడ్గురు బిడ్డలు గంగ పాలగుటయును యెనిమిదవ సంతానమును కూడ అట్లోగంగయందు విడువ నా బోవు నవసరంబున శంతనుండామె కెదురేగి యీ బిడ్డ నాకు గావలయునన రాణి యా నిశువును శంతనున కిచ్చి రాజా! నేను దేవ గంగను. కారణాంతరముల బ్రహ్మానువర్తితనై భూలోకంబున మానుష రూపంబున నీకు భార్యగా పుట్టితిని. నావచ్చు నపుడు శాపగ్రస్థులైన అష్టావశువులు తాము నా గర్భంబున పుట్టు నట్లును పుట్టిన వెంటనే గంగయందు పడవైచునదిగను కోరిరి. వారి మాట ఈడేర్చ నౌనని నా కొక్క తనయుండు కావలయునదిగా వేడ అటులనే మాయందలి అష్ఠమవశువు నీ పుత్రుడుగా మా అందరి అంశ భాగములతో పెద్ద కాలంబు భూలోకంబున వసించి కీర్తి ప్రతిష్ఠితుడు కాగలడని తెల్పిరని రాజా! ఈతని సకల విద్యా పారంగతునిగా నొనర్చి పెంచి పెద్ద జేసి యుక్త వయసు వచ్చుసరికి నీ కొప్ప గింతునన గంగకు శంతనుండిట్లనె.

క. వసువుల కేలనొ శాపము
పొసవెన్వసియిష్ఠ చేత పుట్టం భువిలో
అసమాన బలోపేతులు
వెసదెల్పను వినగ రాదె వేరెవ్వరునున్

క. అష్టమ వసువేల భువి వి
శిష్ఠుడు తా సర్వ శక్తి శేముషి పరుడై
శిష్టాచారణ దివిజుల
కిష్ఠుండై పుట్ట వలయు యేర్పడ చెపుమా!

వ. అని యడుగన్ గంగ తొల్లి, మహా తపస్సంపన్నుండును ధర్మ పరాయణుండును

యైన వరణుండను మునికి బహువిధ పుణ్య ఫలప్రదమ్ముగా ప్రభవించిన వశిష్ఠుండు బ్రహ్మనిష్ఠా గరిష్ఠుండునై ఆశ్రమ వాసముండు చోటికి వసువు లెనమండ్రును క్రీడార్థ ము సతీ సమేతులై వచ్చిరి. వశిష్ఠుడు వారిని ఆదర పూర్వకముగా రావించి భోజన సమయ మాసన్నమగుడు తన హెూమధేనువు నందినిని పూజించుటయును, తోడనే వారందరికిని సరిపడు మృష్టాన్న భోజన పంచ భక్ష్యంబులను ఆ ధేనువు గురియుట ను జూచినవారలై భుజించిన పిదప, అందష్టమ వసువు భార్య భర్తతో యీధేనువు తమకు గావలయునని అడుగుటయును, వశిష్ఠులు యీ ధేనువుతో గూడినదే కదా తమ సర్వస్వమని చెప్పినను వినక వారు తమ యిష్టానుసారముగా యెవ్వరెరుంగ కుండ ఆ ధేనువు నపహరించుకొని పోవుటయును మునికోపించి వారిని మర్త్యులు గా భువి బుట్టునట్లు శాపం బిడిన తెలిసిన వసువు లమ్మునిని ప్రార్థింపనంత తన మాట తప్పదనియును, ఐనను మీరలు పుట్టిన తోడనే జన్మ చాలించి నిజనివాసము ల కేగు నట్లును, అందష్టమ వసువు పెద్దదోషి కావున అతడుభూలోకమున అనప త్యుండుగా పెద్ద కాలంబు ఉండునట్లును అనుగ్రహించి నారని అనువసూత్పత్తియు గాంగేయు జన్మ వృత్తాంతమును తెల్పె. నంత శంతనుడు హస్తి పురికి వచ్చి–

సీ. తన బాహు విక్రమ దర్పంబు దెలియంగ
దరిదాపు రాజుల దర్ప మడచి
తనదైన ధర్మంబు తథ్యంబు పాటించి
జనులెల్ల వినుతించి జగతి పర్వ
తననెంతొ ప్రేమించు తనయుండు ఘనకీర్తి
కలకాల మిర్విపై గణుతి కెక్క
తన రాజ్య సంపదల్ ప్రజలకై
వెచ్చించి యెంతయు పేర్మి జూప
తే. సర్వ కాలాలలో గూడ సమత జూపి
యెల్ల జనులను దయతోడ నేలువాడు
సత్యసంధుండు సుర తేజ సార్వభౌమ
శాంత చిత్తుండు యెంతయుం శంతనుండు

## గాంగేయుని వృత్తాంతము

వ. ఒకనాటి సాయం సమయంబున గంగా సైకత తీరంబుల విహరించు వాడు గంగాంగననే మనమున దలచుచు ముందుకు నడచువాడు–

చ. ఘన భుజ బాహు తేజ ఘన కార్ముక ముక్తక బాణ సంహతిన్
అనఘుడు రాజసంబు తగ అద్భుత లీలలు ఆప్త తంతయున్
కని విన రాని పద్ధతిని కట్టడి చేయుట జాహ్నవీ తతిన్
పని గొని ఆటలాడుటయు పాటవ మేర్పడ చూడ ముచ్చటౌ

వ. అని మనంబున దలచుచు ముందునకు నడచుచున్న ఆ రాజు ముంగట గంగ ప్రత్యక్షమై నవ యౌవనుడైన కుమారునిం జూపి, బిడ్డా! యిదే మీ జనకులం జెప్పి–

క. ప్రభువర చేకొను తనయుం
త్రిభువన రాజ్యాల నేలు దీటగు విద్యల్
విభవోజ్వల తన్నేర్పెను
ప్రభ వెలుగం జామ దగ్ని పటుతర యుక్తిన్

చ. పరహిత తత్పరుండు మరి భాసుర తేజుడు భూరి విక్రమా
కురుకుల సంభవాఢ్యుడిల కూర్మితొ నేర్చెను యెల్ల విద్యలున్
గురుతర భక్తి యుక్తి బుధకోటి బృహస్పతి అత్ర్యగస్త్యులౌ
వర మునివర్యు గొల్చి తగ వహ్వారొ మెచ్చుగ సంతసంబునన్

వ. అని శంతనున కప్పగించి చనియె. అంత శంతనుడు యెంతయు సంతసించుచుం కొడుకును దోడ్కొని పురంబునకు వచ్చి నిండు కొలువున మంత్రి సామంతాది సమస్త ప్రజానీకంబుల నడుమ గాంగేయునకు యువరాజ పట్టాభిషేకముచేయించి ఆనందమగ్నంబుగా కాలంబు గడుపు చుండుటయు, క్రమగతి నాల్గేండ్లు గడిచిన నొక నాడు శంతనుడు విహారముగా యమునా తీరమునకుం జని అట మధురాతి మధురమగు కమ్మని సుగంధ వాసనల కబ్బుర పడుచు యెటనుండి యీ వాసనలు వచ్చెడినో యని చూచునంత–

## యోజనగంధి వృత్తాంతము

క. నడియేట నావ నడుపుచు

వడిగా రావంగ దరికి వచ్చిన లలనన్
కడిది సువాసన లీనుచు
వెడ జూపుల దాని జూచి విధికృత హృదుడై

వ. దాని అంద చంద ముఖారవి ందముల సువాసనల కబ్బుర పడి మన్మథా వస్థ లు జెందు వాడునై–

ఉ. ఎక్కడిదానవో యువిద యిందుల కెక్కడనుండి వస్తివో
చక్కని రూప సంపదుడ సత్కులజాతుడ రాజసంబునన్
మక్కువ మీరగా గొనుము మానుగ భార్యగా స్వీకరింపగా
నిక్కము బల్కుచుంటి విన, నీకగువారలెవ్వరో కదా

చ. అనవిని సన్నుతాంగి తగ నావిభుతోడనె సంతసంబుగన్
తనకగు వారలీదరిని దాసుల రాజని విన్నవించగా
వినవిని వారలం గలసి వేడిరి శంతను మంత్రివర్యులా
జనవరు రాజరాజ్కు తనుజాతను రాణిగ నీకొనం మరిన్

వ. నా యీ కూతురు కడుపున బుట్టిన బిడ్డకే రాజ్యాధిపత్యంబు చెందునట్లు కోరు టయును విన్న శంతనుడు, నూత్న యవ్వన ప్రాయపు వాడై భూవలయ భార దురం ధరుడుగా శక్తి సంపన్నుడుగా నుండిన తన తనయు గాంగేయు (దేవవ్రతుం) దలం చి మౌనము వహించిన వాడై హస్తిన కరుదెంచి చింతా క్రాంతుడై మనసు సంకట పడి రాజ కార్యములం దననురక్తుండుగా యుండుటను గ్రహించిన గాంగేయుడు మంత్రివర్యుల వలన విషయములు విన్నవాడునై సర్వసేనా సమేతుండై దాశరాజు కడకేగి అతని అభిమతంబు మేర సత్యవతీ దేవి కడుపున బుట్టిన సంతానమునకే రాజ్యాధికారం బుండునని మాట యిచ్చి మహా విభవంబు తోడ ఆమెం దోడ్కొని వచ్చి –

## సత్యవతీ శంతనుల వివాహము

వ. తన తండ్రి శంతనున కిచ్చి వివాహంబు గావించు నవసరంబున, దాశరాజు భార్య అడ్డంబు వచ్చి యువరాజా! మీర లీ రాజ్యాధిపత్యము వదలు కొనినను మీ పుత్ర సంతతులు మీవలెనే యుందురను మాట యేటిదనిన, గాంగేయుడు నిండు

కొల్వున సభా మధ్యమ్మున సర్వ దేవ బ్రాహ్మణ బంధుమిత్ర సామంతాది ప్రజాపతులు విన, పంచ భూతములసాక్షిగా తాను వివాహమాడనని భీషణ ప్రతిజ్ఞ గొన్న వాడగుటయును, శంతనుడు తనయునకు స్వచ్ఛంద మరణము ప్రాప్తించునట్లు వరం బిచ్చుటయును నాటి నుండియు గాంగేయునకు భీష్ముడను నామాంతరము కల్గినదనియును దేవతలు పుష్ప వృష్టి గురిపించుటయును శంతనుడు సత్యవతిని వివాహముగావించుకొన్న వాడగుటయును ఆమె యందు చిత్రాంగదుడు విచిత్రవీర్యుడు అను యిరువురు కొమరులు కల్గుటయును చిత్రాంగదుడు చిన్ననాటనే గంధర్వులచే నిహతుండగుటయును విచిత్రవీర్యుడు కురురాజ్యపట్టాభిషిక్తుం డగుటయును భీష్ముడు తమ్మునకు వివాహము చేయ దలంచి కాశీరాజు కూతుల స్వయంవరము విని వారాణాసీ పురంబునకేగి స్వయంవర మంటప మధ్యంబున నిల్చియున్న వధూ త్రయము నవలోకించి రాజలోకం బవలోకించు చుండ కాశీరాజుతో–

## అంబిక అంబాలికలతో విచిత్రవీర్యుని వివాహము

క. అల్లునిగా నాయనుజుని
కిల్లాంద్రుగ చేయవలయు యీ వధువుల ని
ట్లెల్లరు అవునన సభలో
యెల్లి వివాహము జరుపను యింతయు యెంతన్

క. అడ్డము వచ్చిన వారల
దొడ్డతనము పోవు మరియు దుర్నయపరులై
అడ్డము వచ్చిన వారల
నొడ్డియు గైకొందు వీర్ని యుద్ధములోనన్

చ. అనవుడు రాజలోకమది ఆహవ భూమిగ మారినంతనే
కనలుచు యుద్ధతిం వడిగ కార్ముక హస్తుడు భీష్ముడంతటన్
కనివినరాని ఆయుధ నికాయము లెల్లను గుమ్మరించి తు
త్తునియలు జేసె నా సభను దుర్నయమంచును జూడనందరున్

వ. కాశీరాజ పుత్రికలు అంబ అంబిక అంబాలికల మువ్వుర తన రథమున నిడుకొని పోవు వాడు ముందల సమర సన్నద్ధుడై నిల్చిన సాళ్వ భూపతి –

## సాళ్వ భీష్ముల యుద్ధము

చ. తరుణము కానివేళ జని తదయ్యు తన్వుల నింత బల్మిమై
చెరగొని యేగు టెట్టిదియ చెచ్చెర రమ్మిటు యుద్ధభూమిలో
మరలగ జేతునిన్ననుచు మానుగ సాళ్వుడు అమ్ములేయగా
కురుకుల సంభవుం డతని క్రూరశరంబుల బారదోలియున్

వ. కాశీరాజ దుహితల దెచ్చి భీష్ముడు తన తమ్ముడు విచిత్రవీర్యున కిచ్చి వివాహము చేయుసమయంబున వారలలో పెద్దదైన అంబ, మున్ను తా సాళ్వరాజుచే వరింపబడిన దగుటయును ఆతనినే మనంబున తలచునదియు కావున ధర్మమెరిగి ఆతనికెయ్యది యిష్టమో అట్లు చేయదగునన భీష్ముడు ధర్మ విదులైన బ్రాహ్మణుల పెద్దల అభిమతానుసారముఆమెను సాళ్వునకే విడిచిపుచ్చి తక్కిన యిర్వుర (అంబిక అంబాలికల) ను విచిత్ర వీర్యునికిచ్చి వివాహము కావించిన–

చ. పరహిత కామకేళి నృప భావన చేయుచు యెల్లవేళలం
సురనది తీరభూములను చుక్కలు తాకెడి రమ్య హర్మ్యముల్
విరహిత సీమలందవిలి పెక్కగు రీతుల సంగమించుచున్
అరిగెను దేవలోకగతి నయ్యనపత్య విచిత్రవీర్యుడున్

వ. అంత నా కురువంశమున కనపత్యము వాటిల్లకుండునట్లా శంతనుని భార్య సత్యవతీదేవి గాంగేయునితో –

మత్తే. అనఘా యెంతటి పాపమో దెలియదీ అన్యాయముంబాపగా
కనరారెవ్వరు నీకుగా నిజము యిక్కార్యంబు చేపట్టగా
కను మీ నీదగు వంశముం నిలుప నిక్కంబీవు ఒక్కండవే
అనువౌ రీతుల ధర్మ మార్గమున అత్యాప్తిం విలోకించుమా

వ. అనినం విని భీష్ముండు తల్లితో–

క. అలనా డిచ్చిన మాటకు
ఇల నేలను ఉవిద కూడ నిద్ధర లోనన్
కలకాల మెవ్వ రుందురు
తలతుం సత్యంబు నిలుప తథ్యము సుమ్మా!

వ. మరియును మీరన్నయట్లు నా దెలియని ధర్మంబు లేదు. ఐనను ధర్మ విదులైన బ్రహ్మాణ్యులతో విచారించి శంతను సంతానంబు పునః ప్రతిష్ఠిత వగునట్ల నాయెరిం గిన క్షత్రియ కులోచితంబైన రాజ ధర్మము చెప్పెద. అదెట్లన తొల్లి జామదగ్నుండు త న తల్లి శోకంబు మదినెంచి –

క. ముయ్యేడు సార్లు రాజుల
దుయ్యడె రాముడు పరశున దుస్సహ లీలన్
అయ్యను చంపిన పనికై
చెయ్యన కోపంబు తోడ శేషము లేకన్

క. అప్పాటన తత్రాట్సతి
యెప్పటిలా క్షాత్ర కులము యెలమిని పర్వన్
ఒప్పుగ సంతతి గూర్పరె
చప్పుల బ్రహ్మణ్య వరుల సత్కృప తోడన్

## ధీర్ఘ తముని వృత్తాంతము

వ. మరియును దేవ గురుండైన బృహస్పతి శాపంబున యుచద్యుండను మునిభార్య కడుపున నున్నవాడు దీర్ఘ తముడు (పుట్టు జీకటి) పుట్టుటయును, వేద వేదాంగ వే ద్యుండుగా నుతుడై ప్రద్వేషిణి అను కన్యను వివాహం బాడి పుత్రవంతు డైయున్న అ క్కోమలి దీర్ఘముం సరిజూడక పొమ్మనిన దీర్ఘతముండు కినిసి పతిహీనులైన భామిను లకు మాంగల్యాది పూపసుపు కుంకుమలు లేకుండులాపలుకుటయును, ద్వేష భావ ముచే ప్రద్వేషిణి తనయులచే భర్తను బంధింప జేసి గంగలో తోయించుటయును, అంత దీర్ఘతముడు వివిధంబులగు వేదమంత్రంబుల నుదాత్తానుదాత్త సరణిన్ పఠి యించి ప్రవాహమ్మున కొట్టుకొని పోవుచున్నవాని ఒకానొక తీర ప్రాంతమున గంగా స్నానమునకై వచ్చిన బలియ నువాడు చూచి మహా మహితాత్మునిగా గుర్తించి యిం టికి దెచ్చి పూజించి మహాత్మా ! అనపత్యుండనైన మాకు సంతతి ప్రసాదింపుమని ఋతుమతియైన సుధేష్ణయను తన భార్యను సమర్పించుటయును, ఆమె ఆ జాత్యం ధుని బొంద రోసి దాసికూతునుం బంప, ఆ పుట్టిన బిడ్డలు తనబిడ్డలుగా రాజు పెంచుచుండ దీర్ఘ తముడు వీరు నీ కుల పుత్రులు కారు. నీ దాసిబిడ్డకుపుట్టిన వార

లనుటయును, బలిరాజు మరల అమ్మహాత్ముని ప్రార్థింప ఆ దీర్ఘతముడు రాజుభార్య అంగమునం దడివి పుత్రప్రాప్తి నొసం గుటయును, ఆ పుట్టిన వాడే అంగరాజు బుషి సత్తముడుగా వెలుం గుటయును, యివ్విధంబున ఉత్తమ క్షత్రియ క్షేత్రము లందు ధర్మమార్గమున బ్రాహ్మణుల వలన పుట్టి ప్రవృద్ధిం వంశకరులైన రాజవంశముల నేకములు గలవని –

చ. కురుకుల సంభవాఖ్యు గుణ కోవిదు డెంతయు బల్కె తల్లితో
తిరముగ క్షత్రియాన్వయము దీటుగ యిద్ధర నుద్ధరింపగా
సరగున భాసురంబైన సద్గుణ బ్రాహ్మణ వర్యు నిత్తరిం
బరుప విచిత్రవీర్యు నిరు భార్యల సంతతి వృద్ధి లుద్ధతిన్

వ. మరియును–

క. యమ నియమ ధర్మ మార్గుని
సమయా సమయజ్ఞు భాతృ సచ్చరితాత్మున్
కమనీయ భూసురోత్తము
తమకుం గావలయు వాని తలపోయుమనెన్

## వేద వ్యాసుని వృత్తాంతము

వ. ధర్మ సంస్థాపనా పరుడైన భీష్మని పల్కులకు సంతోషించిన సత్యవతి మున్ను తాకన్యగా నున్న యపుడు పరాశర మహర్షి మునీంద్రుల వలన సద్యో గర్భంబున ఒక కుమారునిం బడయుటయును, యోజనగంధిగా మారుటయును, తన కన్యాత్వమ్ము దూషితము కాకుండు నట్లుగా వరంబు పొందుటయును, తత్కారణముగా యమునా నదిం ఓడ నడుపు చుండుటయును, ఆ పుట్టిన పట్టి (కృష్ణ ద్వైపాయనుడు) తపం బొనర్ప తండ్రితో తపోవనంబుల కేగునపుడు తల్లీ ! నీ కోరిన యపుడ తప్పక రాగలవాడనని దెల్పుటయును, భీష్మనకు దెల్పి నీ నాఅభిమతానుమతంబుగా భవద్భాతృ సతి క్షేత్రముల యందు అమ్మహాత్ముని వర ప్రసాదంబున సంతానము ప్రాప్తింప నగునన, భీష్ముడు తల్లి వలన ఆతని కీర్తనము విన్నవాడు కావున మనంబున కృష్ణ ద్వైపాయన మునిం స్మరించి మహాత్మా! మీ చేసిన గతానుగత తపఃఫలంబులు అమోఘంబులు. అనిర్వచనీయములు.ఆ బ్రహ్మకుంగల మహత్వంబు మీకు

నూ గలదు కావున మీరలీ కురువంశమును ప్రతిష్ఠించునది యెల్లవారికిం అభిమతం బని మనః ప్రీతి పూర్వకముగా పంచభూత సాక్షిగా బల్కి ప్రార్థించుటయును, సత్య వతి తనయు పరాశరాత్మజు మదిం రాగోరుటయును, తత్తక్షణంబ–

సీ. అర నెరి జడ ముడి అందాల కురువల్లి
తలకు శింగారమై దనర నెంతొ
దండి కృష్ణాజిన దండ కమండలాల్
యిరు కేల ధరియించి యింపు గదుర
అరమోడ్పు కన్గవ ఆనంద విస్ఫూర్తి
ఆత్మ స్థితత్వంబు ఆప్తి దెలియ
పంచాక్షరీ మంత్ర పాఠన వక్త్రోక్తి
వీనుల విందుగా వినగ బాడ్చు

తే. బూది రుద్రాక్ష మాలికల్ బొసగ దాల్చి
బవిరి గడ్డంబు మీసంబు బాగు మెరయ
సొంపు కాళ్లకు పాదుకల్ సొబగు మీర
తనిగ ప్రత్యక్ష మయ్యెనా తల్లి కెదుర

వ. పుట్టినప్పుడ తండ్రితో తపోవనంబుల కరిగి పెద్దగా పెరిగి తనంత వాడునై తిరి గి వచ్చిన కొడుకుం కన్నార జూచుచు సత్యవతి అమందానంద సంభ్రమాశ్చర్య తన్మ యత్వంబునతనయుం దడివి కౌగలంచుకొని శిరము ముద్దాడి త్రిభువన సామ్రాజ్య పెన్నిధు లన్నియు కట్టగట్టుకొని ముంగిట వాలిన కంటెనుం యెక్కుడు సంతసంబున మాతృస్త్రీ సదృశంబులగు పయోధారలుం బోలు అవిరళగతిజాలువారు ఆనందాశ్రు ధారల ఆ ముని కుమారు నభిషేకించు చున్న తల్లి కభివాదన మాచరించి బంధు పు రోహిత పురస్సర భూసురోత్తమ గణంబులతో విధివాధాయక పూర్వ కంబుగా భీష్ము డు చేసిన అర్ఘ్య పాద్యాది పూజ లందుకొని సుఖాశీనుండైనంత కుశలంబడిగి ఆత నితో తల్లి యిట్లనియె.

చ. అనుపమ తేజ నీ వెరుగ నట్టిది యెద్దియు లేదిద్ధరన్
జననుతుడైన సోదరుడు జాహ్నవి సూను డుదార శీలతన్

జనకు నభీష్ఠ సిద్ధికిని చయ్యన వీడియు రాజ్య సంపదల్
కినియక మాతృ సంతతుల కిచ్చిన ధీనుత భీష్మ డెంతయున్

క. తమ్ముల నిద్దర నెంతయు
సమ్మతి చూచుచును చాల సఖ్యత తోడన్
ఇమ్ముగ జేసెను పెండిలి
సమ్మాన్యత జనులు పొగడ సద్బుధి తోడన్

క. చిత్రాంగదు డుద్ధతుడై
మిత్రా మిత్రం బెరుగక మిరిన వాడై
ఆత్రత గంధర్వులచే
చిత్రంబుగ నిహతుడయ్యె చింతిల మిగులన్

క. తరుణులు యిర్వర తోడను
విరహిత మతియై విచిత్రవీర్యుడు తానున్
యెరుగకె యితరము నెద్దియు
సరగున దివికేగె నంత సంతతి లేమిన్

తే. పౌర బాంధవ బుధవర్గ ప్రాజ్ఞు లెల్ల
కౌరవాన్వయ విచ్ఛిత్తి యౌరటంచు
వాసవాదుల సురవర్గ వంశమంచు
నిలువరింపంగ రారొకో నెవ్వరైన

క. అన్వయ విచ్ఛేదనను స
మన్వయ పరుపన్ మునివర మాన్యుడ వీవే
అన్వయ భ్రాతవు సుమ్మీ
తన్వుల సుక్షేత్రమందు తనయుల బడయన్

## ధృతరాష్ట్ర పాండు రాజుల జననము

చ. అనవిని ధర్మ శాస్త్రవిధి అన్వయ మేర్పడ నుత్సహించియా
మునివర శేఖరాన్వయు డమోఘ ముహూర్తము దెల్పి పంపగా
తనియుచు వచ్చి యంబికయు తన్ముని జూచుడు కనులు మూయనా

తనయుడు పుట్టు గ్రుడ్డగు, నితాంత బలోన్నతి ధార్మికుండగున్

క. వెలి జూడ్కుల నంబాలిక
తెలిమొగమై మౌనివర్యు తేర్పడ జూచ్డున్
పొలతికి జనియించు శిశువు
తెలి పాండుర తేజుడౌత తేర్పడి జూడన్

వ. అనునంతన సత్యవతి వ్యాస భగవానుని ప్రార్థించి మరల కోడలిని బంప, ఆమె తానరుగక యెవ్వ రెరుంగకుండ తన చెలికత్తె నొకతెను ముని మ్రోల నునుచుటయును, ఆమె గర్భంబున మాండవ్య శాపంబున యముండు ధర్మ సన్నిభుండు విదురుండు పుట్టు ననుటయు–

## మాండవ్యో పాఖ్యానము

వ. యమ ధర్మరాజునకు మాండవ్యు డేల శాపంబు నీయ వలసె నన, తొల్లి మాండవ్యుడు మౌన వ్రతుండై కరద్వయం బూర్ధ్వ ముఖంబుగా ఒంటి కాలిపై తపం బొనర్చు చుండ రాజ బొక్కస ధనంబు లపహరించిన తస్కరుడు తమ్ము వెంబడించి వెంటాడుచున్న రాజ దండనాధిపతుల రాకకు వెఱచి పర్విడుచు దాపుననున్న మాండవ్య మహాముని ఆశ్రమ ప్రాంతముల నద్ధన రాశు లిడి పారుటయును, ప్రభు కింకరు లాధనరాశులతోడ మాండవ్యులను దోడ్కొని రాజ సభకుం దెచ్చిన రాజాతని యెంత వేడినను మాండవ్యుడు మౌనవ్రతుండు కావున పలుకకుండుట దోషిగా నెంచి కొరత వేయుటయును, అయ్యు నా తాపసుడు అతిశాంతుండై తపంబున నుండ అతని తపో మహత్వంబు నకును ప్రశాంత చిత్తతకును మెచ్చి రాత్రులం దిరుగుచు నుండు పక్షులరూపంబున ఋషివర్యులు (ఋషిపక్షులు) ఆతని వద్దకు వచ్చి మహాత్మా శూల పోటున యుండియు యింత ప్రశాంత చిత్తుండవై యుండుట యేలనయ్యా యని అడుగుడు, ఆ ఋషిపక్షులతో మాండవ్యుడు మహాత్ములారా! ఎవరు చే సిన పాప కర్మము వారనుభవించక తప్పదని యిందు ఇతరుల దూషింపవలసిన దెద్దియు లేదని నుడువు చుండుట వినిన మారు రూపధరులైన దేశాధిపతులు విని రాజుకుం దెలుప రాజాతని విడిచి పుచ్చుడనం, ఆ శూలమూడి రాకుండుట అనేక విధముల నాతని కొనియాడుటయును తదుపరి మాండవ్యుడు తనమౌన వ్రతానం

తంము పెద్ద కాలంబు తపము చేసి దైవత్వము పొంది యముని పాలికిం జని ధర్మ రాజా! యిన్ని తపంబులు చేసియు నే చేసిన పాపమెద్ది. ఎందులకీ శూలపోటు శిక్ష విధింప బడియె నని అడిగిన, మహాత్మా ! తాము చిన్ననాట తూనీగల పట్టి యిట్లు బాధించిన కారణముగా మీరలీ శిక్ష ననుభవించితి రన మాండవ్యుడు యింత చిన్న తనపు తప్పిదమున కిట్టి దొడ్డ శిక్ష విధించుట నీయట్టి ధర్మయుతునకు తగదని కోపించిన వాడయి యముని శూద్ర యోని యందు బుట్టు నట్లును ఐనను ధర్మత త్పరుండవయి మనగలవని పల్కుటయును మరియును చిన్నతనము వారైన పదునా లుగేండ్ల లోపు వారలు చేసిన తప్పిదములుదూషితములు కాకుండు నట్లును తత్కార ణముగా యముడు విదురుడుగా శూద్రయోని యందు పుట్టుటయును అను మాండ వ్యోపాఖ్యానమును సూతుండు శౌనకాది మహామునులకుం యెరింగించుటయును అనునిది.

**ఇది శ్రీశ్రీ వాణీ వరప్రసాదలబ్ధ సుకవిజనప్రియ సాధుజన విధేయ శ్రీశ్రీ కవిత్రయ స్ఫూర్తి ఆర్వేలనియోగి బ్రాహ్మణ మండపాక వంశోద్భవ వీర్రాజు పౌత్ర సూర్యప్రకాశం సత్యనారాయణాంబాతనయ విరచిత**

**-: శ్రీమదాంధ్ర మహాభారత ఆదిపర్వ చతుర్థాశ్వాసము :-**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆది పర్వ – పంచమాశ్వాసము

### ధృతరాష్ట్ర పాండురాజుల బాల్యము

వ. మరియునట్లు ధృతరాష్ట్ర పాండురాజులు భీష్మాభిరక్షితులుగా ఉపనయనానంతర రాజోచిత విద్యాసంపన్నులు గా తగు గురువుల శిక్షణలో పెరుగుచుండ–

సీ. ధర్మాభి రక్షిత దక్షుండు భీష్ముని
            బహుబల విక్రమ ప్రజ్ఞగరిమ
    ప్రాక్పశ్చిమోత్తర దక్షిణ కురుభూమి
            నెలనాల్గు వానలు నెమ్మి కురియ
    సత్య సంపన్నమై పాడి పంటల తోడ
            సర్వార్ధ ప్రదమౌగ సచ్చరిత్ర
    భూసుర దేవతా పూజాదివిధులెల్ల
            సక్రమార్జన తోడ సంభ్రమింప

తే. భక్తి భావంబు పెంపొంద శక్తి దనరి
    రక్తి యుక్తులు ముక్తికై రహి వెలుంగ
    వ్యక్తమాయెను సఖ్య తవ్యక్త ఫణితి
    జగతి వినుతింప నదిసుతు సచ్చరిత్ర

### ధృతరాష్ట్రుని వివాహము

వ. సర్వాంగీకార యోగ్యుండునా భీష్ముండు ఆంబికేయ ధృతరాష్ట్రుం పట్టాభిషిక్తుంజేయ, కురుపితామహు బాహు విక్రమ శక్తియు విదుర విజ్ఞతా వినయ గరిమంబును అండదండలుగా సమస్త రాజకీయ సమర్ధుండుగా నెరిగి పెద్దగా యౌవ్వనుండైనంత వానికి వివాహము చేయనెంచిన భీష్ముండు విదురునితో, యీ కురు వంశమును నిల్పినవాడు వ్యాస భగవానుడు. జగత్కల్యాణ కర్తయు. భర్తయుఆతడే. ఏ నీవంశ వృద్ధ్యర్ధంబు గాంధార పతి సుబలు కూతురు గాంధారి, తాను నూటొక్క తనయుల

తల్లికా గలుగునట్లు ఈశ్వర ప్రసాదిత అని వినియుంటిని. ఆమెతో ధృతరాష్ట్రునకు వివాహము చేయ సంకల్పించితిని. గాంధార పతియు మనతోటి బాంధవ్యము చేయ దగిన వాడు కావున సుబలుని వద్దకు బ్రాహ్మణుల బంపుటయును, సుబలుండును అందులకు కియ్యకొనుట యును,గాంధారియు తండ్రి మాట చొప్పున ధృతరాష్ట్రుని తక్కఅన్య వివాహమాడననుటయే కాక పతివ్రతా తిలకముగా అనుగమించి తాను ను కళ్లకు పటలమ్ము గావించు కొనియె. అంత గాంధారీ సోదరుండైన శకుని తన సోదరిం దోడ్కొని మహావిభవాతి వైభవంబుగా హస్తిపురంబునకు రా ధృతరాష్ట్రుండు గాంధారిని తన హస్తినాపుర రాజ పట్టమహిషిగా స్వీకరించుటయే కాక ఆమె తోబు ట్టువులైన సత్యవ్రత సత్య సేనాది పదుండ్రను యేక ముహూర్తమున వివాహంబు గా వించుకొనెను. మరియును నానానేక దేశ రాజ కన్నియల తోడన వివాహితుండున య్యెనిక.

ఉ. ఆయత బాహు విక్రముడు అన్నను మించెను యుద్ధ విద్యలన్
పాయక నెల్ల వేళలను పాండుని సుస్థిత సత్ప్రవర్తనన్
ధీయుతుడెన్న సంపదలు తేజము మీర గణించి దానముల్
జేయుచు పూర్వ వైభవము చేకొనె మిక్కిలి సంతసంబుగాన్

క. తొల్లిటి కీరితి వైభవ
మెల్లి నిలుపనాయె పాండు డెంతటి వాడో
వెల్లి విరియు యిల్లాలిని
తెల్లము కూర్పంగ వలయు తేజము మీరన్

వ. అని భీష్ముండు విచారించు నెడ –

**కుంతి చరితము**

క. యాదవ నృపు బిడ్డ పృథను
సాదరమున కుంతి భోజ్జు సదయత పెంపన్
ఆదరమున అన్న మిడుచు
తాదాత్మ్యత జూపుచుండె తథ్యము నెంతో

త. వచ్చుచు కుడుచుచు బోవుచు

మెచ్చుచు పొగదుచును కుంతి మేలిమి గుణముల్
సుచ్చరిత కాగలదుయీ
యచ్చర నెవ్వండు గొనునొ యాతడె ఘనుడౌ

క. వచ్చెను మునివరు డొక్కరు
డచ్చరువందుచును కుంతి ఆప్తత కెంతో
మెచ్చిచ్చెను మంత్ర మొకటి
ఇచ్చుత పఠియింప దీరు యీప్సిత మగుచున్

క. మునివరు డిచ్చిన మంత్రము
కనుగొనగావలె నిజమది కాదో తెలియన్
నిను బోలిన సుతునిమ్మని
తని వేడెను సూర్య దేవు తత్పర మతియై

## కర్ణుని జననము

వ. మార్తాండుండంత చల్లని దృక్కుల నక్కన్నియ యెదుట ప్రత్యక్షంబయి నీ కోరిన యట్ల నొక పుత్రు నొసగు చున్నా గొనుమీ మణిమయ తేజోప్రభాసమాన మందస మున, మహాత్మా ! కోరరాని నా చిన్నతనపు స్త్రీ సహజ చపలత్వ మును మన్నించి నన్ననుగ్రహింప వేడుచున్నాను. ఇట్టిది యెంతటి అపవాదమోఎరుంగనైతినన, సూర్య భగవానుడు, భయపడకు బేలా! మంత్రప్రభావ వైభవము గ్రహింపక తప్పదు. దైవ నిర్ణయమట్లుండ కాదన వలదు. ఇప్పట్టున నీ కన్యాత్వముదూషితము కాకుండ నను గ్రహించుచున్నానని ఆకసంబున కెగయ, చేయునది లేక కుంతి, ఆపెట్టె అంద చం దవైభవమున కబ్బుర పడుచు తెరచి చూచుడు. ఆమె కోరినయట్టి ఇనుసన్నిభ కాం తిపుంజముతో వెల్గులీను మణిమయ కవచ కుండలంబుల శోభాయమానుండగు ముద్దుల పాపనింగని స్త్రీ సహజ మాతృవాత్సల్యంబున ఎత్తిముద్దాడుచు అమందా నందతరంగితయయి ముందు వెనుకల పరికించి చూచి ఆలోచించి ఎవ్వరెఱుంగ కుండ కన్నీరునించుచుంఆబాలుని ఆ మందసముననేయుంచి నదియందు విడువ–

క. వెడ జూడ్కులు నిగుడించుచు
కడవం గొని రాధ, నిక్కి కనుగొనె నీటన్

వడివడిగా నది మధ్యను
సుడులందున వెల్గులీన్చు చూడ్కుల కింపౌ

క. మందస మొక్కటి బోవను
అందుకొని న్దెరువనందు ఆదిత్యేజో
సుందర వదనుండుండం
ఇందువదన రాధ బెంచె నెంతయు వేడ్కన్

## కుంతీ పాండురాజుల వివాహము

చ. కురుకుల సంభవాఖ్యగుణ కోవిదు డెంతయు పాండు రాజు త
త్పురమతులెల్లరున్తమదె పుణ్యము కాదొకొ యెంత యేనియున్
నరవరు డెంతయుం ఘనుడు నాణ్యత నెంచుచు బెంపుజూచుడున్
సురుచిర కీర్తి కాముకుడు సుస్థిర ప్రజ్ఞుడు ఎట్టి వేళలన్

వ. అని ప్రజలెల్లరు వినుతింపనౌ ఆ పాండు రాజునకు భీష్ముడు పెండ్లిచేయనెంచి రాజన్య ముదితల అన్వేషించుచున్నెడ–

సీ. అపురూప లావణ్య అపురూప సుందరి
కుంతి భోజుని పుత్రి కుంతి యెంతొ
ఆదరంబది పంచ నవధులు లేవెందు
కుంతి భోజుని పుత్రి కుంతి కూర్మి
ఇంతింత అనరాని యెంతేని కమనీయ
కుంతి భోజుని పుత్రి యింతి కుంతి
సాధు బీదల నెల్ల సాదరంబున జూచు
కుంతి భోజుని పుత్రి కుంతి దెలియ

తే. మేటి కన్నియ ప్రేమైక మేల్మి బంతి
సర్వ సంగీత సాహిత్య సౌమనస్య
ఆటపాటల చదువుల మాటదెంతొ
ఎందు వెదకిన సరిగారు ఇందు ముఖికి

వ. అనవిని భీష్ముండు తగువారల నియోగించి కుంతిభోజుని వద్దకుబంప అతండు ను పాండురాజునకు తన కూతు కుంతి నిచ్చుటకు నిచ్చగించి అతి వైభవంబుగా వి వాహము గావించుటయును మరియును మద్ర రాజ నందన మాద్రియను కన్నియ ను గూడ పాండురాజు వివాహము గావించు కొనుటయును-

**పాండురాజు దిగ్విజయము గావించుట**

సీ. ఘనగజ స్యందన ఘోటక వ్రాతంబు
లాయుధ పాణులై అంటి నడువ
ఉరుతర సేనతో ఉధృతిం బర్విడి
ఉత్తర కురు రాజు లుక్కడించి
తూరుపు పశ్చిమ దుర్దాంత రాజన్య
సమర తీర్థాలలో స్నానమాడి
దండి మగటిమిమై దనరాశి చేకొంచు
దక్షిణాధీశుల దర్పమడచి
యెనిమిది దిక్కులం దెదురేమి లేకుండ
కురురాజ్య విభవంబు కూర్మి బెంప
వీర దుందుభి మ్రోయ విజయంబు చేకొని
వెలలేని వసురాశి వెంట గొనుచు

తే. ఎందు లేదను ఘనకీర్తి యింత దనుక
అంధరారాజు తనతమ్ము నభినుతింప
హర్ష ఘోషలు చెలరేగ హస్తి నగరు
ప్రజలు కీర్తింప వచ్చెనా పాండు విభుడు

చ. ఘనతర వీర విక్రముల గర్వము మించుచు యుద్ధభూమిలో
మునుమున బట్టి గొట్టుచును ముచ్చట దీర ధరాధినాధుడా
జనవరుడెంతయుం ధనము జాగృతి గొంచును సేకరించియా
ధనముల దానధర్మముల తర్పణ చేయడె సత్కృపాళుడై

వ. వెండియు, తెచ్చిన ధనరాశులను పితామహుడు భీష్మ ముంగిట నునిచి నంత ట ఆతని ఆదేశానుసారము ధృత రాష్ట్ర మహారాజు, అనేక అశ్వమేధయాగాదిక్రతు వులు నిర్వర్తించెను. సత్యవతీ సమేతులైన తమ తల్లులకు గూడ పంచెను.వారలును అనేకములగు భూరి దానధర్మ కార్యములలో యెందరెందరినో దనిపి భూసురోత్తము ల వలన అనేక శుభాశీస్సు లందిన వారలైరి. అవ్విధముగా పాండురాజు కీర్తి దశది శలా వ్యాపించెను. జన ప్రియుడై వెల్గొందుచు అనేకానేక వినోద విలాస కామాను రూపవిషయవాంఛల తులతూగుచు కాలవశంబునమృగయా వ్యసనంబునం ప్రీతుడై

సీ. కాంతార వన మధ్య కాంతలిర్వుర తోడ
ఆటపాటల వెంట అడవులందు
మృగయా వినోదాల మూర్ధాభిషిక్తుండు
పవలును రేలన్క పర్వు లెత్తి
ఘనగజ శార్దూల ఖడ్గాది కిటినెల్ల
సడివిని వన్నంటి శరము లేయ
మృగరీతి రతిరమ్య ముని జంట తనిసుండ
శరసంధ ఘాతాన సమయ నేయ

తే. మృగరూపములు వీడి మనుజ భాష
యిటులె నివు గూడ నీపెంటి నిచ్చపెనగ
విగత జీవనుడౌదని వేగవేగ
శాపతప్తుండు గానౌగ శాపమీయ

వ. ముని శాపంబు తప్పదనుచు విధికృతంబు లిట్టులుండ యిందెవ్వరి తప్పిదంబు ను కాదనుచు తమ వంశ గత వృత్తాంతములు సంస్మరించి యిప్పట్టున మునివృత్తిని జీవించుటయ ఉత్తమంబని మదినెంచి కుంతీ మాద్రులిరు సతులకు జరిగిన దెల్ల వి నిపించి పురికి జనుండు.

సీ. కాలకృత్యములెల్ల కడదేర్తు నికనుండి
కందమూలాదులే కడియచేస్కు
సద్ధర్మ చారణ సన్యాసి జీవన

దినమున కొౕక పండు తినగ జేస్కు
బుద్ధేంద్ర్యి తనుభావ బద్ధాను రాగాలు
విడనాడి యొడలెల్ల బూది చేస్కు
తడయక మునివృత్తి తలకొని జీవింతు
పాప పుణ్యములెల్ల బాయ జేస్కు
తే. మంచి చెడ్డల మాటయే మదిని వీడి
కాలనియతులు విధియుక్త గాదెయనుచు
సంతతానంద మయ బ్రహ్మ సంవిధాన
ధ్యాన మార్గాన నిస్సంగ తాత్మ్యు డౌచు

వ. నా యీ నిర్ణయము రారాజు ధృతరాష్ట్రునకు, సత్యవతీ దేవికి, తాత భీష్ములకును విదురాది పెద్దలగు గౌసల్యలకును, వృద్ధ పురోహిత బంధు వ్రాతములకును వినిపింపుడన, కుంతీ మాద్రులందు కీయకొనక, మీరిట్లాడ తగదు. మీరెందున్న మేమును అందే యిష్టానుసార వర్తనులమై మిముసేవించుటయే పతివ్రతాధర్మంబు. మీకు తెలియని ధర్మంబులు కలవే? కాకున్న ప్రాణములు విడుచువారమన, దర్మువుపాటించి పాండురాజు, తన చెంతనుండు సమస్త వస్తువులును, నగలను, విలువగల వలువలను ఆయాటవికుల కెల్లరకును పంచియిచ్చి నారలుధరించి పాదచారియై ఉత్తరాభిముఖుండై శతశృంగ నగ పార్శ్వ గతుండై అన్నగ గహ్వార ప్రాంతమున తపం బాచరింప నేగి –

చ. కటకట యెంత నాన్నృపుడు కామ్యత నిశ్చల యోగ దీక్షతో
ఝుటిల తమోద్క శీతలత జాహ్నవి యొడ్డుల పర్ణశాలలో
కుటిలత లేని భార్యలిరు కుంతియు మాద్రియు సేవచేయగా
పటుతర నిష్ఠతోడుతను పాప విమోచన కార్యమగ్నుడై

వ. ఇట్లా సిద్ధ సాధ్య గంధర్వ విద్యాధర కింపురుషాది సంసేవ్య మాన దేవేంద్రతుల్యంబైన హిమవన్నగ శతశృంగ మ్మున మహనీయ తపోధన ఋషిపుంగవుల నడుమ నియమితాశనుడై సమస్త శాస్త్రార్థ జ్ఞాన సమోపేతుండై సతీ సమేతుండై వెన్నంటి

నడచుచుండ ఆమునులు, తాపసోత్తమా! మీరలింక మాతోడ రావలను పడదు. ఈ సుదతు లతి సుకుమారులు. మరియును మాజను త్రోవ బహు తపో ధన సంపత్తి ప్రాప్తులకు కాక రా వీలు లేనిది. ఋణ విముక్తులరగు వారే యీ బ్రహ్మ పథమున పయనింపనగునది. అన్యులకు వీలుకాదు. అనవిని పాండునృపాలుడు! తపోధనులా రా! మానవుడు పుట్టుకతో తెచ్చికొన్న దేవ ఋషి పితృ మనుష్య ఋణంబులు తీర్పక ర్తవ్యతా నిర్వహణుండుగా విధికృత జీవన విధానంబు నెరపుచుండు. ఋణవిముక్తాస క్తులు కానివారు స్వర్గద్వారమ్మున జననేరరని విందుము కదా! "అపుత్రస్య గతిర్నాస్తి" అనిగదా వేదవచనము. నేనపుత్రకుండనౌట నేమిసేతు. యజ్ఞయాగాదుల వలనదేవ తల, గురు శుశ్రూష, బ్రహ్మ చర్య తపస్సుల వలన సంతానము బడసి పితృవ్యుల శ్రార్ధకర్మమున సత్య ధర్మార్జనలచే మనుజుల యొక్క ఋణములు తీర్ప వలను పడు ను.కాని నాయట్టి సంతాన హీనుడు పితృ ఋణములు తీర్చుటెట్లు పొసగు. ఆనతీ యుడు. మిగిలిన మూడు ఋణములు తీర్చినాడను. అనవిని అత్తపోధనులుయోగదృ ష్ఠిని అయ్యనఘు ననాగతమువీక్షించి రాజా! నీవనపత్యుండవు కావు.ధర్మార్ధ సంసిద్ధ ములైన తెరగున పుత్రవంతుడవు కాగలవను మృగశాపంబును మది నూహించుకొని కుంతితో యేకాంతమున–

క. మునివరు దెల్పిన జోస్యము
మనకిప్పుడు పుత్రలాభమొందుట నిజమౌ
నని మనసుకు సంతసమై
విననయ్యెను రౌరవాది వెతలేదింకన్

క. సత్సంతానము వడయుట
సద్గతులకు తెరవటంచు సమ్మతి తోడన్
విద్వ త్ప్ర వరులు జెప్పిన
వేద్గోచరమైన ధర్మ విషయంబిలలోన్

వ. కావున ధర్మ విధిని బిడ్డల బడయు ఉపాయం బాలోచింపదగు దనిన, కుంతి భర్తతో–

క. ఎద గల కోర్కులు దీరను

మదినూహలు జేయుదాన మాన్యులు పెద్దల్
విదితము నడిచిన తోవల
సదయత వర్తింప నౌదు సమ్మతి యగుటన్

వ. మును–

క. ముని తన కిచ్చిన మంత్రము
తనయుడు ధర్మంపు మూర్తి తనకుదయింపన్
మనమున కోరి పఠింపను
తనియగ గర్భంబు దాల్చె ధర్మువు నంశన్

వ. ఇట్లా కుంతి నవ మాసంబులు నిండిన యా పదియవ నాడు–

క. గ్రహ తారక గణమలరుచు
మహిమోన్నతమౌచు నున్న మధ్యాష్టమ తిథియుం
సహనోద్ధతి ధర్మ దయతు
మహదాశయ కుంతి గనియె మహిమోపేతున్

క. శతశృంగమ్మున మునులతొ
అతి సంతసమంది రెల్ల రాటవిక తటిన్
అతి కమ్మని తావి విరిసె
స్తుతి యింపను పుష్ప వృష్టి సొంపొనరింపన్

వ. ఎంతయు సంతోషించిన వారలు ఆపాండురాజు పట్టికి యుధిష్టరుడని పేరిడ, ఇట మున్నె ధృతరాష్ట్రుని పట్ట మహిషి గర్భంబు దాల్చి యుండినది, కుంతికి కొమరుండు పుట్టెనని విన్నయది తన గర్భ తాడన మొనరించుకొన్నయది విచ్ఛిన్నమగుటయును వ్యాస భగవానులు వచ్చిచూచి ఆ విచ్ఛిన్న మాంస పిండమును నూటొక్క కుండలలో భద్ర పరపించి తగు రక్షణ గావింప నియోగించుటయును మలి వత్సర కాలమునకు నొకానొక ముహూర్తమున –

క. తొలి సుతుడై గాంధార్సతి
కలలన్నియు పండి పుట్టె కలి యంశమునన్
కుల వర్ధన దుర్యోధను

డెలమిని కూర్చుచును యెంతొ యెంతయు దెలియన్

ఉ. నల్గడలందునందిటవు నల్లని జీకటి ఆవరింపనై
వెల్గది మాయమౌటయును వేదన కూతలు ఘూక కాకముల్
కల్గులనుండి వెల్వెడలె కారడి నిస్వన జంబుక ధ్వనుల్
కల్గెను కౌరవేంద్రు సతి కాంచిన బిడ్డని వేళ దెట్టిదో

క. కార్యాకార్య విచారత
నార్యులు వెలయించినారు నయనిధుడౌ యీ
వీర్యుడు కౌరవ సంకుల
దుర్యోధనాధుడెంతో దోర్బలు డనుచున్

వ. మరియు నదే ముహూర్త శుభ ఘడియల యందు–

క. శత శృంగమ్మున కుంతీ
స్తుతియింపను వాయునంశ సుతునొక్కనికై
అతిలోకోత్తర బలయుతు
డతివకు నుదయించె భీము డనిలుని కృపతోన్

వ. తరువాత గాంధారీ దేవి గర్భస్త పిండ కుండలనుండి క్రమముగా దినమునకొక్కడుగా దుశ్శాసన దుస్సహ దుర్ముఖ దుర్దమ దుర్మద దుర్దక్ష దురూహ ద్రోదర మొదలుగా తొంబది తొమ్మిది మంది పుట్టిరి. కడసారిగా దుశ్శల యను ఆడుబిడ్డయు పుట్టినది. ధృతరాష్ట్రునకు వైశ్యజాతి సతి యందు యుయుత్సుండు పుట్టె.

క. ఏకోత్తర శత సంతతి
ఆకౌరవ పతి బడయుడు అభినందనగా
ఏకము భీష్మాది కురులు
సాకల్యము వచ్చియుండ్రి సద్బ్రాహ్మణులున్

వ. ఆ వచ్చిన పెద్దలనందర ధృతరాష్ట్ర ప్రభుడుచిత సత్కారముల పూజించి వారల ఆశీశ్సులం బడసిన యప్పుడు అందున్న పెద్దలు కొందరు ధృతరాష్ట్రునితో యేకాంత మున –

క. మనయీా దుర్యోధను డవ

నిని పడ్డట్టి వేళ దేమొ నిజమూహింపన్
కననాయె నశుభ శంకలు
పెన వేసుకు నష్ట దిశల పేర్కొన తరమే

క. పుడమికి చేటగు దానిని
తడయక విడువంగ నవుత ధర్మము సుమ్మీ
యెడమిడి తనయుని నైనను
పుడమికి రాజైన వాడు పురజన కాంక్షన్

క. అనవిని భూవరు డేమియు
వినినది తా కాదనట్లు విముఖత జూపన్
జనులెట్టుల కాదందురు
జననాయక రాజు వాక్కె జరిపెడు వారల్

వ. అట శత శృంగమ్మున వాయు వర ప్రసాదిత కొడుకుం యొడి నునిచికొని శత శృంగ శక్తి గిరి నధిరోహించు చుండ క్రూరమృగ మొందు పైబడు నన్న భీతితో పరువిడ బోయినది తొట్రువడి కాలికిందనున్న బండజారి యొడిలోనున్నశిశువు క్రిందపడి దొర్లుడువడి ఆ ప్రదేశమంతయును చదును బారుటయునుచూచిన తల్లి యితరులెవ్వరును చూడలేదుకదా యనుకొని అటునిటు చూచి వడివడిగా కిందికి దిగి తనయు మరల ఒడినందు ఉంచుకొని అంబను దర్శించి ఆశ్రమమును చేరినది. జరిగినదంతయు భర్తకు నివేదించుటయు, పాండు రాజు తనయుడు భీమబలుండు కావలయునని సంతోషించియు, అన్న ధృతరాష్ట్ర మహారాజునకు గాంధారీదేవి గర్భస్థులైన తనయులు నూర్వురు నొక ఆడు బిడ్డయు పుట్టిరని విని సంతోషించియు కుంతితో–

ఉ. వంశ వివర్ధనుం సుభద వత్సలు పాకనశాస సంభవుల్
సంశయమే యెరుంగని కుశాగ్ర జయోన్నతు బాదరాయణుం
అంశను మేలమాడగను ఆప్త శరణ్యుని వాసవోన్నతున్
పాంశుల నెల్లరం దునుమ పాటవ భీషణు సత్సుతున్ గొనన్

వ. ఒక్కని పుత్రునిగా బడసినవాని భాగ్యమే భాగ్యముకదా. కావున నా యభీష్టము

యీడేర్ప వలయునది యన పృథయందుల కీయకొని తామున్ను గొన్న మంత్రము నుపాసించి తిరమతి ఇంద్రుని ప్రార్ధించుటయును తత్ప్రసాదంబున–

మ. మహనీయోన్నతు నింద్ర సన్నిభు డసామాన్యుండు భావింపనా
సహనాదీధితు శాంత మార్గణు సభా సంస్తుత్యు డెన్నంతగన్
కుహనాశక్తుల ధీరుడుం జయతు ఢీకొట్టంగ నెంతేనియుం
బహుశస్త్రాన్విత పాటనుండెలమితో బ్రహ్మాండమే ద్రుళ్లిడన్

వ. శక్తి యుక్తి సమన్వితున్ బడయ నా పాండు రాజెంతో సంతోషంబున ఆ శత శృంగమ్ము నందలి ఋషి కులముల నెల్ల రావించి తగురీతి సత్కారములు గావించి వారికడ ఆశీర్వాదములు గొనుడు వారలా బాలు రూపురేఖా విలాసాదులకబ్బుర పడుచు, పుట్టిన ముహూర్తము గణించి శాస్త్రవిధిని జాత కర్మాధికములు గావించి కార్తవీర్యార్జునుని కంటెను కడింది కానౌట అర్జును డన్నామ మిడుట–

మ. మహదానందము పొందుచున్మరియుచుం మన్నించు చెంతేనియున్
విహితంబౌ గురు సేవల న్దొరయుచో విజ్ఞాన సంసిద్ధులై
సహనోద్ధాంతన సైచుడు న్చతురతం సామాన్య చందమ్మునన్
మహిమోపేతులు పాండురాజు నువిదల్ మర్యాద పూర్వంబుగాన్

వ. అందరి మన్నన లందుకొన్న మీదట రెండవ సతి మాద్రి అంతరంగమున–

క. గర్భము పండని సతికిక
నిర్భాగ్యత కాదె తెలియ నిజమూహింపన్
అర్భకులైనను సుతు తన
గర్భస్థులు కావలంచు కామిత మతియై

క. పతికడ కేగియు కుంతీ
సతి పుత్ర త్రయము తోడ సాపత్నులలో
నుతి కెక్కిన దౌటను తన
వెత దీర్ప నుపాయమొండు వెదకుండనియెన్

వ. అంత పాండు భూపాలుడెంతయు మనమున హర్షించి

చ. సబబిది నీదు కోర్కెయును సద్గతి దోవల పొందుటెంతయుం

అబలలు ధీర సంయుతత ఆదర మొప్పగ ధర్మ సంతతిం
సొబగుల సంస్మరించుచును సోదర కామిను లందునం వొగిన్
ప్రభవెలుగంగ సత్సుతుల భాస్కర తేజుల నొందగా తగున్

వ. అని–

చ. అదనని పాండు భూప నృపు డాప్తితొ కుంతిని చేర బిల్చియున్
సదయత నీ దుపాసనల సమ్మతి మాద్రికి చెప్ప నొప్పదే
ముదితయు బిడ్డలం బడయు మున్విడి నీదగు ధర్మ సంస్థితన్
ముదమది నాకునుం యిపుడ ముఖ్యము యిర్వురు పెంపు మీరగన్

వ. అనుడు అక్కోమలి తన సహ భామిని మాద్రినిం బిలిచి

ఉ. అన్నుల మిన్న మాద్రి విన అద్భుత మంత్రము కర్ణ రంధ్రిలో
సన్నగ నూదనంత మది సంబర మేర్పడ సంస్మరించుచో
విన్నది రెండుగా దలచి విస్మయ మొందుచు రెండుమార్లొగిన్
పన్నుగ వేడుటన్మదిని ప్రార్థన చేయుడు అశ్వనీసురుల్

క. ఎన్నగ మంత్రపు బలమున
కన్నియ వేడిన తడవుగ కరుణామూర్తుల్
ఎన్నికయౌ సుతు లిర్వుర
మన్నన వరమిచ్చినారు మాద్రికి బుట్టన్

వ. మాద్రియు పదంపడి కతిపయ దినముల నాడు నవమాసంబులు నిండి

క. చకచక దినములు గడువ
స్వకులా భరణుల గురుతర సద్గుణ మణులన్
నకులుడు సహదేవుడు నా
అకలంకుల మాద్రి గనియె అచ్చెరు వందన్

వ. ఇట్లు పాండు భూపాలుడు తన యిల్లాండ్రు కుంతీ మాద్రుల

క. నిర్మల మంత్రోప కరణ
ధర్మానిల వాసవాది తాశ్విను వరమున్
ధర్మత పెంపలర బడసె

ధర్మజ భీమార్జు న నకుల సహదేవు లనన్

వ. బిడ్డల నేవుర బడసి శతశృంగమ్మున కిందమ ముని మృగ శాపమ్మున తపోని యమ వ్రతంబులప్రొద్దులు పుచ్చుచున్నాడని విని కుంతి సోదరుండైన వసుదేవు డెం తయు సంతసించి బ్రహ్మణ్యులరావించి వారిచే అనుజాత కుమారులకును బావ మ రిదికిని అనేకానేక భూషణ వస్త్రాదికములైన సమస్త వస్తు సంచయముల నిచ్చిపుచ్చె. పాండురాజును తత్శతశృంగమ్మున గల మునిజన తపోధనుల చెంత బిడ్డలకు వల యు శస్త్రాస్త్ర విషయవిజ్ఞాన సంపదను గ్రహింప జేయుచు మునివృత్తి నియమాను వర్తనుడై కాలము పుచ్చుడు.

## వసంతాగమనము

ల.వి.

తరియంచు ఋతురాజు వడిదాక వనలక్ష్మి తనువెల్ల పులకించి చివురించ నెంతో
న్పురి విప్పి నడయాడు శికిశోభ విరజిమ్మ పరువాన యొడలెల్ల మురిపాల దేలన్
విరులందు మధుపాళి మధురాతి మధురమ్ము విన వేడ్క మధు గీతి విరహాగ్ని రేపన్
మురిపాల చెలరేగ నునివెచ్చ న చలిరాత్రి ముదమార రతిరాజు సరదాల తేలన్

ల.వి.

అమితంపు చలితగ్గి వినుతింప జగమెల్ల అలరించు నునువెచ్చ గిలిగింత రేపన్
తమరాకతెలియంగ మధుమాస ఋతుశోభ తనియంగ వనమెల్లయెరుపెక్క నెంతోన్
కొమరారు ఫలసిద్ధ పువుగుత్తి ముదమార కొసరంగ విరులెల్ల కనువిందు సేయన్
సమపాళి మిధునమ్ము తనుశోభ లెగయంగ సరసాలు కురియంగ రతికాంజిమ్మన్

ల.వి.

జగమెల్ల విరియంగ నులివేడి సనసన్న చలమెచ్చి మధుమాస మిటువచ్చి చూడన్
నగుమోము బుడుతంత యిలువీడినడయాడ నదితీర యిసుకందు సొబగాటలాడన్
తగునంచు తెలిమౌని ఘనమెల్ల ప్రభవెల్గి తమయోగబలమంత ముదమెంతొగూర్చన్
నగుమోము లెగయంగ అనురాగ జనులెల్ల నదులందు జలకేళి రసరమ్య మౌగాన్

సీ. కోయిల కూతలుం కొమరారు జివురులుం
పూతావి పరిమళాల్ ప్రభ దలిర్ప

మధురాతి మధురమ్ము మధుపాళి రొదలతో
నవ వసంతపు శోభ నయము గూర్ప
చిరువేడి క్రమ గతి చెలువార హాయిగా
సుడిగాల్పు చెలరేగు సుంతదెంతొ
తెలిహంస తామరల్ తేలియాడ కొలనిలో
ఋతుగతి పెంపెక్కి రుచిరమౌగ

తే. కామ దేవత నల్దిశల్ గాగ మెరయ
రాత్రి పవళులు మదనుండు రహిని గూర్ప
నవ వసంతోత్స్వ రతికేళి నాట్య మాడ
జగతి వెలుగొందు అజ్ఞాన జడమడంగి

క. అందము బహువిధ బంధుర
సుందరమై జీవకోటి సుమనః ప్రీతిన్
తొందర జేయన్మదనుడు
కందళితము హెచ్చి మనసు కళవళ పరుపన్

క. కిందమ ముని శాపంబున
కొందల మొందుచును మాద్రి కుంతీ సుదతుల్
సుందరులై పాండు పతికి
యెందును దరి జేరకుండ యెడమై ప్రీతిన్

ఉ. మన్నన జేయుచున్మగువ మాద్రియు కుంతియు పాండురాజు ము
న్నెన్నడు లేని రీతి గని నేర్పున మాటలు సంగమించుచో
సన్నగ నేగుచుం దవుల సారస నేత్రలు సామరస్యతన్
పన్నుగ జిక్క నొక్కెడను పాండుకు మాద్రి భయాన వద్దు వ
ద్దన్నను వెంబడించి తగు అక్కున జేర్చు క గతింప నంతటన్

వ. మాద్రి యెంతయో పెద్దరోదనం బోవ వచ్చి చూచిన కుంతియుం బుత్రులునుం గూడ విగత జీవుడైన పాండు రాజు పైబడి యేడ్చుచుండ విని యా శతశృంగమ్మున గల ముని కులంబు లెల్లరు వచ్చి దుఃఖించుచున్న యవసరంబున, కుంతి మాద్రితో

సీ. ధర్మార్థ సంస్థుత్య సద్ధర్మ పత్నినై
అన్నింట పెద్దనౌ నధిపుతోడ
పతి నెడబాసి యీబతుకేటి మదిరోత
అనుగమించుటె ధర్మమన్ని విధుల
సహచరింపగనౌదు సతిపతి చారణన్
సహగమ్మమే జేయ సమయ మిదియ
పిన్నవయస్కులౌ పెన్నిధి బిడ్డలన్
ప్రేమతోడుత బెంచి పెద్ద జేయు

తే. మాతృమూర్తివి నీవన మాద్రి యపుడ
యేగుదానవు నువుగాదు యేనుసుమ్మ
స్వర్గమందైన పతియానతి సమ్మతింప
ఆజ్ఞ యిమ్మనె తనదైన ఆప్తి దీర

వ. పతిక్షేమ విదూరతకు కారణమైన దానను. పిల్లల క్షేమమును చూడగల దానవు నాకంటెను నీవే యెక్కుడుదానవు అన్నింటను. కావున నీవేమనయీా పాండు పుత్రుల పెంచి పెద్దచేయంగల దానవు. అని పిల్లలను కుంతికి వొప్పగించి మాద్రి పాండురాజుతో పాటు సహగమనాను గతి అతని పాదముల చెంత చితిపై దివ్యా వలోకన పరురాలై అగ్ని శిఖల గూరు చుండి విగత ప్రాణియయ్యె. అంత ఆ శత శృంగమ్మున గల ముని కులములెల్లరును–

క. సర్వము విడిచీ కురుపతి
నిర్వాణమె తన కనుచును నిశ్చితమతియై
నిర్వృత్తిం ముని సంగతి
పర్వత సానువుల నిట్లు పడతీ సుతులన్

క. విడిచిన వాడీ జగతిని
నడయాడుచును నే మనలను నమ్మియు మునులన్
తడయక గొని పోవలయును
వడి వీరల కరినగర కురు వృద్ధుల కడకున్

వ. అని కుంతిని తనయుల నూరార్చి వారిని వెంట గొని హస్తి నగరికి రావన్
చూడ వచ్చిన హస్తినాపుర పరి వృత జనం బెల్లరును–

చ. సురవర జాత సుందరుల సోయగ రూపము కబ్బురం పడిన్
నరవర రూపసంపదిల నమ్ముట యెట్టిది కాదు లేదనిన్
కరిపుర వీర విక్రములు కౌరవ పెద్దలు అందరందరున్
తమతమ దేవతాన్వితము తథ్యము అంచును దెల్పుకో తగన్

వ. రా విని భీష్మ ధృతరాష్ట్ర విదురాది పెద్దల పనుపున ధార్తరాష్ట్రులు నూర్వురును తమ తల్లి గాంధారి తోడను సపరివారముగా నగర ద్వార దేశంబుల నుండి యెదు రేగి తోడ్కొని రా, భీష్మ, విదుర ధృతరాష్ట్ర గాంధారీ సత్యవతీ అంబికాంబికలు అమ్ము నులకు మ్రొక్కన్ తమకు నమస్కరించిన పాండుకుమారుల ఆలింగనము గావించుకొన్న గాంధారి కుంతిని అక్కున జేర్చుకొని దుఃఖోపశమనముగావించిన తదుపరి భీష్మ ధృతరాష్ట్ర విదురాది కురుకుల పెద్దలతో నొక వృద్ధ మౌని అమ్ముని కుల తండము అనుమతంబున అందరి సమక్షమున –

చ. స్థిరమతి పాండురాజు వరసిద్ధి తపోధన శక్తి యుక్తమౌ
వరములు గోరి ధర్మువును వాయువు వాసవు నశ్వినీసురన్
సురుచిర కీర్తి సంపదల సూనృత సూరుల బిడ్డలైదురన్
సరగున బందె శాస్త్ర విధి సద్గుణ గణ్యుల పూర్వపుణ్యతన్

క. ఘన తర సహగమనా విధి
కనువుగ సుతు భార మక్క కర్పణ జేసిన్
అనలున కాహుతి యౌచున్
చనియెం ఆదివికి మాద్రి జనపాలుని తోన్

వ. ఈ సాధ్వియు పతి ననుగమించనైన దాని ”నీ బిడ్డల రక్షించు కొనవలె కావున మా మాట తలచి యైనను అట్లు చేయంతగదని నిలువరించుటయును” ఇంత దను క తేవంగల వారమైతిమి. ఈ కురుకుల పాండు కుమారుల నిక రక్షించుకొను భార ము ధర్మ సమ్మతమై మీ కురు వృద్ధుల యందు కూడుకొని యున్నయది యని చెప్పి అంతర్ధాన గతులైరంత. భీష్మ, విదుర ధృతరాష్ట్రులు పాండు రాజునకును మాద్రికిని

పాండు పుత్రులచే పరలోకానుగమ్య పితృకార్యములను యథావిధి నిర్వర్తింప జెసిన వారగుటయును, సాత్యవతేయుడువారలనందర దుఃఖోపశమనుల జేసి నొక నాడేక తంబ తన తల్లి సత్యవతికిట్లనియె.

క. సారము సంసారము మితి
మీరిన అతి హీన దురిత మేర్పడు మనసు
గ్ర్కూరత హెచ్చై చెడు సం
స్కారము లేకుండ జను లసద్గతు లౌటన్

వ. కాలవిధి వీక్షింప నీ దుర్యోధన దుశ్శాసనాది ధృతరాష్ట్రతనయుల కార్యంబులతి విస్తారంబు లయ్యును అసమంజములుగా కను పట్టెడు. మంచి కంటె చెడునే మది నుంకించించెడు వారు ధృతరాష్ట్రుడు తనయులతో సుఖ దుఃఖాల లోపాలనుభవించక తప్పదు.

తే. ఎల్ల కాలము యొకరీతి వెళ్లనవదు
ముందు వెనుకల నూహించి ముదము తోడ
సర్వ మొక్కటిగా నెంచి సమత గూర
కానలందున తపసివి కావ నవదె

వ. అని వెడలుటయును. సత్యవతి పారాశర్యు నుపదేశమును భీష్మ విదురుల కెరింగించి కోడండ్రు అంబికా అంబాలికల తోడం తపోవనంబుల కేగి పెద్ద కాలంబు తపం బాచరించి కాలంబు చాలుడు. శరీరములు విడిచి పుణ్య లోకముల కేగుటయును, యిట ధృతరాష్ట్రుండు–

క. తన సుతులు పాండు సుతులని
మనమున బేధమ్ము లేక మగువయు దానున్
కనికర దృష్టిం కుంతీ
తనయుల నెంతో ముదమున దయతో కావన్

క. తన మన బేధము వలదని
మనమున నందరి నొకటిగ మాన్యత జూడన్
తన సుతు ధృతరాష్ట్రుండెం

తన వారించి నను వారు దర్పిత మతులై

క. పిల్లాట లాడునాడే
యెల్లెడ దుర్యోధనాధు లెక్కుడు దురుసై
బల్లిదులౌ పాండవు లెడ
ప్రల్ల దనపు మాట వెంట పరుసము లాడన్

క. దర్పము జూపుచు భీముడు
కార్పణ్యము తోడ వార్ని కట్టడి సాయన్
వేర్పాట్తగదని మనలో
నేర్పున ధర్మార్జునుల రనేకము వినిచిన్

వ. పట్టుదలలు పగలులేకుండ అన్యోన్యతతో మెలగుట సర్వ శ్రేయోదాయక మని యును –

క. వాదము వచ్చిన పట్టున
ఆదరమున ధర్మ విదుడు ఆప్తి చెలంగన్
సోదరులకు నచ్చు నటుల
మేదురుడై సర్వ జగతి మెప్పును గొనుచున్

వ. భీష్మ విదురాది పెద్దల మన్ననలు గొనువారునై పాండు కుమారులు ధార్తరాష్ట్రులతో సఖ్యత పాటించు చున్నను దుర్యోధన దుశ్శాసనాదులు శకుని కైతవంబున మత్సరగ్రస్థులుగా పాండు కుమారుల యెడ అన్యోన్యత పాటిం పక ముఖ్యముగా భీముని యెటులైనా మట్టుబెట్ట దలంచిన వారలై –

సీ. చెడుగుడు పందాలు చేర్చుక్క రేచుక్క
కళ్లగంతలు కట్టి కఱ్ఱ సాము
బిళ్లాట చెర్లాట గురి గుంట గ్రుద్దులు
పరుగుల పందాలు పాము నడక
దండియలు కుస్తీలు దంతంపు బిళ్లాట
బల్లెము విసురుడు బల్ల యెత్తు
రథ గజ విన్యాస రణరంగ భేరులు

తురగాది రోహణల్ తుంటి పట్లు

తే. బాణమేయుట గురి చూచి బాకు పోటు
పట్టి పాశాద్గదాయుధ దిట్ట లగుచు
వాదులాడుచు కౌరవుల్ పాండు సుతతొ
పంతగించుచు యెల్లెడల్ పంతులాడ్చు

మత్త. ఆటలందున ధార్తరాష్ట్రులు ఆగడంబులు చేయుచో
మేటి భీముడు పాండ వేయుల మేధురుండై యొక్కడుం
దీటుగా పగ తోడ వారల తీటడంచుచు నుండగా
తాట గట్టియు నీట ముంచియు తల్ల క్రిందుగ నాతనిన్

వ. మరియును విషాన్నముం గుడువ జేసియు, విషోరగములచే గరిపించియు అనే కతెరగుల హింసించినను భీమునికి అవ్విషము అమృతోప యుక్తముగా మారుటయు ను దుర్యోధనాదుల పన్నుగడ లెల్లను నిర్వీర్యంబులైపగను వగను మరింతలు చేసిన వే కాని మంచి చేయ నేరమి చింతించుచు గురు శిక్షణలో సక్రమ విద్యా బుద్ధుల నేర్పింప నెంచిన భీష్ముడు తన యిష్ట సఖుడు బాల్యమిత్రుడునైన కృప ద్రోణులవద్ద శిష్యరికంబు నేర్పాటు గావించుటయును.

క. క్షత్రియ విద్యలు కురుకుల
క్షాత్రము తనదే అను నటు గర్వోన్నత స
త్పాత్రు ద్రోణ కృపుల కృప
నాత్రత నేర్చిరి బలయుతు లాప్తిన్సఫర్ధన్

క. గురువులు యెవరీ కురుసుత
కిరవుగ విలువిద్య గరపు కీర్తితు లనగా
గురుకుల నేస్తులు నెంతో
పరమాప్తులు భీష్మ నృపతి బ్రహ్మజ్ఞులకున్

వ. అని వారల చరితంబులు దెల్పెద వినుమని జనమేజయునితో వైశంపాయనుడు

**కృపాచార్యుల జన్మ వృత్తాంతము**

వ. తొల్లి గౌతముండను ముని పెద్ద తపంబు గావించి శరద్వంతుడను తనయుం

గాంచెను. ఆతడు చిన్న నాటనే ధనుర్వేదము నభ్యసించి శస్త్రాస్త్ర ప్రయోగంబులు నేర్చి గొప్ప విలు విద్యా తపః సంపన్నుడై యుండ ఆతని తపోబలమునకు వెరచి సమస్త దేవతా దిక్పాలకుల కెల్లరకును ప్రభుడైన యింద్రుండు అతని తపో భంగము గావింప నచ్చర లేమ నొకతెన్నియోగింప ఆమెవలన రేతః పతన మగుడు.శరద్వంతు డు ఆ వనమును వీడి జనుట యును ఆ రేతఃపతనము రెండుగా చీలి అందుండి నొక బాలుడును యొక బాలికయు సంభవించుటయును వేటకై వచ్చిన శంతన మహారాజు వారి నిరువుర పురంబునకు తెచ్చి యెక్కుడు కృపతో వారు కృప కృపి నామధేయులుగా ప్రసిద్ధులగుటయును కృపుడు తండ్రి వలెనే గొప్ప విలు విద్యా సంపన్నుండు కా, భీష్ముడు అతనిం దెచ్చి తన మనుమలు కురుకుల ధార్తరాష్ట్రులకు విలువిద్యా గురుండుగా నేర్పరుచుటయును.

## ద్రోణాచార్యుల జన్మ వృత్తాంతము

వ. మును మహా తప్ష విద్యానిధియైన భరద్వాజ ముని గంగకేతేర అంతకు ముందు వచ్చి అందుల క్రీడలాడు చున్న ఘృతాచి అను అప్పరాంగనా సౌష్ఠవముందిలకించి మనసు చలించి శుక్ల పాతంబగుడు నద్దాని ద్రోణంబుల దెచ్చిభద్ర పరుప అందుద్భ వించిన వాడగుట ఆ భారద్వాజునకు ద్రోణ నామంబు ప్రసిద్ధంబయ్యె. మరియును భరద్వాజ మహాముని సఖుండైన పృషతుండనుపాంచాలపతి ఘోర తపంబు చేయు డు కుసుమాప చయ విషయమై వచ్చినమేనక అను అప్సర కారణముగా రేతః పత న మగుడు. దానిపాదంబున సంగ్రహించగా మరుత్ అంశమున అందుద్భవించిన వాడుగావున ద్రుపదుండు నాబరగి భరద్వాజాశ్రమమున ద్రుపదుండును ద్రోణునితో సమస్తవిద్యాపారంగతుడునై తదుపరి పాంచాలభూపతి యగుటయు. ద్రోణుడు అగ్ని వేశుండు అనుమహా ముని వద్ద శిష్యుండునై మహా శస్త్రాస్త్ర విలువిద్యా పారంగతు డునై వానివలన ఆగేయాస్త్రము మొదలుగా అనేకానేక శస్త్రాస్త్ర ప్రయోగోప సంహర ణాదుల నెల్ల సంగ్రహించి కృపుని చెల్లెలు కృపిని వివాహము గావించుకొని ఆశ్వద్ధా మ అను కొడుకును బడసి భార్యా బిడ్డల సంరక్షణార్ధము తొల్లి పితృవధా క్రోధుండై భువి నరాజకము గావింప ముయ్యేడు సార్లు రాచ కులంబులం దునుమాడి గొన్న

ధనంబుల నెల్ల తత్పాప పరిహారార్థంబు బ్రాహ్మణులకు భూరి దానంబులు గావించు చున్నవాడని విని జామదగ్ను కడకుజని తన్నెరింగించుకొని అర్థార్థినై వచ్చితి నని వేడ

తే. వేద విప్రుడ అర్థమై వేడ వస్తి
సర్వ మెల్లను ధార్పోస్తి శల్య గతుడ
అస్త్ర ధనములు మిగిలుండె ఆప్తి గొనుము
శుభము నీకగు సంస్థుత్య శుభము శుభము

వ. అనిం ఇట పరశురాముని వలన దివ్యాస్త్రములు సమంత్రముగా గ్రహించెను, ధనార్థియై సతి సుతు తోడన్ తన సహాధ్యాయి యిష్ట సఖుడు నైన పాంచాల భూపతి కడకు జని తన్నెరిగించు కొన్న ద్రోణునితో ద్రుపదుండు –

మత్త. ఏటి సఖ్యత యేటి నెయ్యము యేర్పరించుకు బాపడా
దీటుగా తగ నేస్తమంచును దేహి యంచును యెంతయున్
నోట పల్కిన పల్కదెన్నడో నూహ జేసిటు వస్తివా
సాటి వారల సఖ్యతెంచుట సభ్యతంచును తెల్వదో

వ. అని రాజరిక మదాంధతతో యెగ్గాడిన చేయునది లేక ద్రోణుండు

క. స్నేహంబెక్కుం డనుచును
నూహించియు బంధు కంటె నొక్కట రావన్
యేహ్యంబై మాట లిటుల
భావ్యంబే నీకు ద్రుపద బాపడ నంచున్

క. కాలము చాలని చోటుల
పేలవముగ జూచు జగతి పీడితులనుచున్
కాలము కలసిన పట్టుల
మేలిమియై పర్వు నెల్ల మెప్పును గురియున్

వ. అని మనంబున జింతించుచు సతి సుత శిష్యజనంబులతో పాంచాల తీరంబులు దాటి హస్తి పురోద్యాన వన సీమలకు రానందందు –

తే. ఆటలాడుచు పెంపెక్కి ఆఢ్య గుణులు
బంతి ఆటాడ నూతిలో బడియె బంతి

యెటుల తీయగా తమకౌనొ యేమనంచు
చూచు చుండిరి కురుకుల సుతులు అంత

తే. నూత బడ్డది యేమొక్కొ నూహ జేసి
ఆత్ర పడుచును ద్రోణుండు అందు జూచి
బంతి కొఱకౌనొ మీదైన గెంతులాట
తీతు చూడుడు నాదైన తీరు వింటి

వ. అనుచు తన వాడి శర పరంపరతో ఆ నూత నున్న కందుకము యెట్టును కదలకుండు నటుల బంధించి మరిన్ని శర పరంపరలు నొకదాని వెనుక నొకటి నాటి తాటిగా నొనర్చి బంతిని వెలికి తీయుటయును వారందరు ఆశ్చర్యమగ్నులైవారిని తమతాత భీష్ముని కడకు గొంపోయి జరిగిన దంతయుందెల్ప భీష్ముండు తమ కురుకుల విద్యా గురుండైన కృపుని వలన మున్నె యీ ద్రోణాచార్యుని గురించి విన్న వాడు గావున సగౌరవముగా వీక్షించి కుశలం బడిగి –

మ. అనఘా యెంతటి వాడవో తెలియ సన్మాన్యుండ వెంతేనియున్
అనువౌ రీతిని నూతిలో శరము లత్యంతాద్భుతిం ద్రాటగా
పెనిచిం బంతిని అందుకో దగిన యా విల్విద్య పారంగతన్
తనదౌ లాఘవ మేర్పడం గురుత నత్యంతాద్భుతిం దీయుటన్

వ. అనుచు గో ధన ధాన్య సమృద్ధత తృప్తులంజేసి మనుమలు ధృతరాష్ట్ర పాండు కుమారులం జూపుచు–

క. మీదౌ విద్యా నైపుణి
సాదరతన్ ధరణి వెలయ సంస్తుతమౌగాన్
నాదౌ మనుమల నెల్లర
నోదారిని తీర్చుమయ్య యోధా పటిమన్

వ. అని వారల కొప్పగింప ద్రోణుండును వారలందర చేకొని గురుకులమున–

క. గురుతర విద్యలు నేర్పుచు
గురుడడిగెను నొక్క నాడు గుర్వర్థముగా
వెరపేమియు లేక నిలచు

కరణుడు యిందెవ రనంగ కర్జము దీర్చన్

వ. ధార్త రాష్ట్ర లెల్లరుం పలుకక మిన్నకున్న పాండవ మధ్యముండునే దీర్తునన ద్రోణుండాతనిం కౌగలించుకొని సంతసిల్లి కుమారుల కెల్లరకును విలువిద్యలు నేర్పు చుండ యితర దేశ రాజ పుత్రు లెల్లరుం వారి తోడ గూడి విలు విద్యలునేర్చుకొను చుండ నందు సూతపుత్రుండు రాధేయుండు అర్జునునితో సమర్ధనీయముగా అస్త్ర విద్యలు గ్రహించుచు స్పర్ధ వహించుచు దుర్యోధన పక్షపాతియై యుండువాడు.

క. నరుడన్నిట ముందుండుట
మురిపమ్మున నేర్పనౌచు ముద్దుగ చూడన్
తరతమ విద్యా స్పర్ధత
నెరి వారలు అస్త్ర విద్య నేర్చుచు నుండన్

వ. అర్జునుండు–

క. గురుడొక్కటి నేర్పించిన
మరి రెంటిని సాధనాన మక్కువ మీరన్
మరునాటికి నేర్చి గురుత
వెరగందగ నెల్లవారు వివిధాస్త్రములన్

వ. ప్రయోగించుటలో కృతకృత్యు డౌట నెరింగిన గురు సుతుం డశ్వద్ధామ అర్జును డన్నము కుడుచు నపుడు చీకటి కాకుండు నట్లు చూచుచుండునదిగా వంటింటి అన్న సాదకులకు చెప్ప వారట్లే నిర్వర్తించు చుండ–

తే. కాలి తాపున దీపమ్ము తూలి పడగ
వాటమైనట్టి చేముద్ద నోట నిడుచు
మాట మంతియు లేకుండ మగుడ మగుడ
నోట బెట్టుక కుడువనై యోటు లేక

వ. తిని లేచుచు చీకటి యందున సూటిగా కుడువనైనటుల బాణముల నెందుకు వేయలేమనుట మది నూహించి పట్టుబట్టి కండ్లకు కంతలు గట్టుకొని శబ్దమాత్రాన వస్తుబేధన విద్య నభ్యసించి కృతకృత్యుడు కాగల్గుటయును–

తే. చూడవచ్చిన ద్రోణుండు చోద్యమంది

మాన్య నిను జేతు అర్జునా అన్యు లేరు
మిన్న గాకుండ జగతిలో యెన్నగాను
నాదు కార్యమ్ము నెరవేర గదుర ననుచు

వ. అని అతని యందు బద్ధానురాగుడై వివిధ శస్త్రాస్త్ర విద్యా విషయిక యుద్ధ మెలకువల నెల్లను ప్రయోగోప సంహరణమునెల్ల తనంత వానిగా తీర్చి దిద్దుటయును, మరియు గదా కార్ముక పట్టి ప్రాసాది తోమర కుంత శక్త్యాది వివిధాయుధ విద్యలం దునను రాకుమారుల నెల్ల లబ్ధప్రసిద్ధుల జేయుచున్న ఆద్రోణాచార్యుని ప్రసిద్ధి విని హిరణ్యధన్వుండను యెరుకని దొర బిడ్డ –

## ఏకలవ్యుడు

తే. ఏకలవ్యుండు నా బోయ యేకతంబ
ద్రోణు గురువుగా గొల్వరా ద్రోణుడకట
బోయడంచును మదినెంచి పొమ్మనంగ
గురుని ఆనతి ద్రోణునే గురుత గురుగ

తే. మట్టి తోడుత నొక బొమ్మ నట్టి రూప
మేర్పరించుకు విలువిద్య మించి నేర్వ
అనుదినంబును ఆ బొమ్మ కర్పణమ్ము
చేయు చుండెను తనదైన చేవ మిగుల

తే. కొట్టగా నేర్చె సడిగొని గిట్ట చపుడు
దిట్టడౌచును పరుగున చుట్టుముట్టి
పట్టి బంధించు గురుతర బాణ విద్య
యెట్టి పులినైన కిటినైన మట్టిగరప

వ. ఇట్లుండ నొకనాడు

క. గురుకుల కౌరవ పాండవ
చిరుతలు గురువాజ్ఞ గొనియు చెచ్చెర వేట్లన్
తరుముచు అల్లన జంతుల
పరుగున వచ్చియును పడ్డ పందిని చూచిన్

క. సడి గొని నైదిటి ఆలుగుల
వడి నాటిన బాణ ధాట్కి వహ్వ యనుచున్
నడయాడుచు వచ్చు బుడుత
మిడి చూచుచు అర్జునుండు మిధ్యావాక్కై

వ. ఆలోచనామగ్నుడై యుండ

ఉ. ఆయత బాణహస్తు మృదుహాసను యాసగు వింత భాషనుం
కోయని కూయుచుం సఖుల గోముగ పిల్చుచు నుండు నాతనిం
పాయక కౌరవాన్వయులు పాండుని బిడ్డలు తక్కు రందరుం
బాయని కోప దృక్కులను పర్వుచు నుండిరి మత్సరంబునన్

వ. వారలు పైకెరుక రాకుండ

క. మెచ్చుచు వారాతని యెడ
నిచ్చమైన అస్త్ర విద్య నేర్చితి వనగా
సచ్చరితాత్ములు ద్రోణుల
యిచ్చుతొ నే విద్య నేర్చి తింతయు నెంతన్

వ. విని కురు కుమారులు గుమి గూడి వచ్చి ద్రోణున కంతయుం దెల్ప అందర్జు నుండు గురునితో నొక నాడేకాంతమున ఆర్య!

తే. మాన్య నిను జేతు అర్జునా అన్యు లేరు
మిన్న గాకుండ జగతిలో యెన్నగాను
చూడు నా మాట అనినారు చోద్యమంద
వమ్ము ఆయెను ఆమాట నమ్మ తగదొ

వ. అని యెగ్గాడ ద్రోణుండు వానింజూతము రమ్మని అర్జునుందోడ్కొని అడవిలో–

క. అనవరత శరాస్త్ర నిరతు
వనచరు వినయాతి వినుత పావన గుణునిన్
మనమున కల్మష రహితుని
అనయము తన బొమ్మ ముందు అవనతు జూచిన్

వ. సంతసంబు గదుర ఏకలవ్యుని వద్దకువచ్చి ప్రత్యక్షము కాగా గురువులు ద్రోణు నకు పాదవందనము లొనర్చుచు పరిమళ పూజాద్రవ్య మధువన ఫలకందమూలము లు దెచ్చిపూజించి నేను మీశిష్యుండ. గ్రహింపుడని మీకేది కావలయు నన్న కోరుడ నుటయును తానుమీవాడ సర్వంబును మీయధీనము చేయువాడ. సంకోచింప వలదన–

క. తనియుచు నెంతయు ద్రోణులు
 ముని నియతుని నేక లవ్య ముద్దుల కుఱ్రన్
 మనమున దీవెన లొసగుచు
 తనమాటది నిజము కాగ దయరహితుండై

వ. మాటలు నేర్చిన నిర్జీవ ప్రతిమలా గురు దక్షిణగా నీవేలీయమన్న తత్తక్షణంబ ఏ కలవ్యుడు తన కుడిచేతి బొటన వ్రేలు–

క. తెగ గోసియు చిరు కత్తితొ
 వగపొందక గురుని ముందు పడవేయంగా
 సుగుణుడ వీవని మెచ్చుచు
 సగజచ్చిన గురుని వాక్కు సత్యత కాగన్

వ. అపుడు అస్త్రవిద్యా గురుండైన ద్రోణుండు కన్నీరు పేన్నేరుగా నేడ్చుచు ఏకలవ్యు నాలింగనము గావించుకొని యెరుకల కంగుష్ఠావశ్యకత లేకుండగనే జీవనోపాధికి అంతరాయము లేకుండ ఉండవేట విధానమును ఉపదేశించి పంపుటయును.

క. నాటికి నేటికిని యెరుక
 వాటముగా ఉండ వేట పటుతర వృత్తిన్
 పాటించుచు నున్నారిల
 దీటుగ జీవన సరళికి దేహ్యనకుండన్

వ. మరియును–

తే. మాన్య నిను జేతు అర్జునా అన్యు లేరు
 మిన్న గాకుండ జగతిలో యెన్నగాను
 పొల్లు గాకుండ పరమార్థ మెల్ల తెలియ

సత్యమౌటయు పార్ధుండు సంతసింప

వ. ఇవ్విధముగా పాండు పుత్రులు బల దర్పితులుగా యుద్ధ విలు విద్యా పాటవం బుల మిన్నయైయుండుట సహింపని ధృతరాష్ట్రనందనులు వాపోవుచుండుటయును.

## ద్రోణుడు తన శిష్యుల అస్త్ర విద్యా నిపుణత్వమును పరీక్షించుట

లవి. అట్ట జేసిన పిట్ట బొమ్మను చెట్టు కొమ్మకు గట్టి దిట్టత
దిట్ట యెవ్వరు పిట్ట గొట్టగ గట్టి నియమము చేసి ముందర
నట్టె నిల్పియు శిష్యులందర పట్టు డెల్లరు విల్లునమ్ములు
అంచు దెల్పుచు ద్రోణులంతట ఒక్కనొక్కని పిల్చి వేడుక

వ. ఆ పిట్ట కనబడుచున్నదా. ఈ చెట్టు కనబడుచున్నదా! ఇత్యాది అనేకానేక ప్రశ్న లడుగుచు ఔను ఔనను సమాధానములిచ్చిన పాండవాగ్రజుడైన ధర్మజుని కౌరవాగ్ర జుండైన దుర్యోధనును మిగతా అదే సమాధానము లిచ్చిన యెల్ల వారలను కాదు పొమ్మని ఆఖరున పాండవ మధ్యముండైన అర్జునునిం బిల్చియడుగ పిట్ట తప్ప మరే దియు తన దృష్టి పథమ్మున లేదన కొట్టుమని పల్కిన మరుక్షణంబ చెట్టుకు కట్టిన పి ట్ట నేలంగూలిన చప్పుడు కాగా యెల్ల వారును చూచు చుండగా ఆతని నక్కునజేర్చు కొని ద్రోణుండు మెచ్చుచు వెండియు నొక్కనాడు విహారార్థము ఆనంద ముప్పొంగ గంగ యొడ్డున శిష్యులందరి తోడను–

లవి.ఆట పాటల దేలి సైకత తోటలందున తోటివారితొ
నీట స్నానము చేయునప్పుడు నీట గ్రాహము పట్ట ద్రోణుని
మేటులెవ్వరు నన్ను దేల్చగ ఇట్టు రండని కొట్టి జంపగ
తేట మాటల పొంచి యెల్లరు నీట జూచుచు నిల్చునుండగ

వ. అర్జునుండు ఒక్క ఉదుటన ముందుకురికి నిశితాస్త్ర పరంపరల నీటనున్న ఆ మొసలిం కడదేర్చి గురువుల సంరక్షించుకొన్న వాడౌట మెచ్చి యీతని వలన ద్రుప దుండు పరాజితుడౌట తథ్యమని మది దలంచి అందుల కవసర మగు దివ్యాస్త్ర ప్ర యోగము లెల్ల తేట పరచి మేటి విలుకానిగా చేసెనని సకల పురాణేతిహాస కథాకథ నకుండైన సూతుండు శౌనకాదుల కిట్టులనియె.

ఇది.

**శ్రీశ్రీ వాణీ వరప్రసాదలబ్ధ సుకవి జనప్రియ సాధుజన విధేయ శ్రీశ్రీ కవిత్రయ స్ఫూర్తి ఆర్వేల నియోగి బ్రాహ్మణ మండపాక వంశోద్భవ వీర్రాజు పౌత్ర సూర్యప్రకాశం సత్యనారాయణాంబా తనయ విరచిత**

**-: శ్రీమదాంధ్ర మహాభారత ఆదిపర్వ పంచమాశ్వాసము :-**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆది పర్వ – షష్ఠాశ్వాసము

### కుమార అస్త్రవిద్యా ప్రదర్శనము

వ. దేవా ! అట్లు కృతాస్త్ర శస్త్ర పారంగతులైన కురు కుమారుల కౌశలంబు వ్యాస గాంగేయ విదుర కృప శల్య శకుని సోమదత్తాదుల సమక్షంబున చూప దలంచి ద్రోణచార్యు డొకనాడు ధృతరాష్ట్ర మహారాజుతో–

క. చిరుతలు నేర్చిరి విద్యలు
గురుతర శస్త్రాస్త్ర జాల కోవిదు లగుచున్
కురువీరత దిశల వెలయ
నెరు లెవ్వరొ యేర్పరింప నింతయు నెంతన్

క. అన విని సంతస మొదవన్
కనుగొని మంత్రుల ననుపను
కమనీయముగా అనుపమ రీతుల రంగము
అనువుగ నేర్పరుప నెంతొ అవనీ తలమున్

వ. విదురుని పర్యవేక్షణంబున సువిశాలంబగు పట్టణ పార్శ్వ ప్రదేశమున స శాస్త్రీయ నిబద్ధ ప్రమాణోపేత వర్తులాకార మృదుల నిరపాయ తలంబును దుమ్ము ధూళి రేగకుండునట్లును చూపరుల చూపులకు అంతరాయము వాటిల్లకుండునట్లును అనువగు ఆశ్ఛాదిత వర్తులాకార నిడుపాటి మెట్ల వరుసలతోడను నయనానందకర రమణీయ మణిమయ వర్ణ ధ్వజములతోడను రంగరాజీవ సంస్థాగత ప్రాదేశిక వివిధ వర్గీకృత ప్రవేశ ద్వార దేశముల తోడను నవపల్లవ కుసుమ కోమల తోరణముల తోడను నానాదేశ రాజన్య నివహంబుల కనువైన రీతుల నునుమెత్తని మెత్తల తోడను అల్పాహార విహార విశ్రమిత ఫలభక్ష్య వంటశాలల తోడను దృశ్య శ్రవణ శాంతి సందేశ రక్షట భటసంవిధాన పాత్రముగను దశదిశాను బంధన బలి విధాన వివిధోపాయములతోడను రమణీయ మనోహర కమనీయ సదృశంబుగను సందర్శనాను కూలం

బుగను కుమార అస్త్రవిద్యా ప్రదర్శన రంగమ్ము సంసిద్ధంబైన పుణ్యాహ వచన శుభ ముహూర్తమున ధృతరాష్ట్రుండు గాంధారీ పురస్కృత దేవేరీ పరివృతుండై వివిధ భూషణ భూషిత విలాసినీ నివహంబుతో నరుదెంచి రక్షాబంధబంధురమైన హర్మ్యరాజోచిత మణిమయ ప్రత్యేక మంటప ప్రేక్షాగార మృదుపీఠంబుల నుపవిష్ఠుండైన–

క. చుక్కల చందురుడోయన
పక్కల నున్నట్టి రాణి బంధుర తోడన్
దిక్కుల పదియందింటను
యెక్కుడునై వెలయు చుండె యుర్వీపతియున్

వ. మరియు కుమారుల ప్రావీణ్యత కనుల జూచువేడ్క కుంతియు సపరివార దాస దాసీజన పరివృతయై విచ్చేసి గాంధారీ దేవి ప్రక్కన సదృశ పీఠంబున నుపవిష్ఠురాలైనది. విదురుని పీఠము ధృతరాష్ట్ర గాంధారులదాపున యెప్పటికప్పుడుఅస్త్రవిద్యా ప్రదర్శన విషయములు తెల్పుట కనువుగా యేర్పరుప బడియుండె నపుడు.

సీ. వ్యాస భీష్మ విదిత భూసురోత్తమ స్తుత్య
ధర్మ వీక్షణులైన తాత్వికులును
సద్ధర్మ సాధనా సంసిద్ధమూర్తులౌ
రారాజ నివహంబు రహిని దేర
వితరణశీలురౌ విఖ్యాత వణికుల
ఆహ్వాన సదయుల ఆప్తి చెలగ
వర్ణాశ్రమాన్విత విధివిధాన్వయ పౌర
బంధు బంధుల మిత్ర బాల వృద్ధ

తే. మంత్రి సామంత భట వర్గ మర్త్య వీర
తతులు తండోప తండంబు తరలి రాగ
దేవ దానవ సంస్తుత్య తేజమొప్పి
యలరె నాసభ యెంతేని యాప్తమౌచు

వ. అట్టి సమయావసరంబున–

తే. ధౌత వస్త్రాలు ధరియించి ద్రోణ గురుడు
శిష్య తండంబు దనవెంట పుష్టి దనర
అనుగు బిడ్డ డశ్వద్ధాము నట్టె గూడి
రాగదెంచెను కురుకుల రంగ మలర

వ. అంత –

తే. వాద్య ఘోషలు నినదించె వరుస వరుస
నామ నామాంకిత స్ఫూర్తి నయము బల్క
కూర్మి కురురాజ సుతులెల్ల కూడి రాగ
యెవరి కెవ్వరో సరి జోడి లేర్పరింప

తే. అభినుతింపుచు తమ తమ ఆయుధాల
అస్త్ర గద బాణ కార్ముక శస్త్ర ధరులు
నిలచి రెల్లరు తమ విద్య నేర్పు జూప
శక్తి యుక్తులు గణుతింప సర్వ జనులు

వ. ఇటుల నా వీర విక్రమ పరాక్రమ నానాదేశ రా కుమారు లెల్లరును తమ తమ తోడి జోదులం దలపడి అనే కానేక రకములగు మల్ల ముష్ఠి శంఖనాద గద అశి ప్రాస పట్టి ఈటె పోటు గుడిగొట్టు బడిశ పట్టి పెట్టు ఉండకొట్టు బాణాక్రా శర పరంపరాది వివిధ విభవ యుద్ధ విన్యాసంబుల చూపరుల నెల్ల విభ్రమాశ్చర్యా నందాబ్ధుల నోలలాడింప –

క. ఆహా యోహో లెగయగ
బాహో బాహీ నెరపిరి బాయని పటుతన్
సాహస విన్యాసంబులు
ఊహా తీతపు జననుతు లుద్ధతి యెగయన్

## భీమ దుర్యోధనుల గదా విన్యాసము

వ. అంతట ఆచార్యుల అనుమతమ్మున భీమ దుర్యోధనులు ఉక్కు మిగుల చేవ ద నరి బలదర్ప గదాయుధ పాణులై రంగ ప్రవేశంబు చేసి, నేల దాకి ఊరు చరచి భు

జాస్ఫాలనంబు మెరయ మదమత్త మదేభమ్ముల భంగి నొండొరుం దాకతద్యోధ పద ఘటన ఘట్టనలకు అవని దద్దరిల్ల స్వర్ణ కాంశ్య పంచలోహ నిర్మిత గాదాయుధ భీష ణరవంబుల దిశలు మారుమ్రోవ సూర్య కాంతిని యినుమడింప జేయుచు స్వర్ణగదా కాంతి పుంజములు కనులు మిరుమిట్లు గొల్ప ఒక్కొక్క దెబ్బకు మిన్ను విరిగి మీద ప డినట్లుగా సభాసదు లెల్లరు భీతి జెంద, రంగ ప్రదేశమ్ము నుగ్గునుగ్గై అవని రజము దిక్కుల కెగసి చూపరుల చూపులకంతరాయము ఘటింప జన ఘోష మిన్ను ముట్ట సవ్యాపసవ్యంబు లేర్పరుప వీలు లేకున్నట్టి సమయమ్మున ద్రోణుండు ఆనాటి వారిరు వురి గదా విన్యాసములు రేపట విద్వేష కారకములు కాకూడదని వారింపం దలంచి అశ్వద్ధామను బంపి ఆపించి తన ప్రియ శిష్యు అర్జునుని ధనుర్విద్యా కౌశల విన్యా సములు చూడుడన రంగ మధ్యమునకు వచ్చిన కుంతీ నందనుండర్జునుండు గురు వులకును పెద్దలగు భీష్మ విదుర ధృతరాష్ట్ర గాంధారీ కుంతీ మాతకును నమస్కరింప చూడ వచ్చిన సభాసదుల మధ్యనున్న కొందరు

మత్త. కుంతి కూనల చిన్న వాడట కూర్మి పెంపక మందునం
సంతరింపుల సద్గుణమ్ముల సాహసాన్విత విద్యలం
వింత వింతల విల్లుకాడని వే విధమ్ముల సర్వులుం
అంతకంతకు చెప్ప విందుము అర్జునుండను యీతనిన్

మత్త. భూరి సత్వుడు చాపహస్తుడు బుద్ధిమంతుడు యెంతయుం
తార మధ్యమ చంద్రుడోయని తన్నె జూడగ యెల్లరుం
వేర లేరని బాణ విద్యల వీరుడెవ్వడు సాటనన్
శూరతెంతయు జూప వచ్చెను చూచు వారలు మెచ్చగన్

వ. అని అర్జునునిం జూచుడు సభలో నున్న యువక ఆడ పడుచులు తమలో

మత్త. సుందరాంగుడు సుంతజూడవె చూడముచ్చట కాదటే
అంద గాండ్లలొ అందగాడగు అబ్జ నాభుని బావటే
సందియంబది లేదు తెల్పగ సద్గుణంబుల రాశనిం
యెందరుందురు యిట్టి సుందరు లిద్ధరాతల మందునన్

వ. అని స్త్రీ బాల వృద్ధ జనమ్ము లెల్లరుం పెద్ద పెట్టున కొనియాడుచున్న తన చిన్న కొడుకుం జూచుచు కుంతి–

క. సంతస మొందుచు మనమున
యింతితలు కనులు జేస్కు యెంతయు బంగిన్
సుంతయు ముఖమున దోపకె
సంతోషాంబుధిని దేలె సర్వుల వినుచున్

వ. అంత నా కలకలంబేమని ధృతరాష్ట్రుండు అడుగ విదురుండు

ఆ. అస్త్ర విద్య జూప అర్జునుండదె వచ్చి
రంగ మందు నిలచె రాగ మొప్ప
ఇంత ఘోష రేగె యెల్లెడ విననౌగ
జూచు వారలెల్ల జూచి బొగడ

వ. అని విన్నవింప గాంధారి తన మనమ్మున

క. కొడుకన యిట్టిడు కావలె
వెడగులు పది పదుగు రేల వీరత తక్కిన్
ఒడయుడు కాగల నొక్కడు
సుడిగొని భూవలయ మెల్ల చుట్టియు గెల్వన్

వ. అత్తరి అర్జునుండు–

సీ. ఏక బాణమ్మున దశ శత సహస్ర
మేర్పడ తూపుల నెగయ జిమ్మి
చెవి శబ్ద వినికిళ్ళ చెన్నొందు అస్త్రాల
రాళ్ల పెన్మంటల గ్రాల నేసి
జీమూత మారుత సమ్మోహనాస్త్రుల
జీముసుర్ సుడిగాలి జిమ్మనేసి
విసరిన రాయిని తునియలు జేయుచు
వినువీధి నెరయించి వింత గూర్చి

తే. శక్తి సంధాన బేధన చాప గతుల
పాశ బంధన నిరోమయ పాము గరుడ
అస్త్ర విన్యాస విలు విద్య లార్యు లలర
రక్తి కట్టింప వెలయించె రమ్య ఫక్కి

వ. మరియును నీట జాలువారు మీనుల నేసియు అండబేధన మాదిగా గల బాణ విద్యలతో పాటు జోడైన రాకు మారులతో గదా ఖడ్గ అశ్వారోహణాది యుద్ధవిద్యలు ప్రదర్శింప కరతాళ ధ్వనులు మిన్నుముట్ట, రంగ ముఖద్వార దేశమ్మున అంగరంగ వై భవ సద్గుణ శోభితుం స్వతస్సిద్ధ కవచ కుండల ధారుం బాణతూణీర సంశోభిత భు జస్కంధుం బాల సూర్యప్రభా భాసురంబైన తేజంబు మెరయ సమయాగమనుండైన కర్ణుండు జబ్బ చరచి –

తే. శూరతెంతన అసహాయ శూరుడనగ
అబ్బురంబుగ దరిజేరి ఆఢ్య మెరయ
నీదు విద్యలు నేగూడ నేర్పరించి
ఆర్య జనులను మెప్పింతు అర్జునాఖ్య

వ. అని రంగ మధ్య ప్రదేశంబునకుం వచ్చి కృప ద్రోణులకు నమస్కరింప–

తే. సంభ్రమానందముల్ పొంగ సదయులంత
పాండవాన్వయ భ్రాతృ తేర్పార జూడ
కౌరవాన్వయ నూర్వురుం కనుల కూర్మి
ప్రస్ఫుటంబాయె ప్రతి ముఖ భావమెల్ల

వ. అంత అస్త్రాచార్య ద్రోణులచే ననుజ్ఞ వడసి కర్ణుండు తానుగూడ అగ్ని వాయు వృష్టి మున్నగు అస్త్ర సంధాన క్రియలు వెల్వరించి, మింట మంట గాలి వర్ష ధారల ను కురియం జేయుటయే కాక అర్జునుండు పల్కిన విధముగా అస్త్ర బేధన క్రియల నన్నింటిని అశ్రమంబున ప్రదర్శింప చూడవచ్చిన కురు రాజ్య సభాసదు లెల్లరుం యితడె పో అర్జునకు దీటైన విలువిద్యా పారంగతుడని కొనియాడ దుర్యోధనాదులు నూర్వురుం పరుగుపరుగున వచ్చి కర్ణునిం కౌగలించుకొని హితోక్తుల సఖ్యత గూర్చు

కొని సమాదర ణుండవయి కురురాజ్య సమస్త ఐశ్వర్యములను పాలు పంచుకొమ్మని మమ్ముద్ధరించి కురురాజ్య మేలింపు మన, ఈయకొని కర్ణుండు దుర్యోధనునితో వల్లె యని అర్జునునితో తలపడి నాధాటి చూపిమిమ్మెల్లర నీ సభా ముఖమున మెప్పింతు నన కుంతి తన మనమ్మున–

తే. ఐన వారల పోరికి అదిరి పడుచు
విన్నయంతనె చింతిల్లి మిన్ను విరిగి
మీద పడ్డటు దలపోసి మేద్ని కొరుగ
సేద దీర్చెను విదురుండు శీఘ్ర గతిని

వ. అంత ప్రతిఘటించి నిలచిన అర్జునునిపై కర్ణుండు–

## కర్ణార్జునుల అస్త్రవిద్యా పాటవము

క. పర్జన్యము నిడి కర్ణుడు
అర్జునుపై మేఘ పటల మావహ పరుపన్
ఊర్జిత బల భీభత్సుడు
ఆర్జవుడై యెగుర గొట్టె అనిలాస్త్రము తోన్

వ. ఇట్లా యిరువురు యొండొరుల తోడ వైరమొందుట జూచి ద్వంద్వ యుద్ధ నీతి విశారదులైన కృపాశ్వద్ధామలు ముందునకు వచ్చి వారి మధ్య నిలచి–

క. కయ్యము వియ్యము నెయ్యము
అయ్యెసరి వార్ల మధ్య అభిలషనీయం
బెయ్యెడ జూచిన తగతగ
యియ్యెడ మీమీ సమగత మేర్పడ వలయున్

క. కురునృప నందను నర్జును
సరిదాకగ నిల్చినట్టి సద్భవ తేజో
వర వీరుడ నీదు కులము
తెర తీయగ దెల్ప నౌగ తిరముగ నిల్వన్

క. అనవిని కర్ణుడు ఖిన్నత

తన కులమును తెల్ప సభను తక్కువ దనమున్
వినిపింప నేరకున్నను
తనుగా దుర్యోధనుండు దరిజేరి కృపున్

వ. గురోత్తమా! మీరు పెద్దలు. మీకు తెలియని ధర్మాధర్మము లుండునా? విద్యా విషయిక పాటవ పరీక్షలందు ఇతరములుకొలబద్దలు కాతగునా? ఐనను–

క. తక్కువ యెక్కువ యెంచుడు
యెక్కువ యీ కర్ణు జేతు యిందరు జూడన్
మక్కువ తోడన అంగకు
ఉక్కు మిగుల యోధ వరుని నుర్వీ పతిగాన్

## కర్ణుని అంగరాజ్య పట్టాభిషేకము

వ. అని అప్పటి కప్పుడు ధృతరాష్ట్ర అనుమతంబున భీష్మ నొడంబరచి వేదవిహితంబగు శాస్త్ర సమ్మతముగా భూసుర సహస్రులకు గో భూ హిరణ్యాది పెక్కు దానంబులు సమర్పించి సింహాసనాధిరోహణార్హుండుగా ఆశీర్వాదంబులు గొనమంగళ తూర్యారావములు చెలంగ వైతాళికులు వందికీర్తింప గాయకీమణులుహారతులిచ్చి పూవృష్ఠి కురియింప నాట్యకత్తె లాడ పండితులు పొగడ పామర జనంబులు ఓహోయన రాజభూషణ భూషితుండైన కర్ణుని కాంచనపీఠంబుననునిచి కిరీటముం బెట్టి అంగ రాజ్యమునకు అభిషిక్తుం జేయ సకల రాజన్యలోకంబవలోకించు చుండ హర్షాతిరేక పులకిత పూర్ణ మనస్కుండైన కర్ణుండు కురుపతి దుర్యోధను నాలింగనము గావించుకొని–

తే. మేటి రాజన్య లోకాన సాటి గూర్ప
అంగ రాజ్యాభిషేకాన అధిపు జేస్తి
వెటుల దీర్తు ఋణమది యేమనందు
అసువు లొడ్డియు నీకౌదు నాప్త మిత్ర

వ. అని పల్కి ధార్తరాష్ట్రుల కెంతయు సంతసంబు గదుర సఖ్యత కొడంబడియుండ కొడుకు రాజ్యాభిషిక్తుండౌట కెంతయు సంతసించిన సూతుండు రథముడిగ్గికర్ణునొద్ద

కు రా కర్ణుండును పితృ గౌరవంబున వినయవినమ్రతోత్త మాంగుడైన నాతని కౌగ లించుకొని ఔదల ముద్దాడి ఆనందాశ్రుల నోలలాడ నెఱింగిన భీముండు నగుచు.

తే. సూత పుత్రుండ కర్ణ నాసోదరార్జు న

సాటి రానౌదె తలపడ సాహసంబ

అర్హ రీతిని వర్తింప నౌదు గాని

అందలంబెక్కి కూర్చుండ అర్హ తేది

వ. అని యెగ్గాడిన విన్న కర్ణుండు వ్యాకులిత చిత్తుడై మింటనున్న ఆదిత్యుం జూచు చు మదన పడుచుండ కోపోద్రి క్త ఋూక్షవీక్షణ ముల్నెఱపుచు సోదర తండ

మధ్యమందుండి లేచివచ్చిన దుర్యోధనుండు భీముదెస జూచుచు యిట్లాడు

టుచితంబె నీకు ననుచు

తే. అర్హతన నేమి విద్యయా అర్ధ గుణమ

పుట్టు పూర్వులు యెంచంగనైన

దిట్టలగు యీ గురుజన మట్టు దెలియు

యెంచి చూడుమ నీ నాదు లేమొ యెరుగ

వ. మరియును రాజ్యము వీర భోజ్యమనికదా పెద్దల మాట. వీరుడైన వాడు రాజ గుట ధర్మము. సుర సూర వీర యేరుల పుట్టు కెట్టిదైనను తద్గుణ సంపదల బట్టి ప విత్రములును శక్తి వంతములునై వర్తింపుట లేదా. మహేంద్రాయుధమైనవజ్రాయుధ ము ఉద్భవించినది దధీచి వెన్నెముక నుంచి కాదె. అట్లనే సహజ కవచ కుండల ధా రియు రాజ రాజన్య సమరూపవంతుడును గుణ సంపన్నుండును అస్త్ర విద్యా పాట వ స్ఫూర్తిచే శక్తి సంపన్నుండును సింహాసనాశీనుం డగుటకు యేమి కొదువ అను నంత?

క. అనుపమ తేజోజ్వలితుడు

యినుడస్త్రాదిని యొరుగగ యెఱ్ఱని కాంతిన్

కనినంతనె విశ్రములై

వెను దిరిగి యిండ్ల కేగ వివిధోద్యోగుల్

వ. దుర్యోధనుండు కర్ణుం దోడ్కొని నిజ మందిరమున కేగె. పాండవులును భీష్మ ద్రోణ విదుర కృపాశ్వద్ధామలం గూడి తమతమ మందిరముల కేగ–

క. అంతర్మదయా కుంతియ
యెంతెంతనొ పొంగె లోన యివ్విధి బిడ్డల్
పంతాలను చాలించుచు
సంతోషాంబు నిధి దేలి సమ్మతి వడియెన్

వ. అంత–

క. ఊర్జిత బలు కర్ణు బలిమి
దుర్జయ దుర్యోధనుండు దోర్దర్పమునన్
అర్జున భీతిని బాసియు
గర్జించుచు నిదుర వోయె గర్వోన్నతుడై

వ. అంత ప్రభాతంబగుటయు యథావిధి కాలకృత్యంబులు నిర్వహించుకున్న కౌరవ పాండవులు ఆచార్యుండు ద్రోణుల వద్దకుం రావ గురుదక్షిణగా నాకేమిత్తురని అడుగ మీకెద్ది యిష్టంబొ అద్దాని తెచ్చి యీయగలవారమని నమస్కరించి పలుక విని తొల్లిటి కొకనాడు దారుణైశ్వర్య రాజ్య మదాంధ ద్రుపదునిచే తాపడ్డ పరాభవమ్ము మది కలంగ అందరు విన పాంచాల భూపతి ద్రుపదుం పట్టిబంధించి తెండిదియ నాకు మీరీగల గురుదక్షిణ యని పల్కిన.

**కౌరవ పాండవులు గురదక్షిణగా ద్రుపదుని పట్టి దెచ్చి యిచ్చుటకు వెళ్ళుట**

క. చొరబడి కౌరవు లెల్లరు
కడు రభసతొ యేగిరంత గర్వోన్నతులై
కడిది బలంబగు సేనతొ
నడయాడుచు ద్రుపదు బట్టి నయముగ దేవన్

క. వెనుకనె యేగిరి పాండవు
లని వీరులు గురుని తోడ అక్కజ పడుచున్
వెనుదిరుగరె కౌరవులని

వినమే మును ద్రుపదుడెట్టి వీరుడొ ననుచున్

వ. మరియును అచార్యా ! మీరును ఆ పాంచాలభూపతి ద్రుపదులును సహపాఠు లనియును మీతోటి విలు విద్యా తుల్యుడని వినికిడి. అంతటి మహావీరుని బంధించి తెచ్చుట యీ ధార్తరాష్ట్రుల వశమౌనే? అని అను సందియము తోచుచున్న దనుచు న్నంత అంతకు మున్నే వచ్చిన కౌరవ వీరులు చతురంగ బలములతోడ పాంచాల పురమును చేరి ముట్టడింప సమకట్టి వచ్చిన వారి ద్రుపదుండు ససైన్య సమేతముగా రధారూఢుడై పురప్రవేశ ముఖ ద్వారముననే అడ్డగించి–

క. తనదౌ ధీరత తెలియగ
కనలుచు నస్త్రాలు గురియ కౌరవు లంతన్
కినిసియు నలుగడ ద్రుపదుని
సైనిక రధుని ముట్టి నెట్ట చెలరేగ వడిన్

వ. అంతలో

క. కరవాలోద్ధతు లాశ్విక
వర వీరులు ద్రుపదు సేన పరుగున జేరన్
కురు వీరాశ్విక దళమును
తరతమ మేర్పరుప లేక తద్దయు బోరన్

వ. అంత పాంచాల భూపతి సోమకున కండదండలుగా నుండిన రాజధానీ పట్టణ కాంపిల్య నగర వాసు లెల్లరును నానావిధ శస్త్రాస్త్ర శర బాణ గదాయుధ సంపత్తు లు గొనిరా–

క. కురు సైనిక వీర వరుల
వెరపేమియు లేక ముంద్కు వేగమె రావన్
సరగున జూచుచు పాంచా
లురి భీకరు లౌచు జుట్టి అవనికి నెట్టన్

వ. ఇయ్యది ధార్తరాష్ట్రుల మద మదోన్మత్త దుష్కృతముగా నెంచి

క. కటు వని యెంచియు మనమున

పటు తర కౌరవ నికరుల పారగ దోలన్
యెటులని యోజన చేసియు
దిట తరమౌ రణము నెఱపె ధీరోద్ధతుడై

క. శర వృష్ఠిని గురిపించగ
హర హర కురు సేన యెల్ల ఆహవ భూమిన్
తిరు మంత్రము పఠియింపను
వెరపేలను నిలు డంచును వినిచెం గురుడున్

**అర్జునుడు ద్రుపదుని పట్టి తెచ్చి ద్రోణునకు గురుదక్షిణగా సమర్పించుట**

వ. అంత పాండవ మధ్యముండు ఆచార్యుల అనుమతంబున అస్త్ర తూణీరములు గొని ఆచార్యునకుం అన్నకుంనమస్కరించి కౌరవసోదరుల నందరిని ఇందుండుడని భీమ మాద్రేయులం రథ రక్షకులుగా రండని పాంచాల భూరమణు ద్రుపదుంబట్టి తేగలనని తద్రాజన్య వాహినీ సముద్రమున్ తరిమెం, దరికిజేరి ముందరియోధ –

చ. ఘన తర దంతి ఘోటక నికాయము లన్నిటి వెంట నంటుచుం
అను చర ముష్ఠి తండముల నాయుధ పాణుల సర్వ సేనలం
కని విని నేర మెందనగ ఖడ్గ గదాయుధ మేటి వీరులం
అనితల మందు గూర్చిరట ఆహవ వీరులు భీమ సోదరుల్

వ. అత్తరి ద్రుపద సోదరుండు సత్యజిత్తనువాడు కోపోద్రిక్త మానసుండై తనసైన్యంబుల గూర్చుకొని అన్నకు తోడు వచ్చి శత సహస్ర శర పరంపరా నికరంబులనేయుచు భీమార్జున నకుల సహదేవుల కెదురై –

క. పెక్కగు రీతుల దలపడి
వెక్కస పడుచును పరువడి వివిధాస్త్రంబుల్
గ్రక్కుచు ముందుకు రా వి
ల్లెక్కిడి యయ్యర్జునుండు యెంతయు వింతన్

చ. పటుతర అస్త్ర జాలముల బాధిల జేయుచు నెట్టి వారలం
చటుల మహెూజ్వలోద్ధురుత చాతురి జీల్చుచు శస్త్ర పాణులం

దిటవుడు పంచ భూ విభుని తీటడగించుచు పట్టి కట్టియుం
తటుకున దెచ్చి యిచ్చె తగ దక్షిణ యంచును ద్రోణుకు మాటగన్

వ. అర్జునుండు తన యందు గల గురు భక్తి విశ్వాసములతో చేసిన అనన్యసామాన్య విక్రమ పరాక్రమ ధైర్య సాహసంబునకు మెచ్చి ద్రోణుండు ద్రుపదుం జూచుచు నగుచు –

ఉ. సుంతయు దల్పవైతి ముని సోదర భావము నాటి మాటయుం
యింతటి వాడవై మరచి తింగిత మెల్లను రాజ దర్పతం
యెంతటి నీచమో దెలియు మేర్పడె అర్జును నాదు శిష్యుచే
అంతటి గర్వముం మదము అంతము ఆయెనె వింతగాదహో

తే. వీడె నిన్నాళ్ల కోపమ్ము వీడె శిష్య
కట్లు విప్పుము ద్రుపభూపు కరుణ తోడ
చేవ దేరిన నీయట్టి శిష్యుడుండ
యెట్టి పనికైన లోటుండ దేరికైన

వ. ద్రుపదుండు విముక్తుండైనను మనంబు కోపానలంబున దహించుచు దీనికి తగ్గ ప్రతీకారం బెట్లు గూర్తునా యను కోర్కె తోడ బ్రాహ్మణ ఉపాసనా విధి బ్రాహ్మణోపాస్తి ననుసరించి జరుపు చుండె నంత, నిట.

**భీష్ముడు ధర్మరాజుని యువరాజ పట్టాభిషిక్తుని జేయుట**

ఉ. ధర్మజు డగ్రజుండౌట తద్దయు భీష్ముడు పెద్ద లందరుం
నిర్మలుడౌ గుణోన్నతివి నిర్మల మానస బుద్ధి మాన్యునిం
నిర్మొహ మాటులౌ జనులు నిశ్చల చిత్తత పెద్ద జేయుడుం
ధర్మజు యౌవ రాజనుచు తానుగ జేసెను వృద్ధ నేతయున్

వ. అటుల పేరుకు యౌవ రాజ్యాభిషిక్తుం డయ్యును ధర్మజుండు

చ. నలువురు సోదరుల్ దనకు నాలుగు దిక్కుల నున్న యట్టి యా
కలుముల నన్నిటిం కలయ గల్పుచు నొక్కట  చేర్చుచుం వడిన్
వల గొని యెల్ల భూపతుల వావిరి గెల్చుచు కోట్ల కోట్లు పై

విలువగు అర్థ రాశులను పీడితు గావగ జేయు ధర్మముల్

వ. మరియు భీముండు మిక్కుటమగు బల సంపద యందును వివిధ గదాయుధ యుద్ధ విద్య లందును ఆరితేరి నవాడై ప్రసిద్ధి వడయ–

క. శస్త్రాస్త్ర విద్య లందున
విస్తుతుడై అర్జునుండు విఖ్యాత్పరుడై
శస్త్రాన్వితమౌ బహు విధ
అస్త్రోపాసన పరుడై అలరుచు నుండన్

క. యములును బల దర్పితులై
తమ చాటులు లేరనంగ తాలిమి గుణులై
అమితోద్ధతులై విద్యల
కమనీయముగా చెలగుచు కామిత మొప్పన్

వ. ఇట్లు పాండు కుమారు లనన్య సామాన్య గుణ బల సంపన్నులుగా రాజ పూజితులై యెల్ల వారల ఆదరాభిమాన పాత్రులునై పెరుగుచుండ, అర్జునుండ విశ్రమిత సాధన అస్త్రశస్త్రాది విద్యల ప్రవీణుం డగుటయే కాక శూలాసి తోమరగదా ప్రహరణాదుల ప్రముఖుం డగుటయును, మరియు దన వలని గురుభక్తి ప్రయుక్త స్నేహంబులకు మెచ్చి భారద్వాజుండు వానికి బ్రహ్మ శిరోస్త్రంబును ప్రయోగోప సంహరణంబు లన్నియుం ప్రసాదించుచు, ఇయ్యది ముందు అగస్తి మహాముని వలన అగ్నివేశుండునా ధనుర్వేద గురుండును వారినుండినాకును తత్క్రమంబున అర్హుండవగు నీకునురాదొడంగె. దీనినెన్నడును అల్పులయందు ప్రయోగింప వలదు. అట్లుజేసిన ఆ అస్త్రము ముజ్జగంబుల గాల్చు. నీకెగ్గదలపెట్టు వారలయందు ప్రయోగించునది. వారినక్రమంబున సాధించు మహిమ గలదని పల్కుచు మరియును నీవు నాకిచ్చు గురుదక్షిణ యియ్యది సుమ్మాయని–

క. నాతో దలపడి యెపుడు
న్నృతి యుద్ధము చేయనంచు ప్రతినం గొనుమీ
నీతోబుట్టుల తోడుగ

చేతో మోదంబు గదుర చింతయు తొలగన్

వ. అన వల్లెయని యాచార్యునకు నమస్కరించి యొడం బడి యుండు నంత, దుర్యోధనుండు పాండు పుత్రుల పరాక్రమములకును, యుధిష్ఠిరు యువరాజ పట్టాభిషిక్తంబునకును సహింపక యీర్ష్యాళువై కర్ణ శకుని దుశ్శాస నాదులతో మంతనములు నెఱపి—

తే. ఏమి చేయు వాడ ననుచు యీ విధి పరి
మార్ప, యౌవ రాజని ధర్మ నేర్పరించి
పల్కె తండ్రియు తాతయు ప్రజలు గూడ
రాజు నగు త్రోవ సెలవిండు రాజ నీతి

వ. రాజ నీతి కుశలుండును సౌబలు నాప్త మంత్రియునైన వృద్ధుడొకడు కురు వల్లభుని కిష్టముగ నిట్టు లనియె.

తే. రాజు ధర్మంబు వీడని రాజ్యమందు
దండ నీతికి జడిసి ఉద్దండు లెల్ల
సర్వ జనములు సమ పాళి సఖ్య తెరిగి
శాసనాత్మక వర్తన శాంతు లౌద్రు

తే. అహితు లగు నట్టి వారల నవని విభుడు
స్వపర భేదమ్ము యెంచక సమత బుద్ధి
సతి సుతుల నైన గురునైన శాస్త్ర విధిని
మట్టు బెట్టను నౌకదా మహిత శక్తి

తే. కార్య కారణ విదుడౌచు కామ్య విధుల
గతము నెంచక సువిశాల కార్య సిద్ధి
ఏరి సద్బుధ మతి మంతు లెవరి తోన
విషయ చర్చలు సలుపంగ వలయు సుమ్మ

క. తన బలము నెదిరి బలమును
మనమున చింతింప కరుల మర్దించుటకై

కొనగొనిన వాని కోటమి
తన వెంటనె నంటి యుండు తథ్యము సుమ్మా

తే. దుష్ట భావ పరులైన దోషగుణుల
దేశ కాలాను వర్తన ధీర బుద్ధి
మట్టు బెట్టుట పాడియౌ మాట దెలియు
ఆత్మ రక్షణ దక్షుడౌ అవని విభుడు

తే. దేశ పాలన కుపయుక్త ధీర వరుల
అండ దండలు కూర్చుక నవని యుక్తి
సామదానాది చతురమౌ సామ్య విధుల
శత్రు మడియింప రాదుకో సమయ ఫక్కి

తే. అలయ కెంతయు పర సీమ అవని పతుల
గుట్టు మట్టును దెలియను దిట్టలైన
చార చక్షుల నియమించి చతుర వృత్తి
మంచి చెడ్డల బహు దూర మెంచ తగును

తే. పార మార్థత దేవతా పర్వ సీమ
చుట్టి తిరిగిరా వాహ్యాళి మిట్ట నేల
లెట్టి తావుల కైనను యేగు నపుడు
శోధ జేయుచు జన కోటి చూడ నౌగ

తే. మంత్ర తంత్రాంగ విదులైన మాననీయ
నీతి శాస్త్రజ్ఞ నిపుణులౌ నిష్ఠ తోడ
సమయ ఫక్కిని మెప్పించి సర్వ జనుల
రాచ కార్యాలు దీర్చనౌ రాజు లరయ

తే. ఆడి తప్పుట సుంతయు పాడి గాదు
సూటి పోటుగ లేదను టేటి మాట
నమ్మ బల్కియు యెంతన వమ్ము సేత

అవని పతులకు తగదయో ఆత్మసాక్షి
తే. అమిత మిత్ర విరోధముల్ హానికరము
దురిత దుర్నన స్నేహంబు దుస్సహంబు
శేష శత్రుత్వ అగ్నులు క్షేమమగునె
అల్పు డౌనంచు నపకారి నిల్ప తగదు

వ. కావున సర్వ ప్రకారంబుల రాజ్యాధికార కార్యక్రమముల పట్ల తనకు గాని వారల బంధుమిత్ర సంబంధ మెంచ క ఆత్మ రక్షాపర తంత్రుడయి యుపేక్షించకదూరంబు చేసి మట్టు బెట్టుట యుచితంబగు రాజనీతి యగునన విని సుయోధనుండు చింతాపరుండయి తండ్రి కిట్లనియె.

క. అరుదై దోచెడి మనమున
వెరపేలనొ కుంతి సుతుల వీరత కెక్కన్
పుర జనకోటి సహితమును
పెరవారల మట్లు దోప పేరిన భీతిన్

వ. అదియునుం గాక

క. యువరాజ్య పట్ట మీయను
కువ కువ యెంతయు ముదమున కుంతీ తనయుల్
నవ శక్తుల గర్వితులై
యేరిని లెక్కింప రైరి యెంతయు వింతౌ

వ. మరియును

క. మిమ్ముల తాతను గూడను
అమ్మో యేమని పలుకుదు అనిరిటు పలుకుల్
మమ్ముల గూడను ఆవల
పొమ్మని రందరి యెదుటన పూనిన కినుకన్

వ. వెయేల మిమ్ముల ప్రజా చక్షు వనియుం, పితామహుడు సర్వ సమర్థుండయ్యును రాజ్య భార నిమగ్నంబున కృత నిశ్చయుండగుటయును మిమ్ముల మీమీ అభీష్టా

ను భవ పరులుగా జూచుడు. విదురుండును సమ్మతించు ననియుం దానతా మేమి చేసినను అడ్డు దగులు వారుండ రనియుం, పాండవాను రక్తులైన సామాన్య జనా నీకంబుల పలుకులే వినవోప నన ధృతరాష్ట్రుండు రాజైన వాడు రణరంగమున వీర స్వర్గ మలంకరించుట వలన కాని, పుత్రు లైన వారికి రాజ్య భారమప్పగించి వనము ల శాంత చిత్తులై తపంబాచరించుట వలన కాని స్వర్గ సుఖము లంట నేరవు. రాజ య్యెడు వాడు స్వయముగా రాజ్య భారము తాను దాల్ప సమర్థుడు గానుండ వల యు. ఏను షడంగ సహితముగా వేదాధ్యయము గావించి అర్థ రాజనీతి శాస్త్రము లందు కృత నిశ్చయుండనై బలంబు కల్గియుం, చక్షు అంగ వైకల్యంబున రాజ్యాంగ బద్ధమైన రణ తంత్ర చక్రవ్యూహములకు ప్రతిచక్ర వ్యూహ రచనాదుల నసమర్థుండ కావున యీ రాజ్యాధికారమునకు దగకున్న, శాస్త్రవిధి విధాన క్రమంబునయీ రాజ్యా ధికారమునా తమ్మునిదే. అయినను–

క. తమ్ముడు పాండుడు భక్తిని
సమ్మతి నను రాజు అంచు సదయులు మెచ్చన్
నమ్మిక మోయుచు భారము
యిమ్మహి కప్పంబ్లు గొనుచు యెంతో ప్రీతిన్

వ. నాచే యెన్నియో యజ్ఞ యాగాదులు చేయించిన గుణ సంపన్నుడు. పాండవు లును తండ్రిని మించిన భక్తి గుణసంపన్నులు మరియును ప్రజానురంజనులు.వీర వరేణ్యులు. వారిని కాదన పాడి గాదు, పెద్దలెట్లు సమ్మతింతురన సుయోధనుండు.

క. ఎంతయు బేలవు తండ్రీ !
చింతింపవ దేమొ మాకు జేయగ మంచిన్
ఎంతం జ్ఞాతులు పాండవు !
లంతా మన మంచి కనుచు అనుకో దగునే

క. పంతాలతొ నీ జ్ఞాతులు
లెంతని సహియింతు మయ్యు ఇజ్ఞిత పరతన్
యెంతయు జూచుడు చురచుర

వింతగ యిటు కూర్చొనుంట విజ్ఞత యౌనే

వ. అదియునుంగాక నీవు రాజ్యార్హుండవు కానంత మాత్రంబున జ్యేష్ఠవారసత్వము నాకు చెంద కుండునా? ఇక్కురు రాజ్యంబు మాకు గాక పాండు రాజు రాజై వ్యవహరించిన మాత్రంబున క్రమాను గతిని రాజ్యాది పథ్యంబు వారి సంతతి వారలకే సంక్రమించు నెడ మేమును మా ముందు తరముల వారెల్లరును అస్వతంత్రులమై దాయాదుల దయా దాక్షిణ్యంబులపై ఆధార పడి బ్రతుక వలసి వచ్చును. తండ్రీ ! అట్లు కాకుండ జేయనను పంతంబు గలవాడ వగుదువేని ఆ పాండు పుత్రుల యందు ప్రీతిని దయను విడనాడుము. ఈ రాజ్యము మొద లంట నీది. తరువాత మాది కావలయు. కావున యెట్లయిన పాండవులనిం దుండకుండ జేయ నగుట ప్రస్థుత కర్తవ్యంబు. తండ్రీ ! తొలుత నీవిందుల కొడంబడినచో నీ మీది విశ్వాసముతో భీష్మ విదురులు, క్రమంబున కృపద్రోణ అశ్వద్ధాములు ఒడంబడుట నిశ్చయమని యొప్పింప, దుర్యోధనుండు మంత్రులం బిలిపించి ధృతరాష్ట్ర సన్నిధిని, మీర లెట్టులైన పృధానందుల ప్రియ వచనంబుల యిందుండకుండ వారణావతమున కేగు నటులచేయంగల వారలన, ధృతరాష్ట్ర మాటను కాదనలేక తద్విధపన్నాగముబుల కొడంబడి వారలు.

తరలము: వరుణ అశీజల ఆవృతంబది వారణావత పట్టణం
ఘనతరంబగు పుర వరంబది గంగ యొడ్డున యెన్నగం
వనచయమ్ముతొ శుక పికమ్ముల వాసయోగ్యపు నేలయుం
ముని జనమ్ముల మౌని వర్యుల మోహనంబగు తావలం
బనుచు జెప్పగ విందు మెప్పుడు బహు జనాళుల సంగమం
అన్న పూర్ణమ తావలంబది అవని యందున పుణ్యమౌ
ఇహ పరమ్ముల ఈప్సితార్థము విశ్వనాథు నివసితం
కాశికాపుర నివాస మెంతయు కనుల పండువ చూడగన్
అనుదినంబును పుణ్య జనులకు ఆలవాలము పన్నుగాన్
మిన్నుముట్టెడి హర్మ్య రాశుల తన్మయంబది కాశియుం

తన్ను నమ్మిన వారినెల్ల దయను బ్రోచెడి శంభుడుం
వరున అశీజల ఆవృతంబది వారణావత పట్టణం

వ. అని బహు ప్రకారంబుల మనసు గొను నట్లు వర్ణించి చెప్పుట వలన ఆకృష్ఠులై పాండు పుత్రులు ఉన్నెడ కొంత కాలమైన తరువాత దుర్యోధనాదుల ధూర్తవర్తనా ప రతంత్రంబు లపార మెరుంగక పాండవుల బిలిపించి ధృతరాష్ట్రుండు–

ద్వి. రమ్య రాజిత నిర్మితంబగు హర్మ్య మందిర కుడ్యమం
పారమార్ధుల పాపహరణము వారణావత క్షేత్రముం
శుభము శోభిత శోభనం చూచి రండని వేడ్కతో
అంబికా సుతుండనియె నొక్కెడ అనుగు పాండుని బిడ్డతోన్

ధృతరాష్ట్రుడు పాండవులను వారణావతము నందుండి రమ్మని పంపుట :

వ. అందుండి కొంత కాలము వినిర్మల మనస్కులై ప్రతిదినమును ఆపుణ్య భాగీరదీ జలంబుల స్నాన మాచరించు చు పరిశుద్ధులై, పరలోక గతులైన మీమీ పిత్రు ప్రపి తా మహాది పెద్దల కందరికినీ జల తర్పణము లొనరించుచు గోహిరణ్యాదిదానము లొసంగుచు బ్రాహ్మణుల పూజించుచు మాతామాత్య బంధు జనంబులతో సఖంబుం డిరా పనిచిన పాండవులు భీష్మాది గురు జనంబులకును గాంధారీ ధృతరాష్ట్ర విదు రులకును మ్రొక్కి దుర్యోధనాదుల ప్రియ పూర్వకంబుగా సంభావించి వృద్ధ భూదేవు లకు నమస్కరించి వారల వలన పునః సమాగమాశీర్వాదంబులు గొని జననీసహి తంబుగా వారణావత పురంబేగ ఉన్ముఖులగునంత దుర్యోధనుండు తన తండ్రి యె రుంగ కుండ. తన కార్యము నెరవేరుట కనువౌ వారల నెమకుచు అనుచర గుణు డౌ వనచరు నొక్క పురోచనుడను వానిని బిలిచి అనునయ మాడిన్, నీవు నా వాడ వు కావున అతి రహస్యంబైన కొండొక బృహత్కార్యము నీచే కావలసి యున్నది. అం దులకు నీవొ క్కండవే సమర్ధుడవు. పాండుకుమారులు వారణావత మేగుదురట. కా వున అంతకుముందుగా నీవచటి కేగి ఏకాంతముగా వారుండుట కన్ని విధములా రాజోచితమైనఅనేకానేక వర్ణ వర్ణిత సదృశంబైన లక్క యింటి నొకదాని నతిరమణీ

యముగానాయుధ వంటశాలా మధ్యమున నిర్మించి పాండవుల నందుంచి నమ్మిక దొరకొన్న కొండొక కాలంబైన తదుపరి వారలు యేమరియుండుతరి యొరులెరుంగ కుండ నద్దాని భస్మీ పటలంబు చేయునది.

క. ఈ కతమున కురు రాజ్యము
నాకేకాధిష్ఠిత మగు నిశ్చయమటుపై
నీకౌ కార్యము లెల్లను
చేకురు నా శత్రు వినాశ సిద్ధియు కూరున్

వ. అని యెర పెట్టిన పురోచనుండు వారణావతంబున కేగి లాక్షాగృహము నిర్మించునెడ శతశృంగముల నుండి వచ్చిహస్తి పురంబున కౌరవుల తోడన గూడి సమస్త విద్యా పారంగతులైన యాపుష్కర వత్సరముల కాలవ్యవధానమున ఇన్నాళ్లకు నూతన యౌవనాంకురులౌ ప్రాయంబున వారణావతమునకు జననీసహితముగా పోవుటకు రధంబు లెక్క హస్తిన యందలి సమస్త జనానీకంబులునుమనోవేదనులై–

సీ. ఏమి కార్ణమేమొచ్చె యేల పాండు సుతులు
హస్తి విడిచి యేగ వాస్తు మేమొ
భీష్మ విదురులంత భీష్మింప లేదొకో
వృద్ధ రాజు నెడల బద్ధులౌచు
దుర్యోధనాదులు దుర్మార్గ బుద్ధేమొ
ధర్మ మెట్టున్నదో తరచి చూడ
తండ్రి వారస మెన్న తనయులకే కాదొ
రాజ్య పట్టము ధర్మ రాజు కగునె

తే. అన్న మాటకు కాదని యెన్నడైన
మారు మాటాడి యెరుగరు మాన్య బుద్ధి
భీమ అర్జున కవలును వీరులైన
యేమి కాగలదో ముందు యేర్చి చూడ

వ. నంచు వారివెంట వచ్చు నెల్లర నూరార్చి పెద తండ్రి మాట కాదన లేకిటు వారణావత పట్టణ మందుండి రానే గుచుంటి మని వారల మరల్ప విదురుం డొకింత దవ్వు వారల వెంట నేగుచు యెవ్వరు వినకుండ వారణావతంబున వారుండి యెట్లు మెలగునదియును వివరంబుగా పల్కివారల కౌగలించుకొనికుంతీదేవికి మ్రొక్కి పాండు రాజుం దలంచి భాష్ప పూరిత నయనుండై క్రమ్మరించిచనునంత కుంతి ధర్మరాజు వద్దకు వచ్చి –

ఆ. మంచి చెడుయు రెండు మనదగు రీతుల
ఒరు లెరుంగ కుండ ఒంటి జేసి
విదురు లేమి దెల్పె విశదంబు గాకను
తెల్ప నైన తెల్పు తేట పడగ

వ. అని అడిగిన తల్లితో ధర్మరాజు, విదురుడు తెల్పిన అభిప్రాయమిట్లు దెల్పె.

ఆ. ఎల్ల కార్య గతులు యెరుగుదు రయ్యెరో
చెప్ప వలయు గాన చెప్పుచుంటి
కాని పనులు జేయ కాంక్షింత్రు కౌరవుల్
యెగ్గ చేయ నెంత్రు యేమనందు

వ. కావున, మీర లేమరక విషాగ్నుల ప్రమాదంబుల వలన అప్రమత్తులై సర్వకార్య సర్వావస్థల యందున గుట్టు చెదర కుండు నట్లు మెలగ నగు. మరియు నే దుర్యోధనాదుల గుట్టు మట్టు లెరుంగుచు ప్రతీకార విధంబును రహస్య విధి నెరింగించు చుందునని పల్కెనన కుంతి కన్నుల నీరు నించు కొనుచు ప్రీతిపాత్రుండగు విదురుని నెయ్యమునకు సంతసిల్లు కొనుచు కతిపయప్రయాణంబుల కొన్ని దినంబులకు వారణావతము చేరునంత.

సీ. ఆనంద ముప్పొంగి అందరందరు గూడి
వేగ వచ్చి యెదుర వేడ్క నిల్వ
పాండు భూవిభు పత్ని పాండుపుత్రుల తోడ
అందలంబులు డిగ్గి ఆదరంబ

రంగ వల్లులు వెల్గు రాజ మార్గము లందు
వేడ్క యెంతన దోగి వివశులగుచు
వారణావత పట్ట విభవంబు యెంతనా
జూచు వేడ్కతొ నొప్పు జూచు వార్ని

తే. కనుల పండువు కాగను కనుల ముందు
ధర్మ తేజంబు విరియనా ధర్మ విదుల
రూపు రేఖలు జూచుచు రేపు మాపు
తన్మయత్వంబు చెందుచుం తరలుచుండ

వ. పాండు కుమారులు వారణావత పురీ భూసు రాశీర్వాదములు గొని అష్టమి రోహిణి కష్ట దినంబున సర్వాలంకార శోభితంబైన రాజ మందిరమున ప్రవే శించిన పురోచనుండు వచ్చి తాను జేసిన ఆ మందిరముం జూప సంత సిల్లి పురో చనా శిల్పాచార్యుని పూజించి అనేక విధ సత్కారముల సంతుష్ఠితుం జేసిపంపి ధర్మ రాజు మాయోపాయ పరేంగితావగాహనా ప్రవీణుండైన భీమునితో ఈ భవన ముప లక్షించి చూడ నాద్యంతము కృతక కుడ్య సంవిధాన దగ్ధభూయిష్టంబగు యాజ్యతైలా ర్ద్ర వివిధ లక్కాపరిశృప పదార్ధ సమ్మిశ్ర నిర్మితమై చూచుట కెంత యు రమణీయము గా కన్పట్టు చున్నయది. కావుననే కాబోలు.

క. తన మనమున అనుమానము
జనియించుటచే విదురుడు జననీయుతుడా
కననౌ గా దీని తెఱగు
అని వినిచెను జాగ్రతంచు అనుజులు నీవున్

వ. అనినంత

ఆ. ఇట్టి దేని మనము యిందుండ నేల
అందరున్న చోట కరుగ నవదె
అగ్ని భయము దోప అభయుల మయ్యుంట
పాడిగాదు మనకు వీడ దగును

ఆ. ఎరుగ నైన దీని యేమర కుండ
గుట్టు మట్టు దెలిసి యెట్టులైన
మంట బెట్ట నవదె మధ్యంతరముగ
ననుచు బల్కె భీముడన్న తోడ

వ. ఈ దగ్ధ గృహ ప్రకారము మనమెరింగి నట్లు పురోచనుం డెరిగె నేని దుర్యోధ నాదులు కృద్ధతం ప్రవృద్ధంబైన పగతో వేరు వేరు దుర్మార్గము లాలోచించి వెన్నంట క మానరు. మరియును భీష్మ విదురుల విధములు తెలియ రాకుండు నంత దనుక తొందర పడుట భావ్యము గాదు. కావున కౌరవుల మార్గము లరయు టుచితము.

ఆ. చెడ్డ బుద్ధు లెపుడు చెరుపు జేయు నిజము
పాము వోలె యెపుడు పాప మనక
దోష బుద్ధు లౌచు దూషింత్రు నితరుల
అగ్గి రగులు కర్ర అవదె బూది

వ. ఎవరు జేసుకున్న పాపము వారనుభవింపక తప్ప దనుచు

ఆ. పగలు వేట లంటి పదపడి యడవులన్
యింట బైట గూడ యెంతొ యెంతొ
జాగరూకు లగుచు చరియించు చుండియు
అప్రమాదు లౌచు అహరహంబ

వ. ఇట్లుండ కరి నగరంబున విదురుండు దుర్యోధను దుస్తంత్రంబు లెరుంగుచు విశ్వాస పాత్రుండగు నొక్కఖనకుని రావించి వారణావతంబున నున్న పాండుపుత్రు లెరుంగు నట్ల అభిజ్ఞానమగు పల్కులం పురోచనుడీ అమవసనాటి అర్ధరాత్రంబున లక్క యింటిని దగ్ధంబు గావించు ననుట నెరింగించుచు అందుండి తప్పుకో నగు అతి గోప్యంబగు బిల మార్గ మేర్పరించి వారల కెరింగించిన,భీముడద్దాని క్షుణ్ణముగా పరిశీలించి యున్నెడ–

ఆ. అరిగె నారు నెలలు ఆ కుంతి తనయులు
వారణావతంబ వాసు లగుచు

దాన ధర్మ విదులు తథ్యంబు నెఱపుచు
బీద సాదు జనికి భోజ్న మిడుచు

వ. నాడు అమవస పుణ్య దినంబు కావున కుంతి సకల భూ దేవాది సకల జనం బులకు దానము లిచ్చి అన్న సంతర్పణము గావించి యున్న పురోచనుండుంచిన అ మాయకపు నిషాదు వనిత కుంతీ మాతకు సాయ పడు చున్నట్లు పనులదీర్చుచు యెప్పటి కప్పుడు పాండవుల విషయంబులు రహస్య చారణ చేయుచుండునది. నా టి రేయి తానును పిల్లలైదురు తోడను తప్ప తాగి మేనెరుంగకఅందు నిద్రించె. విష య మెరిగిన భీమసేనుండు పురోచనుని కంటె ముందుగనే వానిని శయన గృహము న బంధించి ఆయుధాగారము తోడను వంటయింటి తోడను సమస్త లక్కా గృహము దగ్ధ మగునట్లు నలుగడల మంట బెట్ట ఖనకునికిం జెప్పి రహస్య బిల మార్గమున నిద్రించు చున్న తల్లిని తమ్ముల అన్ననుం గూడ భుజస్కందమ్మున మోచి కొనుచు–

ఆ. రాయి రప్ప యనక రాత్రంత నడచుచు
తెల్లవారు సరికి తెరలి వేగ
కండ బలము మిగుల గర్వోన్నతుండౌచు
అడవి తోవ బట్టి అరుగునంత

## లాక్షాగృహ దగ్ధము

వ. వారణావతంబున తెల్లవారు సరికి జనాధికముగా పొక్కిన మాట.

క. విననై చూడగ వచ్చియు
అనలము దరి గొన్న గృహము ఆహుతి యగుటన్
అనుపమ తేజులు పాండుని
తనయులు కుంతీ సహితము దగ్ధంబయిరన్

వ. మాటకు నిశ్చయము కుదురమాడి మసియైన ఆరుప్రేతములం జూచుచు విచా రించు చుండుటయును ఖనకుండు పౌరులతో కలసివచ్చిన వాడు పోలె వచ్చిబిల మార్గమును కప్పి పోయి కరి నగరంబునకు వచ్చి విదురునితో సర్వవిషయంబులం దెల్ప వారణావత పురీ జనములు –

ఉ. సూరలు సుందరోద్ధతులు సోదరు లైదురు తల్లి తోడుతన్
మారణ హెూములై యిచట మానుగ భూరి విషాగ్ని దగ్ధులన్
ఘోరము హస్తికిం దెలుప కోవిద పెద్దలు వారణావతుల్
కౌరవు లెల్లరుం వినగ కర్జము దీర్పను సద్గతి క్రియల్

వ. ఆ దురిత వార్త వినిన ధృతరాష్ట్రుం డుల్లము తల్లడిల్ల ఆక్రందింప అంతఃపుర స్త్రీ జనంబు లెల్లరును పెద్ద పెట్టున గోడుగోడున విలపింప కురు వృద్ధ భీష్ముండును గురు పుర జనంబులును శోకాక్రాంతులైరి. విదురుండు పాండవులు కుశలురై యుం డువారని యెరింగియు యెరుగనట్లు పైకి దుఃఖా కులితు మాడ్కి పొక్క ధృతరాష్ట్రుడు కౌరవ భ్రాత బంధు జనంబు లెల్లరుం కుంతీ పుత్రు లెల్లరుకును ఉదక దానంబు లాచరించి ఉత్తమలోకగతి వర్తన క్రియలెల్లను గంగాతీరమందు నివర్తింప అధిక ధనంబు లిచ్చి తగు వారలం బంప పాండవులను పంచత్వపాలు జేసినందులకు లో లోన సంతసించుచు దుర్యోధనాదులున్నెడ, సోదర పాండవులు తల్లి కుంతి తోడన భీముండు –

క. గంగోత్తర దక్షిణ దిశ
నింగికి యెదిగిన అడవుల నిలకడ లేకన్
ముంగల కేగుచు వడివడి
శృంగారంబౌ తటివట శాకాచ్ఛాయన్

వ. విశ్రమింప జేసి నీరు గొనిరా ముందున కేగుచు

చ. అధరము ఝిల్లనన్ మనసు హాయను తీపుల కాస్పదోద్ధతిం
మధురస శీతలోదక సమాన్విత మాధురి కమ్మ కమ్మనై
మధుపమ తీగలం యొడుల మత్తిల జేసెడు పుష్ప వాసనం
పధికుల కెల్ల దాహ సమబాధలు దీర్చు సరోవరంబటన్

వ. నొకటి చూచి దప్పి దీర పానీయముల్ గ్రోలి స్నానమాడి కమల పత్రములు దొన్నెలుగా జేసి సలిలముం దెచ్చు నంతకు–

క. ఇనుడస్త్రాద్రిని యొరుగగ

కనుచీకటు లావరించు ఘడియల లోనన్
పెనుడస్సిన జీవ తతులు
అనువౌ తావుల దొరకొను నవసర నిద్రన్

క. నిశితర రాక్షస గణములు
పిశితాహారపు మృగములు విచ్చలవిడిగా
అశనము కొరకై తమకత
కశి దీరగ రాత్రులందు కదలాడ్డిరుగన్

వ. అట్టి రాక్షస నిశా సమయ రాత్రంబునం గూడ తానున్నానను ధైర్య నిర్భీతులై ఆ వట వృక్ష పులిన తలంబున అవిశ్రాంత గమన శ్రమాయాసులై ఆకలిదప్పులు లెక్క చేయక తెలివి దప్పి నిదురించుచున్న ఆ అమ్మా యన్నదమ్ములం జూచుచు కటకటంబడుచు భీముడు నిద్రాభంగము సేయ నోపక తమంత తాముమేల్కొన్నతరి నీరు ద్రావి దప్పికనపనయింప గలరని కాచుకొని యుండి మనంబున.

క. తెలివిగ మెలగుచు మమ్మిటు
ఇలు వీడియు పోవు నటుల యేర్పాట్జేయన్
కుల కీర్తులు జేయు పనియె
తులువ తనంబనుచు లోన తోచదె మదికిన్

వ. దగ్గరగా మెలగుచు అశ్రయోదాయ బుద్ధులై మోసకారి చుట్టము కంటె దూరస్థమైనను శ్రేయోదాయకమై ప్రియముగా మెలగు చుట్టము లుండు వారే ధన్యుల రనుచు పెద తండ్రి ధృతరాష్ట్రుని వాని తనయుల కల్లబొల్లి బాంధవ్యమునుతలంచుచు

క. అమ్మను అన్నను దమ్ముల
యిమ్ముగ నిద్రించు వార్ల నేమర కుండన్
కమ్మని నిద్దుర మానియు
సమ్మతి నా భీముడుండ చాలగ దలచిన్

వ. అంతనా అర్ధరాత్రంబున –

క. నరవాసన నరవాసన

సరగున రారమ్మటంచు సత్వర మనుచున్
నరులీగతి రానేమొకొ
సురుచిరమౌ తావి గనుమ సోదరి నీవున్

క. అశ నాశత జూసటునిటు
పిశితాస్న దనుజ హిడింబ్డు వీరల జూపిన్
వసివాడని నర జీవుల
పిశితము లీనాట్కి గూడె పీకలు నులిమిన్

క. అసహాయుల నడి రేయిని
యిసుమంతయు జాగులేక యిను రాకడమున్
రసమయ పదార్థ తతి ర
మ్య సమన్వయ వంట వండి అన్నకు యుడుమీ

వ. అని పనిచిన హిడింబ సత్వర సమన్వితయై వారల డాయంబోవునది ముందు-

క. నడిరేయిని నిదురించక
పడిగాపుగ నిల్చునున్న బలదర్పితునిన్
కడు సంబర పడి జూచుచు
గడుసరి తా రూపుమార్చి కామిత వృత్తిన్

మ. ఘన వక్షస్థల దీర్ఘబాహు యొడిలో గాంధర్వ వైవాహికం
బని యీ మన్మధు జేరగా వెడలుదే నారాధ్య చిత్తంబునన్
ఘనుడౌ యీతని భార్య నేనగుదునా కాంతా సరోజాక్షితో
అనిలాశూనుడు అచ్చరో యెవర వీవం చేర్పడం బల్కగాన్

వ. ఏ నీ ఆటవిక రక్కసుల కధినాయకుండైన హిడింబాసురు చెల్లెలు హిడింబను. మాయన్న మిమ్ములం మున్నె జూచిన వాడు.మిమ్ముల జంపి రుచిగా వండి దెమ్మని నాకనియె. మీరలెవ్వరో నాకు దెలియదు. తెలియకిందురా, నమాయకులవలె యను కోవలె. నిన్నూచిన తోడనే ప్రప్రధమముగా కామపీడితనై నీయందు నామనసు లగ్న

మై యున్నది. నామది దోచిన మహనీయుడవీవే. నీయనువర్తినై మెలగెడుదాన. నన్నే లిన నాయన్న నిన్ను మన్నించు. లేకున్న, నిన్ను నీవారల నిలువనీడు. వాని లావు నీ వెఱుంగవు. సురాసురునైన గణింపడు. నూరుయేనుంగుల నైన ఒక్కుమ్మడి క్రిందు ప రుపనోపు. కావున నాకు పతివై ప్రాణంబులు రక్షింపుకొనుము. నావలన యిష్టోప భోగము లందుము. నేకామ చారిణిని. నీకిష్టంబైన చోటికి నిన్దోడ్కొని పోదు రమ్మన్న, భీముడామెతో-

క. మీ యన్న హిడింబ్కు జడిసి
మాయమ్మను అన్నదమ్ము మాన్యుల విడిచిన్
నీ యను మాటల వెంబడి
చేయుదునే పాడి గాదు ఛీ పొమ్మనగాన్

క. అన్న హిడింబుడు వచ్చిన
నిన్నును నీ తోడ నన్ను నిలదీయుచు నీ
అన్న దమ్ముల నందర
కన్నుల జూచుచునె జంపు కడు రభసమునన్

వ. మరియును నిన్జూచినది మొదలంట నా మనసు నీనుండి మరల కున్నది. సరిక దా నీపై మక్కువ పిక్కటిల్లు చుండె. ఏనాటి కర్మ బంధమో యేమో? నీ పెట్టనై పుట్టి తిని కాబోలు. ఏమి సేతునన-

ఉ. ఒక్కడె అందువా వినుము నూర్జిత శక్తి హిడింబు లెందరున్
నిక్కము నిల్వ నేరరని నిక్కము జత్తురు రక్కసాధముల్
గ్రక్కున వచ్చిరేనియును కాదను వాడను కాను నేమరిన్
మక్కువ కల్గు దానని మాటలు జెప్పిన నమ్ము వాడనే

వ. అనుచు వితర్కించు చున్నెడ కాలయాపన యగుడు నరమాంస ఖాదన మాధు రిం మది దలంచుచు చెల్లెలు హిడింబ రాక నుద్దేశించి సహింప నేరక -

సీ. బహు కోప కోపిత బండబారిన దంష్ట్ర
విధ్వంస కర దుష్ట వింత యసుర

పెను భూత దేహుండు పెన్గాళ్లు సేతులుం
బహు గొప్ప ఉదరుండు బాహు బలుడు
కార్నెనుమును బోలు కార్నలుప్పు మేన్ఛాయ
రూక్ష కషాయితా అక్షువాడు
ములుకు సూదుల వంటి మూతి మీసము వాడు
చెలగి దిక్కుల రేపు చెవుల వాడు

ఆ. గాలి దూల వచ్చె కాలాగ్ని రుద్రుడై
ముందునున్న భీము మోము జూచి
జాగు సేయ నేల ఝూమైన రావేల
ఏమి చేయు చుంటి వితని తోడ

ఆ. నాదు పనుపు మాన నీకేమి యయ్యెనే
చావ జేతు నిన్ను యెవడు వీడు
అడ్డ పడగ రావ నవనిని ద్రోయనే
ననగ భీము వెనుక నతివ జేర

ఆ. మరువు జొచ్చి నాదు మర్యాద నెంచక
దనుజ కాంతవౌచు మనుజు గూడ
ఎంత వెఱ్ఱివౌదు వీవంచు దలచునీ
అన్న లావు యెరుగ దన్నువాడ

వ. అనుచు నా దనుజుండు చెల్లెలు హిడింబ మీద చేయి చేసుకో బోవునంత.

ఆ. భీతి తోడ దాగు భీతాంగనుం గావ
అసుర చేయి నులిపి అవని దోయ
అహము దెబ్బ తిన్న ఆహిడింబాసుర్డు
భీము దాకి గుద్దె వీపు మీద

వ. అంతట నా వాయు నందనుం డయ్యర్ధరాత్రంబున తన వారికి –

క. నిద్రా భంగము యగునని

భద్రగతిం తేన్విడింబు పది బారలపై
అద్రి తలంబున కీడ్చుచు
పెంద్రుమ మాని కొన దాల్చి భీకర ముష్టిన్

క. పడ దన్నియు యెడ మీయక
పిడి గుద్దులు గుద్ది గుద్ది భీతిల జేయన్
కుడి కాలిని మెలి బెట్టుచు
పడగొట్టియు భీము దన్నె బాయని కినుకన్

## హిడింబాసుర వధ

వ. ఇట్లా భీమ హిడింబు లిర్వురుం మదమత్త గజంబులభంగి యొండొరు దలపడి మల్ల యుద్ధ గతులై యున్నెడ–

క. కుమ్మను ఝుమ్మను శబ్దము
యిమ్ముగ నాకశము దాక యెంతయు పాకన్
యిమ్మహి దద్దరిలంగను
దమ్ములు బిగియించి బోర తరతమ గతులై

వ. వినవచ్చు ఆరణగొధ్వని ప్రతిధ్వన ధ్వానంబులు వినరా కుంతియు పుత్రులును మేల్కొని అటు నిటుం జూచుచు–

ఆ. ప్రక్క నసుర రూప పద్మాక్షినిం జూచి
యక్ష నాగ దేవ యక్షి బోల
యెవరొ యిదియ యంచు యెరుగంగ అడుగనా
యంబ పల్కె నే హిడింబ ననుచు

వ. మరియు వినుండియ్యది నరమాంసక భక్షణ దక్షుండైన హిడింబు డను వాని ఆటవిక సామ్రాజ్యము. తెలియక యిందేలనో జొరబడి నిర్భీతులై నిద్రించుచున్న మిమ్ముల జూచి కాబోలు మీకహితంబుగా పల్కుచు వండి వడ్డించునదిగా మాయన్న నన్బంప వచ్చి చూచునంతకు మీ సామీప్యంబున –

సీ. నూనూగు మీసాల నూత్న యౌవనుడౌచు

ఆడ మనసులు దోచు అందగాడు
కండ జబ్బల తోడ కామన ప్రియమౌచు
చూపుల కింపైన సోకువాడు
ధీర సూరత నొప్పు దేదీప్య తేజంబు
ముఖసిరి వెల్గెడి మోమువాడు
పంతగించుచు రావ పగతుర దెగటార్ప
జంకు లేనట్టియా జాంబ వదుడు

తే. దండి మగటిమి యెంతనా కండ బలిమి
భీతిలేనట్టి యెంతొ నిర్భీత శక్తి
నిశిని నిశ్చల చిత్తుడై నిలచు నొకని
జూచి మోహన పరతనై జూచుదాన

తె. వచ్చి చూచుడు నాయన్న వహ్వా యనుచు
హెచ్చు మీరిన కోపాన పెచ్చు పెరిగి
చెంత నున్నట్టి ఆ భీము చేరి జీర
అల్ల జరుపుచు నున్నారు మల్ల రణము

తే. పోయి జూతము రమ్మన్న పోయి జూడ
రెండు కొండలు ఢీకొన్న దండి విధము
కుమ్ములాడుచు రణభూమి దుమ్మురేగ
చూడ ముచ్చట యెంతనా జోదు లిరులు

తే. కండకావర మెంతనా గుండె దిటవు
దండ తాడన భుజ బలోద్దండు లగుచు
సంగరోద్ధతి పెనగ నుత్సంగులీల
భూన భమ్ములు రెండునుం భోరులెత్త

క. రమ్మిటు రారమ్మను చిరు
కుమ్ముకు పెనగచును బోర కుడి యెడమలకున్

యిమ్ముగ నాడీ పట్టులు
దిమ్మిల నొక్కుచును వేళ్ల తీటలువారన్

క. ఒండొరు దాకుచు భీతిల
నిండిన తమకమ్ము తోడ నిద్దర కిద్దర్
గుండెలు పగులుగ దన్నుక
దండితు జేయగ నొరునొరు దర్పితు లౌచున్

క. కొండలు పిండిల జేయుచు
శుండాలంబుల పదగతి సురుచిర ధాటిన్
భండన భీమ హిడింబులు
మెండగు రణ విధి తరువులు మేదిని కొరుగన్

వ. అట వచ్చిన పాండు సతీ సుతులుం హిడింబయు జూచు చుండ రెట్టించిన బలుండై –

చ. సుడిగొని వాయు నందనుడు సూరత వీర హిడింబు నుద్ధతిం
విడివడ కాలు చేతులను వంచుచు వెన్కకు మూట గట్టుచుం
కడిది బలంబునం దనుజు కావర మడంచి రక్త మాంసముల్
విడి వడి బార నాయసుర పీడయు లేదన భూతలంబునన్

వ. జేసినట్టి యా భీమసేను బల పరాక్రమంబులను మల్ల యుద్ధ వైదుష్య గాంభీర్యముల బొగడుచు నందరుంరా నా హిడింబను జూచుచు భీముండు రాక్షసులు మాయోపాయ జాల సమన్వయులు. అదియునుం గాక నీవా దనుజ హిడింబు చెల్లివి. నిను నమ్మ రాదన ఆది మారు మాటాడ నేరక వడవడం వడంకుచు పెద్దలైన కుంతీధర్మజుల చెంత కేగి తదేక దృష్టి మగ్నయై భీమునే జూచుచు ప్రార్థనాపూర్వకంబునఅమ్మా ! అయ్యా ! నే సబల నయ్యుం అనాధ నైతి. రాక్షస కుల సంజాతనే కానీ నేనధర్మ చింతను గాను. రాక్షస వనితలకును కొన్ని కట్టుబాట్లు నీతి నియమములు ఉన్నవి. తొలుత మనఃపూర్వకముగా నే నెవ్వని మోహ పాశంబున జిక్కుదో వాని

కే భార్యగా మననగు. కాదేని అసువుల బాయనవు. ధర్మచింతన పరులైన బిడ్డలగన్న వీర మాతవు. అట్లగుటం నను మన్నించి నా మనుగడ కనుమతించునదిగా వీరాధి వీరుడైన నీ బిడ్డ నొప్పింప వేడుకొనుచున్నదాన. మీయందెట్టి వైర భావముం లేని దాన.మాయా బల సంపన్నుండగు మాయన్ననే దెగటార్చనగు వీరాధివీరు మహాబల సంపన్ను భార్య నేనగుట కంటె, అతని వలననే వీరమాత నగుట కంటె నే కోరునదే దియుం లేదు. నీబిడ్డ యందలి ప్రేముడి నా మనసు మరలకున్నది. సరికదా మరు లుగొనుచున్నది. కాకున్న నాయీ తనువేలనని భీముని వంకనే చూచుచున్న యా చి న్నదాని చూచి ధర్మచింతన పరుడైన ధర్మరాజు భీమునితో–

తే. అబల ననుచు రా కాదన నౌనె నీకు
వగల జిక్కియు మరుగొన్న మగువ జూడు
అమ్మ మనుసేమొ యెరిగి నీవామె కనుము
ధర్మ రక్షణె రక్షయౌ ధార్మికుండ

క. ఆపద్ధర్మము కాచుట
పాపాత్ముల నైన గాని పావన బుద్ధిన్
నీపై ఆశలు పెంచుకు
వాపోవుచు నున్న దాన్ని వావిరి గావన్

వ. అనుచు ధర్మజుండు కుంతి మొగంబై అమ్మా! ఈ హిడింబ యందు రాక్షస భా వమూహింప తగదు. ఈమె నిష్కల్మష హృదయగా దోచుచున్నయది. అనవిని హిడింబ హర్షాతిరేకంబున వారల కిరువురకుం మ్రొక్కుచు అమ్మా ! నేనీ కొడుకువ్వ కోదరుకోరి మదన పీడితనై నావారి నెల్లర విడిచి వచ్చిన దాన. మీరు కాదన్నయిప్పు డప్రాణంబులు విడుచుదాన. నను రక్షించిన మీయెల్లర యిష్టాను వర్తినై వర్తించి మీ మెప్పు పొందుదాన. అట్లుకానినాడు మీ చెప్పినయట్ల యెచ్చటికైనం పోవుదాన.నన్ను నమ్ముడు. నే కామరూప కామచార నవుదు. మరియును వర్తమాన భావ్యోదంత ములు యెరుంగ గలదాన. ఇప్పుడొకభావ్యుదంతము దెల్పెద వినుండు. మనకుముం దల శాలిపోత్రు ముని తప్ష ప్రభావితములైన నొక సరోవరంబును వనస్పతియునుం

గలవు. ఆ నీరు వలన ఆకలిదప్పులును వనస్పతివలన శీతాతపవర్ష బాధలునులేకుం డుననియును మీరాశాలిహోత్రు మున్యాశ్రమమున యుండునెడ వ్యాసమునీంద్రుల టకు వచ్చి మిమ్మనుగ్రహింతురని వినుప–

క. విన విని విస్మయ మొందుచు
తనిగా జూచుచును నాపె తాత్విక గుణమున్
కనుగొని మంచియె కాగల
దనుమానము లేదనంచు తద్దయు వేడ్కన్

క. మునుకొని కుంతియు తనయులు
అనునయముగ భీముతోడ అనిరాయువిదన్
కొనుమీ సతిగా వెంటనె
అనుమానించక మనమున ఆప్తి దొఱంగన్

వ. అని భీమసేను నొడం బరచి తద్విధంబున కనురక్త యగు నా హిడింబ కుప యుక్తంబుగా భీమునకు మనఃప్రీతి కల్గించుచు యిష్టోపభోగంబు లనుభవించునదిగా ను పవళ్లెటు దిరిగినను రాత్రంబులు తమయొద్ద యుండునదిగానుచెప్పిభీముండు పుత్రుని వడయుందనుక యీాపెతో యుండునట్లు అనిపించుకొని ప్రభాతంబగునప్పటి కనతి దూరమబున నున్న శాలిహోత్రు సరోవర తీరంబున కేగి సుస్నానులై సంధ్యా వందనాదుల నాచరించి నీరుద్రావి శాలిహోత్రునాశ్వాదించి పూజితులై తద్వనసప్తతి చ్ఛాయ విశ్రమించి విగతక్షుత్పిపాశులై సుఖంబున్నెడ –

## కృష్ణద్వైపాయన ముని రాక

ఉ. పుణ్య తపోధనుండు మునిపుంగవు ముఖ్యుడు ధార్మికుండు బ్ర
హ్మణ్యుడు నీల మేఘ ఘన హారిత వర్ణుడు సాదువాద ధీ
గణ్యుడు యెల్ల లోకముల కాత్పద చిత్తుడు దివ్యుడుం మహా
రణ్య నివాసముం దరిచి రానయె పాండవులున్న చోటికిన్

క. వచ్చిన యా ముని పుంగవు

హెచ్చగు పూజాది విధుల నెంతో ప్రీతిన్
మెచ్చుచు పాండవు లున్నెడ
హెచ్చరికల నిట్టు లనియె యేర్పడ మదిలోన్

క. కొడుకుల కాదన లేకం
వెడగయి పెదతండ్రి మిమ్ము వెడలగ నడచిన్
నడినిశి లక్కా గృహమున
సుడి మంటల చిక్కు బెట్ట సోదర తగునే

క. దుర్జన దుర్యోధ్న శకుని
కర్జము లెల్లయును వోర్చి గర్వోనతువై
అర్జున భీమాధిక్యత
గర్జించుచు జగతి నేల గలవని నుడువన్

వ. మరియును సార్వభౌముడవై రాజసూయ అశ్వమేధ క్రతువుల పెక్కు సేయంగల వు. అని హిడింబం జూచుచు దీని పేరు కమల పాలిక. దీని యందు భీముండు మ హాసత్వుండైన పుత్రుం బడయు. వాడు కొండొక పరి మిమ్మందర మహాపద నుండి రక్షించు. ఈ శాలిహోత్రు కొలని నీరు ద్రావిన బూభుక్షి్వ పాశలనుండి భయంబు డుగు. ఈ వనస్పతి వలన సీతాతప బాధలు కలుగ నేరవు. కతిపయ దినంబులు యిందుండి ఏకచక్ర పురంబునకేగుడు. బ్రాహ్మణ భావంబులు చరించుచు బ్రాహ్మణు ల మధ్య యుండునది అని హితవు గరుప వినయ విధేయులై నమస్కరించు వారి దీవించి కోడలి నూరార్చి సుఖంబుండునదిగా ఆశీర్వదించి అంతర్హితుండైన, వ్యాస ముని చెప్పిన చొప్పున పాండవులు శాలిహోత్రు నాశ్రమంబున –

క. సదసద్వినుత భాషణ
సదయుడు ఆ శాలిహోత్రు సత్కృప తోడన్
పదపడి కుంతీ తనయులు
కుదురుగ ధర్మార్థ శాస్త్ర కోవిదు లగుచున్

క. ముడి పడి భీమ హిడింబియు

నడయాడుచు రేబవళ్లు నచ్చిన చోట్లన్
అడవులు కొండల యందున
కడు వేడుక యెంతొ గానొ కామిత మొప్పన్

ఉ. అక్షయ సత్వతన్ జననుతాఢ్య పరాక్రమ భీమసేనుకుం
రాక్షస కాంతకుం ఘనతరాన్వయ శోభుడు పుట్టె పెద్దయై
రూక్షిత దౌష్ట్ర కర్ణ ముఖ రూపము తోడ ఘటోత్కచుం డటం
రక్షణ దక్షుడై యడవి రాక్షస యూధము సంతసింపగన్

వ. అటుల సద్యో గర్భ జాతుండైన ఘటోత్కచుండు నవ యౌవ నుండును రాక్షస మాయా కామరూప కామచారణ విద్యా విభవ గుణ సంపన్నుండును అగుట కుంతి కిని తల్లికిని తండ్రులకును మ్రొక్కిన, అగ్ర జననుండగుట యెంతయుం గారాబమ్ము న చూచుచుండ, కొన్ని దినంబులైనంత ఘటోత్కచుండు తండ్రులకు నమస్కరించి నా రాక్షస పిశాచ గణంబుల తోడన గూడి వనంబు లందుండుదు. మీ కోరిన య ప్పుడ రాగల వాడనని తల్లిం దోడ్కొని బోవ, నిట పాండవులు శాలిహోత్రునాశ్ర మంబున మరికొన్ని దినంబులుండి యేగుచు అనేకానేక దేశంబులం గడచి ఏకచక్ర పురమ్ము జేరి–

క. తడి మడి నిష్ఠా పరుడై
పెడగా నున్నట్టి ఒక్క విప్రుని యింటన్
బుడుతలు బిక్షా పరులై
నడయాడుచు నుండు నంత నయనిధు లెంతన్

క. దిన దిన తిరిపెము సగ భా
జనముగ భీముని కిడుచును జాగ్రత తోడన్
అనునయ పరచుచు కుంతీ
తనయుల నూరార్చు చుండు తాలిమి తోడన్

క. వేదవిద ద్విజులన నట
సాదర బుద్ధిని మెలగుచు సామాన్యులుగన్

పదుగురు మెచ్చగ నెంతయు
ఆదరమున యూరివారి ఆశ్రితు లగుచున్

క. పెను బొబ్బల యార్త ధ్వని
వినపడ నా భీముడంత వేదన పరుడై
కనికర ముట్టి పడంగను
వినుమా యని అమ్మ తోడ వెడలగ నంతన్

వ. వలవల నేడ్చుచు నా యింటి యజ మానుడును వాని భార్యయు కూతును ముగ్వురు నేనేగుదు నేనేగుదునని తమలో తాము వాదులాడుటగాంచి దయార్ద్రహృదయయైన కుంతి వారల నుద్దేశించి–

క. ఇంతల యేమిట వచ్చెనొ
ఇంతగ భీతార్తులౌచు యేడ్చుచు నున్నా
ర్సుంతయు దెల్పుడు వినతగ
యెంతయు చింతిల వలవల చేసెడిదేమా!

వ. అని యడుగ అమ్మతో వచ్చిన భీముడు కల్పించుకొని

క. నేనని నేనని వగ వగ
కానౌ కార్యంబు యేది కాకుండు నొకో
తానై తీర్తును చెపుమనె
సాను నయంబుగను పల్కి సమ్మద మగుడున్

వ. అనవిని ఆ బ్రాహ్మణుండు దయా పరులారా ! ఈ యాపద ఒరులవలన బాపుకొనునది కాదు. అన్యుల ప్రాణములు బలిగొన నియ్యకొను నంతటి పాపము నొడికట్టి కొననేరను. అది మహా పాతకము. సంసారము సుఖ దుఃఖ భాజనము. సంయోగ వియోగమ్ములు యే ప్రాణికైనను పూర్వ కర్మానుసారము అనుభవించక తప్పదు. విధి విలాసము యెరుంగ యేరి తరము?

తే. ఇష్ట భోగాను వర్తియై ఇల్లు నిలుపు
భార్య రక్షించు కొనువాడె భర్త కాన

అసుర కాహార మగుమని ఆలి బిడ్డ
నసుప నౌనె మనుజు డెంత హీనుడైన

వ. కావున నేన బోయి ఆ అసుర కాహార మగుదు నని ఆత్మ పరిత్యాగమున కృత నిశ్చయుండై యున్న ఆ బ్రాహ్మణుం జూచి బ్రాహ్మణి యిట్టులనియె.

తే. చావు పుట్టుక రెండును సహజ మౌట
పతి నెడబాసి నే బ్రతికేల పతికి మున్న
అసువు లర్పించి అసురకు హారమౌచు
సాయపడుదును పతికి నే సాధ్వినౌచు

వ. అదియునుం గాక నే వగవ బని లేదు. భార్య యందు బడయ నగు నపత్యం బు మున్నె వడసిరి గాదె. నేనును ఋణ విముక్త నైతిని. మీకు సాయపడుటే నిప్పుడు చేయనగు కార్యము. జీవించియు నీ బిడ్డల రక్షించి పోషింప నేర. కావున నా మనః ప్రీతిగ నా పరోక్షమ్మున పునర్దార పరిగ్రహణమ్ము చేసికొనియైనవేదవిహితమైన కులా చార వృద్ధి సంపన్నంబులగు అగ్నిహోత్రంబుల రక్షించు టుచితంబ. ఇది సమాదార ణమగు సాంప్రదాయము. అనునంతన తల్లిదండ్రులం జూచుచు తనయ నిట్లనియె.

తే. ఆడ బుట్టుక పుట్టితి యేడ బోవ
వేర నెవ్వనికో యిడ వీడనౌగ
అసుర కాహార మిడగ నే నన్య గాను
తల్లి దండ్రుల గావని పిల్ల లేల?

వ. మీరు బ్రతికుండ, అనేక పుత్ర పౌత్ర లాభంబు పొంద నగుదురు. దానం జేసి వంశ వృద్ధి కానగు. నాయందు కల్గెడు దౌహిత్ర లాభము కంటె మిన్న గావుననన్ను ఆ రక్కసునకు ఆహారముగా పంపుడన–

తే. అమ్మ నాన్నల చెయి బట్టి లెమ్మననుచు
రాక్షసుని జంపి వత్తును రమ్మనంచు
కఱ్ఱ చేబట్టి లేచు నా కుఱ్ఱ దాని
పల్కు పల్కులు విని వారు బావురనుచు

తే. ఏడ్చు వారల నూరార్చి ఏడ్పు బాపి
కుంతి యడిగెను మూలమ్ము సుంత దెలియ
ననుచు ప్రశ్నింప యపుడనా యసుర కతను
సర్వ మెల్లను వినిపించి సమయ ఫక్కి

వ. ఈనాడు మాయింటి వంతు వరుస రానాయె నంచు పల్కి ఆ బకాసుర రాక్ష
సుండు ప్రతి దినమును బండెడన్న మును రెండెనుపోతులతో పాటు బండి
తోలుకు వచ్చు నాతనిం భక్షించు నట్లు-

ఆ. కట్టు బాటొనరిచి కాని దుష్ట బారి
మార్ప నేరరైరి మనసు దివిరి
ఏమి చేయనౌదు రే వొక్కరుండైన
భయము వీడు టెపుడొ బలిమి లేదు

తే. అనుచు వాపోవు వారితో ననియె కుంతి
దీని బాపగ నేనొక్క తీరు గంటి
యెల్ల జనులను సుఖియింప కల్ల గాదు
నాదు తనయుని బంపుదు నయము వినుమ

తే. అనగ నంత నా బ్రాహ్మణుం డనియె నిట్లు
ఎంత మాటాడి తమ్మరో యేమనందు
అతిధిగా యింట నున్న వార్ననుప దగునె
బ్రహ్మ హత్యయు చుట్టదే బ్రాహ్మణుండ

తే. అతిధి నభ్యాగతు భయస్తు ఆశ్రయార్థు
అతివ శిశువుల భీతాత్మ ఆప్త మిత్రు
జంప నొడబడు నాయట్టి జడుల కిహము
పరము రెండును చెడు నంద్రు బ్రహ్మ విదులు

వ. ఆత్మ పాతమ్ము మహా పాపమనుము. ఇది నాచే చేయంబడునది కాదు. కావున
యేది యేమైనను మీరన్న మాటకు నేనొడంబడు నౌదె నన కుంతి వాని కిట్లనియె.

ఆ. తెలిసి తనయు నంపు తెలివి హీనను గాను
వాని నోర్చు వాడు వసుధ లేడు
అసుర భీతి దీర్చి వసుధను గాపాడు
అనుచు వారి భీతి యిట్టె దీర్చె

వ. ఈ తనయు చేతిలో మున్నె అసుర పెక్కండ్రు నిహతులైరి. మంత్ర సమన్విత మహా బల సంపన్నుడు. అని వారల యొప్పించి తనయునిం బిలిచి నీవా రక్కసు ద్రుంచి వీరి యాపద కడ్డు పడునది యన, తల్లి మాట కొడంబడి ఆతనయుండు వల్లె యన బ్రాహ్మణుండును బంధువులును సంతసిల్లి తగు వంటకమ్ములు చేయు చుండిరని అంతయు విన్న ధర్మ మెరిగిన పెద్దవా డమ్మతో –

క. ఇది యేటి ధర్మమో తెలి
యదు మున్విన్నదియు కాదు యార్తిని కావన్
సదయులు మెత్తురె విన్నను
అదయత యీ తల్లి యనరె అందరు నిన్నున్

వ. అని దుఃఖాతిశయమ్మున పలుక నా తనయునితో తల్లి

క. పదుగురు బిడ్డలు యున్నను
వదలు కొనంగ లేదు తల్లి వొక్కని నేనిన్
ఆదయత కాదుర యెప్పుడు
సదయతతో మంచి గోరు సర్వుల కావన్

క. ఉత్తమ కుల సంజాతులు
సత్తము చూపించి లోక సమ్మతు లగుచున్
కత్తిని ఝుళిపించియు ని
స్సత్తుల కావంగ వలయు సత్కృప తోడన్

వ. అన విన్న ఆ అన్నదమ్ము లెల్లరు సమ్మతింప నంతట

ఆ. పిండి వంట్ల తోడ వండి వార్పించిన
పంచ భక్ష్య భోజ్య పానకాలు

కుండ నిండ పెరుగు కూరలు పచ్చళ్లు
బండి నిండ పెట్టి దండి గాగ

ఆ. సిద్ధ పరచి పంప సిద్ధుడై యుండి యా
బండి తోలు కొనుచు దండి మగడు
అసుర యున్న చోటి కరుగుచు నెమ్మది
వంట రుచుల జూచు వాడె పోలి

ఆ. ఆరగించ సాగె నన్నియు తనకంచు
నొక్క టొకటి వరుస మెక్కుచుండ
అసుర గుహకు చేర అన్నియు జెల్లగా
నిలువ నోప కసుర నింగి కెగసి

**బకాసుర వధ**

ఆ. ఒక్క దన్ను దన్నె ఉరుతర ధాటితో
ముందు కెగిరి పడగ మోము గదుర
అంత లేచి అతడు అసురత ధీ కొన్న
ఘోర యుద్ధ మాయె కుమ్ములాడ

వ. అంత కుంతీ పుత్రుండు ఆ అసుర దాకుచు నీ దిన్న మాంస చయమ్ము నెల్ల కక్కించెద నంచు గ్రక్కునం ప్రక్కనున్న తాళము పెకలించి ఢీ కొన ఆ బకుండును వేరొకతాళ వృక్షమును పెకలించి భీము కెదుర దాకి పెద్ద పెట్టున పోరుసల్ప తత్పరిసరారణ్యమంతయు నేల కొరుగ మల్ల యుద్ధ సన్నద్ధులై–

క. పట్టుకు చుట్టుకు నెట్టుకు
ఇట్టిట్టని తొడలు గొట్టి ఇద్దరికిద్దర్
గట్టిగ పెనగుచును వసుధ
మట్టది జిమ్మిల్ల వారు మరిమరి బోరన్

క. హాహాకారము లెగయగ
సాహస శక్తులు తలపడి సమరోద్ధృతులై

ఆహారార్థత యిరువురు
బాహాబాహీ లనుచును భండన భీముల్

క. ఇద్దరు ఒకటన నెట్టుకు
దద్దరిలం యడవి యెంత తడబడి వణకన్
సద్దాకశమును దాకగ
అద్దిద్దని భీము డసుర నవనికి ఆన్చిన్

క. గుద్దులు గుద్దుచు భీముడు
మద్దెల మోతగ దరువుల మత్తిల మొత్తిన్
దద్దరిలం అడవి చరులు
ముద్దయి మూల్గగను దనుజు ముక్కున గుద్దిన్

క. అవయవములు నులిమి నులిమి
పవన సుతుడు భీముడంత పట్టియు దనుజున్
నవరంధ్రమ్ముల రక్తము
సవసవగా కార దన్ని చావగ జేయన్

వ. చచ్చుచు నా బకాసురుండిడు పెన్బొబ్బలు విని బంధువు లెల్లరు రా వారలం జూచిన భీము డుగ్రుడై ఇక మీదట మానవుల భక్షింప నెంచు వారలెల్లరుం ఇటుల నేజంప బడుదురన భీతిల్లి ఆ యూరి జోలికిం బోకుందుమని నొడంబడిపార భీము డా బకాసుర కళేబరమును జగద్విదితముగా బండికి గట్టితెచ్చి ఏకచక్రపుర వాసుల కుంచూప, సంతసిల్లి భీముం కొనియాడ వచ్చువారు-

క. ఏతన్మాతుడు గాడం
చు తన్మయుల్ ఔచు వచ్చి చూచిన యెల్లర్
పాతము లన్నియును దొరగె
ఈతని వల్లనె యనుచును ఇంతటి తోడన్

వ. అని పొగడొందు నా పాండు పుత్రుల చరితంబును వైశంపాయనుడు జనమేజయున కెరిగించుటయును.

ఇది

**శ్రీశ్రీ వాణీ వరప్రసాదలబ్ధ సుకవిజనప్రియ సాధుజన విధేయ శ్రీశ్రీ కవిత్రయ స్ఫూర్తి ఆర్వేల నియోగి బ్రాహ్మణ మండపాక వంశోద్భవ వీర్రాజు పౌత్ర సూర్యప్రకాశం సత్యనారాయణాంబా తనయు విరచిత**

**-: శ్రీమదాంధ్ర మహాభారత ఆదిపర్వ షష్ఠాశ్వాసము :-**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆది పర్వ – సప్తమాశ్వాసము

వ. అక్కథకుండు శౌనకాదులకుం జెప్పె నట్లు పాండవులు వేదాధ్యయన సంపన్నుల గుచు బ్రాహ్మణ వేషంబుల ఏక చక్రపురంబున యున్నెడ నొక నాడొక బ్రాహ్మణుండు రా, దామున్న ఆ ఇంటి యజమాని యాదరించి సంతుష్ఠం జేసి విశ్రమించి సుఖం బున్నెడ, కుంతి ఆతని కడకేగి మహాత్మా ! మీ రాక మాకెల్లరకును మహదానంద దా యకమని కొనియాడి మీరెందుండి యిటకు వచ్చియున్నారనియడుగ నా బ్రాహ్మణుం డు, అమ్మా ! యాత్రార్థినై దేశ దేశంబులు గ్రుమ్మరుచు ఆయాయా ప్రభువుల ఆదర పాత్రుండ నగుచు ప్రస్థుతము పాంచాల పురమునుండి వచ్చుచున్నానన, అయ్యా! ఏ యే దేశములెట్టివో ఏ యే రాజన్యులెట్టి వారలో అందలి విషయ విశేషము లెవ్వి యో తెల్పుడన నప్పుడు–

### ద్రుపదుని విషయము

క. అలయక గ్రుమ్మరు చెల్లెడ
వెలగల యా ద్రుపద రాజ విషయము జూస్తిన్
ఇలలో సుందర తరమది
దలపను సరిలేదు నెద్ది ధన్యత వెలయన్

వ. అంతటి వైభవ సంపన్నుని నే నెందును చూడలేదు. ఆతడిప్పుడు తన కూతు అగ్ని గుండమున బుట్టిన దాన్ని అయోనిజయైన దాని అపురూప లావణ్య సద్గుణ సంపన్న యైనదాని యొకానొక అనురూప రాజనందనున కీయ నెంచియుం కానక స్వయంవరముం జాట నున్నాడన విని కుంతియు కొడుకులునుఆ అయోనిజ నా ద్రుపదున కెటుల కూతురాయ నన దాని పూర్వోత్తరములు దెల్పెద వినుండని–

క. అచ్చరు వందగ నెల్లరు
సచ్చరితులు మీరలనుచు సమయోచితతన్

యిచ్చతొ వివరింప దొడరె
సుచ్చరితుడు ద్రుపదు డెంతొ సూకృతి యనుచున్

వ. తొల్లి భరద్వాజుడను ముని కలశంబున ఉద్భవించిన ద్రోణుండును, పాంచాల భూపతి పుత్రుండు ద్రుపదుండును చిన్ననాట విద్యలు గరచు చున్నెడ, ద్రుపదుండు నే పెద్దయై రాజైనప్పుడు వచ్చిన నీ వేది కోరిన అది యీయం గలవాడనని ధనుర్వే దంబును అగ్నివేశుండను మునివరు వద్ద పూర్తి అయినంత, పెద్దయై ద్రుపదుండు రాజగుటయును, భారద్వాజుండు కృపుని చెల్లెలు కృపియను కన్యను వివాహమాడి పుత్రవంతుడయ్యు పేదరికముచే కొడుకుకొఱకై ఒండు రెండు పాడియావుల నర్థింప ద్రుపదు పురంబున కేగి, ద్వారపాలకుల చేత రాక యెరింగించ, నుద్యోగించిన వార లు రాజ మందిరమున సఖీజనంబుల నడుమ యిష్టోపభోగ లాలసుండైన ద్రుపదుని కడ కేగి, ఆ వేదవిప్రుని రాక యెఱింగించిన, రాజ్య మదాంధ మతిమత్త గర్వ చిత్తుడౌట, వాని నవమానించి మాటాడ, ద్రోణాచార్యుండు కరినగర రాజ సుతులకు అస్త్రవిద్యా గురుండై విద్యా పారంగతులను జేయ సంతసించి వారు గురుదక్షిణగా ఏమి కోరిన అది యీయగల వారమన, భారద్వాజుండు తన మది గల పరాభవాగ్ని ని చల్లార్చు కొననెంచి ద్రుపదుం బంధించి దెచ్చుటయె నా కోరిన దక్షిణగా భావిం తునన, ధార్తరాష్ట్రులు పాంచాలునిపై దండెత్తి పరాభూతులగుటయును, ఆర్జునుండు భీముని వెంట బెట్టుకొని ద్రుపదుపై దండువెడలి ఘోర యుద్ధమున పరా భూతునిం జేసి బంధించి తెచ్చి ద్రోణుల కిచ్చిన, ద్రుపదుండు తన మనంబున–

ఉ. ఉల్లము లాడి పొమ్మనగ యుస్సురనిం మది పొక్కి కుందుచుం
తల్లడి గొంచు ధీరతను తర్జన భర్జన జేసి యెంతయుం
అల్లన ద్రోణునిం చెనకు ఆర్నవ సత్వత ఆత్మ జుద్ధతున్
అల్లనె అర్జునిం గొనెడి ఆత్మజ నొక్కతె పొందగా తగన్

వ. ప్రతి దినంబును గంగా తీర దేశమ్ముల కేగి యచ్చట వసించు బ్రాహ్మణాశ్రమం బుల బ్రాహ్మణోపాస్తి నెరపుచు, అర్థించి వారి వలన –

క. అనవరత మంత్ర తత్పరు
జన వినుతుడు యాజమునిని జపతప నిష్ఠున్

పని జేయను కామ్య జపము

జననం బొందను యిరువురు చరితార్థులుగాన్

వ. అనుకొని యాయాజుండు యాజకత్వము వహియించి ద్రుపదుచే పుత్రకామేష్టి చేయించిన ఆ యజ్ఞ కుండము నుండి–

క. అసదృశ కాంతులు జిమ్ముచు

పనదనరెడి మేని ఛాయ పసిడిని మించిన్

మిస మిస లాడుచు వెలసిరి

అసమాన గుణోన్నతు లిరు అన్నయు చెల్లిన్

వ. వారిరువురకును ద్రుష్టద్యుమ్నుండు, కృష్ణ అను నామంబు లిడి యథోక్త పూర్వక తాంబూలము లిచ్చి యందర సంతృప్తులం జేసి యాజక పురోహితునకు సువర్ణరత్నాభరణ తాంబూలము లిచ్చి సంతృప్తుం జేసి, ద్రుష్టద్యుమ్ముని ధనుర్వేదమందు ఆరితేర గురువుల నియమించి, ప్రాప్త యౌవన యైన కృష్ణ కిపుడు వివాహము చేయనెంచిన వాడు.

ఉ. పాండవు లెల్లరుం అనల పావను బారిన లక్క యింటిలో

మండియు మాడి రందరని మానుగ పల్కగ వెచ్చనూర్చుచుం

పెండ్లెటు చేతునో సుతకు పేర్కొని అర్జుని మానసంబున్

మెండుగ వేదనం బడుచు మిక్కిలి గుందుచు శోకతప్తు డై

వ. యున్నెడ, తన్నృప పురోహితుండు వేదవిదితం బగుచు తొల్లిఅదృశ్యుండైన యింద్రాగమనమును వినిచి శచీదేవినూరార్చిన విధంబున ద్రుపదు నూరార్చి పాండవులు పరలోకగతులైరను విషయమున వాద ప్రతి వాదములు వినంబడుచుండట వినిపించి శాంతపరచి స్వయంవరమును చాటించినచో దేశ దేశమ్ముల వారెందున్నను రాగలరని పల్క, బ్రహ్మవిదులగు బ్రాహ్మణ వాక్యము కల్లగాదని నూహకురా ద్రుపదుండు

ఉ. అవనిని యెన్నడుం కనని కార్ముక శక్తి యుక్తులౌ

జవనులు మాత్రమే గురిగ జాగృతి ద్రుంచెడు మత్స్య యంత్రమున్

సువిదిత మౌగ దెల్పుచును శూరులు రండని ఐదు తూపులన్

అవనికి గొట్టగా విబుధ అర్హుల కిచ్చెద కూతునం చనిన్

వ. నేటికి డెబ్బది ఐదు దినంబుల నాడు పుష్య శుద్ధ అష్టమి రోహిణి ప్రొద్దున దేశ దేశంబుల ఘోషింప జేయ–

మ. అపురూపంబిది బోవగానగుననిం అత్యంత చోద్యంబనిం
తపనంజెందుచు ద్రుంపగా దగుదనిం తద్ధ్యమ్ము జేపట్టగా
ఎపుడెప్పుండని రాజనందనులు వే యిష్టార్థులై యెందరో
విపినాంతర్గత దేశము ల్గడచుచుం వేగంబ రానెందరోన్

వ. అని యా ద్రుపద పుత్రి కథ యెల్లనా విప్రుండు వినిపింప కుంతి, పుత్రుల అభిమతం బెట్లున్నదో గ్రహింప నెంచి–

క. వినవా కుంతియ పుత్రుతో
మనకిట గూడునది యేమి మన్నన యున్నన్
అనువగు దోవల నెలకొను
యెనయగు నా ద్రుపదు నగరి కేగగ శుభముల్

వ. దక్షిణ పాంచాలము కడు రమ్యమనియు ఆ భూపతి పరమ ధార్మికు డనియును వినియుంటిమి. మరియును–

క. కనువిం దొనరించెడు యా
వన చయ పుర వీధులెల్ల పసిరిక బాయన్
మనసుల కెంతయు హాయ్యిడు
వినవౌగా జనులు యెంతొ విజ్ఞులరనుచున్

క. అడిగిన అడగకె బెట్టెడు
కడు ధార్మిక బుద్ధిపరులు కడు వేడుకతో
కుడుముల పులుసుల అన్నము
కుడువను రారమ్మటంచు కోరుదు రనుటన్

వ. అందు పోవుట లెస్సయన, కుమారు లెల్లరుం కుంతి మాట కౌనన, ఆయింటి బ్రాహ్మణునికిం దెల్పి వీడ్కొని పాంచాల దేశాభిముఖులై అరుగుచున్నంత–

మ. విపినాంతర వనసీమల
జప తత్పరుని యమనిష్ఠ జరిపెడు తాతన్

అపురూపముగా జూచుచు
సపర్యలను జేసి వారు సాగిలి మొక్కన్

వ. వారల జూచుచు కరుణారస పూరితాంతః కరణుండయి—

క. నిర్మల మతులై యున్నచొ
ధర్మవు కొరగాదు యెపుడు తల్లిని వినుచున్
కర్మలు దీర్చెడు వారలు
ధర్మ పరాయణులు ఔద్రు ధార్మిక బుద్ధిన్

క. ధర్మజుడున్నెడ యెన్నడు
ధర్మవునకు కీడు రాదు తాతను వినుడీ
నిర్మలురై వర్తింపుడు
ధర్మవు మిము వీడ దెపుడు ధర్మజు నీడన్

వ. తొల్లి నొక ముని కన్య కర్మ వశమున పతిం బడయ నేరక ఘోరతపంబొనరింప పరమశివుడు ప్రత్యక్షమై నీకేమి వలయు నన్న పతిపారవశ్య మనస్క కావునపతిపతి యనుచు యేను పర్యాయములు ఉచ్ఛరింప అటులనే నీమరు జన్మంబున బడయ గలవని వరము ప్రసాదింప యిపుడామె ద్రుపద పుత్రియై జన్మించిన మహాసాధ్వి. మీరు ఆ ద్రుపద పురంబున కేగుడు. శుభమగునని కృష్ణద్వైపాయనుం దరిగిన పాం డవులు తల్లి తోడనుం గూడి—

క. అడవులు కొండలు నదులుం
వడి గడచుచు పాండుసుతులు పదపడి నడువన్
గడచెను దినములు డెబ్బది
కడ తట్టుగ ద్రుపద పురము కన్నుల పడగాన్

క. గమానాయాసన పరులై
కమనీయులు విశ్రమింప గంగా తటమున్
సమయమ్మది గంధర్వులు
తమ సతులతొ తీర్థమాడు తరుణమ్మగుటన్

వ. సతితో వచ్చిన అంగారపర్ణుడు మానవ అలికిడి విని

క. అయరే యీ నిశి రాతిరి
దయనీయులు రా వెరతురు దారియు కాదే
నయమున వెడలుడు యెడగా
నియమితమీ గంగ యొడ్డు నిశచరి కెల్లన్

వ. ఇవ్వేళల యీగంగా తీర్థ తీరములందు గ్రుమ్మరు వారెవ్వరైనను యెట్టిబలవంతు లనైనను నిగ్రహింతుము. ఇది మాయక్ష గంధర్వ రాక్షస నిశాచర బలసమయము. ఎంతటి వారలనైనా సైరించము. ఇది మా విహార సమయము. కావున యిందుండి దూరము తొలగుడు. నే నంగారపర్ణుండ. కుబేర సఖుండ. ఈవనములును తీరంబు ను అంగారపర్ణంబులుగా ప్రసిద్ధములు. ఇందు మానవులు రా వెరతురన అలిగిన అర్జునుండు –

క. నడిరేయని నిశ వేళని
కడు భీతుల గాము సుమ్మ గర్వోన్నతితో
కడు భీతుల పసి వారల
వడి గాచెడి వారమయ్య పావన పురుషా

క. ఈ నది నద లో యడవులు
మానుగ నీ తాత సొమ్మ ! మా అని పలుకన్
మానవ మాత్రులు యెంతని
మానుము నీ డంభ మెల్ల మాయగ జేతున్

క. అని నంతనె గంధర్వుడు
కనలుచు నిశితాత్రము లిడ ఖండించుచు తు
త్తునియలుగా జేసి నడుమ
తన ధాటిని జూపె నరుడు తక్షణ మందున్

తే. ఇంత మాత్రము తెలియుమా యిఙ్గితజ్ఞ
వెఱ్ఱివాడవు కాదుగా వెనుక బొమ్మ
అటుల జేయని నాడు నీ అశువు గొందు
యక్ష రాక్షస గంధర్వు వైన నేమి

తే. అనుడు అంగార పర్ణుండు ఔడు గరచి
రమ్ము రమ్మంచు అర్జునిం రయము దాకి
వేయి తూపుల బాణమ్ము వేయునంత
అగ్ని బాణాగ్ని వదలె తా అర్జునుండు

వ. ఆ బాణాగ్నికా తూపులతోపాటు అంగార పర్ణుని స్వర్ణమయ రథాంగము లన్ని యు మాడి మసి యగుటయే కాక అంగారపర్ణుండు తాళలేక నేల కొరుగ పట్టి బంధింప వాని సతి (కుంభీనసి) పతి దానము సేయుమనుచున్న అబలాక్రందన విని–

క. అరవిందాక్షుల జూచుచు
కరుణామయు ధర్మరాజు కనికరు డగుచున్
సుర గంధర్వాంగన మొర
చెర వీడితి లెమ్మనంచు చేయిని యిడగాన్

వ. అట్లు గంధర్వుండు పాండు సుతుని వలన నిర్జింపబడి రక్షింప బడిన వాడగు ట సతీసమేత సంతుష్టాంతరంగుడై మీ చెలిమి గోరుచున్నాడ. మీ పరాక్రమ కరుణా మయ సౌశీల్యంబు లనన్య సామాన్యంబులు. గంధర్వుడనై యుండిపరాభూతుండనై దగ్ధ రథుండ నగుట నా యీ అంగార పర్ణ నామంబును వీడువాడ. గాంధర్వ మాయాజాల విద్య వలన చిత్ర విచిత్రంబైన కొండొక రథంబు వడసి చిత్ర రథుండ నయ్యెద. నా తపోధనంబైన "చాక్షుసి" అను విద్యను నీకు ప్రసాదించెదఈ దీనిందొ ల్లి వరుసగా మనువు వానినుండి చంద్రుడు వానినుండి గంధర్వ పతియైన విశ్వావ సువు వాని వలన నేను యిపుడు నానుండి నీకుసంక్రమించు చున్నది. కా పురుషుల కిది ఫలింపదు. నీవు సాపత్య వంశ వర్ధనుండవు. నీకిదిఫలియించు. దీనివలన త్రిలోకము లందెక్కడనైనను యెద్ది యైనను పరికింప నగు. దీనింగైకొనుమన అర్జు నుండు నాచే ఆగ్నేయాస్త్రమును స్వీకరించ వలెనని వేడ, అటులనే యని గంధ్వుం డుపాండవు లేవురకుం మహాజవసత్వంబులుగల ఆశ్విక రథములను గూడయిచ్చిన వాడయ్యెను యిట్లయె.

ఉ. ఇమ్ముగ మూడు లోకముల ఏగెడి వచ్చెడి సన్మునీంద్రుచే
మిమ్ముల నెంతయుం వినుదు మీదగు సూరత జూడగంటి నే

సమ్మతి సత్య మంచు మది సఖ్యత చాటను తగన్
యిమ్మహి వీర ధర్మముల నెవ్వరు సాటగు యెంచి చూడగన్

క. అమ్మను మాటకు సరిపడ
సమ్మతితో మెలగు చుంద్రు సఖ్యత తోడన్
మిమ్మల నెరుగని వారలు
యిమ్మహి నుండంగ బోరు నింతయు నెంతన్

క. ఇంతుల సంగతి గొనువా
డెంతయు డంభములు పల్కు ఇష్టత కొలదిన్
సుంతయు ధర్మువు దలపడు
వింత గదా కాముశక్తి వింతల వింతౌ

వ. ఏను మిమ్మెరింగియు కామ ప్రవృత్తిం దగిలి యెన్నియో డంభములు పల్కితి. మీరు విద్యావంతులు. ధర్మ విదులు. ధర్మానిల ఇంద్రాశ్వినుల వరంబుల బుట్టిన వారలు. లోక హితులు. కావున పురోహిత మతులై నుండ దగుదురు.

తే. ధర్మ శాస్త్రాను వర్తిత దక్షులగుత
వేద వేదాంత విజ్ఞాన విదుష శాంత
బ్రహ్మ కుల జాతు సద్బుధ వర్యు నొకని
బడయ శుభము లొన గూడు వడిగ మీకు

వ. అని పలుక అర్జునుండయ్యా ! మేము కౌంతేయులము. మీరు సాపత్యంబని పల్కుట మాకు తెలియ కున్నది. చెప్పవేడెదమన్న –

## తపతీ సంవరణోపాఖ్యానము

వ. తొల్లి భరతకుల సంభవుండైన అజామీఢ రఘునందనుండైన సంవరణుండు మృగయా వినోదార్థ మడవి కేగి క్షుత్పిపాసా భరుండై సంచరించుచు సావిత్రి ననుజ ఆదిత్యు బుత్రి యైన తపతి యను సుర కన్య తపంబు చేయు చున్న దానిం జూచి మోహించి అనిమిష లోచనుండై జూచుచుం జేరి నీ కిష్టమైన గాంధర్వంబున పరిణయ మాడుదము రమ్మన, నయ్యింతి నాయందు ప్రీతి గలదేని మజ్జనకు నడుగుము. కన్యలకు స్వాతంత్ర్యము లేదని మీరెరుంగుడని ఆదిత్య లోకమున కేగ సంవరణుండా

మెయందు బద్ధానురాగుండగుట ఆదిత్యుందలంచుచు నిరాహారుండయి తపము చే
యుచుండ వెదకు కొనుచు వచ్చిన అమాత్యుండు సీతలోదక సేవలు చేసి పురగురు
మహనీయు బురోహితు వశిష్ఠుం మనంబున ఆరాధింప అతండు వచ్చి కృశ శరీ
రుండై యున్న మహీపతింజూసి యోగదృష్టిం యాతని మనోరథంబెరింగి ఆదిత్యమం
డలంబేగ ఆదిత్యుండమ్మునివరు ప్రీతి పూర్వకమ్మున స్వాగతించి భవ దాగమన ఫలం
బెయ్యది యన నీ తనయ నొక వరునకిచ్చిన కాదే, కూతుగన్న ఫలంబు. గుణవంతు
డుధర్మవిదుడు మహనీయుడు కీర్తిమంతుడు పౌరవ కుల శ్రేష్ఠుండు నైన సంవరణుం
డు నీ తనయ తపతికి తగిన వరుండు. కావున అట్లు చేసి కృతార్థుండవగు మన ఆ
దిత్యుండా కుల గురు వశిష్ఠుల మాట కెదురాడక తపతిని సంవరణుని భర్తగా ఆయ
న వెనుక ఆశ్రమంబునకుం బంప వశిష్ఠుండామెను తోడ్కొని వచ్చి వేదవిహితముగా
వారల కుద్వాహము గావించి పంప సంవరణుండామెను తోడ్కొని విలాసంబుల ద
విలి పుష్కర కాలంబు రాచకార్యమబులు విస్మరింప దేశము అరాచకమై అనావృష్ఠి
బాధలు తోడగుట జలభీతాహులగుట వశిష్ఠుండు సంవర్ణుందెచ్చి శాంతి పౌష్ఠిక క్రి
యలు నిర్వర్తింప అనావృష్ఠి బాధలుతొలగి సంతోషంబు వాటిల్లెనని చెప్పుచు తగు
పురోహితు బడసిన ప్రభువు కెల్ల కార్యములు సఫలత వాటిల్ల గలదనుచుం చెప్పవి
నిన అర్జునుండు వశిష్ఠుని విశిష్ఠత దెల్పుండని అడుగ అంగార పర్ణుండిట్లను. తొల్లి
ఇక్ష్వాకు కులోద్భవు లెల్లరుం రాజోన్నతులై కీర్తి ప్రతిష్ఠలు నొందినది సత్పురోహితుల
వలన గాదే. మరియును వినుమని విశ్వామిత్రుడు చేసిన అపకారమునకు పిల్లలెల్ల
రుం విగతులైనను తపశ్శక్తిచే నివారింపగల శక్తి మంతుండయ్యును సముద్రుండు
చెలియలి కట్ట దాటకుండు నట్ల అతి శాంతచిత్తుండగు వశిష్ఠుని మహత్వంబును
కొనియాడ నాకగునె యన అర్జునుండు అవ్వశిష్ఠునకును గాధి నందనునకును గల
వైరకారణమేమని ప్రశ్నింప తొల్లి విశ్వామిత్రకుండను రాజు కన్యాకుబ్జమును రాజధా
నిగా ధాత్రి నేలుచుండ నొకనాడు విలాసార్థంబు వేటకై అడవి కేగి అలసి సొలసి వ
శిష్ఠాశ్రమమునకు రాగా అమ్మునిసత్తముడు రాజును ప్రీతిపూర్వకముగా స్వాగతించి
ఆదరించి తన హెూమ ధేనువైన నందిని ప్రభావమ్మున రాజునకును అతని వెంట
వచ్చిన సమస్త జనానీకంబునకును షడ్రసోపేత మృష్టాన్న భోజనంబులిడ జూచిన

విశ్వామిత్రుండు ఆ నందినీ ధేనువును తన కిమ్మని బదులుగా వేయి నావుల నీగల వాడనని అడుగుటయును, ఈజాలనన కోపించి భటుల నంపి ఆ ధేనువును దూడ ను కట్టి కొట్టి యీడ్చుకొని బోవుచున్న, వశిష్ఠుండు శాంతుడై యూరకున్న ఆధేనువు ను వత్సంబును బాధకు నోర్వనిదై దుర్నిరీక్షయై అంగ విక్షేపంబున అంగారక వృష్టి యును వాలంబున సబలులను మలమూత్రంబుల శకయవన పౌండ్ర పుళింద ద్రవి డ సింహళుల సేనంబున దశ సబరులను పుట్టించిన అవి యెల్లరును విశ్వామిత్ర సైన్యంబుల చిందర వందర గావించి పరుప అట్టి బ్రహ్మ తేజోజనిత ప్రభావమ్మున క బ్బుర పడుచు విశ్వామిత్రుడు క్షాత్ర బలంబుల నిందించి సర్వంబును విసర్జించి మ హాటవుల కేగి నిరాహారుండై వేయి వత్సరంబులు తపస్సు చేసి బ్రహ్మ ఋషిత్వమును దివ్య శక్తులను బడసి ఇక్ష్వాకు సంభవుండైన కల్మాషపాదుడనురాజు నాశ్రయించి త త్పురోహితుండగు వశిష్ఠునితో బద్ధవైరము పెంచుకొని వాని పుత్రుం సతాగ్రజు శక్తి యను మహామునికి దారి యిడక రాజ మదగర్వంబున ధర్మమార్గమును మది దలం పక అడ్డు దగుల వానిచే శపియింపం బడుటయును రాక్షసుండయి బాధలుపడుచు వానినీ వాని అనుజుల నూర్వుర వధించుటయును శాంత చిత్తుండగుచు విరక్తుండ యి వశిష్ఠుండు అగ్నిబడ అగ్నిభట్టారకుండు చల్లబడుటయును మెడకు రాయి గట్టు కు నంబుధి గ్రాల వార్ధి తనతరంగ హస్తముల నమ్ముని నెత్తి యొడ్డుకు చేర్చుటయు ను సుతశత వర్జితాశ్రమము జూడ నోపక శత సహస్ర పదోన్నత మేరుగిరి శిఖరము న నుండి పదాతుండైనను అతని తను వక్షంబు ధృడతర శక్తివంతమై ఆకశంబున కె గసి గాలియందు తేలియాడ వెండియు తనువివర్జిత మనస్కుండై అమ్ముని నాధుండు ఉదగ్ర గ్రాహవతి అను సరస్సున ప్రవేశింప నది ముట్టక శత విధముల పరస్థలయై న నాటగోలెనది శతధ్రునామియై యుండుటయును మరియు బెక్కువిధముల శరీర త్యాగ సన్నంద్ధుండయ్యును అప్రాప్త మరణుండయి వశిష్ఠుండు నిజాశ్రమమునకుం వచ్చిన వాడు వెనుక వచ్చు దాని "నదృశ్యంతి" అను దానిశక్తి భార్యగా యెరింగి దాని ఉదరంబున నుండి శక్తి చదువును బోలు వేద నాదంబులు విని విస్మితుండై పన్నెండేండ్ల నుండి గర్భమందుండిన వాని యిప్పౌత్రు ముఖమును జూచి కృతార్థుం డ నగుదునని మరణ వ్యవసాయ వర్జితుండై యుండు యొకానొక నాడు రాక్షస

రూపంబున నుండిన కల్మాషపాదునిం జూచి "యదృశ్యంతి" భీతిల్ల వశిష్ఠుండడ్డు పడి రాక్షసు నివారించి దివ్య దృష్టింజూచి మంత్ర పూరితంబులైన కమండలోపమ్ము లు జల్ల కల్మాషపాదుడు శాపవిముక్తుండై నమస్కరించి ముకుళిత హస్తుండై మునీం ద్రా ! మీ కృపవలన శాప విముక్తుండ నైతినని నుడువ వశిష్ఠిందు వాని కిట్లనియె. బ్రాహ్మణుల నవమానించిన వాడెంత వాడయ్యును సుఖంబున నుండనేరడు. కావున బ్రహ్మణ్యుల భక్తి శ్రద్ధలతో పూజించుచు పెద్దకాలము రాజ్య మేలుచు సుఖింప గలవ ని పల్క వశిష్ఠునిం దోడ్కొని అయోధ్యాపురమున కరుదెంచి తొల్లి మహా పతివ్రతయై న "యాంగిరసి" అను దాని వలన శాపముండియు వశిష్టుని వలన విముక్తి పొంది పుత్రునిం బడయ గలవని తెలిసిన వాడగుట వానింప్రార్థింప తత్ప్రసాదంబున "నశ్మ కుండ" నను రాజ ఋషి పుట్టె. ఇట "యదృశ్యంతికిం" పుత్రజననంబైన, వశిష్ఠుడు మనుమనికి జాతకర్మాది విధులెల్లనుం దీర్చి పరాశరుండను నామకరణంబు చేసి పెంచుచున్నెడ, పెరిగి పెద్దవాడై మహా తపశ్శక్తి సంపన్నుం డగుటయును రాక్షసుల కారణ మున తన తండ్రి పంచత్వముం బొందెనని తల్లి వలన విన్నవాడై కోపోద్రిక్త మానసుండై రాక్షస ధ్వంస సత్రయాగముచేయుచున్నెడ పులస్త్యాది మహా మునులు వచ్చి యాగాధ్వరంబున త్రేతాగ్నులమధ్య నాల్గవ అగ్నియోయనదగు పరాశరు ననున యించి యాగంబు ఉపసంహరింప తన్నియోగంబున నయ్యగ్నిని హిమవదుత్తర తీర ముల బడవేయ అప్పుడప్పుడది అగ్నిశిఖలం వెదజల్లుచు విజృంభించి వృక్ష లతా గు ల్మా శిలా భక్షణము గావించు చుండునది యని గంధర్వుండు (తాపత్య వశిష్ఠ కల్మా షపాద పరాశరోపాఖ్యానంబులు) చెప్ప వినిన అర్జునుండు వాని కిట్లనియె.

క. హితుడవు గంధర్వుండవు
మతిమంతుడ లోక వర్ణ మాన్యు నొక పురో
హితు, యతి పుంగవు గుణసం
స్థుత వందితు జూపనంగ సుస్థిర మతియై

వ. పెద్దయుం బ్రొద్దు చింతించి గంగోత్తర భాగ తీర్థంబున దపంబు చేయుచున్నవా డు ధౌమ్యుండను ఉత్తమోత్తమ బ్రాహ్మణుండు. అమ్మహాత్ముండు మీకు దగిన పురో హితుండు కాగలడు వెళ్లి ప్రార్థింపుండన అతి సంతోషంబున గంధర్వుం వీడ్కొల్పి

పాండవులు–

చ. పగతుర నేనియుం సమత బాయక నెంతయు జూడ గల్గునా
సుగుణులు పాండు నందనులు సుందర రూపులు వేగ నేగియుం
అగణిత ధర్మ మూర్తియును ఆధ్య తపోనిధి శాంత చిత్తునిం
తగు విధ పూజ చేసియును ధౌమ్యు పురోహితు గాగ వేడినన్

వ. ధౌమ్యుండును వారల సంప్రీతిం గారవించి పురోహితత్వంబును గ్రహించిన సంతసిల్లి జననీ సహితంబుగా దక్షిణ పాంచాలంబున కరుగువారు ముందల ద్రుపద పురంబున కేగు బ్రహ్మణ్యులం గని మీరెందులకు పోవు చున్నారని అడుగుటయు

క. మహినేలెడు యాజ్ఞకుడల
బహుకాలము సంతు లేక బడయక సుతులన్
బహు తేజుల ధీర వరుల
విహితంబగు యజ్ఞమొకటి వేడ్కతొ జేయన్

క. కడకొని యాగము సర్వము
తడయక దీర్పంగ నంత ధన్యత వెలయన్
కొడుకును కూతును వెలసిరి
కడు యోగ్యులు అగ్నినుండి కామిత మొప్పన్

వ. ఇపుడా పుత్రికి స్వయంవర మహోత్సవము జరుగు చున్నది. ఎందరెందరో బ్రాహ్మణులు భూరి దక్షిణలు ఆశించి వచ్చుచున్నారు. మరియు నెందరెందరో మహా రాజులును గూడ వచ్చి యున్నారని విని యున్నాము. మహోత్సవ సందర్శనార్థమై వచ్చు వారలును లక్షోపలక్షలుగా వచ్చు చున్నారు. వచ్చిన వారెల్లరకును భోజన వసతిసదుపాయములు పెక్కులు పాంచాల భూపాలుడు చేయించినాడట. మీరునుం వచ్చిన మాతో రండన మాట్లాడు కొనుచు వారలతో నడచుచున్నంత ముందర–

## వ్యాసులవారి రాక

క. కృష్ణాజిన దండధరుని
విష్ణు విభాసను జగతిని విజ్ఞాన సు భ్రా
జిష్ణు తపోధను పావను

కృష్ణ ద్వైపాయన ముని గాంచుచు వారల్

వ. అమ్మునికి సాష్ఠాంగపడి నమస్కరించి కృతాంజలి ఘటింప సత్యవతీ నంద నుండు శుభమ్ములు కలుగును లెండని సంతోషమ్మున పల్కిచనిన సంతుష్ఠాం తరంగులై కతిపయ దినములకు పాండవులు పాంచాలపుర ప్రవేశము గావించి కూతు స్వయంవరార్ధము పాంచాలభూపతి ద్రుపదుండు చేయు సత్కారములు గొన వచ్చిన బ్రాహ్మణుల తోడన బ్రాహ్మణరూపధరులగు పాండవులు పాంచాల పురమున కేగుట–

## ద్రౌపదీ స్వయంవరము

క. నాలుగు దిక్కుల వచ్చిన
సాలంకృత రాజ రాజ సదయుల కెల్లన్
మేలగు తెరగుల విడుదుల
యే లోటును రాక నుండ యేర్పాట్లెల్లన్

వ. చూచుచు తమ్మెవ్వరెరుంగ కుండు నట్లు పట్టణ చివర కుమ్మరి వాడ నొక కుంభకారు గృహంబున విడియించి బ్రాహణవృత్తి నుండునంత, ద్రుపదుండు కూతు పాండవ మధ్యమున కీదలంచి యున్నవాడు. వారల రాకకై ప్రతీక్షించుచుఅన్వేషించు చు యెందును కాన రాకుండుటయును వచ్చిన వారెల్లర నోటవిన్నను మత్స్యయంత్ర పు మాటయే మహత్తరముగా వినవచ్చుటయును స్వయంవరమంటపముల బ్రాహ్మ ణుల తోడ గూర్చుండియు –

సీ. అర్ధ వేదాంత శాస్త్రార్ధ సార విమల
విజ్ఞాన విదుషులౌ విబుధ తోడ
పృధివి నేలెడు రాజ రారాజ మహరాజ
రాజేంద్ర నృప వరుల్ రహిని దేర
కోట్లకు పడగెత్తి కోటీశ్వరు లనంగ
కోమటి వణిజుల కులము జేర
వీరులు శూరులు విఖ్యాత విలుకాండ్రు
దేశ దేశాగతుల్ దీప్తి రావ

తే. మత్స్య యంత్రము దునుమాడి మాన్య చరిత
ద్రుపద పాంచాల రాజేంద్రు దుహిత గొనగ
కోటి కొక్కండు చూడనా మేటి వరుడు
జూడ ముచ్చట కాదొకో చోద్యమనుచు

వ. ఎల్ల వారలును యెపుడెపుడని ఆత్రంబున జూచుచుండ-

సీ. పారాణి దిద్దిన పదము లొండొరు వేగ
గజ్జలందియ మ్రోత ఘల్లనంగ
ఊరు శోభల శౌరుఉర్రూత లూగింప
గజయాన గమనమ్ము గడలు కొనగ
నడుము సుంతయు లేక నాభ్యంతరాళమ్ము
చిన్న కస్తురి బొట్టు చెన్ను దోప
కలువ రేకుల బోలు కమనీయ నేత్రాల
ముసిముసి నగవుల మోము దనర

తే. మన్మధాగ్నులు రేపునా మగువ వేపు
యెంత యెంతన చూడనా యింతి సొబగు
విరుల దండయు చేకొని వింత శోభ
మహిత మంగళ ప్రదమొచు మగువ రాగ

తే. భేరి వాద్యాలు మిన్నంది భోరనంగ
భూసురాన్వయ ప్రవరులు పుణ్య సతులు
కలశ పూజలు చేయించి కన్య తోడ
వేద మంత్రాంగ విధి ఘోష విభవ మొప్ప

వ. అట్టి శుభ తరుణమున భేరి నాదమ్ములు వారించి ద్రుపద రాజ తనయుండు ద్రుష్టద్యుమ్నుండు వచ్చిన రాజ లోకమ్మును సభాసదుల నుద్దేశించి మృదు మధుర గంభీర స్వరంబున సభా మధ్యంబున నున్న మత్స్య యంత్రమును జూపుచు, ఇదియె ధనువు. ఇవియే బాణమ్ములు.

తే. వీర వరు లార రాజన్య వీరులార

అస్త్ర విద్యాది బహుముఖ ఆఢ్యులార
యేను అమ్ముల యంత్రమ్ము నేయు వాని
నాదు చెల్లెలు వరియించు వాదులేదు

వ. అని పల్కుచు చెల్లెలు వంక తిరిగి యిమ్మహీతలంబునం గల వీరాధి వీరులును శస్త్రాస్త్ర బహుముఖ విద్యా పారంగతులును అగు రాజ కుమారు లెల్లరునునీ స్వయంవరార్ధము వచ్చిన వారు. వీరలం జూడు మని వరుస క్రమంబున నొక్కొక్కనిం జూపుచు వీరు దుర్యోధన దుశ్శాసన దుర్ముఖ ప్రముఖులైన ధృత రాష్ట్ర నందనులు నూర్వురని తత్సమీపమున నున్న కర్ణఅశ్వద్ధామ సోమదత్త భూరిస్రవ శ్శృత సేనాదులని పుత్ర భ్రాతృ సమేతులరగు శల్యవిరాట జరాసంధ గాంధార పతులని అక్రూర సారణ సాత్యకి సాంబ సంకర్షన ప్రద్యుమ్న కృష్ణ కృతవర్మ అనిరుద్ధ యుయుధాన ప్రముఖులైన యదు వృష్ఠి భోజ అంధకవరులని సుమిత్ర సుకుమార సుశర్మ సుదక్షిణ సుషేణ సేనా బిందు చంద్రసేనబృహద్రధ సత్యవ్రత చిత్రాంగద శుభాంగద భగీరద భగదత్త పౌంద్రకవాసుదేవ వత్సరాజ ప్రభృతుల రను నానా దేశాధీసులును వేద ధ్వని సనాథంబై వెలయు బ్రాహ్మణ సమూహముం జూపి ఇందు –

తే. లక్ష్య బేధన మొనరించు లక్షణాంగు
వీర వరు తగ వరియించు ధీర యనగ
రాజ రాజన్య సుతు లెల్ల రాగ మొప్ప
విల్లు మోపెట్ట గడచుచు నెల్లవారు

తే. సమయ మాసన్న మౌటను సదయు లెల్ల
చూడ దొడగిరి విల్లంబ్లు చూచు వార్ల
వేడ్క యెంతేని దరి నేగు వీర వరుల
కన్ను లార్పకె జూచు నా కన్నె వైపు

వ. అదే అదనగు తరుణ మని చూడ వచ్చిన

క. మలయా నిలయ సమీరుడు
కళ కళ పెట్టుచును దెచ్చె కమ్మని తావుల్
తల గొని ధన్వును బట్టగ

చెల మెంతన వచ్చు వారి చేష్టల కనువై

వ. అటులనే ఆ మహా మహనీయ మత్స్య యంత్రమును యెవ్వరు సాధింతురో యని చూచుటకు గాను ఇంద్రాది యమ వరుణ కుబేరాది దిక్పాలురును నాగయక్ష గరుడ గంధర్వ కిన్నెర కింపురుషాది దేవతాగణములును ఆకశముననుండియే వీక్షింప దొడంగుటయును నృత్య గీత వాద్య వినోదమ్ముల మనోహరంబునై ఆ సభ త్రిలోక వందితమై వెలుగొంద–

క. మనమున గొందల మందుచు
ఘన చాపము ద్రుంప జాలు ఘనునర్జునునిం
తన బావల పాండు సుతుల
కననాయెను కృష్ణ డంత ఘనులగు వారిన్

వ. అంత నా స్వయంవరార్ధము వచ్చిన రాజేంద్రనందనులు ద్రుపద రాజేంద్ర నందన కృష్ణంజూచుచు మన్మధాయత్త చిత్తులై యెటులైనను ఈ యంత్రముంద్రుంచి యీమెం చేబట్ట దలంచి అవ్విల్లెక్కు పెట్ట నుంకించి తమ బాహు శక్తిని–

క. చాలీ చాలక కొందరు
చాలాంచలములు బిగించి చేకొని ధనువున్
కాలుం జేతులు వణకగ
నేలం బడి లేవ లేక నీల్గెడి వారిన్

క. చూచిరి గుస గుస నగవులు
దాచ తరము గాక పొక్క తక్కులు యెల్లర్
వేచను వారలు సహితము
పోచని రా ధన్వు విడచి పోడిమి తక్కిన్

క. విల్లా యిది యని రాజులు
సల్లాపము లాడి ద్రుపదు సరసోక్తులతో
అల్లరి పెట్టుచును కులము
తల్లడి పాల్నేయ నీకు తగునే యనుచున్

క. వరునొక్కని వెదకు కొఱకు

పరువిడి యీ యంత్ర మేర్చి పన్నిన వరమా
నరులకు తరమే యిట్టిది
యెర జేయను యెల్ల నృపుల యేమన వచ్చున్

వ. రాచ కూటంబెల్లరు ఒక్కటై విల్లు మోపెట్ట నేరక యూరకుండ యదు వృష్ణి భోజాంధకులు కృష్ణానుమతంబున అనారబ్ధు లగుటయును, శిశుపాల జరాసంధ శల్య కర్ణులు నల్వురుం దర్పితులై ముందునకు వచ్చియు ధనువుం బట్టియు గొనయం బెక్కించియు మోపెట్టి వంచ నశక్యంబగుడు వెన్దిరుగ అగ్రజు నను మతంబున భూసుర సభా మండప మధ్యంబు నుండి విజయుండు ముందునకు వచ్చి ధనుస్సమీపంబున కేగు వానిం జూచుచు కొందరు బాపలు తమలో తాము–

క. ఏమీ బాపని తెగవిటు
సామాన్యమె యంత్రమేయ సాహస మెంతన్
భూమింజయ బల దర్పులె
యేమాత్రము జేయరైరి యే యొక్కరుడున్

క. అనువారల వెస జూచుచు
ఘనుడీతడు మంత్రవేత్త ఘనభుజ దర్పం
డను వారలు యింకొందరు
ధనువెత్తియు శక్తి దునుము ధన్యత వెలయన్

వ. అనుకొనుచున్నంత న ద్విజ వరుండు వింటి సమీపమున కొచ్చి గురువులకు నమస్కరించి ధనువునకు ప్రదక్షి ణము జేసి మ్రొక్కి మత్స్య యంత్రము దెస నిక్కిజూచియు పైకొక్క పరి అందరును జూచు చుండ–

## బ్రాహ్మణ రూప ధారి మత్స్య యంత్రమును దెగ నేయుట

ఆ. వాటమౌగ విల్లు వడి బట్టి మోపెట్టి
గొనము గుచ్చికొనను గుయ్య వంచి
నీడ జూచి నీట నింగిని తిరుగాడు
మీను నేసె గురిగ మేటి యనగ

వ. అంత కరతాళన ధ్వనులతో సభ యంతయును మార్మోగ దిక్కులు మెరయ న య్యనఘుని జూచుచు రాజలోకం బెల్లను విస్మయాశ్చర్యములనొందుచు ముఖముల విన్న దనంబు దోప క్షాత్రజేయ శక్తి కంటె బ్రాహ్మణ మంత్రాస్త్ర శక్తి మిన్నయని కొని యాడు చుండ భూసురులెల్లరు ఆశీశ్సులతో పొగడొంద ఆకశము నుండి దేవ దుం దుభులు మొరయ అన్నరుపై ఇంద్రాది దిక్పాలురు పుష్ప వృష్టి గురియింప–

సీ. రాజ లోకంబెల్ల రహి జూడ కన్నెఱ్ఱ
విప్రవరు నొక్కని విజయు గాంచి
సుర రాజ సన్నిభు సుందరాంగుని నరు
కన్నుల జూచుచు కలిమి చెలిమి
ముదమార మనసున ముద్దియ ద్రౌపది
ఆనంద ముప్పొంగ అనుపమాంగు
సిరిగల మగడంచు శిత పుష్ప ధామమ్ము
మెల్ల మెల్లన దెచ్చి మెడను వేయ

ఆ. అవని యింద్ర తేజు డానందమున దేలి
చిన్న దాని బుగ్గ చేయి జేర్చి
మేలమాడనైన మేదినీ వల్లభ
కౌరవేంద్రు లాది కన్ను కుట్ట

తే. ద్రుపదు డిట్టి పన్నగ మేల దుహిత కొఱకు పన్నె పోనిందర పనిగట్టు పిల్వ నేల పిల్చియును సత్కృతుల నేల సల్పి పెక్కు యిందరిందరు మహరాజు లంద్ర మధ్య యంత్ర మేసిన వాడంచు మంత్ర విప్రవరుని మెడలోన వరమాలవహ్వాయిడగ సిగ్గుచేటని రాకులమగ్గి కురిసి ద్రుపదు దండింప దొరకొన దుర్నయంబ.

తే. తండ్రి మాటనె దలచి యాతనయ మదిని
అన్నమాటకు తల యొగ్గి కన్నె గాన
విప్ర వర్యుని వరియించె తప్ప దనుచు
తప్పు ద్రుపదున్ది దండింప తప్పదనుచు

క. సద్యః స్ఫూర్తిత శక్తిన్

ఉద్యోగించియును ధనువు ఉధృత దిగిచిన్
సద్యో ఫలమని గొనె తా
వధ్యుండన దగడు విప్ర వర్యుడు మనకున్

వ. క్షాత్ర తేజంబీ జగతిని అనాథ స్త్రీ బాలవృద్ధ దేవ బ్రాహ్మణోద్ధరణార్థంబు కావు న ఆ విప్రు ద్రుపద పుత్రియల తోడిదేమియని ద్రుపదుపై కోపించిన వారలై రయ మున తమతమ ఒరల నుండి ఖడ్గంబులు తీయ భీతుడై ద్రుప దుండు తమ ముం దున్న బ్రాహ్మణ భృవుల మరువునకేగ, యిట్లు శరణాగతుండైన వాని నూరడిల్లుమని మత్స్య యంత్రముం దునుమాడిన విజయుండు ఆ ధనువెత్తి జూపుచు –

క. ఇదె యీ తూపుల దునుమా
డుదు యిటు యీ ద్రుపదు మీద యెత్తిడు వారిన్
యెదిరిచి నిల్చిన నృప వరు
పదపడి రా రమ్మ టంచు ఫల్గుణు డాజిన్

వ. అని తానును భీమసేనుండును రిపు బలములపై తలపడ భీముడొక్క వృక్షము ను పెఱుకు కొని అర్జునున కండగా నిలబడ వారల జూచిన బలరామ కృష్ణులు సంప్రీతులై లాక్షాగృహ దగ్ధుల రైన వారల నిట్లిప్పుడు చూడగడంగుట మహదానం ద మగ్నులగుచు నుండ కురుపతి చూడ కర్ణశల్యు లిరువురును పాండవ మధ్యముని తోడను కుంతీసుత మధ్యముని తోడను తలపడి పోరస రభసమున విస్మయమందిరి దివిజ భూసురు లెల్లన్.

క. కర్ణార్జు నుల యుద్ధం బది
వర్ణింపను యేరి తరము పరమోధృతమై
నిర్ణీత శర పరంపర
పూర్ణంబుగ దురిత దిశల పూర్వా పరముల్

వ. అట్లా సమరమ్మున అర్జునుడేయు సాయకముల వారింపనేరక మహా శూరుడు రాధేయుం డర్జునునితో–

క. నా యెదిరి నిలిచి పోరగ
సాయుధుడా నరుకె చెల్లు సాయక వృష్టిన్

నే యెరిగెడు యింద్ర తనయ
నీ యని నేర్పెరుగు దేను నిశ్చయ మనుడున్

వ. ఏ నీ చెప్పిన వాడ గాను. ఐనను శస్త్రాస్త్ర విలు విద్యా పారంగతుడ నగుట నిశ్చయంబు. భూనుత బ్రహ్మ తేజోధికుండ నిన్నోరిలో నిల్వరింతు నిలు మన విని కర్ణుండు బ్రహ్మతేజంబజేయమని క్రమ్మరియె. మరి శల్య భీములు మల్లయుద్ధమున గడంగి బోరునెడ భీమ బలంబున శల్యుని బట్టికొట్టి ముష్టి ఘాతంబుల ద్రెళ్ల వైచిన వెను దిరిగి చూడక నిజ మార్గణుండై జనె.

క. నర హర రాములు తక్కగ
నొరులకు సరి గాదు గెల్వ నూర్జిత కర్ణున్
గురుతర శల్యుతొ బోరను
తరమా బలరామ భీమ తక్కుల కనుచున్

ఆ. అస్త్ర ముష్టి బలిమి అర్జున భీములా
అనుచు దోచు చుండె అగుదు రేమొ
యెరుగ దగును వీర లెవ్వరో తెలియను
కౌరవేంద్రుడనియె కర్ణు తోడ

వ. వీరి పూర్వాపరములు లెరుంగనగు. ఎవ్వరో ఎందరో. ఏ వృత్తుల జీవించువారలో అని తర్కించు వారలం జూచి కృష్ణుండప్పుడు –

క. ఘనుడీ భూసుర తేజుడు
తనదగు అస్త్రాదివిద్య ధన్యత వెలయన్
దునిమియు యంత్రము నింగిని
తనదానిగ జేసుకొనియె తన్విని సభలో

క. తెలియదు ధర్మాధర్మము
కలి చేయగ తగదు లెమ్మ కౌరవ యోధా
చలమెంతయు గల యోధులు
ఇల లేరని యెరుగ తగవె యింతయు యెంతన్

వ. అని వచియింప నెల్ల నృపులును తమతమ మార్గమ్ములం బడి పోవ భీమార్జు

నులు ద్రుపద రాజ తనయం దోడ్కొని తల్లి కుంతికి జూప రావ గడప ముందునకు వచ్చి తల్లితో అమ్మా ! నేడొక మహారాజు ఫలమును పొందియున్నారమన యెప్పటి యట్ల నాతల్లి కొడుకులతో ఐదుగురును సమానముగా అనుభవింపుడన ఇదిగోన మ్మా ఫలమని తాదెచ్చిన ద్రుపదరాజ పుత్రికం జూప ఖిన్నయై లజ్జించి సత్యాధర్మ భీతయై కుంతి–

తే. ఏమి చేయుదు నేనంచు యింతి కుంతి
తెలియ కెంతయు ఫలమన తొల్లి యట్ల
అనుభవింపుడు ఏవురు నంటి గాని
అనృతము అవదు నా మాట అగుట నిజము

తే. ఏమి చెప్పుదు నేనిప్డు నెవరి నందు
విధి విధానమ్ము తప్పదు వింత యనుచు
సాటి ఆడది మాటాడు మాట యిదియ
లోక పరిపాటి కాదని లోకులనరె

వ. అనుచు తల్లడిల్లు నాతల్లి నూరార్చి ధర్మ నందనుడు అర్జునా ఆ యంత్రముం ద్రుంచినది నీవు కావున దీనిని నీవ వివాహము గావించు కొనుమన్న అన్నకు అర్జు నుండు యిట్టు లనియె.

తే. పెద్ద అన్నకు మునుముందు పెండ్లి యౌట
ధర్మ సమ్మత మనుమాట ధరణి వినమె
అనుజు లందరి సమ్మతి యదియ సుమ్మ
అనెడు మాటకు ధర్మజుండాడె యిట్లు

తే. పెద్దవాడను నా మాట పెంపు జేయ
విధి విధానము వ్యాసులు వినిచి నట్లు
ఐదుమందికి ఆలిగా అగును యామె
అమ్మ మాటయు నిజమౌగ అనగనంత

చ. యదుకుల రాజ శేఖరులు యాదవ ముఖ్యులు రామకృష్ణులా
అదయులు కౌరవాన్వయుల అకృత చర్యల లక్కయింటిలో

విదళిరులైన వారినిట వింతగ కన్గొని సంతసంబునన్
సదయత జూడవచ్చి రిల సత్కృప పాండుల మేనయత్తనున్

వ. కని తమ్మెరిగించుకొని అయ్యుధిష్ఠిరుకుం కుంతికిం మ్రొక్కి తమకు నమస్కరించిన భీమార్జున నకుల సహదేవులం కౌగలించు కొని క్షేమం బరసిన వానితో ధర్మ తనయుండు –

క. మమ్ముల నోర్వని కౌరవు
సమ్మతి బోకూడదనుచు సమయజ్ఞులమై
యిమ్మహి గ్రమ్మరుచున్నా
మమ్మెటు యెరుగంగనైరి మాధవరాముల్

వ. అనిన వాసుదేవుండు నగుచు

క. ఆయత భుజ బల కీర్తుల
ధీయుత శక్త్యాను వర్త్న తేజో నిధులన్
బాయని అంతః కరణుల
మాయని ధర్మానురక్తి మనసగువారిన్

క. మంచికి నెలవై జగతిని
వంచనులై రూపుమాయ వహ్నికి సమమౌ
పంచాగ్నిద్యుతి కాంతుల
అంచితముగ దాచనగునె ఆనుపమ తేజిన్

వ. ఆని అనన్య సామాన్యమగు మత్స్య యంత్రము నేయుట కర్జునుకుం గాకన్యుల తరంబె. అటులనే ద్రుపదుమీద దండెత్త వారినిలువరించు సమయంబున అర్జునకు తోడుగా వృక్షంబును పెరికికొన నొక్క భీమునకే చెల్లు నని వీరల బలపరాక్రమము లమిమ్ముల నెరుగంగ నైతిమి. అధర్మ వర్తనులగుచు దుర్యోధన ధృతరాష్ట్రులు చేసిన లక్షాగృహ దహన ప్రయోగము నుండి బయట పడిరింక మీకు లగ్గగు, నని బలరామ కృష్ణు లేగిన, నిట ద్రుపదుండు తన కూతునకు వరుండయిన వాడెవ్వడో యెరింగిరమ్మని ద్రుష్టద్యుమ్ను నంప భీమార్జునద్రౌపదుల వెంట వచ్చి తమ్మెవ్వరెరుంగకుండ నా కుంభకార గృహము నుండి యంతయు యెరింగి పోయి తండ్రి కిట్లనియె.

ఉ. చెల్లిని దోడ్కొనిద్దరును చెయ్యన మ్రొక్కగ జేసి తల్లికిన్
మెల్లగ నేగిరా సుతులు మేమటు చూచుచు నుండగావడిన్
అల్లన భూసురావళులు ఆప్తితొ బెట్టిన అన్న భక్ష్యముల్
తల్లికి యిచ్చినం పిలచి తద్దయు వేడ్కతొ చెల్లి కిట్లనెన్

తే. అతిధి అభ్యాగ దేవుల కర్ధ ముంచి
మిగులు దానిల సగభాగ మిమ్ము భీముకై
మిగులు నల్వురు మెసకగ కడమ
తింద మిద్దర మమ్మరో తెలియు మమ్మ

వ. కృష్ణయు నా యవ్వ పంచిన విధంబున నందఱకుం బెట్టి తానును ఆమెతో ది
ని పూరి మెత్తళ్లు వేఱ వేర యిమ్ముగా నమర్చి వానిపై కృష్ణాజినంబులు పరచి,తాను
ను ఆమెతో వేరొక పూరి మెత్తళ్ల మధ్య శయన విశ్రాంతి యైన-

క. అంతయు జేసినదియు నా
వంతయు బాధ పడక అనువౌ రీతిగ నే
వింతగ జూచుచు మనమున
యెంతో వేదన పడితిని యేమన వచ్చున్

క. పుట్టెడు భాగ్యము తోడుత
బుట్టినది కడకిటు వట్టి పూరిలు జొచ్చిన్
ఎట్టుల సుఖపడ గలదో
దిట్టత నుండెను మనసున ధీరత తొడన్

క. వేసములా బ్రాహ్మణులయు
బాసలు బహు రాజసములు భక్తులు గూడన్
నాసరములు బాణచయము
యీ సరి లేరెట్టి సుజను లేర్చియు చూడన్

వ. వీరు బ్రాహ్మణులో క్షత్రియులో తప్ప అన్య జాతుల వారు కారని నా నిశ్చయ
మన ద్రుపదుడు మనమున సంతసిల్లి తన పురోహితుం బంపి వారల విషయములు

నిశ్చయముగా తెల్సి కొని రండన, వారల వద్దకు వెళ్లిన పురోహితుడు ధర్మరాజు చే యు గౌరవ మర్యాదలు స్వీకరించి–

ఉ. ఆకుల మందుచుం ద్రుపదు డాయత శక్తిని యంత్ర భేదనుం
మీ కుల గోత్ర నామముల మెల్ల నెఱుంగను బంప వచ్చితిం
మీకును మాకును శుభగ మెంతయు గూర్పను సంతసంబుగా
ఏకము గావుతం బలము ఏర్పడ జెప్పుము ధర్మబద్ధతన్

వ. అనవిని ఆతనికి ధర్మనందనుండు. మహాశయా!

ఉ. ఇప్పుడివేల యన్నియును యేర్పడ విన్నను యేమి సేయునో
తప్పదు కూతు నీయగను తక్కుల కానదె యంత్రమేయగా
చెప్పిన మాట చొప్పునను చేయగ జెల్లదె క్షాత్రతేజతం
అప్పుడె గెల్చె నాసతిని ఆధ్యత రాజసభాంతరంబునన్

వ. అని ధర్మరాజాడిన మాటలు విని ప్రభువుల మనోగతంబున ఫలముగా గలదని వగవ బనిలేదని విన్నవింప ద్రుపదుండు ద్రుష్టద్యుమ్నుని పిలచి చారుర్వర్ణోచితంబుల గు అరదములం గొంపోయి యీ రధంబు లెక్కి రాజ సముఖమ్మునకు రా గోరుట యును పాండవులు రాజోచితములైన కనక మణిమయాలంకృతరధంబులెక్కి దల్లిని ద్రుపద రాజ నందనుం మరియొక రథంబునం తోడ్కొని ద్రుపద రాజ పుర సౌధం బులకు రా, వారల ననేక విధ సత్కారంబుల పూజించి అనేకానేక వస్తు సామగ్రుల నిచ్చి గౌరవింప, పాండవులు, మహారాజు రాజోచితంబులగు రధ గజాశ్వ బాణతూ ణీర గదాఖడ్గాది వస్తువుల గ్రహింప, సుక్షత్రియులని మనంబున నిశ్చయమగుటయు ను, సంశయ నివృత్తి కొఱకు ద్రుపదుండు ధర్మరాజుతో మీరు బ్రాహ్మణులో క్షత్రియు లో మర్మజ్ఞులరై గ్రమ్మరుచున్న మంత్రసిద్ధులో లేక నా పుత్రిక కృష్ణనుం చేబట్టం దివి నుండి భువికి దిగి వచ్చిన దేవతా పుత్రులో యెఱుంగము. మీకల రూపెఱింగించి కృతార్థుని చేయవేడుచుంటినన.

క. రాజాన్వయ సుక్షత్రియ
సంజాతుడు పాండు భూపతి సంతతి, నే ధ
ర్మజు, భీమార్జున నక సహ

దేవానుజులము తిరముగ తెలియుము వరుసన్

వ. వీరు మా తల్లి కుంతీదేవులని యెరింగించిన ద్రుపదు డత్యంతానంద పార వశ్యంబున ధర్మజుం కౌగలించుకొని మిగిలిన భీమార్జు న నకుల సహదేవులం అతా ్యదరంబున ఆలింగనము గావించు కొని ఆనందాశ్రుధారల నభిషిక్తులం గావించి వేనోళ్ల కొనియాడి నాభాగ్యమ్మున గాదె మీరలా లక్షా గృహ దహనమునుండి బయ లు పడితిరని ధర్మ రాజువలన తద్వృత్తాంతం బంతయుందెలసి కౌరవుల పన్నాగం బుల నిరసించి, ఒండొక రోజున ప్రియ భాషణంబుల ద్రుపదుండు సుఖాసీనులయి యున్న పాండవులతో ద్రుపదుండు నా పుత్రిది.

ఉ. ఎంతటి భాగ్యమో దెలియ దింతటి వాసవ నందనాఖ్యుకుం
సుంతయు బార్య కానగుత సూనృప పాండవు తోడి కృష్ణకుం
వింత గదా విధాత్రు కృప వీరల జంటగ కూర్చుటొప్పు దా
వంతయు కానరారెవరు పంతము లాడిన యెట్టి వేళలన్

వ. అనినా పాంచాల భూధవునితో ధర్మజుండు రాజా! నీ తనయ పెండ్లియాడునది వాసవనందనుండొక్కండు కాదు. మా అమ్మ కుంతీదేవి మాటమాకలంఘనీయము. ఆమెనసత్య భాషను చేయ జాలము. ఆమె మాటచొప్పున మేమందరమును యీ ద్రుపద రాజ నందన నుద్వాహమాడెదమన, ద్రుపదుండు విస్మితుడై ధర్మరాజుతో-

తే. ఏడ గలదిట్టి ధర్మమ్ము ఎందు వినము
ధర్మ మార్గమ్ము దప్పుదో ధర్మరాజు
పదుగురాంద్రుల బురుషుండు బడయ నగును
భర్త లైదురు గలయట్టి భార్య యున్నె

వ. మీరు ధర్మార్థవిదులు. లౌకిక వైదిక వృత్తులందెందును యిట్టిది కనివినియెరుంగ ము కదా? ఐన నీ చింత యిప్పటి కుడుగుదము. రేపటెల్లుట మనము మీ యమ్మ కుంతీదేవితోను ద్రుష్టద్యుమ్నును తోడను పెద్దలైన సత్య ధర్మవిదుల తోడను ఆలోచిం తమని-

## కృష్ణ ద్వైపాయన ముని రాక

వ. ఎటులీ సంశయ నివృత్తి చేసుకో దగునో తెలియక ద్రుపద ధర్మజు లిర్వురును-

క. ధృతి నెరుగుచు మది దలపను
అతులిత నిష్ఠుడు వ్యాసుడచటకు రావన్
స్థుతియించుచు ధర్మ మెరిగి
హిత విధి శలవీయుడంచు యిద్దరు కోరన్

వ. అపుడు త్రికాలజ్ఞుండును సత్యసంధుండును ఐన కృష్ణద్వైపాయనుండు ద్రుపదునితో-

క. సత్యము ధర్మము యెడలను
అత్యాప్తుడు ధర్మ తేజు డనుపమ గుణుడీ
సత్యుని పల్కులు తప్పవు
నిత్యమునై ధరణి జెలగు నిజమూహింపన్

వ. మరియుం దొల్లి గౌతముండైన జటిలుడను ఋషి కూతురు త్వష్ట ప్రభావమ్మున నేడ్వురు ఋషులకు నొక్కతియ భార్యఅయ్యెననియును, దాక్షాయని యనుమునికన్య యేక నామంబున ప్రచేతసులనంబరగిన పదుండ్ర కొక్క తియ భార్య అయ్యె నని యును కథల వినంబడు చున్నయది. అట్టి యా యమ్మ మాట పాటించుటయును పరమ ధర్మంబని అదియునుంగాక.

## పంచేంద్రోపాఖ్యానము

తొల్లి నాలాయని యైన యింద్రసేన యనంబరిగిన మహా పతివ్రత మౌద్గల్యుడను మహాముని భార్య అయి కర్మవశంబున కుష్ఠువ్యాధి బాధితుండైన భర్తచే శరీరసుఖంబులు అనుభవింప నేరకయున్న అమ్మహాముని తనతపఃప్రభావమున బ్రహ్మమయుండైన కామభోగములం దనియక కాల వశంబున శరీరము విడిచి కాశీరాజు అను రాజ ఋషికి కూతురుగా బుట్టి కన్యాత్వంబునం పెద్ద కాలముండి పతిం గోరి పశుపతి నుద్దేశించి నుగ్ర తపంబు చేయ పరమేశ్వరుడుప్రత్యంక్షంబై యేమి కావలయునో కోరుకొమ్మనిన పతి దానమ్మనుగ్రహింపుమనిపతి పతి అని యేను మార్లు కోరఅటులనే యీ దేహాంత్రమున నీకేవురు పతులు కాగలరను వరంబీయ, ఆమె, దేవా!ఇది లోక విరుద్ధము కావున వరమును ప్రతిగ్రహింపుమన్న నా వచనమ్మున నీకేవురుపతులగుదురు. వగవకు మన్నను ఆమె చింతాక్రాంతయైయుండ పశుపతి ఆయే

పురయందున ధర్మ మేమరకుండును లే అన్న అట్లేనియు పరమ శివా! అయ్యేవుర యందును ప్రత్యేక సంగమంబును కౌమారమ్మును పతిశుశ్రూషా సిద్ధియు కామ భోగేశ్ఛయుసౌభాగ్యమును ప్రసాదింపుమన పరమశివుండట్లేయని అంతర్హితుండగుట ను ఆదిగా చెప్పుచు ఆయాజ్ఞసేనియే నీ అగ్ని కుండమ్మున ఉద్భవించినదని నమ్మలేని పూర్వ వృత్తంబులు తిలకించునదిగా ద్రుపదునకు దివ్యదృష్ఠి ప్రసాదింప ద్రుపదుం డంతయుఆత్మ గతంబున సదృశ విలోకనుండై విస్మితుండై హర్షించి యున్న ద్రుపదు నకు కృష్ణద్వైపాయనుండు వెండియు, తొల్లి నితంతుడను రాజఋషి కొమరుల అ నంత బల పరాక్రములుసాల్వేయ, శూరసేన, శ్రుతసేన, బిందుసార, ఆతిసారులను యేవురుం పరస్పరానురాగ స్నేహ వినయంబుల అతి ప్రసిద్ధులై పెరుగుచు నౌశీనర పతి కన్యక నదిత యను దాని స్వయంవరమునబడసి వివాహము ఆడిరనియు, యి ట్టిది తొల్లింటి మహాత్ములయందు అక్కడక్కడ నిహితంబుగా గలవు గావున పాండవు ల కేవురకును ద్రౌపదినిం క్రమంబునపాణిగ్రహణముచేయుమిది దైవకృతంబనియు ను ద్రుపదుండు యిష్టుడైయుండ వానిని కుంతియుపాండవులున్న చోటికిదెచ్చి కృష్ణ ద్వైపాయనుండు యుధిష్ఠిరునకిట్లనియె.

## ద్రౌపది వివాహ మహోత్సవము

ఆ. నేడు పుణ్య దినము నెమ్మితో రోహిణీ
యుక్తుడయి శశాంకు డున్నవాడు
మంత్ర వంతముగ గ్రమంబున యేవురు
పెండ్లి యగుడు కృష్ణ ప్రీతి తోడ

వ. అని నిశ్ఛయించి పనిచిన పాంచాల పతియు కరంబనురాగమున వరా భీష్ట శోభనము గావించి కూతు వివాహ మహోత్సవ సన్నద్ధుండగుటయు చందనోదక సంసిక్త ప్రాంగణ రమ్య రంగ రంజిత రాజ మనోహర ముత్యాల రంగవల్లుల తోడ ను సముచితాలంకృత పర్యంకతాసీన ఉన్నతాసనముల తోడను నవ నవోన్మేష కదళీ స్తంభ శోభనా శోభితమ్మును, చూతప్లవ అశ్వత్థ కుసుమ కోమల పల్వాలాలంకృత తోరణముల తోడను, సువిశాల ద్వార దేశంబుల తోడను, నాగ పున్నాగ జాజీ కుం దమందార గులాబీ సంపంగీ మల్లీ కనకాంబరాబంతి చామంతీ సుగంధ బంధుర

కుసుమగుచ్ఛంబుల తోడను శృంగార రంగవారంగనా బహుభంగుర వివిధ నాట్య కళావిన్యాసముల తోడను, గాయక గాయనీమణుల తోడను, ఉత్సవ సందర్శనాగతా నేక స్త్రీ బాల వృద్ధ రాజ సుహృద్బాంధవ బంధు జన సంకులమ్మును, మంగళాశాస న బ్రాహ్మణ పుణ్యాంగనా సముదయముల తోడను, భూరి విరాళము లందుకొన వ చ్చిన సదస్సుల తోడను ద్రుపద రాజ రాజసౌధ మందిర మధ్య సువిశాల పూర్వోత్త ర దిగ్భాగమ్మునరంగు రాజిల్లు చీని చీనాంబరముల వివిధ విరచిత శోభనాకృతుల స్తంభ వేష్ఠనంబున ప్రత్యగ్ర పల్లవ శాల్య క్షతాంచిత కాంచన పూర్ణ కలశోప శోభిత మ్మును, చందన కర్పూర సమిస్ర నవ గోమయ శ్యామ మరకత మౌక్తిక ప్రభాపటల హిరణ్మయ వేదిమధ్య సమిద్ధాగ్ని కుండ మండితమ్మును సర్వాలంకార సుందర శోభి తమ్మును అయిన వివాహ మండపమునకున్ జని నిజ పురోహిత హితుండైన ధౌమ్యుండాదిగా పెక్కురు విద్వన్మహీసుర నివహముతో కరంబొప్పి–

సీ. మహనీయ సద్భవ మంగళ స్నాతకుల్
వర వీర విక్రముల్ వరులు యేవ్రు
దేవ సన్నిభ తేజి దేదీప్య మానమౌ
వీర విక్రమ సింహ విదిత యశుల్
పూజనీయులు నౌచు పూర్ణేందు వదనయా
ద్రౌపది పెండ్లాడ తరలి రాగ
కమలాక్షి కమనీయ కాంతా సహస్రయై
వేగ దెంచె వివాహ వేది కడకు

ఆ. భూరి భూసుర గణ పుణ్యాహ రవములు
మేజువాణి రవళి మేలుగొల్ప
వివిధ మంగళ కర వీణా రవమ్ములు
విస్తరిల్లె శుభము వేళ గడియ

సీ. వేదోక్త మంత్రముల్ విస్తరింపగ నెంతొ
అగ్ని హోత్రపు విధుల్ అట్టె జరుప
కాళ్లను కడిగియు కన్నెదానము జేసె

దోసిలందు వరుస ద్రుపద రాజు
ముత్తెపు తలబ్రాలు ముదమొప్ప బోయించి
చెయ్యిన దలనుంప జీలగుడము
మట్టెలు దొడిగిరా మగువ వేళ్లకు వారు
సంతోషమున దేలి సఖియ జూడ
తే. మహిత మంగళ సూత్రాలు మగువ దాల్చ
కన్నె దానపు వరుస మిన్నగాను
అన్న దానాదు లెన్నియో అధిప జేయ
తుష్టి దీవించి రెల్లరుం పుష్టి దనర

వ. అని వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పె వినగ అను.
ఇది

**శ్రీశ్రీ వాణీ వరప్రసాదలబ్ధ సుకవిజనప్రియ సాధుజన విధేయ శ్రీశ్రీ కవిత్రయ స్ఫూర్తి ఆర్వేల నియోగి బ్రాహ్మణ మండపాక వంశోద్భవ వీర్రాజు పౌత్ర సూర్యప్రకాశం సత్యనారాయణాంబా తనయు విరచిత**
**-: శ్రీమదాంధ్ర మహాభారత ఆది పర్వ సప్తమాశ్వాసము :-**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆది పర్వ – అష్టమాశ్వాసము

### పాండవులు పాంచాల పురంబున సుఖంబుండుట

వ. అక్కధకుండు శౌనకాది మహామునులకుం జెప్పెనట్లు పాండు కుమారుల కేవుర కుం ద్రౌపది నిచ్చి వివాహము చేయించి ద్రుపద మహారాజు అయ్యేవురకును వేత్వే ర నూరేసి భద్ర గజముల తోడ కాంచన మణిమయ రధంబులును వేయితురగ రా జమ్ములును పదివేలగోగణ పరివారమును కానుకలుగాఅర్పించి కాంచన శయ్యా సౌ ధాగారమ్ము లమర్పింప నయ్యాజ్ఞసేని –

క. అతి ముదమున పతి గొల్చుచు
మతిమంతిగ అత్త దెసను మర్యాదలతో
ద్యుతి మించిన కోర్కె లెసగ
సతి తానై మెలగు చుండె సమ్మతి తోడన్

క. కోడలి గుణములు మెచ్చుచు
నీడగ నిలచియు పతులతొ నీదౌ విధులన్
వీడక పతులకు సరియగు
చేడియ వనిపించు కొనుము చిత్తజ వనుచున్

వ. మరియు నా హరియందు లక్ష్మిని, చంద్రునందు రోహిణిని, ఇంద్రునందు శచీ దేవిని, వశిష్ఠునందు అరుందతిని, మన్మధ క్రీడల రతినిన్ బోలి వర్తింపుచు –

క. పన్నుగ జేసెడి క్రతువుల
మిన్నంటిన రాజసూయ మేధము నందున్
వెన్నంటి పతిని గొల్చుచు
నిన్నమ్మిన ధర్మ దీక్ష నెరుపుము యుక్తిన్

వ. అదియునుం గాక –

క. రవితేజో విభవగుచును
అవిరళ గతి నతిధి జనుల కన్నము యిడుచున్
భువి నీదగు కీర్తి వెలయ
సవినియతం పెద్దవౌము సత్సుతు వడసిన్

వ. అని అనేక విధముల దీవింప, నట రేవతీ సహిత బలరాముండును, రుక్మిణీ సత్య భామామణులం గూడిన యశోదా నందనుండును ద్రుపద రాజ నందనద్రౌప దిని పాండవు లేవురుం వివాహంబగుట విని సంతసంబొందువ వారలేవురకును నవ రత్న రజితంబులగు విభూషణములను నానాదేశ దేశన్య చిత్ర విచిత్ర వస్త్రాలంకార సంచయమును అనేకానేక రథ గజతురగంబులతో పాటువిలాసవస్తు నివహంబును సమర్పించిన–

క. అరి భీకరులై వారలు
దురితోపశమన కరికర దుర్నయులగుచున్
పరసేవా తత్పరులై
కురుకుల సామ్రాజ్య వృద్ధి కోరిన వారై

క. అండగ నుండను ద్రుపదుడు
దండి మగల నృపట కోటి దర్పము లెల్లన్
ఖండించుచు పెరవారుగ
నుండిరి యా పాండు సుతులు యుద్ధతి మిగులన్

వ. ఇట్లు పాండు కుమారులు ఉద్దండులై ద్రుపద పురంబున అభీష్ట సుఖము లను భవించుచు రాజ్య విభవ సమ న్వితులై యుండు టెరింగిన దుర్యోధను చారు లరిగి కర్ణ దుశ్శాసన సౌబల సోమ దత్తాది నిజ సోదర పరివృతుండైన సుయోధను కడ కుం బోయి మ్రొక్కి యిట్లు విన్నవించు కొనిరి.

ఆ. ద్రుపద రాజ తనయ ద్రౌపది వర వేళ
కర్ణ శల్యు లాది కడమ నృపులు
ఓపరాని విల్లు మోపెట్టి జేకొట్ట
మత్స్య యంత్రమేసి మగువ గొనగ

ఉ. నీడల జూచి యంత్రమున నిల్పిన చేపను నేల గూల్చనా
వాడి మయూఖముల్ గలుగు వాడదె పాండవ మధ్యముండనిన్
వీడక నంటి శల్యు నతి భీకర ముష్ఠుల నేల నెట్టుచున్
గాఢపు బల్మిమై సెలగు గండడు భీమ వృకోదరుండనిన్

చ. అని మొన దాకి అస్త్ర తతి నందర వీరుల వమ్ము జేయుచుం
కని విని నేర రెవ్వరన కార్ముక హస్తుడు ధర్మ నందనుం
డనుపమ సోదరుల్ యముల్ ఆహవ మందున కౌరవోద్ధతిం
వెనుకకు నెట్టుచుం విజయ వీచిక పట్టరె పాండవాన్వయుల్

ఆ. అనుచు దెల్పు వారి నట నుండి పొమ్మని
దుఃఖి తాత్ముడగుచు దొరలి సెజ్జ
లక్క యింట దగ్ధులైరన్న తెఱగది
ఉత్త దన్న మాట సత్య మరయ

వ. అనుచు పురోచనుం దలంచి లక్కయింట దగ్ధుడై యుండ నోపునని విచారించి దైవానుగ్రహము లేకున్న పాండవు లిట్లుండు టసంభవమని మది దలంచియుయిప్ప ట్టున నెట్లయినను పాండవుల ద్రుపదునండ నుండకుండ చేసినగాని సాధింపవలను పడదని మది నిశ్చయించు కొన్నవాడై-

క. యాదవ వృష్ణులు మరియును
మాధవ బలరామ ముఖ్య మహిమో పేతుల్
చేది నృపాలుడు భోజుడు
ఆదరులా పాండు సుతకు అచ్యుతు తోడన్

వ. నెట్లేని వీరందర నొకటి గాకుండు నటుల భేదోపాయము గావింప వలయు న ని చింతించు చుండు నంత, పాండవా భ్యుదయమ్మును గోరు విదురుండు ద్రౌపదీ స్వయంవరమున దుర్యోధనాదు లెల్లరుం భంగ పడుటయును,పాండవులు ద్రుపద తనయం బెండ్లాడి ద్రుపద పురంబున సుఖోపవిష్ఠులై సామ్రాజ్య అధిప విభ వ సంపన్నులై అమేయ అస్త్ర శస్త్ర విశారదులై యున్నారని ధృతరాష్ట్రునితో బల్కుట యును –

క. తమ్ముని తనయుల విజయము
సమ్మతిగా నున్నదనుచు సమయస్థితిగా
కమ్మగ పల్కియు తనదౌ
నెమ్మనమున తాప మెగయ నిద్దుర రాకన్

వ. పొరలుచు నుండునంత కర్ణ దుర్యోధనులు ధృతరాష్ట్ర అభ్యంతర మందిరమున కుం జని పాండవుల యునికిం దెల్పుచు –

క. పలుకక నుంటివి యేదియు
అలుక మెయిం విదురు డేమి అనునేమొ అనిన్
తలకొని జేసిన వెల్లను
కలగా మిగులుచును నుండె గత విధులెల్లన్

వ. అనివాపోవ పుత్రమిత్రులకు మనః ప్రీతిగా విచిత్ర వీర్యాత్మజుండు ఏమిచేయం దగునని చింతింప వలుక దుర్యోధనుండు అది యెట్లన పుత్ర మిత్ర బహువిధబల సంపన్నుడైన ద్రుపదు నొద్ద పాండవు లుండు నంతవరకు వారి నెవ్వరున్‌సాధింప నేరరు. కావున పాండవుల నునికి ద్రుపదు కెడ గలుగు నట్లు చేయుటొండె. కౌంతేయ మాద్రేయులు తమలో తాము విరక్తులగు నట్లు తగు వారలనియోగించు టొండె మరియును మిక్కుటంబగు వారాంగనామణులం బ్రత్యేకంబ యేవురకుం వేర్వేర ప్రయోగించి ప్రమోదింప జేసి ద్రౌపది యెడల అననురక్తి భావ ముదయించు నట్లు చేయుటొండె. అదియునుం గాక యేవుర మధ్య నొక్కతె యగుట అన్నదమ్ముల మధ్య స్త్రీ స్పర్థ కలిగించుటొండె, దుష్ప్రయోగమ్ముల భీము విగత జీవుం గావించి తక్కిన వారల బలహీనులుగా చేయుటుచితంబుగా దోచుచున్న దనుచుం –

క. ఆయత శస్త్రుని వేన్వే
లాయుధ హస్తులు నలుదెస నడ్డిన యైనన్
వాయు సుతు డండ నుండగ
యూయుర్విన్ పార్థు ద్రుంప నేరికి తరమౌ

వ. కావున నా పలికిన వివిధోపాయమ్ముల మన కనువగు తెరంగెరుంగ బల్కుడన రాధేయుండిట్టు లనియె.

క. పతి కెక్కువ సమ గూర్పగ
సతు లొక్కెడ పోరు చుంద్రు సమయోచితలై
పతి నంటుచు వెంట నుండ
సతిపతులకు గౌరవమ్ము సరి వారలలోన్

తే. ధర్మ బద్ధులు కారొకో తాత్మ్య లౌచు
పాండు నందను లేవురు పత్ని యందు
మైత్రి జూపుచు నుండంగ మమత తోడ
యటుల వీలౌను భేదమ్ము యేర్పరింప

తే. దుర్నయుండెంత వాడహొ ద్రుపదు డరయ
పాండు తనయుల అల్లుండ్ర పాయ గలడె
కుంతి మాద్రేయ పుత్రు మైత్రి గొప్ప దెన్న
విక్రమంబున కాదొకో విజయ మెపుడు

తే. విక్రమంబున సమకూరు విజయ మెపుడు
విశ్వ మెల్లను వశమౌను విక్రమంబ
భరత నామమ్ము పెంపెక్క బలము కాదె
పాక శాసన విజయమ్ము ప్రభ వెలుంగ

వ. కావున చతురంగ బలసాధన సన్నద్ధులమై యుద్ధమున ఆపాంచాలుని బంధించి నక్కడ నుండ నీక తోడ్కొ ని వచ్చుటే మార్గమన కర్ణు పల్కు లాలకించి వృద్ధ రాజు ధృతరాష్ట్రుం డిదియ కార్యంబ అయినను మతి మంతులౌ పెద్దలైన వారలతో విచారించి చేయుద మని భీష్మ ద్రోణ విదుర శల్యాశ్వద్ధామ సోమ దత్తాదులం బిలువం బంపి అంతయు నెరింగించిన విని గాంగేయుండు ధృతరాష్ట్ర నందనుం జూచి–

క. ధృతరాష్ట్ర పాండు లిర్వురు
అతి బల ధర్మానుబద్ధ అవనీ పతులర్
అతులిత ప్రేమాస్పదులరు
ధృతి మంతులు సర్వ సములు తథ్యము దెలుపన్

వ. అటులనే మీరన వారన సమ భావమే కానీ వేరు కాదు. మీరును పాండవులు ను ధర్మార్ధమౌ పిత్రుపితామహ పైతామహంబైన రాజ్యమునకు సమానార్హులు.కావున క్రుద్ధుండవై ద్వ్యర్ధి తలంపక అర్ధ రాజ్య మిచ్చిన నీకును నీవారలకును మాకును లో కంబునకును ప్రియంబగును. కాని నాడు అపకీర్తి పాలు కావలసివచ్చునని–

తే. కలసి యుండుట తగుదయ్య కౌరవేంద్ర
సమత కీర్తియు రెండును సర్వ జనికి
వృద్ధి కారక గుణములు ద్వ్య ర్ధి వలదు
కానినాడది అపకీర్తి కలుగ జేయు

తే. కీర్తి ప్రభులకు వస్త్వైక వర్తనమ్ము
కోర్కె సాఫల్య మెంతేని కులము వెలయు
అర్ధ రాజ్యము పాండుల కాప్తి నిమ్ము
దుష్ట మంత్రాంగ దుర్బుద్ధి నష్టి గూర్చు

వ. అని పలికిన శాంతనవుని మాటల కెంతయు సంతసిల్లిన ద్రోణుండు దుర్యోధ నున కిట్టు లనియె.

చ. బహుజన శోభనోత్సవము పాండుల సఖ్యత సాదు సమ్మత
మ్మిహ బుధ వర్గ కాంక్షితము యింతయు నెంతయు లెస్స నీ పితా
మహు వచనంబు దాల్పు మది మత్సర బుద్ధుల మాట దోచి ని
గ్రహమును చూపుచుం మనుట కౌరవు పాండవు లుజ్వతెంతయున్

చ. విలసిత కీర్తి వర్ధనులు విజ్ఞులు పెద్దలు మీ పితామహుల్
కలిసియు నుండు టెంతయును కర్జము కౌరవకీర్తితంబనిం
తలపుము తాత మాటలను తక్కుల మాటలు లెక్క చేయకన్
యిలగల రాజ్య వైభవము యీప్సిత కోర్కులు దీరు నెంతయున్

తే. దైవ శక్తులు గలవారు ధైర్య శాలు
రవని పాలన కీర్తన రమ్య జనుల
పైత్రుకంబైన రాజ్యంబు పాలు గొనగ
అడ్డు కొననౌనె యేరికిం అవని యందు

వ. వారితో విగ్రహించి నిలచుట కార్యంబు గాదు. కావున పాండవ ద్రుపద ద్రుష్ట ద్యుమ్న కుంతీ ద్రౌపదులకు ప్రియ పూర్వకముగా భూషణాంబర చీని చీనాంబరము లు వేర వేర యిచ్చి పుచ్చి పాండవుల తోడ్కొని వచ్చు వారుగా దుశ్శాసన వికర్ణ ప్ర భృతుల పంపుమనిన ద్రోణు పల్కు లవకర్ణించి కర్ణుడిట్లనియె.

క. ఒప్పని వారల తోడన
నప్పింపను జూచుటదియ నయమగు పనియా
ఒప్పని తప్పని యెంచక
అప్పనముగ దోచినట్లు అనుటయు తగునే

క. పెద్దలు పల్కిన వెల్లను
ఆద్దిర కార్యార్థ మౌనె అందరి యెడలన్
ఒద్దిక కుదిరెడు నా పని
ఎద్దియొ పతికిష్టమౌనొ యెరుగరు అకటా

వ. అని యనిన కర్ణు పలుకుల కాగ్రహించిన ద్రోణాచార్యుండు–

క. అహితా హితవుల నెంచుచు
విహితంబుగ మాటలాడ విభుడవు నీవా?
అహితులు విహితులు యెవరో
బహుదూరపు మాట కాదె పదపడి తెలియన్

క. కామోద్రేకత కురువులు
నీ మాటల కాదె చెడుట నిక్కము అరయన్
యే మాటకు ఆ మాటగ
మోమాటము లేక నాడ్డు మోమున యెదుటన్

వ. అనుచున్న తరి నయ్యిరువుర వారించి విదురుండు ధృతరాష్ట్రునితో–

క. ధర్మము యెరిగిన పెద్దలు
నిర్మలినులు నీతి విదులు నీవారలయా
మర్మజ్ఞుల మాట తగదు
ధర్మానుజ బిలువ బంపు ధార్మిక బుద్ధిన్

ఆ. దాయ తోడి తగవు ధర్మమ్ము కాదయా
దాయ పాయ నీయ తలగు భయము
దాయ పెంపు యెపుడు దయనీయ దుస్థితి
సాయముండు దాయ సర్వ సుఖము

వ. కావున పాండు పుత్రుల తోడి సఖ్యత నెఱపుట అన్నింటను మంచిదిగా తోచు నాకు. దుర్యోధన దుశ్శాసనాదులు కర్ణ శకునియును బుద్ధికుశలత నీకంటె చాలా చిన్నవారు. వారల కాదనుట కాదు గానీ భావితనయుల క్షేమమరసి పాండవుల బిలువ బంచి అర్ధ రాజ్య మిచ్చి గారవించుట అందరకును హితమగు వర్తనము. నీ కుమారులకు వారల తోడి వైరము మంచిది కాదు. గత వర్తన లెల్లను నీకు తెలియని వికావు. వైరము పెంచు కొనుట ఉచితముకాదు. భీమార్జునులు కోపోద్రిక్తులు. ధర్మజుని కెదురాడ లేక ఆణగి మణగి నివురు గప్పిన నిప్పు వలె గ్రాలు చున్నవారు. మాద్రేయులన్నచో మంచిని పెంచుకొని అన్నల కెదురాడు టెరుగని వారు. మరియును యిప్పుడు ద్రుపదుని అండ దండ లున్న అల్లుండ్రు. బావ మరిది ద్రుష్టద్యుమ్నుడు పుట్టుక తోడనే అతిబలసత్వ సంపన్నమగు శస్త్రాస్త్ర కోవిదుడు. బలరామాచ్యుత సాత్యకుల్ వారికి కడు గూర్చువారు గావున దూరస్థుల జేసికో తగదు. వలదు. నీ యందు మిగుల వినయ భక్తి ప్రపత్తియుం గలవారు.

ఉ. స్నేహము కోరుకో తగదె సేమము కూర్చుచు యెల్ల వారికిన్
ఆహవ భూమిలో నరున కడ్డము దాకెడు వీరు డెవ్వడా
వ్యూహము భేదనంబునను వ్యాపకు లెందరు కౌర్వ వాహినిన్
సాహస మెప్పుడుం తగదు సద్గుణ శీలు రజేయ పాండవుల్

వ. మరియును వారల పరాక్రమ విక్రమంబులు మున్నె తెల్లములు గాదె. ఆట్టి వారలతో విగ్రహించి నిగ్రహించుట కష్ట సాధ్యము దుర్బుద్ధుల మాటలు విని మిన్నకుండుట నీయట్టి రాజ నీతిజ్ఞునకు తగదు. నీ పుణ్యమున కాదే వారు తల్లితో లక్క యింట మాడి బూడిద కాకుండ బ్రతికి బయట పడి యిట్లుండునది. పురోచన నియుక్త దగ్ధంబైనలక్కయింటి మాలిన్యమును పాండవానుగ్రహ జలంబుల ప్రక్షిప్తముగావించు

కొనుము అనిపల్క నంతట ధృతరాష్ట్రుండు, మీచెప్పినయట్ల పాండవుల కర్ధరాజ్యమి త్తునని అందరి సమక్షమ్మున పాండవులతోదేర విదురుం బంచిన అతడు ధృత రాష్ట్ర అనుశాసనంబున ద్రుపద పురంబునకుం జని వృద్ధ రాజు పంచిన వివిధ రత్నాలంకృత నూత్న పట్టు దుకూలంబులద్రుపదాదులకును పాండవులకును కుంతీ ద్రౌపదులకును వేర్వేర సమర్పించి గౌరవించి ప్రతి పూజితుండై శ్రీకృష్ణ పాండవ సమక్షమ్మున ద్రుపదునితో యిట్లనియె.

క. సుక్షత్రియ సంజాతుడ
వక్షయ బల శస్త్రాస్త్ర విదిత పావన పురుషా
రక్షణ జేయగ జనులను
దాక్షిణ్యము జూపి కావ దయశీలుడవౌ

మ. సరిరాజన్యుల రక్షణీయ గుణ నీ సంబంధ బంధమ్మునన్
కురు రాజన్యులు యెంతయుం ముదితులై గోరంత కొండంతలై
మరువం జాలరు యెల్ల వేళల మిముం మర్యాద పూర్వంబుగా
గురు భావంబున చూచు చుండుటది మాకుం మీకునుం బందువే

ఉ. తమ్ముని భార్యయుం సుతులు తద్దయు హస్తిని వీడి పోవగా
సమ్మతి జూచు చుండు టది సాధ్యము కాకను తల్లడిల్లుచుం
యిమ్మహి యిట్టులీ తెరగు నింతితొ వీరల జూచు భాగ్యతన్
గ్రమ్మర కెట్టు లుండ నగు రాజ్యపు భాగము పంచి యీయకన్

వ. నీ చేత యనిపించు కొని గాని వీరలీ పురము వీడరు. అనుడు విదురునకు ద్రుపదుండు యిట్లనియె. కురుకుల రాజన్యులు కోరుటయును రాజ గౌరవమువహిం చి నీవచ్చుటయును రాజ్య భాగ మిత్తు మనుటయును మాకెంతయు హితమ్మును పాండవులకు శుభప్రదమ్ము యగుట గాదె. అంబుజ నాభుండును నీవును యెల్ల ప్రొద్దుల వీరి క్షేమము గోరు వారు కాదె. అని తన సమ్మతమునుసంతసమును పల్క నందరకును ధర్మజానుజులుయిట్లనిరి.

క. ఎల్లరు మమ్మీ విధి తగ
చల్లగ కాపాడు చుండ సమ్మతి కాదో

యెల్లెడ నందర గావను
నల్లని మా బావ కృష్ణ ననయము దలతుమ్

**పాండవులు కుంతీద్రౌపది తోడం హస్తినకు వచ్చుట**

వ. అని యుధిష్టిరుండు హరి అనుమతంబు వడసి తమ్ములుం దానును కుంతీ ద్రౌపది తోడం గూడి ద్రుపదు వీడ్కొని ద్రుష్టద్యుమ్న విదుర వాసుదేవ సహిత పరివారంబులు వెంట రా, వచ్చు వారల రాక విని ధృతరాష్ట్రుండు వికర్ణ చిత్రసేన ద్రోణ కృపాచార్యుల నెదురు పుత్తెంచి నంతట సైన్య సమేతులై మహోత్సవముగా పాండవులు హస్తి పురము జేరు నపుడు వారలంజూడ–

క. పుర జను లెల్లరు ముందుకు
అరమర లెంచకను రావ నమితాదరులై
కర కమలము లెగ రేయుచు
పరిపరి గా నగవు లెగయ పాండులు నడువన్

క. భూసుర ఆశీస్సు చెలగె
భాసురమై జనులు పొగడ బారులు దీర్చిన్
కాసుల వర్షము కురిసిరి
యీ సరి లేరెవ్వ రనగ యిద్ధర లోనన్

క. అభవుని దయ గల వీరలు
నిభమణి వెలుగుండు దనుక నిశ్చల దీప్తిన్
శుభులై మనగల వారలు
విభవము చేకూర నవుత విజయుల కెపుడున్

వ. ఆని పుర జను లెల్లరుం దీవించుచుండ పౌరవ కుల సంతులైన పాండు నందనులు భీష్మ ధృతరాష్ట్రాది గురు వృద్ధ జనంబులకు మ్రొక్కి వారి ఆశీశ్సులందిసకల జనాను రాగ రంజితముగా దుర్యోధనాదులతో కలసి మెలసి విద్యావినోదమ్ముల కాలము గడుపుచున్నంత నొక్కనాడు ధృతరాష్ట్రుండు భీష్మ విదుర ద్రోణ దుర్యాధనాదుల సమక్షమ్మున పాండవుల రావించి వారల కిట్లనియె.

ఆ. అర్ధ రాజ్య మిచ్చి అభిషిక్తు గా జేతు

సర్వ భూత హితుల సాక్షి గాను
రమణ నేలు కొనుడు రాజ్యమ్ము మీదైన
జనుల మంచి గొనుచు జాగృతంబ

వ. అని ధర్మరాజుం రావించి అభిషిక్తుం జేసి ఖాండవ ప్రస్థము నివాసముగాయేర్ప రించి పంచిన పాండవులు ధృతరాష్ట్ర సేతనంబునను భీష్మాదులఅనుమతంబునను వాసుదేవ సహితులై ఖాండవ ప్రస్థంబు జేరినంత-

## విశ్వకర్మ ఇంద్ర ప్రస్థమును నిర్మించి యిచ్చుట

క. హరి యింద్రాదుల పనుపున
సుర కర్ముడు విశ్వకర్మ శోభన కరమౌ
సురుచిర యింద్ర ప్రస్థము
పురమొక టుదయించె భువిని పూజితమౌచున్

క. విరి బూసిన తరు లతలతొ
సరి రాగను యింద్ర పురికి సరసుల తోడన్
కరి నగరిని తల దన్నుచు
మురిపంబగు కట్టడముల ముగ్ధత గొలుపన్

క. నిరుపమ లీల కుబే ర్వరు
డురగ పతి పుర తతి విభవోజ్వల తరమౌ
దురితోపశమన కాంతుల
మురిపపు హర్మ్యాల తోడ మోహన కరమై

వ. మరియుం జూడ జూడ

చ. అలఘు తరంగలై విలసనాంబర వీధుల మేఘనావళుల్
మిల మిల కాంతితో దనరు మీనులు నిండిన నీళ్ల పట్టులున్
బలుపెసలారు వాసనల పుప్పొడి నానెడు చెంచరీకముల్
కళ కళ నాడ నా యువిద కాటుక కన్నుల వింత లెంతనన్

చ. అర మర లేక సైకతల నాడెడు కుర్రల కొంటె చేష్టలున్
కొర కొర లాడనౌ నెనరు కూతల కాంతల చేరు వారలన్

అర మర లేక దాటుచును అందము చిందెడి చిన్ని పాపలున్
కెరలుచు కూయుచుం యెగురు కిన్నెర పక్షుల అంద చందముల్

చ. కళ కళ లాడు గుమ్మముల కాంచన తోరణ పుష్ప గుచ్ఛముల్
కళ కళ వీధి ముంగళుల కాంతలు పెట్టెడు రంగ వల్లులున్
ఝణ ఝణ లాడుచును చతుర జార వధూటుల నాట్య శోభలున్
అలవియె చెప్పనౌనె మరి అద్భుత రీతుల వింత లెన్నియో

సీ. వేద మంత్రాన్విత విజ్ఞాన విదుషలౌ
భూసురోత్తమ కోటి పూజ లలర
చతురంగ బలయుత శస్త్రాస్త్ర రణ విధి
ఉద్దండ పిండులౌ యోధ వరుల
ధర్మార్జనా గణ్య ధనరాశు లెగయంగ
విశ్వ విఖ్యాతమౌ విపణ వీధి
అన్న వస్త్రాదుల కనుగుణ సేద్యాల
పాడి పంటల పెంచు ప్రాజ్ఞులలర

తే. దేవళంబులు ఘనతర దీప్తమౌగ
దేశ రక్షణ కొరకునై తేజరిల్ల
విషయార్జనా పరధన వీరులౌచు
వర్ణ చతుష్టయంబది వరలు చుండె

వ. అట్టి దివ్యమౌ ఇంద్ర ప్రస్థపుర ప్రవేశ సమయంబున వ్యాస వాసుదేవానుమత ధౌమ్యులాదిగా గల భూసురు లెల్లరు శాంతి కర్మ సేవ్యంబగు వివిధ బలి విధానమ్ము లు నిర్వర్తించిన పిదప రవి బుధ గురు చంద్ర తారకాగణ విలసిత ప్రసస్థంబైన శుభ ముహూర్తంబునధర్మ తనయుండు ధౌమ్య పురస్సర మహీసుర ప్రవర వేదమం త్రాన్విత ఘోషంబులు సకల జనానీకాశీర్వాదములు మృదు మధురమంగాళా రావం బు లెగయ వివిధంబులగు తూర్య ధ్వనులు మిన్ను ముట్ట ఆకాశ దీపమ్ములు తేజో వంతమ్ములై పటపటా రావ శబ్దంబులు ప్రతిధ్వనింప నట విట నాయికా గణంబులు మెరయ అను జన్ములు వెంట రా ద్రౌపదీ దేవి తోడం గూడి నడువ నగర ద్వార

ప్రవేశమ్ము గావించి దశ విధ దానాదికమ్ముల భూసురోత్తమాది సకల పురజన సందోహముల దనిపి సర్వ జనాను రాగంబున –

క. అను గుణమౌ మంత్రాంగము
కను సన్నల పనులు దీర్చు కార్యోన్ముఖుడై
అనుజుల అన్యోన్నతితో
జనులందరి మంచి కోరి జన నుతుడగుచున్

క. వర్ణాశ్రమ ధర్మ సరళి
నిర్ణయమైనట్టు నడువ నిశ్చల బుద్ధిన్
దుర్నయ బాధలు తొలగుట
పూర్ణోజ్వల ధర్మపాల్న పుణ్యం బనుచున్

క. నెల నాల్గు వాన గురియుచు
యిల పండగ జీవ కోటి యింపల రారన్
తుల తూగుచు ధర్మ యుతము
విలసిల్లిన వేడ్క లలరె విందులు చిందన్

క. రాజోప చార విధులతొ
రాజాజ్ఞలు వర్తిలంగ రమణీయమునై
రాజిలె నింద్ర ప్రస్థము
రాజీవాక్షుని ఘనతర రక్తిం యుక్తిన్

వ. మహిమాన్విత సక్త పాలనా విధి విహితుండై ధర్మనంద నుండుండ నొక్కనాడు వారలకు నారద ముని రాకడ దెల్పుచు –

క. సారస యుక్తుల విని కా
ర్యారంభులు గాగడంగ రహి వెలుగంగా
ధీరులు కండని పల్కుచు
నీరజదళ నేత్రు డరిగె నిజ పురమునకున్

వ. పాండు నందనులు సర్వతో ముఖ భద్రంకర విలసిత బలపరాక్రమ ప్రణయాతి రేకమున సుఖ సంతుష్టులై యున్నెడ నొక్క నాడు–

క. అఖిలాగమ తత్వ విదుడు
నిఖిలోర్వురు దిరుగు మౌని నెమ్మది రావన్
సఖియా ద్రౌపది తోడన
అఖిలంబగు పూజ లొసగి ఆసను జేసిన్

వ. మహాత్మా!మాపుణ్యంబున భవద్దర్శనంబై కృతార్ధులమైతిమన ప్రీతిపూర్వకమ్ముగా

తరలము. అరుగు దెంచిన నారదుండల నాదరంబున జూడనా
పురి జనంబులు ప్రీతి తోడన పూజ చేసిన వారలం
కరుణ తోడన దీవ్న లిచ్చుచు కామితార్ధుల జేసియుం
తరలి నంతనె ధర్మ రాజుతొ తమ్ము లందరు విన్గనొ

వ. ఏకాంత సమయమ్మున యిట్లనియె

తే. నీతి నైతిక ధర్మాది నిపుణ మతులు
ఐదు సోదరు లేకైక ఉవిద అగుడు
నిగమ లోకోప వాదమ్ము నిజము దెలియ
కామ కోపాగ్ని నిగ్రహోద్లు కలుగు కతన
చేటు వాటిల్ల కుండనే చెప్పుచుంటి
వినుడు వెనుకట జరిగిన వింత కథను

## సుందోపసుందో పాఖ్యానము

వ. తొల్లి దితి పుత్రుండైన హిరణ్య కశిపు వంశంబున నికుంభుడను వానికి సుందో పసుందులను నిర్వురు కొడుకులు బుట్టి నియత తపోనిష్ఠా గరిష్ఠత్వంబున కమలాస న (ధాతను) మెప్పించి అతని వలన అనేకానేక దుర్నయవరంబులం బొందుటతో పాటు యొరు లెవ్వరి చేతను జావ కుండు నటులను కామ రూప గమనంబులను సకల మహిమోన్నత్వమును ఆమరత్వమును ప్రసాదింపు మని కోరిన, అందమరత్వ సిద్ధి తప్ప మిగిలిన అన్ని వరంబులను విధాత ప్రసాదించుటయును, తద్వర వచనా ను సారము నా సుందోప సుందులు తమదైన రాక్షసత్వంబున జగద్విజ యానుకూ ల అకాల కౌముది అను నుత్సవమమర జేసిదైత్యుల కెల్లం ముదము గూర్ప–

క. గరుడోరగ కిన్నెర వర

సుర పురముల నెల్ల బొల్చి సుక్కగ చేసిన్
నర లోకంబునను మహీ
సుర వరులకు బాధ గొలుప సుందులు వచ్చిన్

క. ద్విజ వర కర్మలు పొలయుచు
యజనాధ్యాయన విధి కృత హవ్యాల్నెరుపన్
విజయోత్సాహులు సుందులు
అజేయు లనిపించుకొన నియంతలు అగుచున్

వ. సర్వ పుణ్య దేవ నిత్య నైమిత్తికాది పితృదేవ పూజాది విధులు, త్రికాల సంధ్యా వందనములు శివసాయుజ్యా పూర్వక షత్కాల లింగార్చనలకు విఘ్నంబు లాచరించు చు సింహ వ్యాఘ్ర భిల్ల భల్లూకాది క్రూర మృగ రూపంబుల విజృంభించుచు ముని పల్లియల మంట గొల్పుచు సాధువుల హింసించు చుండ, వేల్పులును ముని కులం బులును పద్మభవు పాలికిం జని కృతాంజలులై సుందులు గావించు దుష్కృత్యంబుల ం వినిపింప కమలాసనుండు విస్మితుండగుచు తానిచ్చిన వరముల దలంచి వార న్యులచే వధ్యులు కారుకావున పరస్పరము స్పర్ధించుకొని వారలకు వారే పొడుచుకొ ని యమసదనంబునకుం జననవునని విశ్వకర్మను రావించి అంతయుం జెప్పి అతి రూప లావణ్యవతి నొకతె సృజియింపుమన ప్రసాదంబని ధాతకు మ్రొక్కి–

క. తిలలును అనుమయ కాంతులు
కలబోసిన కాంత నొకతె కాముక కన్యన్
ఇల కాంతుల కలగలుపుగ
తిలోత్తమగను సృజియించి తెచ్చియు యిచ్చెన్

వ. అదియును సురేంద్ర ప్రముఖ బృందారక పరివృతుండైయున్న పరమేష్ఠికిం ప్రణ మిల్ల అరవింద సంభవుండా సుందరిం జూచి సుందోప సుందులను దైత్యులుముల్లో క ప్రాణి కోటికిం సంకట కంటకంబుగా నుండుటను వివరించి వింధ్యాచల కంధర తీర సానువుల నున్న వారలు నీ కారణముగా కలహించుకొని పొడుచుకొని వారల లో వారు కలహించుకొని యమ సదనంబు చేరునట్ల చేయనగు నన వల్లె యని సుందులం బొలయనేగునాసుందరిం జూచుచు–

క. పలు తెరగుల చింతించుచు
నలు ముఖ అజుడాయె బ్రహ్మ నామెను జూడన్
నిలువెల్ల కన్ను లదురగ
తెలి చూపుల జూచె మఘుడు తీయని కోర్కెన్

వ. మరియు నయ్యమరు లెల్లరు నా నవ మోహనాకారిం జూచుచు కామ మోహ పరవశంబులకు లోనగుటయు వింత గొల్ప.

తే. అరిగె భువికి నా నవ మోహనాంగి యంత
వింధ్య గహ్వర ప్రాంతాన్కి సుందు లలర
చిత్త చాంచల్య మెంతనా చిగురు బోడి
విరహ గీతలు బాడుచుం విహ్వలింప

క. ఏకాసన భోజన శయ
నేకోదరు లయ్యు వారలీ కాంతకునై
ఏకస్థులు కాలేకను
నీకో నాకో యనియెడి నిశ్చయ బుద్ధిన్

క. బద్ధము వీడిన వారై
శుద్ధత విడనాడి దనుజ సూకర ముష్టిన్
కృద్ధత బోరియు తమలో
బద్ధత లేకను అసువులు బాసిరి వారల్

క. ఇంతుల పనిగా కదియుచు
ఎంతెంతలు యైన గాని యెరుగరు బుద్ధిన్
పంతాలకు పోవుటదియ
కాంతాలోలత్వ మనెడు కృద్ధత కాదే

వ. అనుచు నారదుడు తెల్పిన పల్కు లాలించి పాండవులు ద్రౌపదిం-

తే. ఏటి కొక్కరు వంతున యేలు కొనగ
సమయ ఫక్కిని గావించ్కు సమత బుద్ధి
గీటు దాటిన వారలు యేటి దనుక

తీర్థ క్షేత్రాలు సేవించి తిరిగి రాగ

వ. అని తాము జేసికొనిన సమయ స్థితిం పాటించుచు సుఖంబుండు నెడ, నొక్క నాడు ఒక బ్రాహ్మణుండు దుండగులు తన హెూమ ధేనువును దూడను అపహరింప

తే. బావురంచని యేడ్చుచు నా బ్రాహ్మణుంధు
తనదు గోవును రక్షింప తరలు మనుచు
పార్థు వెన్నాడి ఘోషింప పాప భీతి
అన్న ద్రోవతి తోడన అలరి యున్న
యింట నుండిన ఆయుధాల్నంటి వేగ
గోధనమును రక్షింపు కోర్కె తోడ
దుండ గీంద్రను వెన్నాడి దూడ తోడి
ఆవు గొని వచ్చి యిచ్చె తా అవని సురకు

వ. అంత నా బ్రాహ్మణుండు అర్జును ననేక విధంబుల కొనియాడి దీవించి చనగ పాండవ మధ్యముండన్న ధర్మ జుని వద్ద కేగి మ్రొక్కి గీటు దాటిన వాడ నైతిని,ధర్మ పాలనా బద్ధులమై లోక మర్యాదలు పాలించు మనకు యింత కంటె దుర్యశంబు లే దు కావున ఆడిన మాట చొప్పున నొక్క యేడు తీర్థయాత్ర జేసి వత్తుట కనుజ్ఞ యిమ్మని వేడిన తమ్ము దర్జునునితో ధర్మరాజిట్లనియె.

తే. వేద విహితంబు క్షాత్రమ్ము వేద విదుల
గోధన చయము గాపాడ కోర్కె కాన
పాప మంటదు సుంతయు బాధ వలదు
అనగ మరలను పార్థుండు అనియె నిటుల

క. ధర్మాధర్మము నెరపెడు
ధర్మజ నా మాట వినియు దయ గను నాపై
నిర్మలతం యున్న మనము
ధర్మము పాటింప వలయు తద్దయు వేడ్కన్

## అర్జునుడు తీర్థయాత్రలకుం జనుట

వ. కావున తీర్థయాత్ర కనుజ్ఞంబొందిన వాడై గురుజనాను మతుండై తగు శాస్త్రార్థ

వివిధ విబుధ పౌరాణికా కథా కథన దక్షులైన పరి వారంబుల తోడను సకలతీర్థ క్షేత్ర సంసేవనంబు జరుపు వాడునై ఉత్తరాభి ముఖుండై తొలుత–

చ. త్రిభువన లోక పూజితము తీర్థపు రాశుల సుప్రసిద్ధమున్
అభవుని అంగనామణియు అన్నము పెట్టెడు పూర్ణమాంబయున్
విభవత గొల్తు రెవ్వరిని విజ్ఞులు పెద్దలు తత్వ వేత్తలుం
శుభముల గోరి గంగ దరి సొంపలరారెడు కాశికాపురిన్

వ. జేరి యందు ప్రతి నిత్యము ఆ గంగా నదిని త్రికాల స్నానము లాచరించుచు దేవ ఋషి పితరులకు జలతర్ప ణలుం భవాని అన్నపూర్ణా సహిత విశ్వేశ్వర సర్వేశ్వ రుని ఆరాధించుచు గంగా జలంబులందెచ్చి అభిషేకించుచు తత్తీరంబున జప హెూ మ తపము లాచరించుచు భూసుర వరేణ్య జనంబులకు అన్నదానాదికములు ప్రసా దించుచు నొక నాటి ప్రభాతమ్మున విధి పూర్వకముగా స్నానాధిక విహిత కర్మంబు లాచరించి శుచిర్భూతుండైన నయ్యింద్ర నందనుండు–

సీ. కురుకుల సంభవు ఘనకీర్తి కౌంతేయు
యెంత జూచిన గాని వింత గొల్పు
కనుగవ కింపైన కమనీయ శోభను
అబ్బుర తేజస్వి అద్భుతాంగు
పరువాల చెలువంపు యెల నాగ కన్నియ
మురిపాల దేల్యాడు ముద్దుగుమ్మ
రత్న మణి దీప్తుల రహి వెల్గు చేడియ
ఉలులూచి అను నామ యువిద యొకతె

తే. కామ పరవశయై వాని కదియ దిగిచి
మంత్ర ముగ్ధునిగా జేసి మహిత శక్తి
నాగ పురముకు గొని పోయె నరుని వేగ
రమ్య రుచిరంపు శయ్యను రమణ నునిచె

వ. అంత కొంత కాలము గడవ మంత్ర యుక్తంపు కాలమ్ము మరలు నంత.

తే. తెలివి వచ్చిన వాడునై తేరి జూచి

యెదుట నున్నట్టి యెల నాగ నేర్పరించి
యెచట నుంటిని మరి నీవు యెవ్వతనుచు
రాగమెంతన ప్రశ్నింప రమణి యపుడు

తే. నిన్ను కన్నది మొదలుగా సన్నుతాంగ
గాంగ సైకత తీర్థాన కాశి యందు
కామ పరవశనై దెస్తి కాంక్ష మీర
నాగ లోక్మిదేనునులూచి నామధేయ

వ. నేనైరావత కులసంభవ కౌరవ్య నామధేయుండైన నాగ లోకాధిపు కూతుర. పర హితార్ధ ప్రద ప్రజ్ఞాశాలివగు నీ అనురూప సౌందర్యములకు ముగ్ధనైతి. నా మనోర ధ కామితార్థుండవు కమ్మని అర్థింప నద్దాని కర్జునుండు–

తే. సర్వ తీర్థాభి గమనమ్ము సలుపుచుంటి
బ్రహ్మ చర్యంబుగా నే బ్రతుక వలయు
పరగ పంద్రెండు నెలలవి బరగు దనుక
నిజము నీ కోర్కె దీర్చ లేనిపుడు సఖియ

వ. అనిన అవనతానన అయి ఆ నాగకన్య అర్జునునితో నీ వ్రత కారణ సర్వంబు ను దెలియు, యైనను –

తే. ప్రాణ రక్షకు సరిగావు బరగు విధులు
యెట్టి వ్రతములు ధర్మంపు గుట్టు దెలియ
మదను తాపాన ప్రాణాలు వదల నగుదు
పావనుండవవు కాపాడు ప్రాణి వీవ

వ. దీన నీకు వ్రత విధాన కంటె యెక్కుడు ఫలంబును పుణ్యంబును కలుగు నన దాని మనోరథంబీడేర్ప నిశ్చయించి సద్యో గర్భమున తనను బోలిన హిరావంతుండ ను పుత్రుం బడసి నాగలోకము నుండి సూర్యో దయంబగు సరికి వచ్చిగంగాతీరం బున తనవారలం గలసి జరిగిన సమస్త వృత్తాంతమునుదెల్పి హృదయానందముం గొల్పి అట నుండి యింకను ఉత్తరాభిముఖుండై యేగుచు హిమవన్నగ పాదప

పార్శ్వంబుల గల మహిమోన్నత పుణ్య తీర్థ ఘట్టంబులు నా అగస్త్య వటమును భృగుశిఖర బిందు తీర్థములందందు గల మితాహార వాయు భక్షులననగు ముని గణంబుల సేవించుచు ప్రాగ్దేశంబునగల విశిష్ట నైమిశారణ్య బదరికావన ప్రాంతములందు గల మహాదేవ కైలాసశిఖరముల దర్శించి పశుపతి నాధు ప్రస్థుతించి కేదారనాథ బ్రహ్మకపాల క్షేత్రమ్ముల బహు దానము లాచరించి బదరీనారాయణ తీర్థ నాదుల దర్శించి మ్రొక్కులిడి అందు గల సాధు సజ్జ నముని పుంగవులకు తగు రీతి వసుదానాదికము లాచరించి శీతల తర వాయు సంఘాతంబుల కుపయుక్తములగు నూత్నకంబళి నైవేద్యమ్ము గావించి ఉష్ణగుండ తీర్థ స్నాన మాచరించి సర్వ భారతావనీ తలంబుల సుసంపన్నము గావించు గంగాది హిమవన్నగ నదీనదముల కునికి పట్టగుచు కైలాస నాధు విలాస విహార శీతల హిమవన్నగ రాజ రాజసంబుల కొనియాడుచు తత్ ఉన్నత శిఖరంబులనుండి అవిశ్రాంతముగా జాలువారు కౌశిక నంద అలకనంద కేదార మందాకినీ మున్నగు శీతల పుణ్య నదీ నదంబుల స్నానము లాచరించి ప్రయాగ దేవ ప్రయాగ బిందు క్షేత్రాది పుణ్య క్షేత్ర తీర్థంబుల దిరుగాడు విభూదాంగ యోగ నిష్ఠా జడధారి దిగంబర సాధుపుంగవులకు పాదాభి వందన లాచరించుచు ఈశాన్యంబున గల గంగా సాగర సంగమ తీర్థ సంగమేశ్వరుని దర్శించు కొని ఫల పుష్ప తోయ పత్రంబుల పూజాభిషేకము లాచరించుకొని –

క. నవ తర తరు లత విలసిత
లవలీ ఫల భర నికుంజ లావణ్య తతిన్
భువనా నంద కరంబయి
అవనీ ఆకశ తలముల నంటెడు తరువుల్

క. విలసన వీచిక లీనుచు
మలయా నిలమున కెనయగు మాధురి గొలుపన్
ఫల పుష్ప తావు లెగయుచు
వల రాజుకు సాయ పడెడి వాసన లీన్చున్

వ. మహనీయంబగు తత్ప్రాంత విపినంబుల ఫలపుష్ప భరిత సువాసనలీను బహు విధ సాల తాల తమాల తక్కోల చూత రసాల కదళీ తరు వృక్షంబులును కిటి

ఘుర్ఘుర గజ సింహ భల్లుక శార్దూల కుక్కుట మర్కటాది వనచర వన్యమృగవిన్యాసం బుల దిలకించుచు సాంద్ర శ్యామల హరిత వనంబుల తరు శాఖలందు వశించు శుక పిక కోకిల సారికాది పక్షుల కిలకిలా రావంబులు వీనుల విందుగా వినుచు, తీర సైకత స్థలముల బారులు దీరి విహరించు హంస బక చక్రవాక జల పక్షి ఆకా శగమన ఆనంద సందోహ నికరంబును, బర్హి బర్హ నట నాట్య విన్యాసంబులు తిల కింపుచు అందందు వశియించు కోయ గోదు చెంచు భిల్ల మొదలగు ఆదివాస తం డంబుల కోపు తోపు సొపు ముళ్ల కోల ఉండ వేట యీటె బడితె బాణాది ఆహార సంపాదనా వవిధ వింత వింత వేటాటల తిలకించుచు అంగవంగాది ప్రాంత పులిన తలంబుల మత్స్య మడుంగుల రంగు రంగు మత్స్యముల యీత లాటలను చూచు చు ఉల్లాస భరితమ్మున విహరించుచు క్రమ గతి తూర్పు తీర కళింగావని ప్రవేశిం చు సమయంబున తనతో వచ్చిన బ్రాహ్మణులు క్రమ్మరి ఉత్తర దేశంబుల కరుగుట యును అంత నందుగల కతిపయ బ్రాహ్మణుల సహాయుండై పార్థుండు ప్రాక్తీర అం బురాశి నానుకొని యున్న బలరామసుభద్రా సహిత పురుషోత్తమ జగన్నాధు నారా ధించి తత్ర్బాహ్మణుల కెన్నియో దానములతో బాటు కుండ అండీ అన్న దానాదికప్ర సాదముల బంచి తానును స్వీకరించి కోణార్కారుణ సహస్ర కిరణ ప్రత్యక్ష దైవమున కుప్రాంజలిఘటించి మహాదేవ రాజలింగమునకు పాల తీర్థాభిషేకము లొనర్చి మ హేంద్ర గిరి చుట్టి కూర్మనాధుని దర్శించి ప్రాగ్దక్షిణ తీర్థ క్షేత్రమైన సింహాద్రి నారసిం హక్షేత్రమును జేరి అందలి జల ధారల తేలియాడుచు అప్పన్న దేవుని దర్శించి ప్రాగ్ద క్షిణదిశా ముఖమున సప్తగోదావరీ జలంబుల పుణ్య స్నానము లాచరించి ఆది భీమే శ్వరుని గొల్చి వేంగీ క్షేత్ర కొమరారు ఫల సిద్ధి వడసి ద్రాక్షారామ సీమల వశియించి గోదావరి నుత్తరించి కృష్ణా మండల శ్రీ పర్వత శ్రీశైలమల్లన్నకు మ్రొక్కులిడి శ్రీకాళ హస్తీ క్షేత్రమున శివుని దర్శించి కావేరీ తీర శ్రీరంగ నాధుని సేవించుకొని సేతువు దరి సేతు రామేశ్వరుని నాశీశ్సులు వడసి అందు దాన ధర్మాదుల కృతార్థుండగుచు కన్యాకుమారిం దర్శించి ఏకాదశ మాసాంతమగుసరికి పడమటి తీర సాగర సీమ మణిపుర రాజ్యంబు (మళయాళము) చేరుటయును ఆ రాజు చిత్రవాహనునిచే పూజి తుండైరాజ పుత్రి చిత్రాంగదను వివాహ మాడగోరిన వాడగుటయును అదితెలిసికొని

న చిత్రవాహనుండు పాండవ వంశవర్ధనుండైన పార్ధునితో ఆర్యా ! తొల్లి మాపూర్వులు సంతానార్ధులై పశుపతిని గొల్చి తపంబు చేయుటయును మహాశివుడు ప్రత్యక్షమై మా వంశంబున నొక్కడుగా జనించు నట్లనుగ్రహించుటయునుక్రమాను గతిని నా కడుపున యీ పుత్రిక ఉదయించుటయును జరిగినది. అదిఅంతయును పరమేష్ఠి మాయా విలసనమే అనుకొని దీనిం బెంచి పెద్ద చేసి యున్నాను. దీని కడుపున పుట్టిన వాడే మా వంశోద్ధారకుడు కావలయు. అట్లగుట యిష్టంబగు నేని యిపుడ నీమెం బెండ్లి యాడ నగుదు నన, కౌంతేయుండువల్లెయని మాట యిచ్చిన మహా వైభవముగా చిత్రాంగదతో వివాహము సల్పుకొన్న వాడై సుఖంబున్నెడ, ఆ పట్టణమున కనతి దూరమున గల సౌభద్ర తీర్ధమున స్నానమాడ అంబురాశిని జేర అందలి మునులు వానికిట్లనిరి.

తే. అంబు తీర్ధావ గాహమ్ము అనువు గాదు
మునుగ బోయిన వారెల్ల మొసలి నోట
పడుచు నుండుట నూరేళ్ల పనిగ నుండె
వలదు వలదంచు వారింప పార్ధు డపుడు

తే. తీర్ధ సంసేవనా సక్త తేజ మొప్ప
యేటి కేడాది తిరిగి రా నేటి దనుక
గ్రాహ బాధకు భయమంది క్రమ్మరిల్ల
యేటి మగటిమి నవ్వరే సాటి మగలు
అనుచు సౌభద్ర తీర్ధాన అంబురాశి
మొనసి క్రీడింప నొక పెద్ద మొసలి బట్ట
నప్పు డప్పాండ వాన్వయుం డహకరించి
ఒడిసి బట్టియు యెదురొడ్డి వొడ్డు నేయ
కాంతయై లేచి చేమోడ్చి గ్రాహ మపుడు
ప్రస్థుతింపుచు నిట్లనియె ప్రభ వెలుంగ

తే. దండి మగడవు కురుకుల పాండవేయ
శాప మోక్షంబు గల్గెనీ సాహసంబ

వంద యేండ్లుగ పడి యుంటి నిందు లోన
యెపు డవత్తువొ నీవంచు యెదురు చూస్తు

వ. అన విని అర్జునుండామెతో నిట్టు లనియె.

తే. ఎవతె వీవంచు కిట్లొట కేమి గతము
తెలుప నెంచిన తెలుపుమా తేట పడగ
అమర విభు కుబేరు తనయ "నంద" నేను
తోడి సఖియలు నల్వుర తోడ గూడి

తే. మర్త్య నేలకు దిగి వచ్చి మహిత మునిని
హాస్య అపహాస్య సరసోక్తు లాడి నంత
తపసు భంగము చేస్తిరో తప్ప దనుచు
శాప మిచ్చెను మొసళులై సంచరింప

తే. అనుడు ఆ మాట లాలించి అదలి మేము
మునికి చేమోడ్చి ప్రార్ధింప ముదిత మిమ్ము
ఒడ్డు నేయుడు యెవడైన దొడ్డ జనుడు
అంత వరకును మోక్షమ్ము అవదు అనియె

వ. అంత చింతాక్రాంతలమై యుండ ఆకాశ గమనుండయి మా ముందల కరుగు దెంచుబ్రహ్మమానస పుత్రు నారద మహామునిం గని నమస్కరించి పలుక మీవదనం బున అనూహ్యా విన్నదనంబు దోప, యేమి యిట్టు లుంటిరని మావలన అయిన దం తయుం విని సర్వమును దైవ నిర్ణయంబని యిందుల పంచ తీర్ధముల వశియింపు డని–

తే. సర్వ తీర్థాభి గమనుండు సవ్యసాచి
మొనసి పెనగుచుం దరియ మిమ్ముద్ధరించు
మునియు చెప్పిన విధముగా ముదము గూరు
ననుడు నా మాట కెపుడెపుడు ననుచు గడుప

వ. ఈనాటికిట్లు నీ వలన శాపమోక్షము వడసిన దానినైతి. మిగిలిన నా చెలికాం డను గూడ ఒడ్డున వేసి అనుగ్రహింప వేడెద నన కరుణాంతర స్థితుండైన పురందర

నందనుండు మిగిలిన మడువులందు నను తీర్ధము లాడి అందరి తోడనుం పెనగు లాడి భుజ విక్రమంబున ఆ గ్రాహముల నెల్ల మర్దించి విగత జీవులుగా నొడ్డనంవే య అందుండి విముక్తులైన నంద సఖియ లెల్లరుం పార్ధుని కొనియాడి దీవించి త మ లోకమునకుం జనిరి. అప్పటి నుండియు నా పంచ తీర్ధములు నారీ తీర్ధములు నా విరాజిల్ల అర్జునుండు వణిపూరు పురంబునకుం జని చిత్రాంగద యందు బభ్రు వాహనుండను తనయునిం బడసి చిత్రవాహనునకు వంశ కరునిగా నునిచి వారల వీడ్కొని గోకర్ణ క్షేత్రమునకుం జని అచ్చుటిస్వామిని దర్శించి పుష్పా నదీ తీరమున వె లసిన సూర్య దేవునిం బూజించి సౌరాష్ట్ర ముఖుండై యేగుచు మార్గ మధ్యస్థ మంద లి నర్మదా తపతీమున్నగు పుణ్య నదుల పునీతుండయి పశ్చిమ సముద్ర తీర ప్రభాస తీర్ధమున క్రుంగులిడి ద్వారవతి దగ్గర లోనే యున్నదని–

తే. ఆది విష్ణుని త్రైలోక్య ఆది గురుని
అంబురుహ నేత్రు అరవింద అబ్జ వదను
ప్రాణ మిత్రాప్తు శ్రీకృష్ణు పద్మనాభు
పరమ పురుషుని సేవింప పార్ధుడంత

తే. అమ్మ అను జన్మ తనయ నా అత్త బిడ్డ
శుభపు కోర్కె తన సుభద్ర చూచు వేళ
మనము ఉవ్విళు లూర సమాతురంబ
సన్నుతాంగుని మదిలోన సంస్మరింప

వ. మరియును అప్పురంబున తన్నోరు లెరుంగకుండు టట్లును యదు పుంగవులు యతుల యందతి భక్తు లనియును మనంబునం దలచి కృతక యతి వేష ధరుండ యి ఆర్జునుండుండ–

## అర్జునుడు ద్వారకకు వచ్చుట

క. మనసెరిగియు బావ కడకు
చనియా ప్రాభాస తీర్ధ చరియల లోనన్
తనియుచు చూడగ వచ్చెను
తన నెచ్చెలి కృష్ణుడెంతొ తాత్మ్యత దెలియన్

వ. ఇట్లు వచ్చిన బావ దేవకీ వసుదేవ నందను నతి ప్రేమతో సంభ్రమానందముల్ ముప్పిరి గొన గాఢాలింగనము గావించుకొని పురందర నందనుం డానందజల భరిత నయనుండయి పాద పద్మములకు ప్రణమిల్లి–

తే. అన్న మాటకు విధి యుక్త మమిత కోర్కె
తీర్థ యాత్రలు సేవించి తిరుగు కతన
పదియు రెండ్లెల్లు పూర్తయ్యె ప్రభ వెలుంగ
నీదు దర్శన భాగ్యమ్ము నేడు గల్గె

వ. అనవిని నగుచు నబ్జ నాభుండు నర్జును ప్రీతి పూర్వకంబునం కౌగలించుకొని కుశలంబు లడిగి తెలిసికొని తీర్థాభి గమన నిమిత్తంబును సుభద్ర యందు బద్ధానురాగుండగుటయు నుపలక్షించి ద్వారకా పురంబునకు దోడ్కొని వచ్చి –

ఉ. సా జల ధార తీర్థముల శాంతికి దాంతికి మూలకందమై
కూజిత చెంచరీక చయ కోకిల పక్షుల గాన మాధురిన్
భ్రాజిత కీర్తి చంద్రిక నిభాసన దీప్తిలు పుష్ప వాటికా
రాజిత పూజితంబైన రైవత కాద్రికి తెచ్చి యుంచినన్

క. పరమానందము పురి గొన
పరమాత్ముడు పాండు తనయు బావా యనుచున్
పరి పరి గుస గుస లాడెను
పరిణయ మాడను సుభద్ర పరిహాసోక్తిన్

క. వాసవు నందన నీతో
ధీ సములెవ్వరును లేరు తేజము మీరన్
మీసము గడ్డము తోడుత
వేసము మార్చియు తగ తగ భేషనిపింపన్

వ. ఇట్లు పరమ పురుషులైన వారిర్వురును పూర్వజన్మ సహవాసంబున ప్రియ భాషణముల పరమానంద మగ్నులై ఆరాత్రియంతయుం గడిపి ప్రభాతంబగుడువసు దేవ నందనుండు కాంచన రధారూఢుండై ద్వారకకుం జని పౌర జన ప్రధానుల సమక్షమున రైవత మహోత్సవంబు సాటింపం బంచిన –

చ. విలసిత పూజ నీయములు వేలుగ దెచ్చియు సంభ్రమించుచుం
వలనగు పాయసాన్నములు వడ్డన జేయగ సందడింపుగా
కలసియు వేడ్కతో జనిరి కాంతలు పిన్నలు పెద్దలందరుం
తలకొని యెల్ల వారలును తన్మయులౌచును రైవతాద్రికిన్

ఉ. ఆటలు నాడు వారలును అందము చిందగ గంతు లేయుచున్
మీటుచు వేణుకా వినద మెంతన తుంబుర మద్దె లావళుల్
దీటగు కోల ఆటలును తీయని పాటలు పాడు వారలుం
మేటులు యాదవ ప్రముఖ మెంతయు వింతగ సంబరోద్ధతిన్

ఉ. ఏగిరి రుక్మిణీ సహిత యెల్లరు దేవులు కృష్ణ తోడుతన్
సాగిరి వెంట నంటుచును సారణ సాంబద శంబరాదులున్
తూగుచు సాత్యకీ విబుధ తోరణ పంక్తిగ ముందు వెన్కలన్
వేగ మిదేమొకో యనుచు వేవురు వీరులు రైవతాద్రికిన్

వ. అరుగు దెంచిన యెల్లవార లమ్మహోత్సవ సందర్శనానంద మగ్నులై యుండు నవసరంబున వాసుదేవుండు ధనంజయు పాలికిం జని తోడ్కొని అప్పర్వత రామణీ య తరులతా పుష్ప వాటికా మధురిమానంద ప్రదేశములం జూపుచు ఆదరి నొక రమణీయ మణిమయ శిల్పారామ వేదిక యందుపవిష్టులై అభిమతసంభాషణముల నుండునంత–

చ. సదమల కాంతి రేఖ యన సద్గుణ శీలయు సంస్థనీయయుం
యదుకుల దీపికా మణియు హల్దరు కృష్ణుల తోడ బుట్టువుం
మదనుని రాణియో యనగ మక్కువ జూచుచు యోగిపుంగవున్
మదవతి జేర రా నటకు మానిని జూచుచు యింద్ర శూనుడున్

వ. వసుదేవ నందనుడు మహాత్మా ! యతి వేషమున నున్న మీ వంటి యోగి పుం గవులుకన్యా జనుల వంక కన్నెత్తి చూచు టెంతయు వింతగా నున్న దనియును సుభ ద్రం జూపుచు మహాశయా ! ఈమె మాచెల్లెలు సుభద్రయని పల్కుచు,సుభద్రతో భద్రా యని దగ్గరకు రా బిలిచి అమ్మా !

చ. వలనుగ మ్రొక్కుమా యతికి వచ్చిన దానవు యింత దవ్వులం

తలపకు యోగి పుంగవుని తక్కువ జేయకు మానసంబునం
వలచియు వచ్చిరీపురికి బంధువు సాటిగ జూచు యెల్లరం
తెలియని దానవో యితడు దీనుల పాలిట బంధువో యనన్

వ. సుభద్రయు సంతసంబున యాతనిం జూచుచు

చ. స్థను లత పొంగుచున్మెరయ తాత్మ్యత జూచుడు మానసమబునం
పని గొని చాయలుం గనగ పాండవ మధ్యము డర్జునుండనిం
మనమున జింత జేసి అనుమానము దోపగ పల్కరించి యో
మునివర యెన్నడేనియును యేర్పడ జూచిర పాండవేయులన్

వ. అని ప్రశ్నించి పలుకరింప వారిద్దరి మధ్య నున్న బద్ధాను రాగంబులు వెల్లి విరియ మున్నె తానెరింగిన వాడు గావున వాసుదేవుండు వారల కోర్కె పెద్దలకు జెప్పి సఫలంబు గావింప నెంచిన వాడు గావున చారులవలన అర్జునుడు ద్వారకాపురియందున్నాడని ధర్మజునకు దెల్పబంపి యున్నంత బలదేవాది యాదవులెల్లరుం వచ్చి యతి రూపంబున నున్నఅర్జుననకుం భక్తి పూర్వకముగా నమస్కరించి వాని వలనసర్వ తీర్థా సంసేవన ఫలంబులం విన గోరి చాతుర్మాస్యంబు చేసి కృతార్థులంజేయ ద్వారవతి యందుండ ప్రార్థించి పార్థునిందోడ్కొని వానికి కావలయు విధులం జూచునట్లు సుభద్రకుం నియోగించి కన్యాంతఃపుర ప్రాంగణమ్మున ప్రత్యేక వసతి యేర్పరింప–

క. అతులితమౌ భక్తితొ న
య్యతి వరు కెంతయు ముదమున నన్నియు దానై
అతి భద్రమ్మున జేయుచు
మతిమంతిగ మెలగు చుండె మర్యాదలతోన్

చ. మది గల బావ భావనలు మర్మపు సూక్తుల తేట తెల్లమౌ
విదముగ పల్కు లేర్పడగ వింతగు నవ్వుల కార్య సాధనన్
కదుపుచు మేల మాడుచును కాంతకు దగ్గర బోవు వాడునా
ముదమలరారనా ముగుద ముందుకు ముందుకు జేరు చుండగన్

చ. విడి వడి యుండ లేనటుల వీనుల విందుగ మాట మార్చుచున్
దుడుకగు చేష్టలా తనువు దూరము లేకనె అంటి యుండుటన్

సుడి వలె జుట్ట జుట్టుకొని సుంతయు వీడక ఆట లాడుటన్
తొడ బడు చేష్ట లెల్లయును తోయజ నేత్రికి రక్తి గొల్పుటల్

క. యతి రూపమ్మున నుండిన
ధృతిమంతుడు ధీర గుణుడు ధార్మికు డయ్యున్
కతిపయ దినములు గడువను
అతి మెత్తని భద్ర చేయి అదనుగ బట్టిన్

క. సుదతీ తెలియుమ నన్నని
కదియను రా ముందు కురుక కాంతామణియున్
విదితమ్మాయెను బావా
ముదమెంతయు అర్జునాఖ్య మోదము గూరన్

క. మోమున ముద్దిడి గట్టిగ
కామోద్రేకత తెలియగ కాగల శుభముల్
దామోదర సన్నిభ వరు
ఆమోదము తోడ వేగ అగునని పలకన్

క. తెలిసీ తెలియని యట్టుల
మెలగుచు నుండిరి నొకటిగ మీరిన వాంఛన్
కలిసీ కలవని వారుగ
వలపుల పందిళ్ల లోన వహ్వా యనగన్

వ. ఇట్లా సుభద్రార్జును లుద్రేక వాంఛా ప్రణయానురాగ గీతిక నెల్ల కనీ కననట్లు తన దివ్య జ్ఞానంబున యెరింగిన శ్రీకృష్ణపరమాప్త పురుషోత్తముండు రుక్మిణీ సత్య భామల కతిరహస్య ప్రమోదమున యెరిగించి అర్జునునకు వలయు భోజనాదు లెల్ల ను చూచునట్ల రుక్మిణీ దేవి కప్పగించి సర్వ సమర్ధుండైన దేవ దేవుండు యేకాంత మున –

క. వసుదేవ దేవకీ సాం
బసాత్యకి యదు నృప యాదవ కులోద్భవులా
దిసమర్ధ జనములు వినన్

వసుదేవ సుతుడు సుభద్ర పరిణయ మనుచున్

వ. సుభద్రార్జునుల అన్యోన్య రహస్య సమస్త నెయ్యంబును విడమరిచి వివరించి తమ తొల్లింటి సంబంధబాంధవ్య మగుటకు అందరునూ సంతసింప బలదేవాది కొందరి యాదవులకెరుక లేకుండ సుభద్రార్జునుల వివాహము చేయ సమకట్టి వార లకుం జెప్పి పార్వతీ పతిపుజా మహోత్సవ వ్యాజంబున అఖిల యాదవ వృష్ణి భోజాంధక ముఖ్యులతో అంతర్ద్వీపమునకు వెడల నడచిన అక్కడ జేరిన వారెల్లరు మహా దేవుని సందర్శించుకొని–

## అంతర్ద్వీపమున మహాదేవు సమక్షమ్మున సుభద్రార్జునుల వివాహము

ద్వి. ఇందు ధరాధిప ఈశా దేవా – అందరి బ్రోచెడి అభవా విభవా
నంది వాహనా నాగా భరణా – వందన శతములు వరదుడ గొనుమా

ద్వి. కైలాసవాసా కమనీయ శోభా – త్రినేత్ర ధారీ త్రిశూల ధారీ
ముని జన పాలా ముల్లోకవాసా – నిన్నే కొలుతుము నీలకంధరా

వ. అనుచు ఆడుచు బాడుచుం ఆనంద మగ్నులై యుండ

క. ఎన్నడగు పెండ్లి యనుచును
తన్నమ్మిన వాసుదేవు తలచిరి మదిలో
కన్నెయు అర్జున వధువరు
లెన్నెన్నో యూహ లెసగ యిద్దరు తమలో

క. హరి వాసుదేవ ముని జన
వర వధు బంధువులు రావ వరదులు మురియున్
తరలిరి యెల్లరు పెండ్లికి
సురలోకాంగనల తోడ శోభన వేళన్

క. బృందారక గణ పరివృత
సందోహము తోడ యింద్ర సముదము రావన్
ఇందీవరాక్షు శాసను
ఎందెందరొ వచ్చి తెచ్చి యెన్నో వరముల్

వ. ఇటు వసుదేవ వాసుదేవ అక్రూర సాంబ సాత్యకులును అటు పురందరుండు నిల్వ దేవ గురుడు బృహస్పతి నిర్ణయించిన శుభలగ్న ముహూర్తమున అచ్చరులాడ దేవదుందుభులు మ్రోవ దిక్పాలకా గణమ్ములును సుర సిద్ధ సాధ్య విద్యాధర నాగ బృందమ్ములు తరలి రా కశ్యప ప్రజాపతి అధ్వర కార్య కర్తగా అత్రి భృగు నారద వ శిష్ఠ వామదేవ ప్రభృతి మునిగణంబులు సదస్యులు కా, అరుంధతీ అహల్యా శచీ రుక్మిణీ సత్యలు ఆప్సరోగణములతోడ పరంధ్రీ కార్యములునిర్వహింప ద్వారవతీ పురంబున సుభద్రార్జునుల వివాహ మతి మనోహరముగా జరుగు నంత–

తే. అనఘ బిడ్డను అర్జును నభినుతించి
సుభద్ర కోడలి కెన్నియో సుద్దు చెప్పి
రత్న మణిమయ కాంచన రాశులిచ్చి
ప్రీతి వెడలెను యింద్రుండు దేవ పురికి

వ. ఇట్లు నారాయణుండు తన కోర్కె సఫలంబైనందులకు సంతసిల్లి సంప్రాప్తయౌవ నమనోరధుండైన పార్ధుని కౌగలించుకొని చెల్లెలు సుభద్రను ముద్దాడి అక్షయ బాణ తూణీరముల నిచ్చి పవన జవనాశ్వ కాంచన రధారూ ఢుని రావించి సుభద్రం దోడ్కొని యింద్ర ప్రస్థమ్మున కేగుమని పంచి అంతర్ధ్వీపంబున కరిగిన –

క. హరి పంచిన మార్గమ్మున
పురజను లెవ్వరును లేక పూర్వా పరముల్
సరిలేని మార్గ మందల
ఒరు లేరిని వెంట గొనక యేగెడి వానిన్

క. సతియా సుభద్ర దోడ్కొని
మతిమంతుడు మాననీయ మహిమాన్వితుడున్
ధృతి దూలుచు పోబోవను
ధృతి మంతులు నగరి రక్ష దుస్సహు లెంతన్

క. యదుకుల సుత రధమున గొని
యదు వీరులు వెంట రాక యర్థమె యనుచున్
పదునగు మాటల వరుసన

యెదిరించియు నిలుప పార్థు డెక్కిడె ధన్వున్

వ. యాదవ పురక్షక భట సందోహము లెల్లరు నొకటై పోర నిల్వ పార్థుండును

క. అడ్డము వచ్చిన యా యదు
గడ్డుల యెదిరించి బోర గర్వోన్నతిమై
నడ్డులు విరుగంగ బొడిచె
దొడ్డడు యా యర్జునుండు దుస్సహు డగుచున్

వ. అంతట మిగిలిన –

క. యదు వీరులు రణ ధీరుని
పదిలముగా జుట్టి ముట్ట పార్థుడు కినిసిన్
కదుపుల మాదిరి నడచిన
యదు వీరుల మద మణచియు అవల బోవన్

వ. అంతట ఆ బాల గోపాలకా గణంబు లెల్లరుం పురంబున కరిగి బహు విధము లైన అర్జున అస్త్రాయుధ నైపుణి యెల్లను కన్నది కన్నట్లు యెరింగింప అంతర్ద్వీపము నసుండి తిరిగి వచ్చిన బలదేవాది యాదవు లెల్లరు విని యిది సహింపరాని విషయ మని కృద్ధ కోపోద్రిక్త మాన మానసులై అప్పాండులపైదండెత్తి పోసన్నద్ధులు కండని అందరు అనవిని బలదేవుండు కృష్ణునితో–

క. ఏ వెరవున నీవెరుగక
తావెడలునె పార్థు తోడ తమ్ముడ చెపుమా
నీ వాడిన కాదందుమె
కావాలని జేస్తివింత కారణ మేమా

వ. అని యడుగ వసుదేవ నందనుం డన్నతో

తే. "గొల్లరేగిన తరమౌనె చల్ల బరుప"
అనెడి సామెత దెలియవో అన్న గావ
ఆడు బిడ్డను అందుమా అందరెదుట
మనసు యెరిగిన వాడనై మనువు జేస్తి

తే. వెర్రి గొల్లలు అను మాట వింటె కాదె

మేక మెత్తని మనసులు మేటి జనులు
నమ్మ బల్కిన యెంతైన నయము గూర్తు
కాదు కాదన్న విందురే వాదు తప్ప

తే. బావ మరదలి బంధమ్ము భావ్య మనుచు
ఉత్తమోత్తము డెంతేని అత్త కొడుకు
పాండవోత్తము అర్జును బాయలేక
మరులు గొల్పంగ వెడలెతా మర్మసక్త

వ. అని ప్రథమ కోపియు శాంత చిత్తుండును ఐన అన్న నెరిగిన పురుషోత్తముడు బలదేవు ననునయింప అందరును సంతసింప-

క. సతి యా సుభద్ర తోడన
అతి ధీరుడు అమ్మ అనుజు ఆప్తుల జూడన్
స్తుతియింపను పుర జనములు
మతిమంతుడు అర్జునుండు మాధవు నాజ్ఞన్

క. పుడిసెడు జలములు దావుచు
కడు నలసియు యడవులందు కడకెట్టు లనో
గడపుచు జనపద పురముల
అడుగిడి తా యింద్రపురి సమాంతర గతుడై

క. అభిమానము అడ్డు దగుల
అభిమత మీడేర పార్థు డాడెను సతితో
అభిజాత్యము నీకేలను
శుభమగు మార్గమ్ము పొమ్ము సోదరి కడకున్

క. అమ్మకు అక్కకు ముందుగ
సమ్మతితో పూజ లిడుము సహచరి ననుచున్
కమ్మని దీవెన లొందుము
పొమ్మటు నాకంటె ముందు పొందగు శుభముల్

వ. అని బంప సుభద్రయు సతీ ధర్మముగా పతి పంచిన మార్గమ్మున యింద్రప్ర స్థ పుర రాణివాస అంతఃపుర ప్రాంగణములకుం బోయి అత్త కుంతికిం ద్రౌపదికిం మ్రొక్కిన –

క. పతి అనురాగము తోడుత
ధృతిమంతపు బిడ్డ బడయు బోర్బల వీరున్
అతి లోకోత్తర సతి వగు
మతిమంతివి వంశ వృద్ధి మానిసి వగుచున్

వ. అని వారలు దీవింప సంతోషంబున

క. అల్లన యింద్ర ప్రస్థము
మెల్లగ చేరియు కడకెటొ మిక్కిలి సుఖతన్
చెల్లి సుభద్రయు పార్థుడు
చల్లగ నున్నారని సంబర పడుచున్

వ. అల్లన అనియెను కృష్ణుడు మెల్లగ బలభద్రు తోడ ఆన్నా !

క. చెల్లికి చీరా సారెయు
పల్లకి మంచము తరిణెలు పాత్రలు బిందెల్
బెల్లపు కావెళ్ల వరుస
వెల్లువగా అరణ మిడగ వేడ్కయు కాదే

క. పెక్కగు గజ తురగంబులు
మిక్కిలిగా గోధనములు మీరిన ప్రేమన్
తక్కుం గల వస్తు చయము
మక్కువతో పంపి రావ మాధవ అనుజుల్

క. ముదమున ధర్మజు డంపగ
సదయత నక్కవలు భీము సత్వర గతులై
మధుసూదన బల రాముల
కెదురేగియు పురికి దేవ నెంతయు ప్రీతిన్

వ. వసుదేవాది యాదవ వృద్ధుల కెల్లం మ్రొక్కి బలదేవ సాత్యకీ ప్రద్యుమ్నాదుల

ప్రియ పూర్వక సత్కృతులం జేసిన యంత-

క. శ్రీ నుతు లొప్ప నిరంతర
మానిత యాదవుల గూడి మధురిపు రాముల్
యేను దినంబుల నుత్సవ
తానుత కీర్తనల యుండ్రి తద్దయు వేడ్కన్

ఉ. ఆదర మొప్ప కుంతికిని ఆ ద్రుపజాత్మకు బావ లెర్ర కుం
ఆదరి జూడ రా నవని అద్భుత వస్తుల భూషణాదులన్
సాదర పూర్వకంబుగను సత్కృతు జేయుచు పేరు పేరునన్
మాధవు డిచ్చె తా సరిగ మన్నన జేయగ నెల్ల వారికిన్

క. కూజితులైరి సుభద్రయు
నాజిం జయ కీర్తనుండు నర్జున లిర్వుర్
భ్రాజిత కీర్తన యాదవ
భూజన గుణగణ్య వరుల పూనిక తోడన్

వ. మరియుం పాండవులచేత ప్రతిపూజలందుకొని బలదేవాది యదువు లెల్లరుం ద్వారవతికిం జన ఉపేంద్రుం డింద్రనందను సుభద్రల తోడ యింద్ర ప్రస్థమున యిష్ట వినోదాదిసంభాషణల నుండె నంత సుభద్ర చూలు దనరి-

క. బేలకు నెలలవి తొమ్మిది
మేలుగ నిండిన తదుపరి మేలని పొగడన్
బాలుడు కల్గె సుభద్రకు
ధీలలితుడు వంశ కర్త ధీరుడు శూర్డున్

క. పుత్రోత్సాహులు పాండులు
పుత్రోత్సవ వేడుకలవి పూనిక తోడన్
పాత్రోచిత దానమ్ములు
మంత్రోచ్చారణ విధు లభిమన్యుకు జరుపన్

వ. ఇట్లభిమన్యుండు తల్లి దండ్రులకును పుర జన పరివార సకల జనంబులకునుఆ నందదాయకముగా కుల గురువులు ధౌమ్యుల వారి వలన జాత కర్మ చెవులోప న యన విద్యాసంస్కారంబులు వడసి పెద్ద యగుచు–

మత్త. మామ కృష్ణుని రాజ నీతులు మాట మాత్రన నొక్కటన్
సామ వేదము అస్త్ర విద్యలు సాహసుండయి యెంతనా
కామ శాస్త్రము అర్ధ వంతము కామ్య మెంతన నొప్పుగా
ధీమతంబగు వ్యూహ బేధన దుర్నయుండై నేర్చియున్

వ. అంత ద్రుపద రాజ నందన ద్రౌపది క్రమంబున పాండు రాజ నందనుల వల న ప్రతివింధ్య , శ్రుత సోమ, శ్రుత కీర్తి, శతానీక , శ్రుతసేను లను ఉపపాండవుల ను పుత్రులంబడసిన వారలైదురును–

క. మతిమంతులు ధీనుతులరు
అతులిత శస్త్రాస్త్ర విద్య లందిన వారల్
ద్యుతి మంతులు ధీర గుణులు
అతి సాహసుల రుపపాండ్లు అందరు వీరుల్

వ. ఇట్లు పాండవు లందరు పుత్ర సంపన్నులై సుఖం బున్నెడ ఇంద్ర ప్రస్థమ్మున, అయనఋతు క్రమ తిథి దినంబులు పొడవయిమంద మారుతములు సహింపరాని ఘర్మ దివసంబులు నోపరాని వాడర్జునుండు నొక్కనాడు బావ పురుషోత్తమునితో–

చ. కడు నిడివైన వీ దివస ధర్మపు రోజులు తాప ముధృతిన్
పుడిసెడు నీరు పోయగను పూజ్యము అంచును బాధ తోడుతన్
అడుగిడి దూర తీరముల కాతురు లౌచును యేగుదెంచుటన్
గడపను పోదమా సుఖత గంగకు దాపు వనాంతరమ్ములన్

వ. అని పురందర నందనుండు గోవిందు ననుమతంబున మిత్రామాత్య భృత్య సమేతుడైఅరిగి విహరించుచు ఖాండవ వన సమీపంబున నొక చందన లతా భవన చంద్ర కాంతమణిమయ శిలావేదిక యందుప విష్టులై యిష్టకథా వినోదమ్ముల నుండు నంత–

చ. అగణిత పావకుండు బహు ఆద్యపు మాంద్యము బాపుకో నయిన్

సుగుణులు పార్ధ సారధులు సుందరు లున్నటి ఖాండ్వ నంబుకున్
తగ వడి వచ్చి విప్రతను ధన్యులు ధీరత ఆత్మ రక్షణన్
దగ పడి యున్న వాడ కడు దాహము తోడుత నున్న వాడనన్

వ. అన వారతని నతిభక్తి గొలువ వారలకు విప్రు డిట్లనియె.

ద్వి. అమితభోజనుండ అగ్ని మాంద్యముతోడ – బాధపడుచునున్న బ్రాహ్మణుండ
ఓప నగుదురేని యిష్ట భోజన మిడుడు – తుష్టిగా దినియు సంతృప్తు జెంద

వ. అనిన నీకెద్ది యిష్టమో దానిన బెట్టెద మనిన అగ్నిభట్టారకుం డాహార మయ్యిం ద్రు ఖాండవమ్ము గాల్ప కావలయు ననుచు ఆ యింద్ర సఖ తక్షకుం డందున్న వాడ్గాన వలను పడుటలేదు వరుణేంద్రు వృష్టిధాటి మీరలు మహా సత్వ శస్త్రాస్త్ర కో విదులు. ఆర్త రక్షా పరతంత్రులు. ద్విజ ధర్మ రక్షా విధి బద్ధ కంకణులు. కావున అమరేంద్రాదుల అడ్డంకి తొలగించి నా మనోవాంఛితము యీడేర్ప కోరు చున్నాన ని ఆ నరనారాయణుల ప్రార్ధింప గడగెనన విన్న జనమేజయుండు–

ఆ. వహ్ని కేల గల్గె వన ఖాండవము గాల్ప
ఏమి కారణమ్ము యిద్ధ చరిత
అనుచు వేడె కథకు ఆత్మాభి సర్వజ్ఞ
దెలుప నైన దైన దెలుపు మనుచు

## శ్వేతకి అను రాజర్షి వృత్తాంతము

వ. అడిగిన జనమేజయునకు వైశంపాయనుండిట్లనియె. తొల్లి శ్వేతకి అను రాజర్షి ద్వాదశ వర్ష శత వార్షిక సత్రయాగము చేయ సమకట్టి ఋద్విజులం ప్రార్ధింపవారు రాజా! నీ చేయు అనవరత యాగ నిర్వహణా దక్షుండు ఆ దక్ష ప్రజాపతికి అల్లుం డైన పరమేష్ఠియేకానీ నిరంతర క్లేశ సంభూతులరగు మా వంటిమానవ మాత్రుల వ లన కాదన శ్వేతకి కైలాసగిరి కరిగి పరమేశ్వరు నుద్దేశించిఘోర తపంబనరించు నం త అప్పరమేష్ఠి సంతుష్టుండై ప్రత్యక్షంబగుడు శ్వేతకిదేవ దేవ మహా దేవా !

క. శతమఘు ప్రీతిగ జేసెద
శత వార్షిక సత్ర యాగ సమయపు వేళన్
ధృతిమంతుడ వాది పురుష

సతి తోడన ఋత్విజువై సొంతము జరుపన్

వ. నిర్వహణ దక్షుండవు నీవ యని ప్రార్థింప పరమేశ్వరుండు–

క. ఋద్విజమా బ్రాహ్మణులది

పృధ్వీ దేవతలు వారు పురుష శ్రేష్ఠా

సద్విజు దూర్వాసు నడుగు

సద్విజ్ఞాని యతనికిల సాటులు గలరే

వ. అన శ్వేతకి దూర్వాస మునికడకు జని పరమేశ్వరు వాక్యముగా ప్రార్థించి యాతని గొని దెచ్చి పండ్రెండేండ్ల పాటు నిరంతర ఘృత వసు ధారాపాత అగ్ని తర్పణముగా శత వార్షిక సత్ర యాగము పరిసమాప్తి చేసె. అట్లా శ్వేతకి యాగమ్మున చేసిన నిరంతర ఘృత ధారా భక్షణ కారణమున అగ్ని దేవునకు అగ్ని మాంద్యమ్మను తేజో హీనతయు అపరిమిత దప్పికయు యైన, పితామహు పాలికిం జని తన శరీర స్థితి వెల్వరింప పితామహుండు దానిని అమిత ఘృతాశన కారణముగా గల్గిన మహా మాంద్య వ్యాధిగా నెరింగి అగ్ని భట్టారకున కిట్లనియె.

క. అవ్యాసనుండ వినుమిది

దివ్యౌషధ సేవ వలన దీరున దగుటన్

క్రవ్యాసన భక్షింపుమ

దివ్యౌషధ ఖాండ్వ వనము తీరును దానన్

వ. అని దెల్పి పంప అనేక మారులు ఖాండవమును దహింప సమకట్టిన నాకు ప్రతిసారియు అనర్ఘ సురానీక సముదంబుల వలన అడ్డంకులు కలుగు చుండమరల నాతడు కమల సంభవు కడకేగి దీని కెద్దియేని యుపా యాంతరము కలదా యని ప్రార్థింప భావి కార్యంబాలోచించి కమలసంభవు డాతనితో నరనారాయణులను ఆదిమునులు ద్వాపరాంత సమయ కాలంబున అర్జున వాసు దేవులుగా దేవ హితార్థముగా జన్మింతురు. వారి వలన నీ వ్యాధి నివారణకార్యంబు ఒనగూడ నగునన సంతసిల్లి నమస్కరించి కాల విధి ప్రతీక్షింపుచు పెద్ద కాలంబైన నిప్పుడు కృష్ణార్జునులతో ఖాండవ దహనార్థము ప్రార్థించిన అగ్ని దేవున కర్జునుండిట్లనియె.

## అగ్నిదేవుడు కృష్ణార్జునులకు చక్ర కార్ముకాదు లిచ్చుట

ఉ. కాదగు కార్య నిర్వహణ కార్యపు దక్షత కల్గి యుండియుం
నీ్ని దురితోప వారణము యెట్టుల చేయుద మన్న యిత్తరిం
మా దరి యుండగా వలయు మారణ హెూమపు కార్ముకాదులుం
నీదగు దేనియుం యగును నిశ్చల చిత్తత చెప్పుడో యనన్

వ. అన విని ఆగ్ని దేవుండప్పుడు వరుణునిం దలచి బిలచి వాని తమకు సన్నిహితుం జేసి తొల్లి నీకు సోముడ్చిన బ్రహ్మ నిర్మిత కార్ముక మహా ధనువును అక్షయ బాణ తూణీరయుగళమ్మును దివ్య హయంబులం బూన్చిన మణిమయ రధమునునియ్యి ఇయ్యతిరధ మహారధుండైన పార్ధునకిమ్మని మరియుం గదాచక్రములు వాసుదేవునకుం యిమ్మనిన.

సీ, మహనీయ మనోజ్ఞ మహిమాన్వితంబౌచు
ధర్మ సంస్ధాపన ధర్మ మెరిగి
యెల్ల లోకాలలో యెదురేమి లేకుండ
దుష్టత దునుమాడు దృష్టి గల్గి
దేవ రాక్షస యక్ష దుర్నయంబుల ద్రోలి
ముల్లోక సంస్తుత్య ముగ్ధ మౌచు
మంచి చెడ్డలను పెంచి మర్యాదలను పెంచి
సర్వ భద్ర మమర్చి సమత పెంచి

ఆ. పాప పుణ్య గతుల పరమార్ధ మెరిగియు
ధర్మ చింత్న తోడి కర్మ విదుల
కిహ పరమ్ము గూర్చి యీప్సితార్ధుల జేయు
విష్ణు చక్ర మదియ కృష్ణు కిచ్చె

వ. ఇంకను వామ హస్త భూషణముగా దుష్టసంహార మహనీయ దుర్నిరీక్ష్యంబై తేజోవంతమై వెల్గందు కౌమోద గదయును వాసుదేవ ప్రదానంబు గావించె. మరియును సకల సాధు జన రక్షా దక్షంబౌచు ధర్మ సంస్ధాపనార్ధమై ముల్లోక ప్రతి వంద్యుల సమయోచితమై నిర్ద్వంద్వ గతి సమయింప వెలుగొందు గాండీవ

చాపంబును అక్షయ బాణతూణీర ద్వయంబును కనక మణిమయ విరచిత తేజో విరాజ మాన మహనీయ దివ్య మంగళ తురగంబుల బూన్చిన రథంబును అప్పటి క ప్పుడు వరుణుండు అర్జునునకు ప్రసాదింప అట్లు సంప్రాప్త దివ్య చాప రథాయుధు లైన వారలం జూచి అగ్ని భట్టారకుండు–

క. వినుడిది గాండీవంబను
అనుపమ చాపమిది తొల్లి యసురుల దునుమన్
దనుజాది యింద్ర సోములు
జనితోద్ధతి తోడ గొనిరి జయమగు నెల్లన్

క. దీనిన విడివడు బాణము
సానువులం గండ శిలల చయ్యన జీల్చున్
దీనులపై విడివ తగదు
దీన శరణ్యుడ యెపుడును ధీవర పాండ్వా

క. ఈ కౌముది యీ చక్రము
సాకల్యము దీర్చి మరలు చయ్యన మరలున్
వీకొన దేరికి వశమై
నీకార్యము లెల్ల దీర్చు నీరజ నయనా

## ఖాండవ దహనము

వ. అని తత్ప్రభావము నుగ్గడింప కృష్ణార్జునులు సంతసిల్లి రథంబెక్కి యింక యెవ్వ రడ్డమైనను తిరుగు లేదు. నీవు నీ కార్యోన్ముఖుండ వగుదన హుతాశనుండుఒక్క పరి తన సహస్రాగ్ని శిఖలం ప్రజ్వలింప జేసి –

మ. ఎడ లేకుండగ యగ్నులం బరపి తా యేకంబ ఒక్కుమ్మడిన్
విడువం బోవక అన్నిటిం వరుసనా విఖ్యాత ఖాండ్వావనిన్
సుడులం జుట్టుచు గాల్పనా వనములో శూన్యంబు దివ్యౌషధుల్
మడియం జేయను ప్రాణి కోట్లరచె తా మార్మోగ దిగ్ధాంతముల్

వ. అంతనా మార్మోగు ప్రాణికోటి హాహా కార రవంబులు విని కుపిత కోపోద్రిక్తులై పరతెంచిన వాసవాది నాయక వనపాలురు వచ్చి నిలిచిన కృష్ణార్జునుల కడ్డు తగిలి

పోరు సల్పుటయును పార్థుని నిశితాస్త్ర ధాటికి ఓర్వని వారలై అరిగిన యంత పెల్లు బికిన అగ్ని శిఖలు కాలాంతక సమయ రుద్రు సన్నిభములై ఖాండవమును సర్వము భస్మీపటలము గావింప నెగయు ధూమ పటలమ్ము ఆకశమున జీకట్లు క్రమ్మ నెగురు పక్షులు నూపిరాడక కన్ను గానక క్రింద పడి చచ్చుటయును, కలుగు లందలి యుర గ మూషిక జాతులన్నియు విషాగ్నులు గ్రక్కుచు తల్లక్రిందులుగా బడి చచ్చుటయును అంత దేవత లెల్లరును ఖాండవ దహనాగ్ని మహాజ్వాలలకు భయ భ్రాంతలైమహేం ద్రు పాలికిం జని చెప్పిన తక్షకాపేక్ష నతి త్వరితగతి ధారాధర నివహంబు ఖాండవ మునకు వచ్చి హుతాశనుపై అపరిమిత వారిధారలు కురిపించిన, ఆ వారిధార లెల్ల ను అర్జునుండేసిన గురుతర మహాగ్ని బాణ శిఖల వేడికి ఆకాశ మధ్యముననే ఆవిరి యై పై పై కెగయుటయును నొక్క చినుకైనను పావకాగ్నులపై బడకుండుటయును దాన నయ్యరణ్య మందలి సకలజీవులు అల్లాడి శించు చుండుటయును కుపితుండై

## ఇంద్రుండు కృష్ణార్జునులతో బోరుట

చ. పరుగున పాక శాసనియు పార్థుని కృష్ణుని వీక జేయగా
కురియగ కుంభవృష్ఠులను కోపము నెంతన నగ్ని నార్పగా
సరి సరి కృష్ణ పార్థులరు సాహస మెంతన పాక శాసనిం
కురియు మయూఖముల్ వరుస వాసవు ధాటికి అంతరాయులై

వ. అంత శత మఖుండు యెంతయు నలిగి వారిపై శిలా వృష్ఠి గురియింప-

చ. గురుతర మారుతాస్త్రముల ఊదెను పార్థుడు రాళ్ల వృష్ఠులన్
సరగున దేవ వాటికల సంపద లన్నియు నేల గూలనా
సుర గరుడోర్గ సాధ్య గణ సోదరు లెల్లరు సిద్ధ అస్త్రులై
పురుహూతు నందనుం నిలుప పూనిక తోడన పార్థు డంతటన్

చ. వెరువకు మంచనిం తెలిపి విద్విష వాయువు వీచు యెల్లడన్
విరివిగ మార్ణ హెూమముల విస్తుత శక్తుల శస్త్ర జాలమున్
తరుగని తంపరై సురల తక్కుల జేయుచు వెంట నంటగా
దురితము యింద్రు సేనలకు దుర్నయుడౌచును పెచ్చు రేగుటన్

చ. తనయుని విక్ర మోద్ధతికి తాత్మ్యత చెందుచు యింద్రు డెంతయుం

మనమున మెచ్చుచుం తనయు మార్కొన నేరక కోప ధృక్కులం
వనముల గాల్చునా అనలు పట్టగ నెంతయు పార్థు డుండగా
అనువది కాదులే యనుచు అచ్యుతు జూచుచు మెచ్చుకోలుగా

క. నరనారాయణు ధాటికి
గరుడోరగ సిద్ధ సాధ్య గణముల లోనన్
వెరువని వారలు గలరే
సురలోకాధిపు లయినను సూరత తక్కిన్

వ. అనునంత నొక్క అశరీర వాణి పాకశాసనున కిట్లనియె. నీ యిష్ట సఖుండైన త క్షకుండింతకు మున్నె ఖాండవం బగ్నిచే దగ్ధంబగునని తొల్లి అజు వాక్యంబుగా నెరిగి న వాడు గావున అందుండి కురుక్షేత్ర సానువులం జేరిన వాడు కావున దీనికి వగవ ం బని లేదన సురపతి సురసిద్ధ సాధ్య గంధర్వ గణంబులతో మరలి నిజలోకంబున కేగె. ఖాండవ దహన సమయంబున అందు చిక్కు వడ్డ మయుండను దనుజుం డందుండి పార నుంకింప నేరక తక్షకు నివహంబున దాగొన అగ్నియు అచ్యుతుం డును వాని జంప జుట్టి ముట్టు నవసరంబున వాడు అతి భీతుండై పరుగు పరుగు న అర్జున పిరుంద డాగి శరణు వేడ–

క. శరణాగత రక్షణమే
పరమావధిగాగ నెంచు పార్థుడు తనుగా
కరి గాచిన వర దాయక
పరమాత్మా నీవ గావ ప్రార్థింతు ననన్

వ. అట్లు మయుండును తక్షకుండును మందపాల సుతులు నల్వురు, సార్నకులు ను అతులి తోగ్ర అగ్ని దాహ బాధ నుండి దప్పించుకొన్న వారలైరని విన విన్న జన మేజయుండు మహాత్మా !

## మందపాలోపాఖ్యానము

క. మయ దనుజ భుజగ మోక్షము
దయ తోడుత యెరుగ నైతి తక్షకు కథయున్
నయ కోవిద యెరుగ జెపుమ

నియతాత్ముడు మందపాలు నిశువుల కథయున్

వ. అని యడుగ వైసంపాయనుడు ఆతనికి

క. విను దొల్లి మందపాలుడు
అను నొక ముని వర్యుడుండె అమితోగ్రుడు తా
కనురెప్ప లార్పకుండనె
యిను జూచుచు తపము జేసె యిన్నూరేండ్లున్

వ. అంత కొండొక కాలంబున నియత నిష్టా విశుద్ధ యోగాభ్యాస వశంబున దేహము విసర్జించి పుణ్య లోకముల జొర నేరక తిరిగి దేవతల మ్రోలనిలచి నేనేమి దుష్కృతినైతి ననదేవతలు వానితో మహితాత్మా !"అపుత్రస్య గతిర్నాస్తి" అనువేదోక్తి నీ వెరుంగని వాడవు కావు. కావున సంతాన వంతుడవై రమ్మన మందపాలుడు మరల మర్త్య లోకమునకు వచ్చిపక్షుల యందు వేగ సంతానోత్పత్తియగుట యెరింగి తానును సాద్యకుండను పక్షియై జరిత యను లావుక (పావుర) పెంటియందు నల్వురం బడసి ఖాండవంబు నందుంచి అరుగు వాడు ఖాండవ దహనోద్యుక్తుండైవచ్చు అగ్నిభట్టారకుంగని అగ్నిసూక్తముల స్తుతియింపుచు –

క. తనకగు బిడ్డల నలువుర
పిన గుడ్డుల పేరు కొనుచు పెరిగెడి వారిన్
వన చర సార్జవ నిశువుల
అనలా కాపాడు మంచు అర్థించుటయున్

వ. ఆగ్ని దేవుండు మందపాలుని ప్రార్దన నంగీకరించుటయును అంత నిట జరిత పెంటిప్రళయాగ్నుల వలె నేతెంచు అగ్నిశిఖలంజూచి తనయుల రక్షణార్ధము చింతించుచు నొక బిలమున దూరి యుండ మనుటయును, అందుల కీయకొనని ఆ నిశువులు తల్లితో మాకై చింతింప వలదు. దైవ నిర్ణయ మెట్లున్న అట్లగుట నిక్కువంబు. నీవు బ్రతికియున్న పెక్కురు బిడ్డల పొంద గలవు. అని పల్కిన పెల్లుబికి వచ్చు కాలాగ్ని శిఖలు దగ్గరగుటం జూచుచు –

క. ఆగని శిఖలకు వెరచుచు
ఆగమ వేదోక్త సూక్తి ననలుని దలచిన్

ఆగుము అభయము కమ్మని
సాగిలి పడి వేడినంత చరణాల్లేమిన్

వ. జరిత పెంటియు వగచుచు అగ్నిశిఖలు ధూమ దూసరితముగా ఆకశము నల్గడల క్రమ్ముకొనగా రెక్క లల్లా ర్చుకొని నింగి కెగరుటయును, అగ్ని భట్టారకుండు మందపాలు ప్రార్థనంబు మదిదలంచి శార్జకులు నల్వురు గల వృక్షమును భక్షింపక పరిహరించిన దానిం జూచిన జరితయు సుఖంబుండ సంతసించినలపిత మందపాలురు సంతుష్టాంతరంగులై నిజేశ్చన్ జనిన నయ్యనఘుండగ్ని ఖాండవ వనమును దహింప జేసి అందుద్భవించి విరాజిల్లిన దివ్యోషధీ దగ్ధ ధూపామృతము లాఘ్రాణించి తనమాంద్యమును బాపుకొని తొల్లిటి యట్ల మహా తేజస్సంపన్నుండై కృష్ణార్జునులం వేనోళ్ల కొనియాడి దీవించుటయును, అప్పుడు –

**ఇంద్రు డర్జుననకు దివ్యాస్త్రముల నిచ్చుట**

క. నర నారాయణు లిరువురు
సుర తేజుల మీరి నట్టి సూకృతి మునులర్
నరులై బుట్టిన వారలు
సాదరతం ద్వాపరాన సద్ధర్మ పరుల్

క. అతి తేజులు ఘన కీర్తులు
అతులితమౌ ధైర్య శౌర్యు లవనీ పతులర్
నుత గుణ కారణ జన్ములు
ధృతి మంతులు నీతి ధర్మ తత్పరులౌటన్

క. సుర పతి మెచ్చియు వారలు
పరంధాముని అంశజు లని పరిపరి దలచిన్
నరుడా అర్జున కృష్ణులు
నరులౌటని మ్రొక్కు వారి నభినందించిన్

వ. ఉపేంద్రార్జునుల నతి గారవమ్మున కౌగలించుకొని అర్జుననకు యెప్పుడును

యిష్ట సఖుండవై యుండుమని ప్రార్థించి దివ్య విమానారూఢుండై దేవ లోకంబున కరిగిన యిటకృష్ణార్జునులు మయుం దోడ్కొని ఇంద్ర ప్రస్థమున కరుదెంచి ధర్మరాజు నకుం మ్రొక్కి ఖాండవ దహన ప్రకారంబు వినిపించి మయుంజూపి సుఖంబుండిరని

క. వినుపం వైశంపాయన
  వినుతుడు జనమేజయునకు విఖ్యాత్వరతన్
  అనుసరణీయపు కథలతొ
  మునుకొని ఈ ఆది పర్వ మొత్తము దెలిపెన్

ఇది

**శ్రీశ్రీ వాణీ వరప్రసాదలబ్ధ సుకవిజనప్రియ సాధుజన విధేయ శ్రీశ్రీ కవిత్రయ స్ఫూర్తి ఆర్వేల నియోగి బ్రాహ్మణ మండపాక వంశోద్భవ వీర్రాజు పౌత్ర సూర్యప్రకాశం సత్యనారాయణాంబా తనయు విరచిత**

**–: శ్రీమదాంధ్ర మహాభారత ఆది పర్వ అష్టమాశ్వాసము :–**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## సభా పర్వ – ప్రథమాశ్వాసము

### మయుడు సభను నిర్మించి యిచ్చుట

వ. అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పినట్ల కృష్ణార్జునుల వెంట వచ్చిన మయుండు తానును ధర్మజునకు మ్రొక్కి యిట్లనియె.

తే. ప్రాణ దాతలు మీ మది బాయకుండ
ప్రియము మీరగ యేదేని పెంపు మీర
చేయ కల్పించి యున్నాడ చెపుడ జేతు
మయుని చేతని భువనాలు మారు మ్రోగ

వ. అనవిని ధర్మజార్జును లిరువురును కృష్ణపరమాత్మ మొగంబు దిలకింప కృష్ణుండు పెద్దయుం ప్రొద్దు చింతించి మయునితో అనియె నిట్లు.

చ. అనుపమ శిల్ప చాతురిత అద్భుత రీతుల ముజ్జగంబులన్
కని విన లేదనంగ బహు కాంతుల శోభల వింత వింతగన్
దిన మణి దీప్తులం గురియు దివ్య సభాస్థలి నేర్పరింపుమా
మనమున చింత జేసి తగ మానుగ నీదగు అద్వితీయతన్

వ. అనిన వాసుదేవునకు మయుండు–

ఉ. ధీనుత యెల్ల లోకముల దీనిన కెక్కుడు లేదు లేదనన్
వీనులు కన్నులుం మనము విస్మయ మొందగ శిల్ప చాతురిన్
ధీ నిధు లెల్లరుం బొగడ దీప్తులు చిందెడి చిత్ర సంపుటిన్
దానవ శిల్పి యీ మయుని పావన మెన్నగ చేసి చూపెదన్

వ. తొల్లి వృషపర్వుండను దానవేంద్రునకు నొక సభ రచియింప సమకట్టి తెచ్చి దాచిన వివిధ రత్నమణిమయ ఉపకరణంబుల తోడన నొకసభను నిర్మించి ధర్మజుని కిచ్చెద. మరియును సర్వ శత్రు దండిత మండితంబైన గదను భీమసేనునకును దివ్య ఝషంబు వెలయించు దేవదత్త మను శంఖమును అర్జునునకును దెచ్చి యిత్తునని

చెప్పి ధర్మ రాజుచే సత్కృతుండై మయుం డరుగుటయును శ్రీమన్నారాయణుండు పాండవుల వీడ్కొని ద్వారవతి కేగుటయును మయుం డంతట ఉత్తరాభిముఖుండై కైలాస బిందు సరోవరమున కేగి అచ్చట–

క. మును తా దాచిన వెల్లను
 మును కొని సమకట్టి తెచ్చి మోదము తోడన్
 కనకపు మణిమయ సౌధము
 వినుతింపగ జేసె మయుడు వింతలు గురియన్

చ. తొలకరి మేఘ మార్గముల దోబుచు లాడగ మేటి హర్మ్యమున్
 మలయజ వీచికా వళుల మాధురి హాయని యాస్వదింపనా
 జలమయ వాటికా కుసుమ జాలము కన్నుల కింపు గూర్చుచున్
 అలరగ నెల్ల లోకముల అద్భుత సౌధము యిద్దియే యనన్

క. మనమున చోద్యము నొందగ
 కనినంతనె కాలు మోప గడిమాయు ననన్
 పని తనమది పొగడ దరమె
 వినుతింపను లోకులెల్ల వైభవ మెంతన్

క. స్థలమో జలమో తెలయను
 కల రూపము లెరుక రాక గజి బిజి పరుపన్
 విలసిత తరువుల దరి జను
 ఫల పుష్ప భ్రాంతి తోడ పక్షులు గూడన్

వ. మరియును వివిధ రుచిమయ తేజో విరాజిమాన నవరత్న ఖచిత విద్యుల్లతా జలయంత్ర స్తంభముల తోడను, కనుల కింపౌ సప్తవర్ణ పతాకావిళంబిత కలగలుపు తోరణ పంక్తుల తోడను తరునీడల ప్రతికృతు లీనెడు మణిమయ వితర్ధికాదుల తోడ ను, వీనుల విందుగా స్వర సంయుత గానగాణ సౌవర్ణ సౌజన్య కాంతా సదృశ సుం దరతర మనోహర గీతికల విందొనరింపనగు అందాల కొమ్మల బొమ్మల తోడను క మ్మని వాసన లీను వీచికా యంత్రముల తోడను వేనకు వేలగు జనంబులు బారులు తీరి కొలువుండ నగు వృత్తాకార మంటపముల తోడను, దశ దిక్ సదృశ విలసన

ఉన్నత మధ్యస్థ వేదికల తోడను, దేదీప్యమానంబగు మయసభా భవనమ్మను పేర విలసిల్ల నగు నొక మనోహర మంటపమును మయుండు నిర్మించి ధర్మరాజునకు యిచ్చి మదమత్త వారణ విలసిత మనోహర మణిమయ గదను భీముకును దేవ దత్తంబను శంఖమును అర్జునునకు యిచ్చి ధర్మరాజుచే సత్కృతుండై మయుం డరిగెనంత.

క. వినుతింపగ జను లెల్లర
దనిపియు ధర్మార్థ వితతి ధర్మజు డంతన్
అనుజ స్త్రీ పరిజన నృప
అనుయాయుల తోడ గూడి అడుగిడె సభలోన్

క. దశ దానంబుల వరుసన
అశ నాన్నంబుల జననుతు దత్తరి వేడ్కన్
దశ దిశ రాజుల దనిపెను
విశదంబుగ ధర్మజుండు విజ్ఞత మెరయన్

వ. అత్తరి ఆ వచ్చిన నల్దిశ భూపతులును యధాశక్తి

క. మదవారణ తురగాచయ
ముదమగు కానుకల తోడ మోదంబలరన్
సదయులు దేశాధీశులు
ముదమొందుచు ధర్ము గొలిచి మోదితు లగుటన్

వ. మరియు నటకు విచ్చేసిన మహిత మార్కండేయ మౌంజాయన మాండవ్య శండిల శాండిల్య మందపాల ముదల మౌద్గల్య ఆత్రేయ భరద్వాజ రైభ రేభ పరాశర కౌండిన్య గౌతమ మైత్రేయ భార్గవ యాజ్ఞవల్క వ్యాస విశ్వావస శుక సుమంత జైమినిలను మునిగణ తండముల నెల్ల అనుజులంగూడి ధర్మనందనుండు యెదురేగి తోడ్తెచ్చి అతి భక్తిం పూజించి అర్ఘ్య పాద్యాది విధుల ఫలరస పాయసాన్నముల జనిపి లబ్ధాశీర్వచనుండై చతుర్విధ పురుషార్థ తత్పర కమనీయ పుణ్యకధా శ్రవణంబుల కాలము గడుపు చున్నెడ నొక్కనాడు–

## నారదుడు వచ్చుట

క. నీరజభవు మానస భవ
నారద మౌనేగుదెంచె నారాయణమం
త్రారాధన పరుడిటు ధ
ర్మరాజ ఋషి కులజు లున్న రాజిత సభకున్

వ. అంతనా బ్రహ్మమానస పుత్రు దేవముని ముఖ్యు నారద మహామునినిం గని యెల్లర తోడన్ అనుజ సహితుండై ధర్మరాజు వినమ్రుడై లేచి నమస్కరించి యెదురేగి తోడ్కొనొచ్చి కనక మణిమయ మెత్తని ఆసనంబున గూర్చుండ నియమింపజేసి అర్ఘ్య పాద్యాది విధులం కాళ్లు కడిగి పూజించిన వారల కుశలంబు లడిగి ఆశీర్వదించిన నారదుండు యుధిష్టిరుని తోడ ధర్మ తత్పరత రాజనీతి విషయ సమన్వయంబుగా–

## నారదముని రాజ నీతిజ్ఞత

సీ. ధర్మజ నీదగు ధర్మ విచక్షతన్
సద్ధర్మ మార్గమ్ము సలుపుదయ్య
నాల్గు వర్ణాలు నయవృద్ధి వెలయంగ
పురుషార్ధ సంపత్తి పొందునట్ల
పాడి పంటలు పెంచి ప్రగతికై శ్రమియించు
నియమితార్ధ యుక్తి నిధుల గూర్చి
జార చోర వ్యాధి జనులకు లేకుండ
రక్ష జేయగనైతె రాజరాజ

ఆ. పాప భీతి తోడ ప్రజలను గాపాడ
మానవత్వ మతుల మనుజ విభుల
ప్రీతి గావ జనుల ప్రేమగా జూడనా
ఆదరమ్ము తోడ నమిత ప్రీతి

ఆ. మంచి చెడ్డ లెరిగి మంత్రాంగముల్ గొని
సర్వ సమత గూర్ప సద్గుణాలి
నియత కార్య కలన నీతిజ్ఞ రాజాజ్ఞ

దీన జనుల బ్రోవ దీప్తి చెలగ

క. న్యాయా న్యాయ విచక్షులు
ధీయుతులై దీర్చరింత్రె తేజము వెలయన్
పాయక ధర్మము నెప్పుడు
నాయను పక్షంబు లేక నయవిధులౌచున్

ఆ. మంత్రి వర్యు లెల్ల మంచిగా వర్తింత్రె
నీదు మంచి గోరి నిర్మలాత్మ
రాజు రక్ష గోరి రాజాజ్ఞ పాటించి
కంటికి రెప్ప విధము గాచు వారె

క. రక్షా దక్షత వెలయన్
రక్షింపను దేశ జనుల రాక్షస వృత్తిన్
శిక్షలు విధియింప నౌదె
శిక్షార్హుల వదల కుండ శేముషి పర్వన్

ఆ. చార చక్షు లెంతొ చాతురి గలవారె
వార్త లరయు చుంద్రె వరుస వరుస
దేశ కాల గతులు తెల్లమ్ము జేతురా
మరుగు పరుప కుండ మాట మాత్ర

ఆ. దేశ రక్షణమ్ము దేశాభి వృద్ధియు
పాడి పంట తోడ ప్రబల మౌగ
ధీర వీర శూర తేజంబు జూపనా
సర్వ జనులు నీదు సమత బుద్ధి

క. వర్తక వ్యాపారాదుల
వర్తింతురె నయము గూర్ప వణిజులు తమకై
ధూర్తత లేకేమి జనుల
ఆర్తిం ఆర్జన పరతత అన్యాయముగాన్

క. విద్యా వైద్యారోగ్యత

ఆద్యంతము గూర్ప నౌదె అనువగు రీతిన్
సద్యో ఫలములు గొనగను
ఉద్యోగుల బుద్ధి కుశుల నుద్యోగింతే

ఆ. కూడు గుడ్డ నీడ కొదువ లేకుండంగ
పనులు గూర్చి జనుల బాధలెరిగి
ఆర్తి గాచు వాడె అవనీంద్రుడవు గాదె
ధర్మ దృష్టి దెలియు ధర్మరాజ

క. వార్తా వర్తన జేయుదె
కర్తంవ్యంబులు మరువక కార్యాచరణన్
వర్తింపను జనులెల్లరు
ఆర్తిని కాపాడు నటుల అభయత గూర్చిన్

క. మంచిని పెంచెడి వారల
అంచితముగ దేశ రక్షణకవధులు లేకన్
వంచన లేకను మనసున
కుంచితులరు కానివారి కోర్కెలు దీర్పన్

క. నమ్మియు గొలిచెడి వారల
నిమ్ముగ వీక్షించి వార్ల నీదగు రీతిన్
సమ్మతి జూచుట లెస్సగు
పొమ్మాయని యనుట తగదు పోతరికంబున్

వ. మరియును ఆడి తప్పకుండుట అనృత మాడకుండుట లేదను మాట రాకుండుట మంచి పనుల నాలసింప కుండుట ప్రమాదము లెరుగ కుండుట అనర్ధ చింతన జేయుట తెలిసినవారి నెరుంగ కుండుట క్రోధము ప్రకటింప కుండుట అప్రస్థుతములైనవాని యోచించుట విచ్చలవిడి ధనములు వెచ్చించుట రహస్యములు దాచలేకుండుట మంచిపనులు చేయలేకుండుట దుర్గుణముల కలవడుట దుర్మార్గుల చేరదీయుట అను రాజకీయ విషయంబుల ఆప్రమత్తుండవై మెలగు చుండుట నిజకార్యంబుల

రాచ కార్యములు యేమర కుండుట నీదగువారల కలసి యోచించుట రాజ ధర్మంబ నవిని ధర్మ రాజిట్లనియె. మహాత్మా !భక్తాగ్రణీ ! మహదాశయా !

క. చేయుదు మీదగు మంచిని
చేయుదు నా ధర్మ యుక్తి సేమము గూర్పన్
చేయను అన్యాయమ్మది
చేయను నా జనుల కెగ్గ చెనటిని అగుచున్

వ. అని నమస్కరించి మునీంద్రా ! మీ చూడని దేదియుం యి మ్ముజ్జగంబుల లేనే లేదెందేని యిట్టి అపూర్వ సౌధమ్ము చూచితిరా అని మయ నిర్మితంబైన సభా భవన మును జూప విస్మితుండై నారదుండు ధర్మ రాజుతో-

క. ముల్లోకంబుల దిరుగుదు
యెల్లెడనుం కాన నిట్టి దెంతయు వింతౌ
చల్లని కాంతుల సొగసరి
వల్లింపగ నేరి తరము వాసుకి కైనన్

క. చూచితి వాసవు వరుణుల
జూచితిని కుబేర అజుల సుందర సభలన్
చూసితి యమ సదనమ్మును
జూసితి సరిరావు దీన్కి చూపుల బోల్పన్

**ఇంద్ర సభ**

క. సురపతి వాసవు సభయది
సుర కన్యల అట పాట్ల చోద్యము లరయన్
విరి వెన్నెల దీప్తు లలర
చిరుతరు పూ పరిమళాలు చిందుచు నుండన్

క. శత మఘు సభలో నుందురు
అతులితురౌ వేద విబుధ ఆ హా మునులర్
స్థుతి వర దిక్పాలురతో
సతి యా శచి యింద్రు గూడి సహచర గణముల్

క. వీరత అనిలో జచ్చిన
కారణ జన్ములు పరహిత కామిత ప్రదులన్
ధీర జగద్ధిత కీర్తన
తారాగణ పురుష తోడ ధనపతి తోడన్

క. కొలువై సురపతి యుండును
కుల ధర్ముల కీర్తి ధనుల గురు సుర గణ భూ
విలసన సత్య వ్రతులతొ
తలపోయుచు ధర్మ మార్గ తత్పర జనితోన్

వ. మరియును అది సర్వశుభ లక్షణ లక్షితంబై సర్వకాల సర్వావస్థల యందును శీతా తపంబుల కనువై వెన్నెల కంటె చల్లనై తెల్లనై యెటు జూచినం దశ సహస్ర యోజన పరివృతంబై సుర గణ రక్షితంబునై వైహాయస విలసనంబునై మనోగత స్ఫూర్తి కామ గమనమ్ము నై వివిధ మణిమయ రత్నాలంకృత ధనలక్ష్మీ సరోవర విరాజితంబునై మనోహరంబునై యొప్పుచుండు.

## యమ సభ

క. యమ ధర్ముని సభ శుభకర
కమనీయము పాప పుణ్య గణనీయమునై
అమరామర కొలమానపు
రమణీయము కర్మ కొలత రక్షణ గూర్చున్

వ. ఇది రవి తేజో నిభవంతమును శతయోజన విస్తారమును కాలకింకర మూర్తి మంతమును పితృ దేవతా నివసనంబును కర్మ పాశంబుల ననుభవించుచు కాల చక్రగతి నిరీక్షితులై ఊర్ధ్వ లోకగతి సూక్ష్మ దేహులునై కృత వైభవ వీర్యులైన మన్మధ మధుకర బ్రహ్మదత్త జనక శంతనులును పాండురాజు లాదిగాగల అనేక రాజ ఋషి తండంబుల సేవితుండై యిందు యమధర్ముడు చిత్రగుప్త సహితుండై జీవుల శుభాశుభమ్ము లరయు చుండు.

## వరుణ సభ

క. వరలెడు నియ్యది జగముల

సురేంద్ర యమ సబల దీప్తి చూపుల కింపై
దురిత నివారణ కరమై
వరుణేంద్రుని కీర్తు లెగయ పరమోత్కృష్టన్

వ. మరియును మణిమయ రజిత విరాజితమ్మై సర్వలోక హితార్థము ప్రాణాధార నిలయంబునై కాలమేఘములం గూడి దీప్తి వంతములునై సప్త సాగర వసుమతీ జలధులు సకల నదీనద తీర్థ కన్యకా మణి పరివృతుండై అందలి జలచర స్థల చర తండంబులం గూడి వరుణేంద్రుండు వారుణీ సతి తోడంగూడి వాసుకీ ఐరావతాది నాగ ముఖ్యులును ప్రహ్లాద బలి నరక కైటభ కరకంఠ విశ్వరూప విరూపాక్షాదులైన దైత్య దానవ యక్ష రాక్షస వరులు సేవించుచుండ యిందు కొలువుండు.

**ధనపతి కుబేర సభ**

క. ధనదుని సభయది యింద్రుని
వన శోభల మించి వెలుగు వహ్వో యనగా
దిన మణి కాంతులు విరియుచు
మణిమయ విలసనము జూడ మహిమోధృతమై

వ. ఇది నూరు యోజనముల నిడువును డెబ్బది యైదు యోజనముల వెడల్పును పంచ శత సహస్ర దేవతా మునిగణముల కుండుట కనువై కనక మణిమయతరుల తావిలసన చిత్రవిచిత్ర శరదంబుద శోభాయమానమై సహస్రాక్షుని న ందనవన శోభాయమాన సదృసంబునై రత్నరాజిత కదంబ తోరణములతో దివిజవాసనలు వెదజల్లుచు రంభోర్వసీ తిలోత్తమా మేనకా ఘృతాచీ విభావరీ మున్న గు ఆప్సరా గ ాన విన్యాసములతో నొప్పి కిన్నెర గంధర్వ కింపురుష ప్రభృతి యక్ష రాక్షస గణ సంసేవ్య మానుండై కొలువుండు ధనదుండు.

క. దీనన వచ్చుచు బోవుచు
వాణీధవ వాసవ శివ వీణా ధరులున్
గానాపేక్షత నుందురు
ధీనుతులా దేవ ముఖ్య తెరువరు లొకటన్

## బ్రహ్మ సభ

వ. తొల్లి పదునాల్గు భువనమ్ముల జూచువాడనై తిరిగితిరిగి భూలోకమున విహరించుచున్న కాలంబుల కొండొకనాడు ఆదిత్యుండు తనకడకు వచ్చి పితామహు సభను వర్ణించుచుండ విన విని తనివి తీరక తత్సభాభవన కుతూహలుండునై బ్రహ్మ లోకంబున కరిగి పితామహునకు నమస్కరించి దీవన లందుకొని అల–

చ. తెలియగ జెప్ప లేను విన తీరదె జూడగ ధర్మ నందనా
కలగని నట్టి చందమున కానయె వింతగ మానసంబునన్
తలచిన తోడనే భువి పితామహు మానస భావన గోచరించుటల్
అలవియె పద్మజుం మహిత అన్యుల కేరికి సృష్టి జేయగన్

వ. మరియు నందు శిత శీతల చందన వీచికా వాసనలీను తెల్లతామర మొగ్గరసంభవు విధాత్రు వామపార్స్వంబున వీణాగాన విద్యా సరస్వతి శారద సృష్టి విషయ కధా కధనంబులు వల్లె వేయనా ప్రణవనాదంబు నందుండి సర్వ సృష్టి సంభవముల తన మానస వీధుల సంకల్ప మాత్రణ చేయువాడునై తొలుత సూర్యచంద్రాది నవ గ్రహ నక్షత్ర సంపత్తిని పృధ్విని పంచ భూతములను కల్పింప అందుండి యీ చరాచర ధృగ్గోచర మెల్లను ఉద్భవింప జేయుచుండుటయును, మరియును తనదైన కాల పురుష స్వరూపము నుండి పుట్టిన మన్వంత్రులు ప్రాచేతసులు దేవ దానవ యక్ష రాక్షస పిశాచ గణంబులును ప్రజాపతులును తన్ను పరివేష్ఠించి కొల్చుచుండ ధర్మార్ధ కామ మోక్షములును శబ్ద రస రూప ఘ్రూణ స్పర్శ గంధంబులును సంకల్ప వికల్ప నిర్వికల్పంబులును వేద వేదాంగములును సమస్త బాషలును విద్యలును కళలును మూర్తివంతములై కొలువ పరమానంద స్థిత పరమేష్ఠి పద్మాసన స్థితుడై యోగనిద్రా ముద్రితుండైన పురుషోత్తముని ధ్యానించుచు అద్వైత స్థితి యందుండునని లోక పాలుర బ్రహ్మ సభలను వివరించి పల్కిన నారదమహర్షితో ధర్మరాజు వెండియు–

## హరిశ్చంద్ర మహారాజు

చ. అనఘులు పాండు భూపతియు ఆఢ్యులు యెందరొ ధర్మ గొల్చుచున్
జనవిభు డుండ నా హరిశ చంద్రుడు యేమిట యింద్ర సన్నిధిన్
మునివర దేవతా సభను మోదితు డౌచును సద్గుణాఢ్యుడై

దనరుచు యోగ్యతా మహిమ ధన్యత కెక్కుచు సత్కృతుండవన్

వ. అని యడుగ నారదు డతనితో, అయ్యరిశ్చంద్రుండు

క. నిత్యా నిత్య వివేచన
సత్యమె నిత్యము అనుచును సద్గుణ శీలా
అత్యుత్తమ పృధివీ పతి
సత్యము కొరకై సతి సుతు సర్వము వీడెన్

వ. అంతటి ధీరోదాత్తుండను గుణవంతుడును సూర్య వంశ సంభవుండును త్రిశం కు నరేంద్రుని పుత్రుండును తన బాహు బల వీర్యవంతముల అవని పతులెల్లరం జయించి సప్త ద్వీప ధరా వలయంబు నెల్ల ఏక ఛత్రాధి పత్యమున నేలుచు ఆశ్రిత జనరక్షకుండునై జగజ్జన ధరాధిపతుల అండదండలతో వారి కోర్కె మీర రాజ సూయ మహాధ్వర మొనర్చె. దానన ఇంద్ర సాన్నిధ్యంబు నొందె నని తెలిపియు మీ జనకులు పాండురాజు యమ సభా భవన సందర్శనార్థమై యేగినపుడు నను కలిసి మహాత్మా ! ఈ విషయమును భూలోక సంచార మేగినప్పుడు ప్రత్యేకంగా నా సుతులతో చెప్పి ధర్మరాజుతో రాజసూయంబు చేయునదిగా చెప్ప మనుటయు ను ఆ కారణముగనే నేనిందు వచ్చుటయని తెల్పుచు–

క. చేయుము రాజిత సూయము
చేయుము ఇంద్రోర్వి సభను చేరగ పితరుల్
చేయగ దిగ్విజయమ్మది
చేయుము సోదర భుజ బల శీలత దెలియన్

వ. మరియును అమ్మహాధ్వర రాజసూయ

క. క్రతువున కూరును శుభములు
క్రతువున కడ్డాలు కూర్చు ఖలులుందు రహో
క్రతు విఘ్నత కాకుండియు
ప్రతిగా ప్రళయమ్ము వచ్చు పాపము తొలగన్

వ. అని హెచ్చరించి నారదుం డరిగిన, తమ్ముల మొగంబై ధర్మతనయుండు ధౌమ్య వైశంపాయన సుహృద్బాంధవ సమక్షమ్మున–

## రాజసూయ యాగాధ్వర సమాలోచన

క. పితరుల కనుగుణ వర్తన
అతి ముదమున చేయ నవదె అవనిని సుతకున్
మతి మంతులు ధీర గుణులు
ధృతి దూలుచు చేయ నవదె దుస్థర మైనన్

వ. అనె నారదుండు.

క. మరియును దీనన పాపము
తొలగెడి రణమది పొసగును దుర్నయ మనుచున్
పరిపరి జెప్పెను జరుపను
సరియో కాదో మనమున సంశయ మగుడున్

వ. అని యేమి చేయుటకును తోచని స్థితి యందున్న ధర్మరాజుతో ధౌమ్యాదులైన పెద్దలు నారద మహర్షి నుడివిన విషయము లందలి మంచి చెడ్డలు పూర్వాపర త్వరిత దూర గతాను గతికమ్ముగా విచారించి–

ఉ. ధీయుతు లెల్లరు కలసి తీర్చియు తర్క నసంశయంబులన్
చేయుము రాజసూయమది చేసిన తోడనె మంచి చేకురున్
పాయును దోషముల్ మరియు బంధములన్నియు వీడునంచనన్
నాయని సోదరుల్ నిలువ నల్వురు నల్గడ ధర్మ తేజుడున్

## కృష్ణుడు ఇంద్ర ప్రస్థమునకు వచ్చుట

వ. రాజసూయమును చేయువాడునై నిర్విఘ్నముగా నిర్వహించ గల్గుట కా జగన్నాటక కర్తయు పురుషోత్తమ వాసుదేవుల యండ దండ లుండనిదే కాదని యాతని తోడ్కొని రా యాప్తం చరుల ద్వారకకుం బయనింప యుధిష్ఠిరు ఆహ్వానము నందుకొన్న దేవకీ నందనుండు త్వరిత గతిం గదలి నిరంతర ప్రయాణముల యింద్రప్రస్థమునకు వచ్చి –

క. అత్తా కుంతికి మ్రొక్కియు
ఉత్తముడా ధర్మ తనయు నురమున జేర్చిన్
అత్తరి వచ్చిన వాయు సు

తోత్తము నర్జున కవలల తోడ్కొని దరికిన్

తే. సంతసమ్మున యెద జేర్చ సంబరాన
ఆసనము లంటి గూర్చున్న నయిన పిదప
పరమ హర్షమ్ము తోడన పరమ పురుషు
భక్తి గొల్చియు పూజించి పాండు సుతులు

వ. క్షేమ సమాచార మడసి మార్గాయాశోపశమన భోజన భాజనమ్ము లైన పిదప సుఖాశీనులై యున్నెడ, బావా!

క. కౌనిరావించితి ముదమున
వినిపెను ఆ నారద ముని వినిచిన విధమున్
తనుగా దెల్పుమ యనుచును
వినిచిన యా పాండు విభుని విశదాశయమున్

క. ఎరుక గల వాడ వెల్లను
కరుణామయ రాజసూయ కవ్యము జేతున్
సరియని నీవన్న యెడల
నెరవేరును అడ్డు లేక నీదగు కరుణన్

క. అని పలికిన హరి యిటులనె
నిను కాదను వాడ గాను నిశ్చయ చిత్తా
విను శిశుపాల జరాసం
ధులు నా ఘన వీర ఘోర దుర్దమ శక్తుల్

వ. తొల్లి జామదగ్నుండైన పరశురాముడు క్షత్రియ కులంబులన్నిటిం నిర్మూలనంబు గావించుటయును హైహయ ఇక్ష్వాకు వంశంబులు తక్కుటయును వీనినుండి ప్రభవించినవియును యయాతి భోజ వంశంబుల రెంటన్ గూడుకొన్న చతుర్దశ రాజ వంశములుగా మిగిలిన, సకల క్షత్రియుల నెల్లరం జయించిన వాడు జరాసంధుడతనికి–

క. అతి బలవంతుడు శౌర్యుడు
మతి మంతుడు వీర్యవంత మహిమాన్వితుడున్

ధృతిమంతుడు ధీర గుణుడు
పతి సేనానాయక శిశు పాలుడు యగుటన్

వ. మరియును మగదాధిపుడా జరాసంధునికి పశ్చిమ దిక్దేశాధీశులు హంస డింభకు లతి బలవంతులు కుడి యెడమ భుజాలు మహా వీర్యులండగా నుండుటయును భగదత్తుండు నీ జనకుడు పాండురాజునకు హితుడైనను జరాసంధునకును హంస డింభకులకును భయపడి వారికి సహాయకుడుగా నుండువాడు. పురుషోత్తముండును ప్రాగ్దక్షిణ ప్రాంత ప్రభువులు సలభ సంరక్షక మనోదత్త చక్ర సాల్వేయ యవనులును అష్టాదశ క్షత్రియ కులంబులవారును ఉత్తర పాంచాలా శూరసేనా పుష్కరులును, దక్షిణ ధీశాధీశులు కళింగ కుంత మత్స్య భూపతు లెల్లరును వానికి పాదాక్రాంతులై ఊడిగము చేయుచున్నవారు. మా మామ కంస మహారాజు వీని కల్లుడగుట చేతను నాపై యీసునం పగసాధింప నొకప్పుడు మధురపైదండెత్తి రావ అతి వీర రణధీరులైన యదువృష్ఠి భోజాంధకులగూడి మేమును మహారణమును సల్పినం వానిం జయింపనేరక మధురను వీడి రైవతకాద్రి దుర్గమును నిర్మించుకొని యుండువారము.

క. అతి దురితు జరాసంధుని
దునుమగ అది వీలు పడదు బోర్బలుడెంతన్
పని దీర్ప జాలు భీముడు
మునుకొని నా మాట చొప్పు ముదమది గూర్పన్

వ. అనిన మాటకు ధర్మానుజులతోను కృష్ణునితోను భీమసేనుండు-

క. కార్యారంభము లేకనె
కార్యము లొడ గూరు నయ్య గర్వోన్నతిమై
వీర్యత జూపుచు పెంపున
కార్యము లొడ గూర్ప నౌగ కామిత మొప్పన్

క. సరియగు మగటిమి గెల్వక
తరమెక్కునె వంశ కీర్తి తథ్యము మరియా
దురితుని దుర్నయు దునిమిన

మురియరే ముజ్జగ జనములు ముచ్చటు లగుచున్

క. మా బావ కరుణ యున్నచొ
నా భుజ బల విక్రమముల నయమును గూర్తున్
నాభిం జీల్చుచు ధక్కల
శోభిల్లుదు దిశలు వెలుగ శూరత కెక్కన్

వ. అన విని నకుల సహదేవులు–

క. అన్నకు దన్నుగ వచ్చియు
యెన్నంగా రాజసూయ మేవిధి నైనన్
పన్నుగ చేయగ దలతుము
మన్నింపుచు జనకు మాట మానుగ నెంతన్

ఉ. భూనుత కీర్తి భూపతుల బోరిన గెల్చియు రత్న రాశులన్
మానుగ దెచ్చి నీ జగతి మాన్యులు మెచ్చగ రాజ సూయమున్
తానుగ జేయుమా బొగడ ధన్యత నొందగ ధర్మ నందనా
ధీనుత పాండు భూపు సరి తేగను మెచ్చుచు దేవ భూమికిన్

వ. అనిన పాండునందను లెల్లరుంవిన రుక్మిణీ వల్లభుండు, రాజసూయ నెపంబున ఆ జరాసంధుని వధియించి నిఖిల క్షత్రియ విమోచన మోక్షమ్ము జేయుట మీయంత టి వారల వీరధర్మము. అద్దురాత్ముండు భూతలము యందలి అంతరాత్మ చందమ్ము న ఏకాంతశీలుడై అంతర్గృహ మధ్యమ్ముల నుండు. అతని అంతికమును సవ్యమార్గ మ్ముల జన దుర్లభమ్ము.. అనవిని ధర్మరాజు బావా! దామోదరా! దానవాంతకా!

క. అంతయు దెలిసిన వాడవు
వింతగు అని నిన్నెదిరించి విజయుండగుటన్
అంతటి బలయుత శక్తులు
సొంతము తావడసె నెట్లు సంభవ మాయెన్

వ. అని యడిగిన ధర్మజునకు గృష్ణుండిట్లనియె.

## జరాసంధుని వృత్తాంతము

వ. మగధాధిపతి బృహద్రధుండను వాడు అతి సమర్థుండును బలవంతుండును

అగుట సాటి రాజన్యుల నెల్లరం జయించి తన యిరువురు భార్యలందును పుత్రుల బడయ గోరి యెన్నియో యజ్ఞ యాగాది వ్రత విధానములు నిర్వర్తించియు పుత్ర కామేష్టి జేసియుం గూడ సఫల మనోరధుండు కాలేక పత్నులిరువురి తోడం అడవు లకేగి మోక్షార్థియై తపంబు జేయ సమకట్టి ఒక బాలరసాలము క్రింద ఉగ్ర తపంబు చేయుచున్న చండ కౌశికుండను మునివరు గాంచి వినయ భక్తి ప్రపత్తులం గొల్చి సేవించు చుండుటయును, ఆ చండ కౌశికుండు మెచ్చి నీ కభీష్ఠ సిద్ధి కానగు. ఏమి కావలయునన, వినయ వినిమితాంగుడై ప్రణమిల్లి మహాత్మా ! నేనెంత విభవ సంప న్నుండ నైనను సత్సంతానము లేనివాడగుట సర్వము గోల్పోయిన వాడుగా మిగిలి యున్నాను. మీ దయ వలన ఆ కొరంత దీరిన సంతసింతునన, మునివరుండు కరు ణార్ద్ర మనస్కుండయి ధ్యాన ముకుళిత నయనుండయి యుండ–

క. కండది చీలియు రెండుగ
పండొక్కటి రాలె మునికి పాదము చెంతన్
రండని పిలిచిచ్చె మునియు
ఖండితముగ దినగ నిమ్ము కాంతల కనుచున్

వ. దీనిన సంతానము బడయు నగునన అంత దానిం గొని బృహద్రధుండు కృతా ర్థుండ నైతినని ఆ చండకౌశిక మునికి నమస్కరించి తన యిరువురి భార్యలకు నీయ వారు దానిం దిని నవమాసంబులు నిండిన నొక నాటి ఆర్ధరాత్రంబున–

క. సగ భాగము లొక టొకటిగ
నగు మోవియు కన్ను చెవియు అవయవ సిద్ధిన్
మగువలు ముక్కుచు మూల్గను
మగ శిశువేయని దెలుపను మంత్రపు సానుల్

క. సగ బుట్టిన ఆ నిశువుల
వెగటొందగ జూడలేక వెక్కస పడుచున్
నగుబాటని యెదల దలచి
తగునన రాజేంద్రుక్కు జూప తగదని లజ్జన్

వ. వీని నెవ్వఱెరుంగకుండ కందకమ్మున వైచిరండని దాదులం బంచిన రాత్రించరి యైన నగర పాలక రాక్షస శక్తి జర యనునది దానిం దిన రా–

క. కదలుచు కాలుం జేతులు
మది కెంతో వింత గొలుప మానుగ రెంటిన్
అదుమగ దగ్గర ఒకడయి
ముదమున కెవ్వని యెగయుచు ముచ్చట గూర్పన్

క. సంతస మొందుచు శక్తియు
సంతోషంబున బాలకు చంకకు గొనగా
వింతగ బరువై బాలకు
డెంతెంతో యేడ్వ దొడగె యెల్లరు రావన్

వ. ఆ బాల రోదన రావంబు విని అంతిపురము లోని ముదుసలులు అందరుం రాగా వారలతోపాటు బృహద్రధుండును వచ్చి బాలకు నెత్తికొని వివరంబు తెలిసి కొను నవసరంబున కామరూప గమన చారియగు ఆ రాక్షసి మానుష స్త్రీ రూపసి యై రాజా! నే నీ నగర పాలక రాక్షస శక్తిని. రాత్రించరిని. ఈ కందకమున పడి యున్న యీ అర్ధ మానుష బాల శరీరముల జూచి దిన రా, అవి రెండును కాల్జే తులం కదల్చుచుండ రెంటిని దగ్గర నొకటిగా చేర్చి చూడనొక్కడై ముద్దుగొల్ప చంక నిడుకొనవలెనని చూడ నా శక్తి కశక్యంబై పెద్ద రోదనము గావింప మీరెల్లరును వచ్చిరన ఆ బాలుడు తన తనయుడుగా నెరింగిన బృహద్రధుండు యెంతయు సం తసించి జరయను దానిచే సంధింప బడినవాడు గావున ఆ బిడ్డకు జరాసంధుడను నామకరణం బిడి ఆ జరను కులదేవతగా భావించి యేటేటం పూజ లొనర్ప నియ మించి కోటకుంగొనిపోయి భార్యల కిచ్చి కొడుకు నతిగారాబంబున –

క. ఉత్సాహిత రీతుల మృదు
వత్సలతన్ బెంచు చుండె వర్ధిల సుతు కా
ర్యోత్సాహుడు జర సంధితు
ఉత్సుకతం కీర్తి కెక్క యుద్ధాదులలోన్

## జరాసంధుని వద్దకు చండకౌశికుని రాక

వ. ఇట్లు జరాసంధుడు పెరుగుచున్న కాలమున బృహద్రధు కడకుం చండకౌశికుం డు రా మగదాధిపతి బంధు మిత్రామాత్య పుత్ర కళత్ర భృత్య గణముల తోడ నెదు రేగి నమస్కరించి తెచ్చి యుచితాసనమునిచ్చి కూర్చుండజేసి అర్ఘ్యపాద్యాది విధులం పాదములు కడిగి పూజించి తన సర్వస్వమ్మును నివేదించి కొడుకుం జూపినం జూచి సంతసిల్లి మునివరుండు–

క. జర యను దానిన నీతడు
దురితోప శమను డగుటయు దుర్జయు డగుటన్
ధరణీప యెరుగుదును నా
పరవిద్యా యోగ నిష్ఠ పరతత్వ విధిన్

క. అరయుమ దెలిపెద నీతడు
సరి తూగుచు దిక్పతులతొ సమమై వెలుగున్
పరమై దూలును అస్త్రము
వరవీనిని దాకి మరలి వచ్చిన దోవన్

వ. నీ కుమారుడు కుమారుడంతటి బలవంతుడు. వీని నెదుర్కొని యెవ్వండును అ ని నిలువ లేడు. సముద్రుడు మహానదులం లోగొనునట్టు నీతడు మహీపతుల సంపద లెల్లం లోగొన గలడు. అనిపల్కి చనియె. నంత బృహద్ర ధుండు–

క. అనయము వీడని తనయుకు
తనుగా పట్టంబు గట్టి తరుణుల తోడన్
వనముల కెగె తపస్వుల
పనిగొని సేవించి ముక్తి పథమున మెలగన్

వ. జరాసంధుడును ఆయుధ నిహతులు గాని హంస డింభకుల సహాయకులుగా నిజ పరాక్రమం బెగయ భూభరణుల నెల్లర భంజించుచు యెదురులేక మదోత్కట విజృంభణ మాన పరాక్రముడయ్యును వారలు మల్లయుద్ధ నిహితుగుట జేసి యిప్పు డు గత గర్వమునన్ కాలగతి విశంకితాత్మ గతుండై–

ద్వి.గీ.ఆయుధముల్ దెగటార్ప లేవనెడి అహంకృతి నున్నవాడు తా

మాయోపాయత మల్ల యుద్ధమున అపగతు జేయు టొక్కటే
ఆయువు దీర్పు మార్గమది అల్లన జరాసంధునిన్
ధీయుత సర్వ భూరమణ తేజము జేయుము రాజసూయమున్

వ. అని నిశ్చితాత్మతం పల్కిన వానిం జూచి పాండవాగ్రజుండు

చ. పరహిత ధర్మ మార్గ గతి పాపము బాపుటె రాజధర్మ మా
కురుకుల పాండవాన్వయుల కోర్కులు పండగ లోక రక్ష కై
తిరముగ నిల్వ నీవ యిటు తీరనిదంచును యుండునే భువిన్
తరుగని తేజసంబెసగ తమ్ములు నీవును కార్య సాధనన్

చ. అడుగిడ జూచి ధర్మజుడు ఆప్తత కృష్ణుని కౌగలించుచున్
విడువని భీము అర్జునుల వీరుల జూచుచు సంతసంబునన్
గరపుడు రాజసూయమది కారణమౌగను కీర్తి నింపగా
వడి జను వారికిం గురిసె వావిరి దీవన లెల్ల భంగులన్

వ. అటులా ముప్వురుం మగధరాజ మహీపుర గిరివ్రజ కూటమి దిక్కుగా పూర్వాభి ముఖులుగా పయనమై మార్గమధ్యము లందలి సోణ గండకి సరయూ నదీ నదంబు లం దాటి పూర్వ కోశల మిధిలాది దేశంబులం దాటుకొనుచు గంగోత్తరులై మగధ దేశ ప్రాంతంబుల నడుగిడి గోవర్ధన పర్వతోన్నత శిఖరముల నడుగిడి తద్రామణీయ తను తిలకింప జేయుచు గోవర్ధనోద్ధరణ దక్షుండైన గోపాల గోపికాలోలుండు గిరి వ్రజ పురముం జూపుచు –

చ. ఉరుతర వైభవంబెసగ నుధృత గోపుర హర్మ్య రమ్యమా
గిరి తరు పుష్ప వాటికల వింతగు శోభల పద్మజాకరుల్
కరి తురగాది గోధనము కామిత మొప్పెడి పంట భూములున్
గురుతర శక్తి యుక్తమగు కూరిమి సేనల రక్షితంబయిన్

చ. అడుగిడి నంతనే నగరి కావలి గట్టున వైరి జూచుడున్
కడువడి భీకరా రవళి గర్జన జేసెడి కంచు ఢక్కలున్
తొడబడి యెల్ల సైన్యముల తొందర జేయుచు మేలు కొల్పనా
ఒడయని రాజ్య మెంతయు నయోధ్యము చూచుడు నెంత వారికిన్

వ. దీనిం జుట్టుకొని గోధనము ఋషభము వరాహము ఋషిగిరి జైత్ర కాద్రులను నైదు గిరులు శూర భటులం బోలి గాచికొని రక్షగా నిల్చియుండ నీ పురము గిరి వ్రజమను పేర నొప్పెడి. ఇంతటి భద్రతతోగూడిన దైనను యీ మాగధుడు బ్రాహ్మణ భక్తి పరుం డగుట–

క. వెడలెడు విప్రుల కెల్లెడ
నడయాడెడి వీర భటులు నయ విధులౌచున్
తడయక మార్గము లిత్తురు
ధృడతర రాజాజ్ఞ విధుల దుర్జయు లగుచున్

వ. కావున తొలుత బ్రాహ్మణ వేషధారులై విరోధ విహిత పెరటి ద్వారంబున–

తే. భూరి విక్రమోన్నతులు విభూతి నొసల
విప్ర వేష విభూతులు వెల్గ లీన
జీరినా భేరి ఢక్కల జేరి వెన్క
దురిత వారణ పని జేసి దుస్తరంబ

వ. ఇంక నేనడ్డంకియు లేక రాజమార్గంబున జరాసంధుని మందిర ద్వారంబు చొచ్చుడు.

**విప్ర రూపధరులైన వాసుదేవ భీమార్జునుల కడకు జరాసంధుడు వచ్చుట**

తే. అతిధి అభ్యాగతార్చన అవని విభుడు
విప్ర రూప ధరుల వేగ జేరి
అర్ఘ్య పాద్యాది విధులెన్నొ ఆనుసరింప
చూచుచుండియు నుండనా శూరు జూచి

తే. విప్ర వరు రూప యేమిట వేగ వచ్చి
భావ్య మగునయ్యు వైరుధ్య భావ యుక్తి
క్షాత్ర తేజము దెలియు నిక్షేప విబుధ
యెవరొ వీరలెంద్కిటు వస్తి యెరుగ జెపుడ

వ. అనిన వానికి పురుషోత్తముం డిటులనియె.

క. నే వసుదేవ సుతుండను

యీ వీరిర్వురు కురుకులు లిద్ధ చరిత్రన్
యేవురు అన్నల్ దమ్ములు
భూవర వీరులు జగతిని పూజితు లగుటన్

వ. సకల వసుమతీ నృపకుల సంఘముల నొకటిగా దలంచి తద్దేశ శ్రేయోభిలాషు లగుచు నీచేసిన అన్యాయంబులు విని వారల విడిపించి సర్వజన ప్రాణికోటి సంక్షేమముగా ధర్మవిధి ధర్మజుచే రాజసూయ మహాధ్వరము చేయింప సమకట్టి యున్న వారు. కావున నీ చెరబట్టిన నృపకుల తండంబుల విడుదల జేసి సహకరింప గోరుచున్నవారనిన దానికి అరివీర భయంకరుండును మహా బలవంతుండును మదాంధ గర్వితుండును ఐన మగదాధిపతి అలిగి, మీరా! నా చెరయందున్న నృప తండమ్ముల విడిపింప వచ్చిన వారలు. నన్నెదిరించి నిల్చువీరుడే వొక్కండును యీ భూమండలమున లేరు. మరియును–

క. సరియౌదురె మీ ముర్వురు
సరి యొక్కట నా యెదుటన సముల్లై నిల్వన్
అరుగుడు వచ్చిన దారిన
తరమెరుగక వచ్చినారు తరలుడు వేగన్

వ. అని పలుక మధురాధిప శూరుండు వాని కిట్లనియె.

ఆ. మంచి చెడియు వీడి మర్యాద పోనాడి
సాటి వారి యెడల సమత లేక
మట్టుబెట్టి చంప మహనీయ తందువా
రాచ కులుడవౌదె రాక్షసుండ

ఆ. కార్త వీర్యు డాది కామాంధులెందరో
మునుల కెగ్గు జేసి మోహ వశత
మహిత శక్తి దనరి మానవత్వము లేక
సాధు హింస జేసి జనరె మున్ను

వ. అటులనే నీవునూ మదాంధుండవై సాటి రా కులజుల మట్టు బెట్టి అవమానించితివి. కావున మేము నీ ఆతిథ్యము స్వీకరింపనైతిమి. మాయోపాయ బలుండవైన

నిన్ను మాయోపాయముననే మట్టుబెట్ట వచ్చితి మన తోకత్రొక్కిన త్రాచువలె పైకెగసి జరాసంధుడు బుస కొట్టుచు–

చ. ఎరుగవె మున్ను నీవు నను యేర్పడ జెప్పుమ గోప బాలకా
వెరపది లేక వీరులరి వీరుల నిద్దర వెంట బెట్టుకన్
పురపుర లాడుచుం యిపుడ పోరికి వస్తివ సిగ్గు మాలియున్
సరియగు వారితో రణము సఖ్యత అందురు పెద్దలెప్పుడున్

వ. కావున నీవు కాక వేరెవ్వరితో నైనను రణమ్ము గూర్చు కొమ్మన మురవైరి వెండియు వాని కిట్లనియె. మహాబలా! వీరాధివీరా! నే గోప బాలకుండ. నాతో నీ కేమి కానీ నాతో వచ్చిన వీరు లిద్దరును నీసాటి అననగు వీర కుమారులు. పూత చరిత్రులు. వాయువాసవాత్మ సంభవులు. కావున–

క. నీ తోచిన యే యొకరిన
చేతో మోదమ్ము గూర్ప చేయుము రణమున్
వాతాత్మజుని తోడన
పూతాత్ముడు అర్జునాఖ్య పురుషుని తోనా

వ. కోరుకొమ్మని పలుక బృహద్రధుండు వల్లె యని మారుతాత్మజు వృకోదరుని కోరుకొనుటయును, యుద్ధ సన్నద్ధులై భీమ జరాసంధు లిర్వురును–

## భీమ జరాసంధుల మల్ల యుద్ధము

చ. ఘన భుజ వీర్య విక్రములు గాఢపు బల్మిని రమ్ము రమ్మనిన్
అనువగు రీతులం కదిసి ఆయత శక్తులు ధీర శూరతన్
కనివిన నేర నట్లొదివి కర్కశులొౘను చుట్టి ముట్టుచున్
తనువులు డస్సియుం వివశతాత్ములు వీడకె యిద్దరిద్దరున్

చ. ఆయుధ పాణులై మరియు అస్త్రము లేకనె కొంత కొంతయున్
కాయములందునం రుధిర గాటులు కల్గిన లెక్క చేయకన్
మాయని కీర్తి తత్పరత మత్సరతెంతన సంగరోద్ధతిన్
నాయను వీర విక్రమత నమ్మిక నెంతయు బోరు సల్పుచున్

క. జవసత్వంబులు మెరయగ

అవయవముల్ వ్రయ్యలయ్యు ఆహవ వీరుల్
పవన బృహద్రథ శూనుల
శివమెత్తియు వీడకుండ్రి చెదరని కాంక్షన్

క. దిక్కులు పిక్కటిలన్ వడి
వెక్కసులై జూడ వచ్చి వీరుల ముష్టిన్
ప్రక్కల గలయా తరువులు
ఒక్కొక్కటి కూలనయ్యె ఒరుగుచు నవనిన్

వ. ఇట్లు భీమ జరాసంధు లొండ్రొండ్రు జయార్థులై తీరని కాంక్షమీర పట్టియు జుట్టియు ముట్టియు కొట్టుకుబొడుచుకు క్రిందుమీదుగా నెట్టుకు ఉడుగక మెడ బట్టి యు తొడ జుట్టియు మెలి బెట్టియు కాలు సేతులు నులి బెట్టుచుకుడి యెడమల మ ల్ల యుద్ధ వీరులు పదిరెండు దినంబులు యెడతెగని ఘోర మల్లయుద్ధము చేయు నెడ ఆ రాత్రి నిశి సమయంబునకు వజ్ర శరీరుండైన వాతాత్మజ భీమ ముష్టిఘాతం బులకు జరాసంధుడు డస్సి యుండుట పొడగట్టిన యధోక్షజుండు భీముడు చూచు చుండు నటుల–

క. నిలువున జీల్చియు తుంగను
వలపల దాపల నిటు నటు వంకర విసరన్
బలయుతుడు జరాసంధుని
తల మొలయును జీల్చి విసరె ధరపై గూలన్

వ. ఇవ్విధమున విజయుండైన భీమసేనుండు జరాసంధుని కళేబరమును నగరి వాకిట వైవ జూచుట కది సర్వజన భయంకరమై దోప–

క. బహుభంగుల దుఃఖితులై
సహచర మాగధ బలములు సహనోద్ధతితో
అహమును వీడియు సమయత
బహుదూరము దలచి భీము బలమును పొగడన్

వ. అంతట నా అచ్యుత భీమార్జునులు చెఱయందలి పృథ్వీపతుల నెల్లర విడుదల చేయించి–

క. అభయం బిచ్చియు మగధకు
విభవు జరాసంధు సుతకు విభవోజ్వలతన్
సభికులు మెచ్చగ పట్టము
అభిమానించియును కట్టి అర్పుండగుటన్

వ. అంత కృష్ణ భీమార్జునులచే విడుదల కాబడ్డ పృధ్వీపతు లెల్లరుం జరాసంధుని తనయుండైన సహదేవుతో పాటు తమతమ రాజ్యమ్ముల పునరాభిషిక్తు లగుటకు సంతసిల్లి వారి యేలుబడిని సన్మానించి సంతృప్తి వెలయింప అనేకానేక అనర్ఘ వస్తురత్న రాజిత ధనరాశులచే వారిని పూజించుటయును నారాయణుండు స్వదేశాభి గమనులై చూచుచున్న భీమార్జునులం వీక్షింపుచు జరాసంధుడు అధిరోహించు దివ్య రదమ్మును రావించి వినుమిది–

క. బహురత్న రాజి విరజిత
మహిమోన్నత దివ్య రధము మనువుని వలనన్
మహితుండా మగధాపతి
బహు యోధ బృహద్రధుండు బహుకృతి వడసెన్

వ. అని ఆ రధంబెక్కి భీమార్జునుల తోడన వారల వీడ్కొని ఇంద్రప్రస్థ గమనోన్ముఖుండై వినతానందనుం మదిదలంప. తక్షణంబ–

క. అనిలుని మించిన వేగత
వినయా సుతు దేగుదెంచె వివిధోర్వీశుల్
కనుగొని పొగడగ కృష్ణుని
అనుమానము లేక కృష్ణు హరిగా దెలిసిన్

వ. అంత అటనున్న ఆ బాల స్త్రీ వృద్ధు లెల్లరుం అతి వినయ భక్తి ప్రపత్తుల శ్రీమన్నారాయణున కవనతులగుచుం మ్రొక్కి ఆనందింప కృష్ణు నాజ్ఞ గరుడుండాదివ్య రథ సారధ్యంబు వహింప వాయు వేగ మనోవేగంబుల భీమార్జున కృష్ణులు ఇంద్రప్రస్థపురము జేరవచ్చి –

క. కడిది బలాధిపు భీముచె
మడియ జారాసంధు డట్లు మహితం బనుచున్

చెడు తొలగె ననుచు జనములు
పుడమిని సద్ధర్మ పాల్న పొందెద మనుచున్

క. అనురా గచ్చెరు కౌతుక
జనితోద్ధతి జూడ వచ్చి చయ్యన కృష్ణున్
అనిలాత్మజు అర్జునులను
మునుకొని ఆ పుర జనములు ముగ్ధుల రగుచున్

వ. ఇట్లు జరాసంధుని హత విజయభేరులు వసుదేవ మరుత్ వాసవాత్మజులు ముప్వురును వినమ్రులై వచ్చి పాండవాగ్రజు ధర్మరాజునకు నమస్కరించి తమచే బంధ విముక్తులైన మహీపాలుర నెల్లర జూపిన వారును.

ఆ. రాజసూయ యజ్ఞ రాజాజ్ఞ పాటింప
వినయతాత్మ బుద్ధి విబుధ వరులు
ధర్మసూన్కు మ్రొక్కి తడయక వర్తింప
ధర్మ సూక్ష్మ గరిమ ధర్మరాజు

వ. వారల నందర అభినుతించి సగౌరవ లాంఛన మర్యాదలతో సెలవొసంగ మాధవుండును అనుజసహిత ధర్మరాజుం వీడ్కొని తద్దివ్యరథం బధిరోహించి ద్వారకకుం అరిగెనంత పాండవాగ్రజుండైన ధర్మరాజు రాజసూయ యాగార్థము–

## ధర్మరాజు తమ్ముల దిగ్విజయ యాత్ర జేయ బంపుట

ఆ. తండ్రి మాట దలచి తడయక యెంతేని
రాజసూయ యజ్ఞ రమణ గూర్ప
ధర్మమౌను గాదె తమ్ములా యేమంద్రు
ననుచు ధర్మరాజు నయము బల్క

వ. విన్న యా భీమార్జున నకుల సహదేవులు నల్గురును అన్నగారి మాట నౌదల దాల్చి –

క. ఇల గల రాజుల గెల్చియు
కల ధనముల పోగు జేయ గర్వోన్నతిమై
అల నా ధర్మజు అనుజులు

తలపోసియు రాజసూయ తత్పర మతులై

వ. అమేయ రథ గజ తురగ పదాతి బల భట సందోహంబులు కల్పించుకొని నాలుగు దిక్కులకు మహోత్సాహులై ఒక్కొక్క రొక్కొక్క దిశగా నడచిరని వినిన జనమేజయుండు వైశంపాయన మునితో–

క. అనఘా అనఘులు నల్వురు
చని గెలువను యేగినట్టి చక్కని దోవల్
అనుపమ ధీ బల యుక్తులు
అని గెల్చియు దెచ్చి నట్టి ఐశ్వర్యంబుల్

వ. వినిపింపవే యని అడుగుటయును.

**అర్జునుని ఉత్తర దిగ్విజయ యాత్ర**

సీ. అగ్నిదత్తంబైన అరదంబు సమకట్టి
అర్జునుండరిగెను ఆర్య మెరయ
ఊర్జిత బలులైన ఉత్తర జన విభు
పుళినిందు ధనవింద్యు పొడిచి ముడిచి
పర్వత సీమల ప్రభ వెల్గ పాలించు
రాజేంద్రు ద్రుంచియు రణము నందు
ప్రాగ్జ్యోతిషేంద్రు డా భగదత్తు అని మొన
సాహసంబున గెల్చి ఝామలోన

ఆ. విజయ సింహుడౌచు వీర విక్రము సల్పి
రాజ వర్యులిచ్చు రత్న రాశి
రాజసూయ కాన్క రహి గొంచు పణముగా
అరుల నెన్నొ గొనియె అర్జునుండు

సీ. ఇటుల నా విజయుండు యిరువది ప్రొద్దులు
చతురంగ సేనతో చలగి వరుస
నులులూకు బృహదంశు నుద్దండు రణధీరు
సంకుల సమరాన సమయ జేసి

అనువింద బహుదూరు అవనీశు లందర
విక్రమ రణమున వీర్యమడచి
వనచర దస్యుల వశవర్తులం జేసి
కోసల కాంభోజ కోర విరచి
ఆ. రాజసూయ వర్త్న రాజాజ్ఞ పాటించి
ధనము లెన్నొ గొనియు ధర్మ నియత
ఘనుడు పార్థుడెంతొ ఘనకీర్తి వెలుగొందె
అన్న మాట చొప్పు అర్జునుండు

## భీముడు పూర్వ దిగ్విజయము చేయుట

వ. భీమసేనుండు చతురంగ బల సేనలం గూర్చుకొని రాజసూయార్థ్వరార్థంబు గదలి తొలుత తూర్పు తీర పాంచాల భూపతి చేత సత్కృత సమ్మానమ్ములు గొని విదేహపతి జనకుండనువాని జయించి దశార్ణ విభుడైన సుధన్వుతో మహాయుద్ధము చేసి గెల్చి తత్పరాక్రమమున కెంతయుంమెచ్చి సైన్యాధ్యక్షుగా గొని రోచమాను లను జ సహితంబుగా నిహతుజేసి చేది దేశమున కడుగిడి నంతనే –

చ. పనిగొని జూడవచ్చె శిశుపాలుడు భక్తితో చేది భూపుడా
అనిల సతుం మహాబలుని ఆయత శక్తుని వీర్యవర్ధనుం
కనుగొని రాజసూయ ఘనకార్యము చేసెడి ధర్మజాన్జుకుం
ధనములు పెక్కులిచ్చి చనె తద్దయు వేడ్కతొ సంతసింపగాన్

వ. అంత ఆతని పురమున కొన్ని దినంబు లుండి భీమసేనుండు యింకను పూర్వ తీరమందలి పుళింద పురంబున సుకుమార సుమిత్రులం కుమార విషయంబున శ్రేణిమంతునిం నయోధ్యాపురంబున, దీర్ఘ యజ్ఞుని కాశీరాజులను సుపార్శ్వ్వలను, రాజపతియైన సుధన్వుని మత్స్యమలయ పతులను కర్నాట దక్షిణ మల్లులను మర్దించి అపరిమిత ధనమ్ములు వశపరుచుకొని మగధాధిపతి జరాసంధు తనయు సహదేవు నాశ్వాసించి పర్వత ప్రాంత దేశములు జలోద్భవ భల్లాటుల జయించి కిరాత పతుల నేడ్వుర చంద్రసేన సముద్ర సేనులను వత్సపతిని పుండ్రపతి పౌండ్రకవాసుదేవునుం, వశ గతులం జేసికొని వారిచేతం బహుధనరాశులం కప్పంబులుగా గొని–

తే. ధరణి పతుల గెల్చి ధనరాశు లెన్నెన్నొ
కోట్ల కొలది మిగుల కూడబెట్టి
ధర్మవిదుడు అన్న ధర్మజు ఆనతి
పవన సుతుడు వచ్చె భరత కులుడు

## నకులుడు దక్షిణ దిగ్విజయము చేయుట

వ. నకులుండును మహా సేనావాహినులం గూర్చుకొని దక్షిణ దిక్కు కరిగి సుమిత్ర సూరసేన దంతవక్త్ర యవనులను గోశృంగ నివాసులను జయించి కుంతిభోజు చేత న్ ప్రియ పూర్వకంబుగా సత్కృతుండై –

ఆ. జలజ నాభు వైరి జంభకుం డనువాని
బోరిలోన గెల్చి భూరి బలుని
ఆజి గెల్చి వాని హయ గజ ధనముల
రత్న రాశి బడసె రాణ కెక్క

వ. మరియు నట నర్మదను దాటి అవంతీ పతుల విందానువిందుల మద మడంచి మాహిష్మతీ పురంబు పై బిడిసిన–

క. ధీరుడు శూరాగ్రణి ఉ
గ్రారి విమర్ధనుడు నీలుడను వాడు మహా
దారుణ భీకర యుద్ధ
ప్రారంభోద్విగ్నుడయ్యె పాండవు తోడన్

క. అత్తరి పావకు డెగసెను
గుత్తగ నా నకులు మీద గురుతర శిఖలన్
చిత్తవ హయ గజ యూథము
సత్తువుడిగి సకల సమర సాహిణు లెల్లన్

క. అన జనమేజయు డప్పుడు
అనె నా పావకుడు యేల ఆ నకులునిపై
పనిగొని శిఖలం గురిసెం
అన వైశంపాయన ఋషి నతనికి వినగాన్

వ. తొల్లి నీలు వంశంబున నిషధుండను రాజు రాజ్యంబున జాతవేదుండు విప్రరూప ధరుండయి వేదాధ్యయనము చేయుచు మాహిష్మతీ పురంబున నుండి విధివర్త నుండై పాదచారకుండయిన, నెరింగి రాజనియోగులు వానింబట్టి కొనిపోయి రాజ సమక్షమున శాస్త్ర విహిత దండనంబునన్ దండింప బోయిన, అవమాన దుఃఖ పరితప్తుడై నయ్యగ్ని భట్టారకుండు రోషాణలంబులు మండింప నిషధరాజు కడు భీతుండయి జాతవేదునకు నమస్కరించి తప్పు సైరింప ప్రార్ధించుటయును వానికి వైశ్వానరుండు ప్రసన్నుండై నీ కోరిన వరం బిచ్చెద వేడుమన్న-

ఆ. ఎవ్వ రైన గాని యీ పురంబును దాక
వచ్చు శత్రు వరులు చిచ్చు దాకి
జగతి చచ్చు లాగ చయ్యన వరమిమ్ము
అనుచు వేడె నిషధు డగ్ని దేవు

వ. నాటంగోలె పర రాష్ట్రపతులా యగ్నికి భయమంది దానిపై శత్రుత్వంబువీడి ఉండుటయును, మరియును అగ్నిభట్టారకు ప్రీతిగా ఆ మాహిష్మతీ పుర స్త్రీ జన మనోజ రాగ స్వైరణ విహారములు నిషిద్ధము లేకుండుటయును తెలియకదానిపై దండెత్తవచ్చిన ధర్మ రాజానుజుండు నకులుని సైన్యములు అగ్ని కాహుతులగుటం జూచి నకులుడు శుచిర్భూతుండై జలంబులు వార్చి అగ్ని సూక్తంబుల పఠియించి ప్రార్ధించె నిట్లు.

తే. ధర్మ కార్యార్ధ సంరక్ష ధర్మతేజ
పావకుండవు నిఖిలోర్వి పావకుండ
ధర్మ యజ్ఞమ్ము కొరకునై తరలి వస్తి
నాదు విన్నపం బాలించు నకులడేను

తే. హవ్య వాహన యాగాది కవ్య రక్ష
వాసవాదుల సైదోడు వాయు మిత్ర
అగ్ని పోకార్చి కాపాడు అగ్ని దేవ
పాదు కొల్పవె సద్ధర్మ భావయుక్తి

వ. అని వేడుటయును.

తే. నకులు విన్నపం బాలించి నయము గదుర
ధర్మ యజ్ఞమ్ము వర్ధిల్ల ధర్మ దృష్టి
వాయు మిత్రుండు శుభగత వరదు డగుచు
చిచ్చు చల్లార్చె శాంతుడై హెచ్చు ప్రీతి

వ. అది విన్న నీలుండు నకులుని దైవాంశ సంభూతుగా నెరింగి భక్తి తాత్పర్యంబుల మ్రొక్కి ఉచితాశీను గావించి దివ్యాంబర నానావిధ రత్న రాజిత మయాభరణాదులొసంగి రాజసూర్థాముగ పెక్కు కానుక లిచ్చి సంతృప్తుం జేసె. ఇట్లు మాహిష్మతీ పురంబు సాధించి నీలు చేతం అరొని నకులుండు యింకను ముందున కరిగి సౌరాష్ట్ర మందలి నానా విషయాధీశుల నుండి అనేకానేక వస్తు వాహన హయ దంతి ఉష్ట్ర గోధనంబులు కప్పంబులుగా గొని సాగర తీర ద్వీప వాసులైన పురుష నిషాద ఏకపాల కాలముఖుల ప్రావరణుల నరరాక్షస యోనుల రామ శైల తామ్ర ద్వీప వాసులను వశగతులం జేసికొని మరియు –

ఆ. ద్రవిడ ఆంధ్ర యవన గుడివన కేరళ
చేర చోర పాండ్య చోళ పతుల
నొడిచి కొన్న ధనము నూర్జిత పరుడౌచు
నకులుడెన్నొ దెచ్చె నయము తోడ

## సహదేవుడు పశ్చిమ దిగ్విజయము చేయుట

ఆ. సాహసుండు నగుచు సహదేవు డరిగెను
పశ్చిమంబు గెల్చి భద్ర గతిని
సర్వ సైన్య యుక్తి సత్కీర్తి వెలుగంగ
ధనము లెన్నొ దేవ తాను గూడ

వ. ఇట్లు మాద్రీ నందనుండు మహా సైన్యంబులు వెంటనడువ దత్త సింధు మయూరకాది విషయాధీశుల తోడన కయ్యంబుసల్పి మాళవ బర్బర తర్పక సైరీష దశార్ణ దేశ రాజుల జయించి పుష్కరారణ్య నివాసులైన గంభీర గణంబులను, సరస్వతీ సింధు సైశ్రితులైన గ్రామణీయులను పార్శ్వ పర్వత నివాసులను వశగతులం జేసి కొని–

సీ. పశ్చిమ సాగర బహు తీర వాసుల
భండనంబున గెల్చి బాహు బలిమి
అరి గొని వెలలేని అర్థంబు లార్జించి
వేవేల సంఖ్యగా వీరు డవల
తనకైన మామ మద్ర విషయాధిపు శల్యు
ఉత్తమ గుణ శీల తుత్సహించి
కానంగ నేగియు కార్యార్థ సంసిద్ధి
సత్కారముల్గొన్న సత్తముండు
తే. అర్థ రాశులు కోకొల్ల లొచు మూల్గ
సమర యోధుండు యెంతేని సాహసుండు
అర్థి జనముల బ్రోచెడి అవని విభుడు
వచ్చె సహదేవు డెంతేని వసుధ బొగడ

వ. ఇట్లు భీమార్జున నకుల సహదేవులు నల్వురు నాల్గు దిక్కుల జయించి మంచిగా రాజసూయాగార్థమ్ముగా వారు తెచ్చిన అసంఖ్యానేక ధనరాశులు మరియు వస్తు నివహంబులునుం వేర్వేర ధర్మరాజుకుం జూపి యిచ్చిన.

తే. వరలె ధర్మజు డుద్ధతిం వరుణ ధనదు
కన్న మిన్ననై యీ భువి కామ్య కలన
రాజసూయమ్ము వెలయింప రమ్యతెంతొ
తండ్రి పాండుని యానతి తలను దాల్చి

**ధర్మరాజునకు రాజసూయ యాగార్థ నిమిత్తమై ఆప్తుల వాక్కు**

ఆ. అనుజ తెచ్చి నట్టి అధికమౌ ధనరాశి
ఆప్త జనులు మరియు అవని సురుల
జూచి వేడ్క తోడ శోభాయమానుడౌ
ధర్మరాజు జూచి తడయ కపుడు
రాజసూయమంచు రాజాజ్ఞ తెల్పనా
జగతి వినగ నంత చాట బంప

ఆ. వలయు నంచు దెల్ప వాసుదేవుకు ముందు
తెలుప ధర్మజుండు ద్వారవతికి
సకల భార వహుడు సర్వేశు గొనిరాగ
అనుజు భీము నంప నమిత వేగ

క. వచ్చిన జగదా ధారుడు
అచ్చెరువుగ జూచి ధర్మ అమితోత్సాహున్
మెచ్చియు నాతని దమ్ముల
యిచ్చుత నా రాజసూయ మీడేర్పు మనన్

వ. ధర్మరాజు జగదర్చితుండైన అచ్యుతు పూజించి తమ్ములు నల్వురు దిగ్విజయము లు చేసి తెచ్చిన సమస్త వస్తువాహన ధన కనక రత్న నివహమ్ము నెల్లం జూపిన –

క. లక్ష్మిసాధృశ ధనముల
లక్ష్మిం తా జూచి నటుల లక్ష్మిధవుడుం
లక్ష్మియుత మాధవు సరి
లక్ష్మిం బూజించ్రి యంత లాలసు లగుచున్

వ. అంత వాసుదేవుని ప్రతిపాదనమున ధర్మజుండు దేవ ముఖంబైన అగ్నిముఖము న విధి విహితమ్ముగా అగ్నివేల్చి దేవ తర్పణంబొనర్చి రాజసూయాధ్వర విధానమున నియోగించ అనుగ్రహింపు మనిన కృష్ణుండు వానికి–

ఉ. పూజ్యుడ రాజలోకమది పుణ్యుడ వంచును కీర్తి నింప సా
మ్రాజ్యము నేలనా జగతి మానుగ జేయవె రాజసూయ సా
యుజ్యము పొందగా పితరు లుజ్వలు లౌచును కామితార్థులై
పూజ్యము చేయవే ధనము పుణ్య జనాళికి ధార వోయుచున్

## ధర్మరాజు రాజసూయము చేయ సమకట్టుట

వ. ఇట్లు వాసుదేవుని చేత యాజ్ఞాపితుండయి అనుజులయు ధౌమ్య ద్వైపాయను లయు అనుమతంబున ధర్మరాజు రాజసూయ మాహాధ్వరము జేయ నుపక్రమించి సహదేవుం జూచి నీవు ధౌమ్య గురోపధిష్ఠంబులైన సమస్త యజ్ఞోపకరణద్రవ్యంబులు దేర ఇంద్రసేన అర్జున సన్నితుండైన రుక్మను తోడుగాగొని యజ్ఞాయతనంబుగా వచ్చు

నానా దేశాగతులైన రాజుల కెల్లరకును సన్నివేశంబులు కూర్పింప అఖిల భూతల బ్రాహ్మణ క్షత్రియాదుల నెల్లర రా బనుప పంచిన ఇంద్ర సేనాదులైన అనేక శిల్పకారుల నియోగించి తత్కార్యాచరణ నిమగ్నుం డగుటయును –

సీ. విధి విధానమ్ముల విఖ్యాత తలమును
గోమయ శుద్ధిగా గోష్ట పరచి
నాగేటి చాలుల నయముగా దున్నియు
చదును చేయించియు చతుర గతిని
అష్ట దిక్శోభన మలరంగ పూజించి
రంగ వల్లులు దిద్ది రయము తోడ
యజ్ఞోప విధి యుక్త మమరిచి వేవేగ
వంట శాలలు నింపి వరుస వరుస

తే. పాయసాన్నాది షడ్రుచి పాకశాక
పిండి వంటలు తోడన పెరుగు నేయి
కూర గాయలు పచ్చళ్లు ఉప్పు పప్పు
సిద్ధ పరపించె సహదేవు డిద్ధ చరిత

వ. మరియును సహదేవాను శాసనమున సబాంధవ మిత్ర పుత్ర సమేతులై విరాట్ ద్రుపద శిశుపాల గాంధార రాజు లును ప్రాగ్దిశా శోభిత పరులైన భగదత్త బృహద్బల చంద్రసేన సముద్రసేన కుంతిభోజ పౌండ్రక వాసుదేవులును పశ్చిమాన వసుదేవ బలదేవ ప్రద్యుమ్న శూరసేనాది యదువృష్ఠి భోజాంధక వరులును పూర్వోత్తర దక్షిణ అంగ వంగ కళింగ కాశ్మీర కాంభోజ గౌడాంధ్ర సింహళ కేరళ కుంతల ద్రవిడ యవన పతులును మొదలుగా గల్గు చతుస్సముద్ర ముద్రిత వసుంధరా చక్రమ్మునం గల రాజ చక్రమును సమగ్ర వేదవేదాంగ పారంగతులైన అగ్ర జన్ములును స్వకర్మ నిరతులైన వైశ్య శూద్రజాతులును వచ్చి తత్తత్ సన్నివేశంబుల విడియించిరంత ధర్మపుత్రుండు భీష్మాది గురు కురువృద్ధ పెద్దల నెల్లరం గొనిరా గజపురంబునకు నకులుం బంప

క. అనుపమ రీతుల తమతమ
అనుయాయుల తోడ గూడి యా కురువృద్ధుల్

మునుకొని కాన్కలు గొనుచును
తనియుచు రా రాజసూయ తత్పర మతులై

వ. ఇట్లు వచ్చిన భీష్మ ధృతరాష్ట్ర విదుర ద్రోణ కృపా అశ్వద్ధామ సౌమదత్త కర్ణ భూరిశ్రవ శల్య శకుని సైంధవ దుర్యో ధన దుశ్శాసన వికర్ణాదుల నెల్లర బ్రియసత్కారముల పూజించి వారలతో ధర్మరాజు–

క. అవనిని అరుదగు యాగము
తవదీయుల ఆదరంబ ధన్యత వెలయన్
పవనాశ్విన వాసవ సుత
సవనోద్ధతి జేయువాడ సత్కృప గొనుడీ

వ. అని వారల అనుగ్రహము వడసి గో గజాశ్వ రత్న స్వర్ణ రజిత ధనదాన విషయంబుల కృపాచార్యుని కృతాకృత పరిజ్ఞానము నందు భీష్మ ద్రోణులను వస్తువ్యయ సంవిధాన విషయంబుల విదురుని నానా దేశాగతులైన రారాజులుతెచ్చియిచ్చు ఉపాయనంబులు గైకొన దుర్యోధనుని భక్ష్య భోజ్యాది వినియోగంబు నందు దుశ్శాసనుని నియోగించి–

క. అందరి ఆమోదమ్మున
సుందరి ఆ ద్రుపద రాజసుత ద్రౌపదితో
సందడి గొన రారమ్మన
అందముగా ధర్మరాజు యాజ్ఞికు డేగన్

ఉ. వింతగు భూషణావళుల విస్మయ శోభితు ధర్మనందనుం
డెంతయు రాజ తేజసము యెల్లెడ పర్వగ యజ్ఞ వాటికన్
సంతత వేద ఘోష మది చర్వితి చర్వణ మంత్ర పూతమై
సంతస మెంతనా జనులు సంభ్రమ మందుచు జూచి లెల్లరున్

వ. అంత వేద మూర్తులైన పైల ధౌమ్యులు హెూతలుగా యాజ్ఞవల్క్యుం డధర్వుండుగా ద్వైపాయనుండు బ్రహ్మగా సోముడుద్గాతగా వీరల పుత్ర శిష్యగణమ్ములు బ్రహ్మణ్యులుగా నారదాది బ్రహ్మ ఋషులు సదస్యులుగా భీష్మాది రాజ ఋషులు సహాయకులుగా షడంగ సమృద్ధంబై సర్వ సమగ్ర క్రియా సమంబయి సంపూర్ణ ధనధాన్య

సమన్వి తంబునై జగన్నాధ రక్షితంబునై సకల జన నయనానంద కరంబునై రాజసూ యంబు నతి రమణీయమునై వెలుగొంద –

సీ. రాజసూయాధ్వర రమణీయ తెంతన
పూత మంత్రాన్విత పుణ్య ఫలిత
ధర్మ పాశాలలో దయనీయతం వీడి
పరమ పధము దోవ పట్టె పాండు
తనియగా దేవతల్ తద్ధర్మసూయాన
వేవేల దానాల విప్ర తతులు
సముచిత సత్కార శోభాయ మానులై
సంతృప్తు లై రాజ సదయులెల్ల

తే. అన్న వస్త్రాది దానాల పిన్న పెద్ద
లెల్ల జనులరు సంతృప్తు లౌగ జేయ
ధర్మ తత్పరు దీవించి ధరణి జనులు
అనుచు వచియించె నా మౌని అవని విభుకు

ఇది

**శ్రీశ్రీ వాణీ వరప్రసాదలబ్ధ సుకవిజనప్రియ సాధుజన విధేయ శ్రీశ్రీ కవిత్రయ స్ఫూర్తి ఆర్వేల నియోగి బ్రాహ్మణ మండపాక వంశోధ్భవ వీర్రాజు పౌత్ర సూర్యప్రకాశం సత్యనారాయణాంబాతనయు విరచిత**

**–: శ్రీమదాంధ్ర మహాభారత సభా పర్వ ప్రధమాశ్వాసము :–**

# శ్రీమదాంధ్ర మహాభారతము
## సభా పర్వ ద్వితీయాశ్వాసము

### ధర్మరాజు కృష్ణుని కర్ఘ్య మిచ్చుట

వ. అటుల సూతుండు శౌనకాది మహామునులకుం చెప్పినట్లు వైశంపాయనోక్తం బగుచు విన వచ్చిన భారత కథా కథనంబున జనమేయయుండు తన పెదతాత పాండవాగ్రజుడు ధర్మరాజుచే పితృవాక్య పాలనా ధర్మ విధిని నిర్వహింప బడిన రాజసూయ మహాధ్వర విధానోద్ధతిని ధర్మజుని ధర్మ వ్యాప్తిని వివరింపుచు నారదుం డు కృష్ణం జూచి యదు వంశజుడుగా ప్రభవించిన శ్రీమన్నారాయణునిగా అందరె రుంగునట్లు ధర్మసంస్థాపనోద్ధరణ భారకునిగా అభివర్ణించుచు భావిభారత మహా రణవిధి మది దలంచుచు మహామనీషుగా యుంటంకించి యుండునంత–

క.. శంతను గంగా నందను
డెంతేనియు హృష్టుడౌచు యెల్లరు వినగన్
అంతక పుత్రున కనియెను
శాంతము గోరర్ఘ్యమీయ సత్కృతు కనుచున్

ద్వి. వృద్ధ బుద్ధుల బుద్ధి కుశలుడ – పెద్ద లందున పెద్ద వాడవు
యెట్టి వారల కర్ఘ్య మీయను – యెల్ల లోకము మెచ్చుగాన్

వ. అని ధర్మజుం డనినంత భీష్ముడు ధర్మరాజుతో–

ద్వి. సద్గుణాఢ్యులు బుద్ధి వృద్ధులు – సంయమీంద్ర గురూత్తముల్
సదయ హృదయులు సాధు వృత్తులు – సమర యోధ ధరాధిపుల్
పెద్ద లెల్లరు పూజనీయులు – పేర్మి చూపెడి వేద వేద్యులు
యెంచి యొక్కని సంచితార్థము – అర్ఘ్య మీయుమ అనిన మీదట

వ. పాండవాగ్రజుండు దేవ వ్రతునితో తాతా! అన్నియు యెరింగిన పెద్ద వాడవు. నీ మాట చొప్పున చేతునన–

ద్వి. వేదవేద్యుడు విశ్వరూపుడు – నీరజాక్షుడు నిఖిల లోకుడు

అన్ని తానగు ఆత్మ రూపుడు – సన్నుతాంగుడు సాక్షిభూతుడు
బ్రహ్మ కాద్యుడు పరమ పూజ్యుడు – బాధ లొందని పాప రహితుడు
సంయమీంద్రుల సరస సంభవ – సద్గుణాన్విత సాధు శూరు
అష్ట లక్ష్ముల కాకరంబగు – సృష్టి తనదగు సూక్ష్మ రూపుడు

తే. నరవరుండైన పరమాత్మ నల్లనయ్య
ఆత్మ విదుడైన అచ్యుతుం డాఢ్యు కంటె
అర్ఘ్య మీయను వేరవని అర్హులుంద్రె
ధర్మ తత్పర గుణసాంద్ర ధర్మరాజ

వ. అనిన కురుపితామహు భీష్ము వచనంబున సహదేవ్యోపనీతంబైన యర్ఘ్యంబు నా వాసు దేవునకు విధి విధాన శాస్త్ర సమ్మతముగాధర్మ రాజిచ్చిన దానింజూచి సహింప నేరని శిశుపాలుడు పాలంబన పరుండయి మాధవుని ఆక్షేపించుచు–

**శిశుపాలుడు ధర్మజ భీష్మ వాసుదేవుల నాక్షేపించుట**

ఉ. శుద్ధత యోగ్యులుం బుధులు శూర పరాక్రమ ధీ విశాలురున్
వృద్ధులు పెద్దలుం మరియు బంధు జనంబులు యిందరుండగా
కృద్ధత పల్క భీష్ము డిటు కాదనకుండగ పూజ సేయగా
బుద్ధి దలంపవే యెడద పూజకు నర్హుడె యాదవుండనన్

చ. ముదుసలు లాడు మాటలకు ముందుల వెన్కల నూహ చేయకే
యదుకుల భూషణాఢ్యు తగ యాదర మెంతన భక్తి యుక్తులన్
పొదివియు భూషణావళుల పూజలు చేస్తివి పాడి కాదనిన్
మది దలపోయవా జడుని మాన్యత యెంతని యోజ సేయకన్

సీ. వయసున పెద్దయా వసుదేవు కంటెను
వృద్ధులెందరొ చాల పెద్ద లుండ
పూజనీయుడె చాల పురుషోత్తముండన
వ్యాస కృపుల కంటె వన్నె చెపుమ
కోరి పూజింపనా కుంభ సంభవు సాటె
అస్త్రాది విద్యల ఆఢ్యుడౌనె

సరి రాచ కులజుల సరివాడ తులతూగ
యదువంశజుడైన యాదవుండు

తే. అగ్ర తాంబూల మందనా అర్హౌనె
పూజనీయుడె పురుషార్ధ పూజలొంద
యేల యిటు జేస్తి ధర్మజా బేలవౌచు
పాడి యెంతువె భీష్ముని భాషలందు

ద్వి. పరుష శ్రేష్ఠుడ పూజనీయుడ – పుణ్య శ్లోకుడ ధర్మజా
సాదరంబున రాజులెల్లరు – సద్గుణాఢ్యత దలచి నీ
రాజసూయము రాణ వెల్గను – కోర్కె మీరగ గుములు కొనిరా
తోసి రాజుల తోయజాక్షుని – యాదవాఖ్యుని పూజ జేస్తివి
తగునె నీకిటు ధర్మతత్పర – కౌరవాన్వయ గౌరవంబే

తే. ఇచ్చు వానికి లేకున్న పుచ్చు కొనగ
గోపలోలుడు గోపాల కోవిదుండు
పాడి గాదని దలపడే భావ్య మనక
తగునె తానిటు గ్రహియింప ధర్మ బుద్ధి

ఉ. పేడికి పెండ్లి వేడుకయు పెన్నిధి కూర్చుట లుబ్ద బుద్ధికిన్
నీడకు రంగు పూసినటు నిశ్చల చిత్తుకు బోధ చేయుటల్
గోడకు దీప్తి గూర్చుటయు గోపరి పాలున కర్ఘ్య మిచ్చుటల్
చూడగ చోద్యమై దనరు శోభన వేళను నిష్ఠురోక్తులున్

ఉ. ఇందరు జుల్క జూసి నిను యీసడి చేయను చీదరింపనున్
విందుగ విందువా చెనటి వీనులు లేనటు నిష్ఠురోక్తులన్
అందరి యాదరాభిమత మాదట యిట్టుల కోలుపోతివా
తొందరపాటనిం మనము తూటులు వోవదె ధర్మ నందనా

వ. అనుచు ననేక విధంబుల ధర్మజ భీష్మ కృష్ణుల యెగ్గు లాడుచున్ క్రోధానలుం డయి అటనుండి పోవుచున్నెడ అనునయింప యిట్లనియె.

క. క్రోధము తగునే ధీరకు

మేధావుల కెగ్గు లాడ మేటి గుణంబే
సాధారణ మానవుడే
ఆధారుడు అచ్యుతుండు అఖిలోర్వులుకున్

క. అది యిది యని కురు వృద్ధుని
మది నెరుగక మాటలాడ మాన్యుడ తగునే
నది సుతు కంటెను బుద్ధివ
వదరుచు మాటాడ నవుదె వాక్పరుషములన్

చ. దురితపు మాటలాడు టది దుర్నయ బుద్ధుల లక్షణంబనిన్
మరి మరి చెప్పు చుంద్రు బహు మాన్యుడు పెద్దయు వృద్ధు లిద్ధరన్
కురుకుల పెన్నిధిం మరియు కూరిమి భక్తుడు దేవదేవుకున్
నరవర చేది భూప గుణ నేరము లెంచకు బుద్ధి మాంద్యతన్

వ. అని అనేక విధములా శిశుపాలు సముదాయింప జూచు ధర్మరాజుతో శాంత నవుండు–

తే. బాలుడీతడు దర్పంపు బలయుతుండు
హేయ బుద్ధికి మర్యాద లేమి దెలియు
పాలుమాలిన వానితో పలుకు లేల
ధర్మ సూక్ష్మమ్ము తెలియునే ధర్మ హీన్ము

వ. అని శిశు పాలుం జూచుచు

తే. అవని విక్రమ క్షత్రియు నవని నేలు
ధర్మ తత్వజ్ఞ జ్ఞానైక ధర్మ విదులు
పరమ భక్తులు ధీయుక్త బ్రహ్మ విదులు
ఉత్తమోత్తము లన్నింట నూహ సేయ

తే. హరి యయోగ్యుండె అర్ఘ్యంబు అందు కొనగ
మూడు లోకాలు పాలించు మూర్తి కాదె
ఆది విష్ణువు త్రైలోక్య ఆది గురుడు
అన్యు లెవ్వరు సాటౌదు రర్ఘ్య మంద

సీ. కామితార్థుల కోర్కె కారణ జన్ముండు
ధర్మసంస్థాపనా ధర్మ విదులు
సర్వైక సృష్టిని సమతుల్య గరిమమ్ము
పంచ భూతాత్ముడై బరపు వాడు
అన్ని తానై యుండి అవ్యక్త రూపుండు
వేదాంత వేద్యుడౌ విశ్వ శక్తి
కాల స్వరూపమ్ము కరణీయుడై వెల్గు
సూర్య చంద్రుల దీప్తి చేయువాడు
తే. ఆది మధ్యాంతముల్లేక అలరు వాడు
పరమ పురుషుండు పురుషార్ధ భావకుండు
ఆత్మ తత్వజ్ఞ పరమాత్మ అద్వితీయు
సకల జీవుల బ్రోచేటి సద్గుణుండు

వ. అట్టి మహా మహితాత్ము పరమాత్ము నెరుంగ సామాన్య మానవుల కశక్యంబు. ముక్త సంగులైన మునులు మహర్షులు ఆత్మ తత్వజ్ఞులు యోగులు యెరుంగ గలట్టి జగత్రయ పూజ్యుండయిన వసుదేవ నందనుండైన వాసుదేవుండు అందరి కంటెను మహొన్నతుడు. పూజనీయుడు. అర్ఘ్య మందుటకు అర్హుండు. కావుననే అచ్యుతున కర్ఘ్యమిచ్చి పూజింపు మంటినను అవసరంబున సహదేవుండు ముందునకు వచ్చి-

ఉ. ఆదట మాట మాత్రమున అచ్యుతు నంతటి ఉత్తమోత్తముం
కాదను హీను లుండ్రె మరి కర్కశ వాక్కుల మాట దూలుచున్
మీదకు వచ్చుచో వినక మిక్కిలి దన్నుచు నేల రాల్చెదన్
సాదర బుద్ధులై మెలగి సంస్థుతి బల్కని యెట్టి వారలన్

వ. అనునంత.

క. పరిమళ కాంతులు విరిసెను
సుర దుందుభు లెగసె దివిని సుంభ ధ్వనితో
విరి వానలు గురుసి రమరు
లరయుచు సహదేవు పైన అందరు మెచ్చన్

క. శుభమిది జగతికి అని విన
అభవుని కొనియాడి పాడ అందరు వొక్కటై
సభ యంతయు మారు మ్రోవ
నిభమణి శీతాంశు దగుచు నింగిని వెలుగన్

వ. అది అంతయు కని విని చేది భూపాలకుండు శిశుపాలుండు సహింపక కోపో ద్రిక్త రోష కషాయితాక్షుండై పరుష వచనంబుల నంబుజగర్భు గోవింద గోపాలు నధిక్షేపించుచు స్వపక్ష క్షత్రియ కులంబు నెల్ల వెంట గూర్చుకొని వొక్కుమ్మడి పోరికు రుక వాసుదేవు పక్షంబైన యదు వృష్ణి భోజ కకురాంధక సమస్త వాహినులుం గూ డయుద్ధ సన్నద్ధంబై దూకు చున్నెడ యజ్ఞ ప్రయోగమ్ము ప్రజోపయోగము కాకుండ వి ఘ్నం బగుచుండుట కెంతయుం చింతించి శాంతికాముకుడైన ధర్మ తనయుండు తాత భీష్మ సన్నిధికింజని జనాప వాదోపద్రవంబు రాకుండ సంక్షోభము వారింప వేడుటయును ఆ శ్రీహరి భక్తుండు భీష్ముండు వానితో–

క. గర్వితులై విఘ్నమ్ములు
దుర్వినయులు చేయుచుంద్రు దోర్దర్పు లిలన్
నిర్వాకులు కానేరని
దుర్వారుల ద్రుంచు వాడు దర్దమ హరియే

క. తరమెరుగని పరిహాసులు
పరిపంథులు నొకట గూడి పరి పరి పలుకన్
దురితోప శమన కారుడు
హరి యల్గిన నిల్చువారు అవనిని గలరే

క. సుజ్ఞానివి ధర్మ తనయ
అజ్ఞానివి కాక లెమ్ము అన్నియు తానై
యజ్ఞ ఫలము శాంతి దనర
విజ్ఞత కాపాడు వాడు విశ్వంభరుడే

వ. అని అనేక విధముల కృష్ణు పరమాత్ముగా పెద్ద గొనియాడ నాగ్రహ బుద్ధుడైన శిశుపాలుడు కృద్ధుడై బహు విధ ధీర వీర శూర వర నృప కోటి నెల్ల యీ భీష్ముని

కతంబున ధర్మరాజు అవమానము పాలు జేసి నాడనుచు కృష్ణుంజూచుచు నీ యట్టి దురాగతులు గలరే. నీ జేసిన దుష్ట చేష్ట లెల్ల యెరుగుదుననిదూలుచు వీరలెరుంగ కుండినన్.

ద్వి. మాయగాడవు నీవు మర్యాద దెలియవు – గోవింద గోపాల గోపికా లోల
యెవ్వరి వాడవో యేమంచు వచియింతు – యాదవుండవు నీవుయెల్ల రెరుగ
యెటబుట్టి యుంటివో యిటకొచ్చి తగుదననా – ఆడినదాటగా పాడినపాటగా
పూర్వమిచ్చిన మాటపూతమై చెల్లింప – నంద నందన యశోదా నందనుండ
ఆట పాటల తోడ అలరింప నెంతేని – వెన్నల దొంగవై పన్నిన చేష్టల
దుర్నయ బుద్ధివై దుడుకుచేష్టలు జేస్తి – గొల్లభామల గూడి కల్లలాడుట నేర్చి
గోదుగ్ధముల్ ద్రావిగోకులేశుడ వైతి – పాలువెన్నాజున్ను పదియిండ్లలో మెక్కి
గోపాల సతులెల్ల గోలుగోలని యేడ్వ – నవ్వులు చిందించు నల్లగొల్లడ వౌదు
గోవర్ధనంబెత్తి గోవులం గాచితే – వృషభాసురుం దునిమి పస జూపితంటివి
గోపికల వస్త్రాలు కోర్కెతో దాస్తివి – కుర్ర పిల్లవు గావు వెఱ్ఱి చేష్టలు జేయ
కాళీయుమర్దింప గర్వింపతగునయ్యా – ముసలినాగదికాదె ముచ్చటగ నర్తింప
పూతన జంపినా పురుషోత్తమా నీవూ – ఆడదానినిజంపి అధికుండ వెట్లౌదు
మామకంసునిద్రుంప మర్యాదఅగునయ్య – కువలయపీడము కూలంగ జేస్తివి
చాణూరుముష్ఠులం చావమోదితి వన్న – ఇన్నిజేస్తివి వినా సన్నుతింపగ తగవు
తన్వి రుక్మిణి తా తనను బిల్చిన దంచు – యెవ్వరి కెరుకరా కేకాంతమునవచ్చి
మృచ్చిలి పెండ్లాడి ముచ్చువై యుంటివి – రాక్షస వృత్తిమై రాణిగా చేకొంటి
దుర్గుణమ్ములుయిన్ని వెన్నంటియుండగా – అర్ఘ్యంబుగొననీవుఅర్హుండ వెట్లౌదు
మరియును,
జరసంధుజయసింహుయెదురొడ్డిపోరాడ – నిలువలేని నీదునిర్వాక మెరుగనే
పదియారు మారులు పరుగెత్త లేదొకో – పసలేని భీరువు వశవర్తనుండౌనె
యాదవుడు మాధవుడె – వాదు చేయుట గాదు

వ. అని అనేక విధములగు రూక్ష వచనంబుల శిశుపాలుడు ప్రలాపించు చుండ వినివిని సహింపనేరని వాయు నందనుండు కోపోద్రిక్తుండై పండ్లు పటపటం గొరు

కుచు శిశుపాలుం, నమలి మ్రింగుదునా అన్నట్లున్న భీమసేనుంవారింపుచు భీష్ముండ

**ుశిశుపాలుని వృత్తాంతము**

వ. ఇద్దురాత్ముండు చేది దేశస్థులైన సాత్వతీ దమన ఘోషుల కుమారుడు. వికృత రూప జనితుండైన వీనింజూచి ఆ తల్లి రోదించుచుండ నొక యశరీర వాణి ఆమె కిట్లనియె.

క. అతులిత బల జనితుండీ
సుతు నెవ్వరు ద్రుంపలేరు చూపుల కెదురై
ధృతి దూలుచు బహు శోభల
మతిమంతుడు మాననీయ మత్సరు డెంతన్

క. శిశుపాలుడు పుట్టుకతో
నిశచర రూప జనితుండు నిక్కము వినుమీ
నిశువు వికృత రూపంబదె
నాశనమౌ వానిచేత నశియించు ననెన్

వ. అది విన్న యామె సంభ్రమాశ్చర్యంబులు మైకొని తన కుమారుంజూడ వచ్చిన ప్రతి యొక్కనికిని యెత్తుకొన చేతికిచ్చు చుండుటయును అత్త సాత్వతి పుత్రుంబడసె నని విన్న బలరామ కృష్ణు లొకమారు వారల జూడ నేగుట యును సాత్వతి అల్లుం డ్రనిద్దర అత్యాదరంబున ఆదరించి ప్రియ సత్కారముల పూజించి తన పుత్రునితొలు త బలరామునికి యెత్తి కొమ్మని యిచ్చిన తరువాత –

క. అత్తా సాత్వతి తన సుతు
డెత్తుకొనన్ వాసుదేవు కిచ్చిన తోడన్
యెత్తు కొనం వికృతాకృతి
పత్తా లేకుండ పాయె పరమేశు కృపన్

వ. దానిం జూచి సాత్వతి అద్భుత చింతా కులచిత్త యై అశరీరవాణిని మదినిల్పి యున్నది కావున శ్రీకృష్ణుని వలన తన పుత్రుడు అంతంబగుట దలంచిరక్షణార్థంబు అతనితో నిట్లనియె.

క. కరుణా హృదయా మాధవ

తరుణిం నీ బావ చేయు తప్పులు కావం
వరమీయవె అని వేడగ
వరమిత్తును కావ నూరు వరుసన తప్పుల్

వ. అని నారాయణుండువీని తల్లికి అభయ మిచ్చుటం జేసియు అశరీరవాణి కారణంబునను ఆ శ్రీహరి చేతిలో తప్ప నిహతుడు కాడు వీడు. లేకున్న యీ పాటికి నానిశిత బాణ పరంపరాహతి వీని శిరస్సు వేయి వ్రక్కలు కాకున్నె. మారుతాత్మజా అని అనుచుండ విన్న శిశుపాలుడు భీష్ముని దిక్కై చురచుర జూచుచు అంతటి వాడవగుదువే కురుపితామహా నీవు. నీవనుచున్నయట్ల నన్ను రక్షింప మాయమ్మ ప్రార్థింప వరములిచ్చి రక్షించ గలంతటివాడా యీ యాదవ మాధవ శ్రీహరి రాజసూయార్థము పూర్వ పశ్చిమోత్తర దక్షిణ దిగ్దేశ విజయంబు గావించిన పాండవులు బేలలు కావున నీతోపాటు ధర్మజుండును వానితో పాటూ భీమార్జున నకుల సహదేవులును ఆ మాయల మారి యాదవ మానవ మాత్రుని మాధవుడని వేనోళ్ల కీర్తించుట మీ వెఱ్ఱితనమ మీరన్న ఆ యాదవ నారాయణుండు ముల్లోకములను శాసించి పాలించ గలవాడా? తాతలంచిన సమస్త ధరాతల రాజలోకం బేకంబై వచ్చినన్ నిర్జించగల సర్వ సమర్థుడా? అమ్మ సంబంధీకులరని ఆలోచించు చుంటిని కానీ–

క. చైత్యుల కెనయగు ధీరులు
నత్యుత్తమ రాచ మగలు అరుదీ ధరలో
సత్య నియుక్తిమ పరతం
కాత్యాయని శక్తి గొలుచు కర్మో పాశుల్

క. తగుదురె మీమువ్వు రొకట
మగటిమితో బోరి నిల్వ మామక యెదురై
నగుపాలగుదురు సుమ్మా
దుగదుగగా జీల్తు మిమ్ము దుర్దమ శక్తిన్

వ. అని శిశుపాలుండు గర్వించి పలుకు చుండుట విని విని చక్ర ధరుండు రాజలోకం బాలోకించు చుండ శిశు పాలు మొగంబై వీడు తొల్లి –

## శిశుపాలుడు చక్రాయుధ నిహతుడగుట

సీ. భగదత్తుపై మేము భండనమ్మున కేగ
ద్వారకాపురి గాల్చె దయయు లేక
ఆబాల గోపాలు రాటలాడుచు నుండ
చాటు మాటుగ వచ్చి సంహరించె
రతి రంగ సంగమ రాస క్రీడల దోగు
ఆనంద సాగరుల హంతకుండు
దూరుడు క్రూరుడు దర్నయ వృత్తుడు
పాప భీతులు లేని పరమ నీచు

తే. అత్త కిచ్చిన మాటగా అణగి యుంటి
నోరు మూసుకు వినియుంటి నూరు తప్పు
తప్పు తప్పున కొక పిక్క దాచినాడ
అవధి దాటిన వాడయ్యె అంతమొంద
దైవ దూరుడు యెంతేని దండనార్హు
డనుచు చక్రమ్ము విడచెనా చక్ర ధరుడు
శిరసు మొండెమ్ము వేరవగ చేదినాధు

ద్వి. ద్రెళ్లగ తల మొండెమ్ములు రెండుగ – రుధిర ధారలు యెగసి బారె
రూపొందుచు వాగు రీతి – అరిగెను ఆ ఆత్మ జ్యోతి ఆకశ దిశగా
శివ శక్తుల భక్తు డౌట – జనులెల్లరు చూచు చుండ
శివ గణములు తాండవించె – ఖగచరులాడుచు బాడిరి
శిశుపాలుడు అంతమొంద – జయ కీర్తను లగుచు జనులు
కొనియాడిరి చక్రాయుధు – గణుతింపను జగ మెల్లను

వ. అనంత శివశక్తి సంపన్నుండైన శిశుపాలుని ఆత్మ శివసాన్నిధ్యమ్ము చేరుటయు
ను, అనంత శయనుండు శిశుపాల దేహ సంస్కారములు గావింప బంపి వాని
సుతుని చేది దేశ రాజ్యాభిషిక్తుం జేసినట్ల శుభాభి శాంతి దాంతి ప్రవృద్ధ ప్రారంభ
సహృదయంబయ్యె అనేకానేక విఘ్న వినోద ప్రశాంత మనస్కంబయ్యె భూసు

రాశీర్వాదనా మృష్టాన్న పాన సమృద్ధంబై జగన్నాటక జనార్ధన రక్షితంబయి రాజ సూయ మహదాధ్వరంబు పరిసమాప్తం బగుటయును.

చ. అరిదగు రాజసూయ మహాదాధ్వర సిద్ధుని కీర్తి వర్ధనున్
వరగుణ వాసవాది సుర వాహిను లెల్లరు పావనుండనన్
పురజన భూసురోత్మ గురు పూజన తృప్తుని మెచ్చు చుండనా
కురువర కౌరవాన్వయులు కృద్ధత పోయిరి మానసంబులన్

వ. అభిమత కార్య సిద్ధనం తృప్తుండై సభ్రాతృ బంధుమిత్ర సంవృతుండైన ధర్మ నం దను నొద్దకు వచ్చిన నానా దేశా గతులైన భూపతులు యిట్టు లనిరి.

చ. స్థుతమతి కీర్తి తా వినుత సోదర ఐక్యత తేజరింపనా
అతులిత వైభవోజ్వలన అధ్వర దీప్తులు నింగి నంటగా
నతులివె నీకునీ యనుజ నల్వుర మంచిని యిచ్చ మెచ్చుచుం
ధృతిమతు లెల్లరుంబొగడ ధన్యుడ వైతివి ముజ్జగంబులన్

ఉ. చూచుడు రాజసూయ మది సోదరు లిచ్చిన గౌరవంబులున్
మా చెవి మారు మోగ విన మాధవు కీర్తన పూజనాదులున్
పూచెను కల్పకంబనగ భోజన భాజన దాన ధర్మముల్
చాచిన చేతికిం ధనము చాలను దాకను యిచ్చి పంపుటల్

వ. మరియును మనం బెరయ నీ చేయు గౌరవ సత్కారములం జూచి కృతార్థుల మైతిమి. ఇక మా మా దేశములకు మరలెదమని వీడ్కొని చనిరప్పుడు. ధర్మ రాజు వచనంబున భీష్మ ధృతరాష్ట్రాది కురువృద్ధుల భీమసేనుండును యజ్ఞసేను నర్జునుం డును కృప ద్రోణాశ్వద్ధామాది గురుతుల్యుల నకులుండును సపుత్ర కళత్ర కర్ణ శల్య సుబల దుశ్శాసనా జనానీకంబుల సహదేవుండును విరాట్ భగదత్త భూరిద్రధుల దృష్టద్యుమ్నుండును స్త్రీ జనంబుల సౌభద్ర ద్రౌపదేయులును దనిపి అనేక రీతుల సత్కారముల్ సల్పిన యంత–

చ. సుర గరుడోరగాది నృప సోదరు లెల్లరు చోద్యమొందగన్
తరుగని కీర్తి నింపెనని ధన్యత గూర్చుచు ధర్మసూనుకుం
మరువగ లేము యిట్టి మహిమాన్విత హర్మ్యము నంచు మెచ్చుచుం

తిరముగ నేగి నెల్లరును తీయని ఊహల రాజసూయమున్

వ. వసుదేవ నందనుడు పాండునందనుల నందరన్ క్రమమున వీడ్కొని ద్వారవతి కేగుచు ధర్మ నందనున కిట్లనియె.

చ. తిరముగ భూత సంఘముల సేమము నెంచుచు తోడు నీడగా
పురజను లెల్లరుం వినుతి పూజలు సల్పగ ధర్మ యుక్తులై
అరమర లేక సోదరుల నాప్తితొ జూచుచు నెల్ల వేళలన్
ఉరుగుణ శక్తి యుక్తి తగ ఉద్ధతి నేలుము రాజ లోకమున్

వ. మరియును గతము విస్మరించక అప్రమత్తుండవై ప్రజా రక్షకుండవై నీధర్మ విధి నొనరింపు మనిన, నంద నందనునకు ధర్మరాజిట్లనియె.

క. అక్రూర వరద మాధవ
చక్రాయుధ నీదు కరుణ సఫలుడ నైతిన్
విక్రమ సంస్థవ నీయుడ
సత్క్రతు వొనరింప జేస్తి సర్వము నీవే

క. ఆదర కరుణా సాగర
నీ దలచుచు నుందు మెపుడు నిక్కము సుమ్మా
ఏ దరి నున్నను కానీ
సాదరతం జూడు మమ్ము సత్కృప తోడన్

వ. అని వేడుకొని వీడ్కొలుప దారకుడు సారధిగా అనిల జవనాశ్వంబులం బూన్చిన కాంచన మణిమయ ఖచిత యుక్తంబైన రధంబు నధిరోహించి శ్రీకృష్ణ పరమాత్మ ద్వారకకు యేగునప్పుడు పాండునందనులు పాదచారులై దీన మనస్కులై వెన్నంటి కనుజూపు మేర ధృక్కుల నిగిడ్చి జుచుచు యెట్టకేలకు వెను దిరిగి నగరంబు జేరుకొనుటయును.

## పాండు కుమారుల వైభవ ప్రాభవముల జూచి దుర్యోధనుడు మత్సరుడగుట

క. శకునియు దుర్యోధనులరు
చకితులురై పాండు సుతుల సంపద గనుచున్
సకలము చాటుగ జూచుచు

వికలంబగు బుద్ధి తోడ విహ్వాలు రగుచున్

క. అతులిత వైభవ మెన్నగ
మతిచలియించుచును నుండు మత్సర గుణికిన్
స్తుతి పాత్రము సన్మార్గపు
మతి మంతికి మాననీయ మహనీయులకున్

వ. ఇట్లతి రమణీయంబగు నా మయ సభాభవన మందలి శిల్ప కళా కౌశలముం దిలకించుచు దుర్యోధనుం డొకనాడు అందందు దిరుగాడుచు మనోహర మయ్యును అంతయు సవ్యాపసవ్య మాయా జాలమ్ముగా గోచరించుటకు కడు విస్మితుండగుచు నొక్క మణిమయ రమణీయోద్యాన వన మధ్యమ్మున గ్రుమ్మరుచు స్థలమని భావించి యందొక్క జలాశయంబునం బడి పుట్టముల తడుపు కొనుటయును, గోడ యని తెలియక సుందరతర ద్వారదేశంబని జొరనేగి తలపగుల గొట్టుకొనుటయును చిత్రాతి చిత్ర వర్ణ మిళితంబులై చెక్కిన పాలరాతి కుడ్యములందలి పూచిత్రితముల నిజ పుష్పములని భ్రమించి కోయ నేగుటయును సమతల ప్రదేశమ్ముల క్రిందుమీదులుగా భ్రమించి తొట్రిల బడుటయుం జూచిన పరివృత పాంచాలీయుత జనమ్ములు పరిహాసమ్ముగా నగవులు చిందించుటను యెరింగిన ధర్మ తనయుండు భీమునిచేత ధృతరాష్ట్రనందనునకు నూత్న దుకూల ఆభరణములిచ్చి పంపుటయును దుర్యోధనుండట్లు లజ్జావమాన మానసుండై ఇంద్రప్రస్థంబున పాండవుల వీడ్కొని హస్తిపురంబున కరిగి సర్వజనానీ కాకర్షనోత్సవంబైన ధర్మజు రాజసూయాధ్వర వైభవము తన కసూయా ద్వేష జనకంబగుటయును స్త్రీ జనపరిహాస నిర్ఘృత పరాభవాగ్ని తన్ను దహించుచుండుటయును–

క. తిండియు నిద్రయు మానియు
నిండిన బాధా వ్యధలతొ నిలకడ లేమిన్
రండని యెంతయు వేడిన
పొండని తన వారినెల్ల పో పొండనుచున్

వ. తప్త హృదయుండయి యెవ్వరి తోడం బలుకక యున్న ధృతరాష్ట్ర నందనునం జూచి శకుని యిట్లనియె.

ఆ. నిజము దెల్పుచుంటి నీదు మామను కాద
పలుక కుంట తగునె భరము కాదె
ఇభ పురేశ నీదు యీప్సితార్థము దీర్తు
మనసు విచ్చి చెపుమ మర్మ మేల

వ. అని యన దుర్యోధనుం డాతనితో –

## దుర్యోధనుని దురాలోచనము

క. మామా జూచితి వీవును
యేమో అనుకొంటి గాని యెంతయు వింతౌ
భూమీశులు వేలు గొలువ
సామాన్యమె పాండు సుతుల సంపద లెన్నన్

ఉ. నాలుగు దిక్కులం గెలిచి నల్వురు దమ్ములు దెచ్చి నట్టియా
మేలగు రత్న రాశి గని మెచ్చని వారలు పృథ్వి నుందురే
లీల గదా మయా భవన లీలలు లోలుప జేయు నెంతలన్
తూలగ జేయుటబ్బురమ దుస్సహ శక్తుల ఖేద బుద్ధులన్

ఉ. దానవ వైరి చక్ర గతి తప్పనిదై శిశుపాలు దుంచుటన్
దీనత జెంది రెంతయును తేజసమన్వయ రాజలోకమున్
దానన గాదె ధర్మజుడు తద్దయు వెల్గెడు కీర్తి వర్ధిలన్
మాన ధనాఢ్యుడైన కురు మండను డోర్చునె దాయ వృద్ధియున్

వ. వేయేల ఆ మయ సభా భవన మండప మధ్యంబున నే పడిన పాట్లకు–

చ. చులకన జేసి కాదె అట చూచిన ద్రౌపది హేళనా వళుల్
కలుముల కండకావరము కామిత భర్తల అండ దండలున్
తులువ తనంబదెంచ మది దుస్సహ మెంతయు మాన హానియున్
విలవిల కుందె నా మనము వికృతి చేతకు మూలకందమై

వ. ఎవ్విధముననైనను నన్నవమాన పరచిన ఆ పాండవాంగనా లక్ష్ములను కైవసము జేసి కొన కున్నను, వారి నపహాస్య అవమానముల పాలు జేయకున్నను, నా మనోవేదనాగ్ని చల్లారనంత వరకు సహించ నేరనన దుర్యోధునకు మామ శకుని

యిట్లనియె.

ఉ. నీదగు కార్య సాధనకు నిక్కము దెల్పెద ముందు జాగ్రతన్
వాదది రాక యుండ నగు పద్ధతి నీదగు తండ్రి యాజ్ఞయున్
మీదెటు వచ్చినం విభుడు మెచ్చిన బాటనె నిర్వహించుటే
మాదగు కార్యమంచనుచు మన్నన పొందుట నిశ్చయంబగున్

క. అనియపు డల్లుని దోడ్కొని
చనియెం ధృతరాష్ట్ర కడకు సత్వర గతుడై
తనయుని దుఃఖిత విధమది
వినియుండను కోర్కె దీర్ప విహ్వాలు డగుచున్

వ. నాయనా సుయోధనా ఇట్లేలవగచెదవు. నీకు లేనిదేది యీ కురుకులసామ్రాజ్య గౌరవ మంతయు నీదె కాదే? అనుజులు అనుచర భూపతి బంధుజనంబు లెల్లరుం నీ ప్రీతిగా ఏమి చేయుదమ్మనినను సంసిద్ధులు కారే. ఇంద్రతుల్య ఇష్టోప భోగముల నుభవింప సమర్థుండవు. నేనును నీ యిష్టుండనేకదా చెప్పుమన తండ్రికి దుర్యోధను డిట్లనియె.

చ. ఘనతర రాజసుయ శుభకార్యము రమ్మని బిల్వ నంపగా
అనుజులు మెచ్చగా నరిగి తంతియ కాదనలేక యుత్సుకన్
మును మొన ధర్మజుండు నను ముందుగ నిల్పియు కాన్క లందుకో
న్వినయత కోరినన్ కనుల విందుగ నందితి రత్న రాశులన్

చ. తలకొని మేము మేమనుచు తక్కుల మించుచు హెచ్చు వేడ్కతో
యిల గల రాజు లెల్లరును యిష్టత గూర్చిన కాన్క లెన్నగా
కలుముల పంటయా పసిడి కన్నుల జూచుడు ఈర్ష్య పుట్టగా
నలిగితి మానసంబెరయ నమ్ముము నా నుడి కౌరవేశ్వరా

క. సామాన్యులె పాండు సుతు ల
సామాన్య నృప రిపు గెల్చి సాధించిరయా
సామోద్ధతి భయ భక్తుల
ధీమన్యులు బుద్ధి కుశల తేజో నిధులర్

క. విభవత యెన్నగ తరమే
అభవుని సరిసాటి యనగ అన్యాయంబౌ
సభికుల కీర్తన దీప్తులు
నిభమణి కాంతులను మించి నింగిని దాటన్

వ. మరియును వేల వేల మద గాజాశ్వ గోధనంబుల–

క. బలరామ కృష్ణు లంపిరి
తలమానిక రత్న రాశి తలకొక కోటిన్
వెల లేని వస్తు చయముల
కలిమన ఆ పాండవు లదె కౌరవ నాథా

వ. అదియునుం గాక ఆ రాజసూయ మహాధ్వరోత్సవ సందర్భముగా వచ్చిన కాశ్మీర కాంభోజ సింధు గాంధార మద్ర మగధ మాళవ కోశల అంగ వంగ కళింగాంధ్ర ద్రవిడ కేరళ సింహళ సౌరాష్ట్ర మహారాష్ట్ర క న్నడ పుళింద దేశ వాసు లెల్లరు తెచ్చి యిచ్చు కస్తూరీ పుణుగు జవ్వాదికాది మధుర మంజుల సుగంధులును చందన కుంకుమ పూ పరిమళాదులును పట్టు జరీయ నగిషీ దివ్యాంబరాభూషణములును దివ్యౌషధములును గజ దంత వస్తు సంచయములును చూచుచుండుటయునుపర్వత ప్రాంత వాసులైన కోయ గదవ ఆది వాసులు తెచ్చిచ్చు పులిగోరు చర్మంబులునుఅడవి దున్న కొమ్ములును సుక పిక మయూరాది సుందర తర పక్షి సంపదలును రుచి రమ్య ఫల బక్ష్యమ్ము లును తేనె తుట్టలును అశేష భాసుర భూసుర జనానీకంబులతో పాటు గరుడ గంధర్వ కిన్నెర కింపురుష నాక లోక వాసులెల్లరుం పాండు కుమారుల కొనియాడుటయును అనురక్తులైన విరాట్ ద్రుపదులును అనేకానేక వేల గోగజాశ్వంబులతో పాటు దాస దాసీ విలాసినీ జనంబుల నంపుటయును.

క. అలయా ధనసంపద కని
విలవిల లాడెం మనసది వింత గ నెంతో
కలగాంచినటుల దోచును
తలచు కొనన్ వేద నౌచు తపియించు మదిన్

క. వరుసకు లక్షలు వంతున

తరుగని యా అన్నదాన ధర్మము లెన్నన్
ధరయీనిన దమచు వినుప
సురధేనువు కల్పకమ్ము చూడగ వచ్చెన్

వ. అనుటయును తొల్లి కృతయుగ కాలమందు –

క. అపుడయ్హరిశ్చంద్రు డొకడు
యిపుడీ యమ ధర్మ సుతుడు యిద్దరె పుడమిన్
అపురూప రాజసూయము
ఉపమించియు కీర్తి గొనిరి యుద్ధతి మిగులన్

వ. అట్టి రాజసూయాధ్వర సమాప్త సమన్వయ అవభృత స్నాన సమయంబున దేవ మునిముఖ్య పరివేష్ఠితుండైన మహేంద్రు భాతి వెలుగొందు ధర్మజుని నారదాది మహామునుల సహితుండునై ధౌమ్యుండు సకలతీర్ధ కలశంబులన్ అభిషిక్తుం జేసిన.

ద్వి. దేదీప్య మానుడై దేవేంద్ర తుల్యుడై
ద్రౌపదాంగన తోడ దర్పమ్ము మెరయ
అను జన్ములకు మధ్య ఆనంద ముప్పొంగ
అగ్రాసనస్థుడై అభిషిక్తుడై యున్న
పాండవాగ్రజు దివ్య పాదంబులకు మ్రొక్క
ఆ బాల వృద్ధులు ఆలు మగలును గూడి
ప్రఖ్యాతి గొన్నట్టి పుర జనులెల్లరుం
బారులు దీరియు భక్తితో గొలువను
రాజేంద్రు బిడ్డనై రహి వెల్గు రాజునై
తనవారి ముందర తక్కువ వాడనై
మానాభిమానముల్ మంట గలియుచు నుండ
చూచి యోర్వగ లేమి చింతించ కెట్లుందు

వ. నని మిక్కుటంబగు దుఃఖమ్మున గుములు చుండు వానికి మామ శకుని యిట్లనియె.

క. వగచుట తగదుర అల్లుడ
మగధీరుడ కురుకులేశ మామను యుండన్
వగవగ జేతును పాండుల
తగ బిల్చియు జూదమాడ ధర్మజు తోడన్

క. జూదాభి రతుడు ధర్మజు
డాదారిన గెల్చి వారి అవనీ ధనముల్
నీదగు నటు జేతు వినుము
జూదమునకు అనుమతింప జూడుము తండ్రిన్

వ. అనవిని దురాశా దుర్వినీతీ ధనాపేక్షా ప్రేరితుండైన దుర్యోధనుండు తండ్రి పాదములపై బడి తండ్రీ ! దూర మాలోచించి నీ కురువంశ సామ్రాజ్యాభి వృద్ధికై మామ శకుని కైతవ పొంతనమున కనుజ్ఞ నిమ్మని యడుగ వృద్ధ రాజు అర్ధాంగీకార మౌ నుండై యుండ దుర్యోధనుండు తండ్రీ ! దీనికి నీ వొడం బడని నాడు నేను నీ వాడను కానన ఆతురుండై ధృతరాష్ట్రుండు నాయనా సుయోధనా! నేను నీ మాట ను కాదను వాడను కాదు కదా. ఐనను –

క. అతి యాప్తులు భీష్మ విదుర
మతి మంతులు మాననీయ మర్యాదస్థుల్
ధృతి నెగడెడు ధీమంతులు
నుతిగా నొక మాట మాత్ర నుడివిన మీదన్

క. ఇరు పక్ష హితులు వారలు
దురితోప శమన కార్య దుర్దమ శక్తుల్
సరి నాకగు కరుణాంతర
కురువంశపు కీర్తి కామ గురు తుల్యులిలన్

వ. అనిన మీదట దుర్యోధనుండు –

క. గంగా తనయుని విదురుల
అంగీకారముల కేమి అవనీ పతి నీ
అంగీకారమె వలయును

ఇంగిత ఫల సాధనుండు ఇత్తరి మామే

వ. అని దుర్యోధనుండు ధృఢబుద్ధితో పలుక సమయోచిత కాలజ్ఞుండై ఆనందము కల్గు నట్లు అప్పటి కప్పుడు శిల్పాచార్యుల రావించి కనక నవరత్న మణిమయ ఖచిత శత సహస్ర సంభావృతంబును చిత్రాతి చిత్ర యిన్నూరు సహస్ర ద్వార దేశంబుల తోడను అనేకానేక శీతలోదక తటాక పుష్ప వాటికా మణిస్థగిత వేదికా శిల్పాకృతుల తోడను రమ్యాతి రమ్యం బగుచు ఆ మయసభా భవనమును దలపించి మించు వినూత్న ప్రక్రియతో విరాజిల్లు మహోన్నత రాసలీలా విలాస మందిరమును నిర్మిం చునదిగా వచియించి నొక్కనా డేకాంతంబ విదురుని రావించి శకుని దుర్యోధనుల అభిప్రాయము వినిచిన, విని విస్మితుండై విదురుండు కలి ద్వాపరాంతస్థిత విలయ ప్రారంభ డగుట దలంచి వలదనుచు–

**జూదము వలదని విదురుం డనుట**

క. జూద మదనర్థ హేతువు
జూదము దుర్నయము కాదె జోరగుచుండన్
జూదము మైమరపించును
జూదము అపహాస్య కారి సోదరు మధ్యన్

క. తగదీ జూదపు కార్యము
తగులము పుట్టించు కాదె దయనీయమునై
వగపై మిగులును తుదకిది
నగు పాల్గాకుండ చూడు నయవిధ యుక్తిన్

వ. కావున శకుని దుర్బోధలకు దుర్యోధనుడు లోను కాకుండ నీ బుద్ధి యుక్తుల వారించి కురుకుల సంక్షోభమ్ము రాకుండ కులము రక్షింపు మనిన విదురునకుధృ తరాష్ట్రుం డిట్లనియె.

తే. తగవ దేటికి జూదంబు తగులమౌనె
నీవు నేనును భీష్ముండు నిలచి యుండ
సుతుల సౌహార్ధ పందెముల్ జూడ గోర్దు
సంశయింపకు సుంతైన సదయ హృదయ

తే. వేట జూదమ్ము పందెమ్ము వయసు వార్కి
శోభ చేకూర్చు యెంతేని చోద్య మౌచు
అన్ని విధముల సమతుల్యులైన బిడ్డ
లాట లాడుట భావ్యమ్ము అర్హ ఫక్కి

తే. అడ్డు తగులుట సరిగాదు అధిప సుతుకు
యేగి పాండు సుతులు దీన్కి యిష్టులైన
తోడి కొని రమ్ము విదురనీ తోడ వార్ని
విధి విలాసమ్ము సంతోష వార్ధి దేల

వ. అనిన యా ఆంబికేయు మాట కాదన లేక అయిష్ట గతుండై నాపగేయు మంది రమునకుం జని విషయ మంతయు యెరింగించ విన్న గాంగేయుండు యిది చాల చింతింప వలసిన విషయం బనుచు–

తే. పతికి యెదురాడి మాటాడ పాడి గాదు
దుష్ట వర్తన జూదమ్ము తుష్టి యగునె
మాట మాత్రమె అంతంత ఔట కాదె
యెరుగ రానిది విధి కృత మెప్పుడేమొ

వ. పాండు పుత్రుల గొనిరా యింద్ర ప్రస్థమున కేగు మనుటయును ధృతరాష్ట్రుం డు తానిర్మింప బంచిన సభా భవనమ్మును జూడ దుర్యోధను రావించి యేకాంత మున అతనితో–

తే. జూద కార్యమ్ము నీకేల జోదు చెపుమ
యెరుగ నేరుదె గెలుపోటు యెవరి వశమొ
భ్రమలు గొల్పెడు జూదంబు ప్రబలమైన
సర్వ నాశనమై తీరు సమయ ఫక్కి

వ. ధర్మానుజుల సంపదలు నీకేల. ధర్మజుని సంపదల కంటె మిక్కుటమగు రాజ్య విభవ సంపన్నుడవు. నీకిష్టముగా నిర్మింప బనిచిన వైభవోపేతమైన నూత్న సభాభవ నమున నీకిష్టమగు యజ్ఞ యాగాదులు నిర్వహించి భూరిదానాది ధన సంతర్పణము న నీకును నీ కులమునకు కీర్తి ప్రతిష్ఠ లినుమడింప జేయుటయేకాక భారతావని స

ర్వంబును నీదై నిన్ను వేనోళ్ల కొనియాడు దురనిన ధృతరాష్ట్రునితో దుర్యోధనుండు యిట్టు లనియె.

తే. జూదమున గెల్పు మనదౌను జూడు వినుము
మామ మర్మజ్ఞ పాచికల్ మసలుటెల్ల
చేతి వాటమ్ము యెంతేని చెప్పి నటుల
తికమకలు మాని దీటుగా తిరుగుచుండు

వ. వేట లందున ద్యూతమున సంగర రంగ మందున పర మహీపతుల నోడించి గెలుపొందుటక్షత్రి యోచితము. సరి వారల మధ్య చిన్న నై యుండుటయును అల్పు లుధృతులై వెలుగొందు చుండుటయును మానధనుండైన భూపతియోర్వగలడె. అది యునుం గాక ధర్మరాజు చేయు రాజసూయమున కేగి నపుడు ఆ మయసభా ప్రాం గణమున అందందు తిరుగాడుచు ఊహాతీతం బగుచు మాయావరణం బగుచుఉన్న ది. ఉన్నది లేనిది తెలియక క్రిందు మీదులుగా స్థల జల భావంబులం దెలియక దొౖట్రు పడుచు సౌవృత వివృత సవ్యాప సవ్య విషయమ్ము లేమరింప నేరక నాపడిన భంగ పాటుల చూచిన ధర్మానుజులు నవ్వుచు వచ్చి సవ్య మార్గమున నడుపుటయు ను అది యంతయుం జూచుచు పరివార స్త్రీ జనంబులతో పాటు ద్రౌపదియు అవహేళనగా నవ్వులు చిందించుట యును యింకను నా మనంబును వీడక దహిం చు చున్నది. దీని కంతటికిని నీయండ దండల పెరిగి పెద్దలైన వారి కండ కావర రాజ్య వైభవ సంపదలేమూలము కదా? ఆడుది నన్నపహసించుటయా? యెట్టు లైన ను వారి రాజ్య విభవము లన్నియు అపహరించి మానావమానముల పాలు చేయక నా వేదనాగ్ని చల్లారదు. నీ బిడ్డని వేదన నీది కాదె? దీని కన్ని విధముల మామ చెప్పిన ద్యూతమే సరియైన సులభ మార్గము. దీనికొడంబడునది యని ప్రాధేయ పూర్వకముగా పొక్కుచుండు వానిం జూచి శకుని యిట్టు లనియె.

క. కత్తిని బట్టక ధృతి దం
డెత్తక రుధిరంపు మరక యేర్పడ కుండన్
చిత్తుల శాయను పాండుల
నిత్తరి జూద క్రియ యది యింగిత బుద్ధిన్

క. ఇలలో పాండవు గెలుచుట
కలలో విననగు దెలియుమ కదనోద్ధతిమై
సులభోపాయము వొకటది
అలవోకగ నోడు చేయు అక్షత విద్యన్

వ. విదుర భీష్ములు పాండవ పక్ష పాతులు. మన వారల మతము లెప్పుడును ఒకట కానేరవు. ద్యూతమునూ అనాదిగా వచ్చు యుద్ధ క్రీడ వంటిదే. పురాణ ప్రసిద్ధమై దేవ దానవ యక్ష రాక్షసుల వలన అంగీకృతమైనదియే. అని పలుక ఆలోచించి ఆలోచించి యెట్టకేలకు ధృతారాష్ట్రుడా మాటలకు ఒడంబడి అట్లు ప్రవర్తింప శకుని కాజ్ఞ యిడి విదురుం రావించి ఇంద్ర ప్రస్థమున కేగి పాండవాగ్రజునితో నా మాటగా దెల్పు మని బంప–

## విదురుడు ధర్మరాజును తోడ్కొని వచ్చుట

సీ. రత్న కాంతుల శోభ రమణీయ ధృశ్యాలు
రాగరంజితమౌచు రహి వెలుంగ
సౌవర్ణ మణిమయ సమతుల్య సౌధమ్ము
మహనీయ శిల్పమ్ము మధుర మౌగ
కట్టిస్తి సుతు కోర్కె కాదన లేకను
వన్నె కెక్కను చాల వసుధ యందు
పాండవాగ్రజ నీవు పదమిడి జూడను
ఆనంద మెంతేని అనుచు బల్కి
ఆట పాటల తోడ అనుజుల గూడియు
సుస్థిర సౌహార్ధ జూదమాడ

తే. కోర్కె మీరగ కొలువుండ కొన్ని దినము
తివిరి దెమ్మన బంపగా తెంపు జేసి
విధి కృతంబది యెరుగంగ వింత యనుచు
వస్తి ననుచును వచియించె వాస్తవమ్ము

వ. అన విని ధర్మరాజు విదురునితో మీరును వారును మా తండ్రి కంటె యెక్కుడు వారలు. అన్ని విధముల అధికుం డును ఆదరించి పెంచి పెద్ద జేసిన మా పెద తండ్రి ధృతరాష్ట్రుని మాట మీకెంత అనుల్లంఘనీయమో మాకునూ అంతియే కదా. అదియునుం గాక విధికృత మెట్లున్న అట్లు కాక తప్ప దనియును పెద్ద చేసి పిలచిన ప్పుడు పోకుండుట పాడి కాదనియును జూదము దుష్టంబైనను పిలిచి పీట వేసి ఆడ మన్నప్పుడు ఆడకుండుట ఒడిన వానితో సమాన మనియును రాచమర్యాదకు లోట నియును మది దలంచిన వాడా ధర్మజుండు.

క. అనుజ స్త్రీ సహితుండై
చనియెం పెద తండ్రి చొప్పు జనితోద్ధతుడై
పని కట్టుక కరి నగరికి
తనియుచు ఆ తల్లి తోడ తప్పనిసరియై

క. అరదము లధిరోహించియు
చిర పరిచితమైన హస్తి చేరుట తోడన్
పురజను లెల్లరు వడివడి
కరములు జోడించి వెంట కదలుచు రావన్

వ. అట్లు పాండవులు హస్తిపుర రాచనగరు ద్వార దేశంబు చేరుదనుక వారి నెల్లర చిరు నగవులచే సౌంజ్ఞల సంతోషమ్మున వారించుచు వీడ్కొల్పు నంతకు విదురు నా నతి గాంధారీ నగర పరిచారకా స్త్రీ జనంబులు యెదురేగి పాండు మహీపతి పత్ని కుంతీమ తల్లిని పాండవ పట్ట మహిషి ద్రుపద రాజ తనయ ద్రౌపదీ దేవిని గాంధా రీ మహారాణి రాణివాస మందిరమునకు ఆహ్వానించుకొని పోవుటయును–

క. పరమోదారుడు ధర్మజు
అరదము డిగి నడువ వేగ అనుజులు దానున్
సురుచిర మైనట్టి తెరువ
కురు నృపు డున్నట్టి సభకు గురుతర బుద్ధిన్

వ. అందు సుహృద్బంధు మిత్ర పుత్ర శతంబు తోడను భీష్మ ద్రోణ కృపాశ్వద్ధామ కర్ణ సైంధవ సోమదత్త శకుని సమేతుండై నిండు పేరోలగమ్మున కనక మణిమయ

కురు సామ్రాజ్య భద్ర సింహాసన స్థితుండై కొలువై యున్న పెద తండ్రి ధృతరాష్ట్ర మహీపాలు సన్నిధికిచేరి వానికినీ భీష్మాది గురువృద్ధులకును పాండవులు నమస్కరింప ద్రుపద రాజనందన గాంధారీ దేవికి మ్రొక్కి పరిచారికా జనంబుల మధ్య మెల్లని నడకల వచ్చి తానును భీష్మాది కురువృద్ధులకును పెదమామ ధృతరాష్ట్రునకును నమస్కరించిన వారెల్లరును ఆమెను ఆశీర్వదించి పంపుటయును యిట్లు కౌరవ పాండవులు సుహృద్భావ సమాస్వాదను లగుటయును. మరునాడు–

సీ. కురుకుల పెద్దయా కూరిమి ధృతరాష్ట్ర
నిర్మితంబై యెన్న నిర్ధ సౌధి
దుర్యోధనాదులు దర్పులై యెంతొ
ధర్మానుజుల నెల్ల దగ్గరుండి
చూపగ దొరకొన్న చూచుచు మురియుచు
మహనీయ మంచును మధుర భాష
శిల్ప చాతురి హెచ్చు చెల్వు మీరుచు నుండె
గని మెచ్చుచును పాండ్వ లనుజు లధిపు

తే. సంభ్ర మాశ్చర్య చకితమౌసరస యుక్తి
జూద శాలలు నగళుల జూచి మరియు
ఆట పాటల సువిశాల అగళులెన్నొ
ఇంపు మీరగ ఈద్లాడు ఈత కొలను
పొలుపు లెగయంగ జూచుచు పూవు దోట్ల
వృద్ధ రాజును గొనియాడి వహ్వ యనుచు

వ. వచ్చి సుఖాశీన ఇష్ట సంభాషణాది ద్యూత క్రీడా విషయకంబులనున్నంత దుర్యోధనుండు అయ్యుధిష్టిరున కిట్లనియె. ప్రొద్దు పోవుటకై అందరూ ఆనందింప–

క. అన్నా ఆడుదె జూదము
నిన్నెంతురు జూదమందు నేర్పరి వనుచున్
యెన్నో దినముల నుండియు
సన్నుత నీ యాట జూడ సంభ్రమ మగుడున్

వ. అనిన వానికి ధర్మరాజనియె సోదరా!

క. అవకృత జూద ప్రక్రియ
భువి నేలెడు నృపుల కగునె బుద్ధి దలంపన్
కవి పండిత విభుదోక్తుల
సువిదిత కాలంబు గడుప సూకృతి అవదే

క. వ్యసనము జూదము మత్సర
మసమంజస సంఘ దోష మాత్మ క్షోభా
కసి కార్పణ్యంబుల ధుని
బుస గొట్టెడు కాల సర్ప భోగపు నీడౌ

క. జూదము తగదని చెప్పుట
కాదది ఆత్మాభిజాత్య కరణంబౌటన్
సాదర బుద్ధిని పలికితి
కాదందురె బుద్ధి కుశల కార్యోద్యుక్తుల్

క. జూదంబనర్థ హేతువు
జూదము దుర్నయము కాదె జోరగుచుండన్
జూదము మైమరపించును
జూదము అపహాస్యకారి సోదరు మధ్యన్

వ. అనిన వానికి దుర్యోధనుం డిట్లనియె

క. ఉల్లాసపు జూదంబిది
సల్లాపపు ఆట కాదె సంభవ మగుడున్
కల్లా కపటపు ఆటలు
తల్లడిలం జేయు టెల్ల తథ్యము దెలియన్

వ. అనునంత సౌబలుండు కలుగ జేసుకొని దుర్మద ద్యూత రణంబులు రెండునూ సమతుల్య పురుషార్థ పుణ్యకార్యం బులనియే బుద్ధికుశలురైన పెద్దల వాక్యము.ద్యూత కుశలుండవైన నీవిట్లాడుట వింతగ గన్పట్టు చుండె. అదియునుం గాకనాకలోకస్థులు సయితము ద్యూతమునం పెంపెక్కి సుఖోపవిష్ఠులై విష్ణు పద గతులైరని కదా పురా

ణములు పల్కుచున్నవి. వేయేల జూద ప్రియుండవై యుండియు యింత దూరము వచ్చి ఆడ రమ్మన వెనుకాడుటది ఓడుటయే కదా? ఆటా వేటా జూదము లందు వెనుకాడుట రాజధర్మమును కాదు. ఓడుదు నన్నభయమున్న ఉడుగు మన్న నాతని కి ధర్మరాజిట్లనియె.

## ధర్మరాజు శకునితో జూద మాడుట

క. బలవద్యూతార్థినినై
బిలువంబడి ఆడకుంట బీద తనంబౌ
తలపడి ఆడుటె సరియని
తలపడగా జేసె జూద ధర్మంబతనిన్

వ. అటులలా నిర్మల నీతి నిగ్రహ విశాల మనస్కుండయ్యును జూదధర్మ విచక్షణ కుశల దక్షుండు కావున ధర్మరాజు తమ్ముల సముఖంబున దుర్యోధనాదులతో జూద క్రియా కలాపమున ఉద్యుక్తుం డగుటయును అభిమతాక్షంబు లమర్చుకొని కూర్చున్న దుర్యోధన దుశ్శాసన శకుని ప్రభృతుల నెల్లం దిలకించుచు ధర్మరాజు వీరిలో నాతో జూదమాడ గడంగు వారలెవ్వరని అడుగ దుర్యోధనుండాతనితో–

క. నాకై మా మామ శకుని
ఢీకొను జూదమ్ము లోన దిటుగ నీవున్
ఢీకొని పలుకుము పందెము
చేకొను అక్షములు వేగ జేజేలెగయన్

వ. అని తన ముంజేతి కనక మణిమయ రత్నాంచిత మురువు లొడ్డిన ఒకరికొరకై మరియొకరాడుట ధర్మంబనుచు ధర్మతనయుండు భూరి వైభవ భానుప్రభా భాసురం బౌచు వెల్గొందు తన కంఠాభరణము నొడ్డె. ఇట్లు సుహృద్భాసిత భాజన ప్రారంభిత జూదమ్ము క్రమగతిని ప్రవృద్ధం బగుచు నుద్దీపింప జూడ వచ్చిన జనానీకంబులు ఒహొూ ఆహా లెగయించు చుండ విని నచ్చోటికి భీష్మ ద్రోణ ధృతరాష్ట్ర కర్ణ కృపాశ్వ ద్ధామ విదురాది పెద్ద లెల్లరుం వచ్చి చిత్రాతి చిత్రవిచిత్రాసనస్థులై జూచుచు అమం దానంద కందళిత హృదయాంతరస్థులై యుండిరంత.

క. అడిగిన పందెము వేయుచు

మడియుచు నా శకుని మామ మాయా పటిమన్
ఓడం జేయుచు ధర్మజు
నడయాడుచు గెల్చుచుండె నయవిదుడగుచున్

వ. ఉండ ధర్మరాజు తానక్షములం గొని ఒడుతునని వానిం గొని అభిమతాక్షర అక్షంబుల దొలుప నేరక ప్రతి పందెమునను అధృష్ట దేవత కౌరవ పక్షం బగుచు వచ్చుడు క్రమగతిని సంగ్రహ సహస్ర సంఖ్యానక కనక రూక సంచులు లక్షోపలక్ష లుగా గల కోట్ల కోట్ల ధనంబులును వజ్ర వైఢూర్య మరకత మాణిక్య నీల ప్రవాళ ప చ్చ పద్మరాగ మౌక్తి కాది నవరత్న ఖచిత కనకమయ సప్త వాసరసుప్రసిద్ధ ఆభరణభ ూషణ మణులను నల్వురు దమ్ములు నాల్గు దిశల దిగ్విజయములు సల్పి తెచ్చిన మదమత్త వారణ సింధుర యశ్వ రధములను ధనములను రాజసూయ యాగార్ధం బుగా మూర్ధాభిషిక్త రాజన్యులు బహూకరించిన వాహనాది ధన కనక వస్తు సంచ యములును అర్జునునకు చిత్రాంగదుడు బహూకరించిన గంధర్వ హయంబులును శతసహస్ర పరివారికా జనంబులను భోజన భాజన పాత్రాదిక కనకమణి మయ ర జిత సమస్త వస్తు తుల్య సమన్వయంబులును లక్షోపలక్షల సంఖ్యానకంబగు గో మ హిష ఉష్ట్రరా సభ నివహములును నొడ్డుచు ధర్మరాజు-

క. ఓడు కొలందియు మీరుచు
తాడో పేడోయని కడు దయనీయుండై
మేడలు మిద్దెలు నగలను
ఆడుచు ఓడుచు నరవరు డన్నియు వరుసన్

చ. గెలుపను మాటయే యెరగ ఎంతటి వారును వింత నొందుచున్
వలలను జిక్కువడ్డ ఘన వాలువు రీతిని గింజులాడుచున్
మలయుచు మానసంబునను మత్సరు డౌచును తల్లడిల్లుచున్
గెలువడు ఒక్క పందెమును గీచిన గీటు నదేమి చిత్రమో

చ. అల నటు జూదమందు తను దమ్ముల నందర ఒక్కరొక్కరిన్
కలుమల నెల్ల నోడువడె కర్కశు డౌచును ఆశ పెంపునన్
విలవిల వృద్ధు లెల్లరును వింతగ జూచుడు చుట్టు వారలున్

కలగని లేచి కాననటు గారడియో యన కొద్ది సేపటన్

వ. అంతయు జూచుచున్న విదురుండు యిదికపట మాయోపాయ అక్రమ జూదం బని యెరింగిన వాడు కావున రహస్య వచనంబుల ధృతారాష్ట్రునితో–

క. తొలి బిడ్డడు దుర్యోధను
డిల దీప్తుల నెగడ జేయు నెంతయు ననగా
ఖలుడీ దుష్టుడు బుట్టుచు
పలు గాకులు ఘూక నక్క పరిపరి గూసెన్

క. ఒద్దిక లేని గుణమ్ములు
సుద్దగు బుద్ధులు వినుటది శూన్యము మరియున్
పెద్దల గౌరవ మెరుగడు
అద్దిర నీ పెద్ద బిడ్డ అపసవ్యడనన్

వ. ముష్టి ధన మదాంధక దుష్ట బుద్ధుల ప్రాపకంబున మంచి చెడ్డ లాలోచింపక పాప పుణ్యము లెరుంగక వర్తింపుచు భరతపురు కురు ప్రతీప భీమసేన శంతను లాదిగా గల మహానుభావులు పుట్టి యినుమడింప జేసిన వంశ కీర్తి ప్రతిష్ఠ లన్నింటి నిమంట గలుపుచున్న వాడీ దుర్యోధనుండు. దుష్టాంగమును ఖండించి కుల ముద్ధ రించ నగుట రాజ ధర్మము.

క. కమ్మని మాటగ రమ్మని
సమ్మద జూదంబులోన సర్వము దోచిన్
కిమ్మన కుండగ జేస్తిరి
సమ్మతియా యూర కుంట సద్గుణ నీకున్

వ. అని యీ దుష్ట జూద మ్మనపేక్ష్య మధర్మము. ఇంకమీద ఉపేక్షించుట నీకుచి తంబు గాదు. వారింపుమన, పుత్రా పేక్ష పక్షపాతమ్మున ధృతరాష్ట్రుడు మారుపలుక నేర కుండుటయును విదురుండంత దుర్యోధనుల మొగంబై –

క. న్యాయా న్యాయ విదూరుడ
మాయా జూదంబు పన్ని మామయు నీవున్
ధీయుతు డా పాండు సుతుల

శ్రీయును రాజ్యంబు దోయ ఛీయనరె జనుల్

వ. అనిన వానికి దుర్యోధనుడిట్లనియె.

క. కుడిచెడు యింటికి యెడగా
వడి పల్కుచు ఒరుల మెచ్చు వాచాలత మే
మడుగకనె పల్కు టేలది
పెడ నీతులు చెప్పు టొప్పె పెద్దల కైనన్

వ. అనిన వానికి విదురుండు

క. చెడు దాపుర మగు వేళల
కడు నిజమగు పల్కు లెల్ల గర్హిత మగుచున్
చెడ గలపు వారి మాటలె
కడు యిష్టత దోచుచుండు కడకేమగునో

వ. తండ్రి వంటి వాడిని కాన తల్లడ పడుచుంటిని. వినుమని విదురుండు–

తే. విశ్వసించును కుక్కైన విషము దిన్న
అన్న బిడ్డల మంచినే నభిలషింతు
వేరు భావమ్ము లేదెపుడు విజ్ఞతెరుగ
నీవు వారును ఒక్కటే నిజము తెలియు

వ. నేను మీఅందరి మంచినే యెంచువాడ. కావునచెప్పు చుంటిని వినుము. పాండవులు నీవు అన్న దమ్ముల బిడ్డలు. వారును మీరును కలిసి యున్న యీ భూమండల మెల్లను యేల గలరు. పాండవుల తోడి తగవు విరోధ భావము తగదు. ఇంతకుం జెప్పెడి దేమన యీ మాయా ద్యూతమ్ముడుగు మనుచుంటి నని‌నంత శకుని ధర్మ నందనున కిట్లనియె.

క. సర్వము కోల్పోతి ననుచు
నిర్విణ్ణుడవౌదె ధర్మ నిరతుడ నింకన్
గర్విత మతివై ఆడను
ఉర్వీ సతి ధనము లుండె ఒడ్డియు గెలువన్

వ. అనవిని బలవద్వ్యసనాశా పాశ బద్ధుండై పెంపు జేసి దేవ బ్రాహ్మణ మాన్యము ల్ విడిచి తక్కిన మహీతలంబును బ్రాహ్మణుడు తక్క మిగిలిన సర్వ ప్రకృతి జనులను ఒక్కొక్క యొడ్డున యోడువడి చింతించుచు తుదకు ధర్మరాజు–

క. కులసతి నొడ్డియు నోడియు
వెలవెల పోవంగ మోము విహ్వల హృదుడై
విలవిల లాడంగ మనము
జలజల కన్నీరు కార్చె జనితోర్వేదన్

వ. అప్పు డప్పాట నతని జూచిన ద్రోణ కృప భీష్మలాది కురు వృద్ధు లెల్లరుం జాలి యొదువ కన్నీరు మున్నీరుగా కార్చుచు దీనవదనులై దాసులై అన్న వెంట నిలుచున్న భీమార్జున నకుల సహదేవులం జూచి దుష్ట చతుష్టయం బనదగు దుర్యోధన దుశ్శా సన కర్ణ శకునులును సైంధవుండును హర్షాతిరేక పులకితాంత రంగులగుచు హాస్య నగవులం చిందించు చుండ నా కోలాహలముంవిని యిదియేమీ సభా కలకలంబని విదురుని అడుగు సమయంబున పాండవుల సర్వస్వము గెలిచితి నన్న గరువ తనం బున క్రిందు మీదెరుగక నాడు మయ సభాభవనమున తాబడిన యగచాట్లకు అవ హేళనా నగవుల దలంచుచు కృద్ధతం సతీ సమేత ఆ పాండవుల పరాభవింప నెం చిన వాడై దుర్యోధనుండు–

క. వాసవు సతితో సాటిగ
భాసిల్లెడు పాండ్వ సతిని పాపంబనకన్
దాసిగ దలచుచు దెమ్మనె
నా సుకుమారి కులసతిని యవమానింపన్

వ. అనిన ఆ పనికి సహింపని విదురుండాతనితో –

క. మదమెక్కిన మూర్ఖుండన
పది మందియు వినుచు నుండ పాపపు పనికిన్
ముదమాయెర యిటు పలుకను
అదయుడ ఆ మానవతిని అట్లన దగునే

వ. ఇది నీకవమానముగా దోచుట లేదా? ఆమెయుం గూడ కురుకులాంగనయే క దా? దీననయ్యెడు హాని వృద్ధు లెరుంగ కుంటివి. ఇట్టి విపరీత కార్య బుద్ధులుకదళీ వేణు ఫలంబులం బోలె సమూల నాశనమునకు దారి తీయునన యీ విదురుండె ప్పుడునూ అరిష్టములే పలుకుచుండు. పాండవు లనిన వెరచు ననిప్రాతికామి ఆను వానిం బిలిచి నీవుబోయి ద్రౌపది ని తోడ్కొని రమ్మని పనిచిన..

## ప్రాతికామి సభకు ద్రౌపదిని తోడ్కొని రా నేగుట

ఆ. అపుడ యేగి యతడు ఆమున్న నగరికి
వినయు డగుచు మ్రొక్కి అనియె నిటులు
అవని విభుడు మిమ్ము ఆ సభ గొని తేవ
ఆజ్ఞ యిడగ వస్తి నమ్మ యిపుడు

ఆ. ధర్మరాజు లిపుడు ధన సంపదలతోడ
అవని అనుజుల తోడ నతడు మిమ్ము
జూదమందు యోడి జోగిగా మిగిలిరి
యేమనందు నమ్మ యేమి యగునొ

వ. అనుచు కన్నీరు గార్చుచు వచియింప

ఆ. ఎరుగ మెపుడు యిట్టి హేయ్యమౌ జూదమ్ము
ఆలి నొడ్డు వెట్టి అవని పతులు
కనియు వినియు నవదు కార్యమ్ము గతమందు
ధర్మ రాజులుంద్రె ధరణి యందు

వ. ఆ పలుకులు విన్న ద్రౌపది ఆతనితో ధర్మాధర్మ పరేంగితావగాహి గావున

తే. తొలుత దమ్ముల దానును తుదకు నన్ను.
కాక, నన్నోడి ముందర, కడమ తనను,
ఆడి ఓడిన ఆటయా అడిగిరమ్ము.
ధర్మ విజితను కానౌదొ తలప నొక్కొ

వ. అని పలికిన ఆప్రాతికామి ఆమెకు నమస్కరించి వెను దిరిగి ద్యూత సభా ప్రాం గణమున కేగిడి ఆమె పలికిన పలుకులు యధాతధముగా విన్నవింప అటనున్న పెద్ద

లందరును ఆమె యడిగిన ప్రశ్నకు సరియగు నుత్తరము తెలిసీ తెలియనట్లు తెల్లము గావింప నేరనివారలై మిన్నకున్న అందరూ వినుచుండ భీష్ముండు –

క. క్లిష్ట తర ధర్మ మిది సం
స్లిష్టము వివరింప తరమె శిష్టుల కైనన్
స్పష్టంబిది యని తెలుప
నిష్టా నిష్టత కొలదియు నిబిడీ కృతమౌ

వ. ఇందలి ధర్మమును ధర్మాధర్మ విచక్షణా దక్షుండైన ధర్మజుడే తెలుప నగు నన, వినియుం ఓటువడి దుఃఖితాంతర్గతాను భూతుండైన వాడగుట మౌనియై యుండు నంత ప్రాతి కామిని గద్దింపుచు దుర్యోధనుండు–

క. సందిగ్దార్ధము యెరుగను
తొందరగా తోడి తెమ్ము తోయజ నేత్రన్
సుందరి యా పాంచాలిని
కొందల మందంగ పతులు ఘూర్ణిలు మతులై

వ. అనిన వాడునుం పాంచాలి యొద్దకరిగి అమ్మా! మీ యడిగిన యర్ధంబు యెరిం గి దీర్ప నేరక ధర్మరాజులు సహితము పెద్ద లెల్లరుం మౌనము వహించి యూరకున్న దుర్యోధనాదులు మిమ్ము దోడ్కొని రాబంచిరి. రమ్మన దుర్యోధను దురాగతమున కెం తయు వగచి చేయునది లేక ప్రాతికామి వెనుక యేక వస్త్రయయ్యును దీనాశ్రునయ న ధారాకులిత పరి పీడ్యమాన హీన పరిధానాంతరయి అవనతావనీ కృశిత వదన యునై సభకు చనుదెంచి కురువృద్ధు ఆసన సమీపమున నిలువ ద్రౌపదిం చూడనో పక లజ్జిత దుఃఖావమాన మానసులయి తలలు వంచియున్న పాండవుల వైలక్ష్యం బుపలక్షించి దుర్యోధనుడు సంతసిల్లి దుశ్శాసనుం బిలిచి వెరచు నీతడు భీముకు నీవు బోయి ద్రౌపదిం తోడ్కొని రమ్మని పల్కిన –

తరు. పాప నిరతుల నిర్దయాత్ముల పాలబడితి నిదేటి ఖర్మమో
అంచు భీతిలి ఆడ ఆండగ అత్త గాంధరి వెన్క బోవనా
దుష్టశాసను కడ్డు నిలిచియు దుర్నయంబిక చాలు పొమ్మనన్
అమ్మ దోసియు అడ్డు దొలగగ నామె జుట్టది బట్టి యీడ్చుచున్

వ. ఎంత ప్రాధేయ పడుచూ బ్రతిమలాడు కొనుచున్నను విడువక కర్ణ దుర్యోధన శకుని సైంధవ దుష్ట నికృష్ఠ పాప భూయిష్టంబై నిండుకొని యుండు సభకు గొనిదేవం ద్రౌపది కోప లజ్జా వనత వదనయై

ఉ. అదయుడు దుశ్శాసనుడు ఆదట వచ్చియు భీతి లేకనన్
సదయులు జూచు చుండగను సాహస వృత్తిని కొప్పు పట్టియున్
ముదమలరార దెచ్చుటది మోదమె పెద్దకు కౌరవాన్వయుల్
గదియను రారె కాదనగ కౌరవ సొదర ధూర్త వర్తనల్

ఉ. భారత జాతియే చెడెన భామిని నిట్టు లధర్మ వృత్తులై
భోరన యేడ్వ జేయగను బుద్ధి తలంపక పాప భీతకున్
ధీరత కాదనన్ ఒకరు తెంపును జేయరు యోజ చేయ కే
దారుడె దిక్కు నా కనుచు ద్రౌపది కృష్ణు దలంచె యేడ్చుచున్

వ. ఇట్లు ఆ భువనవిజయ జగజ్జేగీయమాన భుజ బల అవిక్ర పరాక్రమ తేజో సంపన్నత సనాథయై యుండియు శకుని దుర్యోధనుల కైతవ ద్యూత వర్తనా విధిపరాజితులై ధర్మ బుద్ధి వర్తనాను బద్ధులై కట్టు బడియుంట అనాథయుం బోలె భయ విహ్వల దుందిల హృదయ విదారితయై జగత్రయీ నాథుండైన శ్రీకృష్ణజగన్నాథుం మది దలంచుచు ధర్మానుజుల దుఃఖిత స్థితికినై పరితపించుచు రూక్షకటాక్ష వీక్షణ వచనంబుల ప్రవర్తించు దానిం జూచి భీమసేనుం డోర్వక –

క. ధనధాన్యమ్ముల పణముగ
వినియుంటిమి కాని యిటుల వినలేదాలిన్
తన సొత్తని జూదమ్మున
అనుమానము లేక నొడ్డ అవనిం గలదే

క. ఒరు బిడ్డను తన దుడ్డుగ
కరుణామయ ఆడ తగునె కాంక్షిత మతివై
నరవరు కైనను తగదిటు
తెరువెరుగని ధర్మరాజ తిరమతి కావో

వ. అని సౌబల సుయోధనుల మొగంబై వీరల కుటిల మాయా ద్యూతమ్మున కాదె యిట్టి అనర్ధ వైపరీత్య మొనగూడెనని కోపోద్దీపనుండై పలికిన వాయునందనునకు అర్జునుండిట్టు లనియె.

తే క్షాత్ర ధర్మమ్ము నెరుగు సుక్షత్రియుండు
ధర్మ రక్షా పరుడయి తడయ కాడె
ధర్మ మార్గమ్ము దప్పునె ధర్మ రాజు
అనుజ ధర్మమ్ము దప్పిన అవని క్రుంగు

తే. విధిని కాదన తరమౌనె వెఱ్ఱి వాడ
పరుల దూషింప వలవదు పాప మదియ
పాప పంకిల ధర్మమ్ము పరము జెరపు
క్షాత్ర ధర్మమ్మె మనల రక్షించు ననుచు

వ. దుఃఖితు లగుచున్న ధర్మజానుజులను దుశ్శాసనావిధి నపకృష్ణయై సభాంతర మున నున్న ద్రౌపదిం జూచి వికర్ణుండు న్యాయాన్యాయ విచక్షణా దక్షులై యుండి యు మిన్న కున్న సభాసదుల మధ్య కేతెంచి యిట్టు లనియె.

క. ధర్మా ధర్మము దెలుపక
కర్మా న్విధికృతము నంచు గమ్మగ నున్నన్
నిర్మల మతులై యుండియు
కర్మోపాశులు జెడుదురు కాంక్షిత ఫలముల్

వ. కావున యిప్పుడీ ద్రౌపది ప్రశ్న కుత్తరము విచారించ కుండుట సభా మార్యాద కెగ్గగు నన, నా దుర్యోధనాదుల దురాగత వృత్తి కెంతయుం వెరచి కురు వృద్ధులును గురోత్తమాచార్యులును మిన్నకున్న సభాసద పెద్దలందు యేవొక్కరైనను ధర్మోద్ధరణకై నిష్పాక్షికముగా తానెరిగిన ధర్మసూక్ష్మములు విచారింపు దనినను యెవ్వరుం బలుక కున్ననా దెలిసిన ధర్మనిర్ణయము దెల్పెద వినుండని–

తే. ఒకరికై ఒకరాడు టనుచిత వృత్తి
విధివిధానపు జూదమ్ము విజ్ఞతెరుగ
ఉమ్మ డాస్తది ద్రౌపది ఒడ్డ గొనగ

ధర్మ తప్పిద మౌనుగా ధర్మ దృష్టి

వ. కావున ద్రౌప దధర్మ విజిత. ఆమె నీ సభకు దెచ్చుట ఉచితమ్ము గాదు. అన్యాయము. అధర్మమ్మని వక్కాణింప వికర్ణు పలుకులకు కొడం బడని కర్ణుండు–

తే. పెద్ద లెరుగని ధర్మాలు పిన్న నీకు
తెలుపనౌ గాదు ధర్మమ్ము తెంపు జేసి
పలుక పాడియె సభలోన ప్రాజ్ఞతౌనె
మిన్న కుండక నీకేట్కి విన్నవింప

వ. ద్రౌపది నధర్మ విజిత నంటివి. ధర్మరాజు సర్వము నొడ్డి నోటు వడి నప్పుడిది అధర్మ మెట్లగును. ధర్మ నందనుడేల మిన్నకుండె మరియును కులసతి నేకవస్త్ర నిటు దెచ్చు టదియును ధర్మాతిక్రమణ మంటివి. ఇది అనేక బర్త్రృక. విధి విహితమైన అర్ధాంగి యెట్లగును. ఇట్టిది మంధకి ఆనబరగు. దీని నెట్లు దెచ్చినం ధర్మ విరోధము కాబడదని ప్రత్యా ్యఖ్యానము చేసి పల్కిన విని దుర్యోధనుండు దుశ్శాసనుండు పాండవులయు ద్రౌపదియు వస్త్రంబు లూడదీయు మనిన దాని నెరింగి ధర్మ రాజానుజులెల్లరుం దమ దమ పైపుట్టంబు లూడ దొడం గుటయును.

## దుశ్శాసనుడు ద్రౌపది పుట్టంబు లొలువ బూనుట

వ. ద్రౌపదియు చేయునది లేక చూచుచుండ–

ఆ. మంచి చెడ్డ యనక మర్యాద కాదన్క
దుష్ట శాసనుండు దుష్ట బుద్ధి
మానసీయ తెంచ్క మాలిన్య చిత్తుడై
ఆడ దాని వలువ లూడ బెఱుక

వ. ఉద్యుక్తుండగుట చూడనేర కప్పాండునందనుల తోడి సభ యెల్లరు పరోన్ముఖులగుటయును ద్రుపద రాజనందన తన పుట్టంబును గట్టిగా కటిస్థలంబున జుట్టుకొని పట్టుకొని భోరన యేడ్చుచుం యెలుగెత్తి–

క. అన్నా! కృష్ణా! రావా!
నిన్నే నమ్ము కొని యుంటి నివ్వగ బాపన్
పన్నుగ జూదం బాడియు

నన్నోడియు బావ లుండ్రి నవనికి క్రుంగిన్

క. మానమె ప్రాణము స్త్రీలకు
దీనను కాపాడ రావె ధీర శరణ్యా!
కానను దారీ తెన్నది
మానిత నీ చెల్లి కావు మాధవ కృష్ణా!

మ. జవసత్వాఢ్యుల భార్యనై అబలనై జాజ్వల్య మానాఢ్యనై
యెవరేమన్గను వీలు లేదనగ నిట్లేర్పడ్డ దుర్నీతికిన్
అవమానమ్ముల బాధ నొందనైతీ అన్యాయము న్బాపవో
భువనోద్ధారక కావవే కరుణ నా పుణ్యం బదెట్లున్నదో

క. అన్నా! కావగ రావో
నున్నా యేడ్చుచు కురుసభ నుద్ధతి తక్కిన్
నన్నాపన్నను దయగను
మన్నా! కరుణాంతరంగ మాధవ కృష్ణా!

వ. దానిం విని ఓర్వక భీమసేనుండు దుశ్శాసనుడు ద్రౌపదికి చేయబూను అవమానాగ్నిని చల్లార్చు కోనేరక అంతర్గత కోపోద్రిక్తుండగుచు పళ్లు పటపటం కొరుకు కొనుచు కాలాంత్క రౌద్ర రక్తాక్షుంబోలిన వాడయిన వానిం జూచుచు సభంతయు భయభ్రాంతు లగుటయును ఆపన్న శరణ్యుండై యెల్లవేళల తన్నమ్మిన వారిని రక్షించువాడును ధర్మ సంరక్షణ దీక్షా పరతంత్రండును ద్వాపరాంతమున యీ భువి నవతరించిన శ్రీమన్నారాయణ వాసుదేవుండా చెల్లి ద్రౌపది ఆపన్న పరిదేవనమ్ము చెవిని పడ,అంతర్గతమున యేకాత్ముండైవీక్షించి అక్షయ వస్త్ర దానము ప్రసాదింప అపుడా దుశ్శాసనుండు ద్రౌపది పుట్టంబులు లాగుచు–

క. ఒలుచు కొలందియు తరుగని
వలువలు కోకొల్ల లౌచు వసుధయు నిండన్
అలుపొందెను దుశ్శాసను
డల విసవిస లాడ్చు డస్సి అవనికి గూలెన్

వ. అంతట భీమ సేనుండు ముందునకు వచ్చి అందరు విన–

క. ద్రౌపది నిట్టుల జేసిన
కా పురుషుని దుస్ససేను కండలు జీల్చిన్
ఆపోసన పట్టి రుధిర
తాపం బది యారు వరకు తాగెద గాకన్

వ. అట్లు చేయ నైతి నేని ఆసత్య దోషం బొడి గట్టుకొని పాప కూపంబున బడిన వాడ నగుదు ననిన, అందరును ద్రుపదపుత్రి వాక్యంబులు విచారింపని కురువృద్ధుల నిందించుచు తమలో సపుత్రకుండైన ధృతరాష్ట్రుకై వగచు చున్నంత నెల్లర వారించి విదురుండు రాజ సభకు వచ్చిన ధర్మ సందేహములు దీర్పరింప నేరకయు దెల్పియు పక్షపాత బుద్ధిన్ ప్రవర్తిల్లు టయు మహా పాతక మనియు మరియును అయ్యధర్మమున పాలు పంచు కొన్నవారగుదురనియు పెద్దల వాక్యంబుగా వినుచుందు మనియును యిట్టివి మాహా భాగవతేతిహాసములం గూడ చెప్పబడిన వనియును ప్రహ్లాదుడు పట్టాభిషిక్తుడై రాజ్యమేలుచున్నప్పుడు తగవునకు వచ్చిన ధర్మార్థ మేర్పరుచుటకు తానే స్వయముగా కశ్యపుని వద్దకు బోయి ధర్మ నిర్ణాయక విషయ విజ్ఞాపనము గ్రహించి తీర్పు చెప్పి ధర్మ మేర్పరచి కీర్తి నందినట్లును పక్షపాత బుద్ధితో ధర్మమును వీడినప్పుడు ఆ యధర్మ దోషంబున అందరును పాలుపంచుకొన్న వారలగుదురనియును కావున బాలుండయ్యును వికర్ణుండాడిన ధర్మ తత్పరతను గర్హించక గ్రహించుట పాడి కాదగుననియును, ద్రౌపది ప్రశ్నయందు ధర్మ బుద్ధి చేయు టుచితంబనియునుపలికి దుర్యోధను భయమున యెవ్వరును పెదవివిప్ప నేరక మూగ జీవు లగుట జూచి ద్రౌపది మనోవేదనం బొందుచు–

సీ. పాంచాలు బిడ్డనై ప్రభ వెల్గు లెగయంగ
అగ్ని యుద్భవ కీర్తి యంది యెంతొ
పాంచాలినై చాల ప్రఖ్యాతి వడసియు
పట్టపు రాణిగా ప్రబలి మిగుల
యాదవ కుల దీప మాధవు చెల్లినై
అందరి మధ్యను అధిపనౌచు
అవని భూపతు లెంతొ ఆదరంబున గొల్వ

తులలేని వైభవాల్ దూగి యిపుడ

తే. పాప భూయిష్ట దుర్మార్గ పాల బడితి
యెరుగ జెప్పంగ లేరొకో యింత మంది
నేన దాసినే యౌదునా నిక్కువంబ
అనుచు వగచెడు నప్పాట ననియె భీష్మ

వ. అవ్వా ! నీ ప్రశ్నకు సూక్ష్మ ధర్మ కుశలుండైన ధర్మజుండు తప్ప వేరెవ్వరును సదుత్తర మియ్యం జాలరు. సూక్ష్మాతి సూక్ష్మ దృష్టులకు సయితముం అనూహ్యమ్ము. దీని ఫలంబు యిక్కురు కుల పాంశు లనుభవింతురు సుమ్మన. అక్కోమలిం జూచి నగుచు–

తే. ఐదుగుర గెల్చి అధిపుడై అలరు వాని
ఒక్కరుని భర్తగా నెంచ నిక్కువంబ
సమ్మతము కాదె తెలియుమా సాధ్వి యనుచు
కర్ణ కటువుగ పల్కెనా కర్ణు డంత

తే. ఊహ మాత్రమె తెలియనౌ ఊరు జూపి
వచ్చి కూర్చొన సుదతినా హెచ్చు వేడ్క
వోర సైగలు చేసె సుయోధనుండు
దాని వీక్షించి భీముండు ధరణి పగుల
కాలదన్నుచు రుద్రుడై కౌరవాధ్మ
యంచు దిట్టి తొడలు ద్రుంతు నంచు మరియు
తనదు వేణి నీదు రుధిర ధార ముడుతు
కౌరవాంగన లెల్లరు కలసి యేడ్వ

వ. అని కనుల నిప్పులు రాల్చుచు క్రోధావేశ వివశుండై జన భయానకముగా నడచుచు తన గదాయుధము దెస పలికించుచు అనుజుల వంక చూచుచున్న భీముని రౌద్రాకారమ్ము గని భీష్మ విదురాది ద్రోణ గురుడును వానిని వారించి ఆగ్రహించుటకు ఇది సమయము కాదని శాంత వచనమ్ముల సమ్మతింప జేయబహు దుర్లభమ్మైన యంత–

క. కౌరవ పతి లో అగళుల
క్రూరములౌ కాక ఘూక కూతలు చెలగెన్
ఆరని వేదన భరమయి
నీరజదళ నేత్రలంత నేడ్పులు పోవన్

క. హెూమాగ్నులు ఆర దొడగె
ధీమన్యులు హడలు కొనగ తేజము లుడిగెన్
యే మంత్రము జపియించిన
ధూమంబై పొగలు కొనగ దుష్టుల మనుచున్

క. ఉత్పాతమ్ములు పొడగని
సత్పురిపాలనకు లోటు సంభవ మగుటన్
తత్పురి వనితలు కడుభయ
తత్పర మతులై బహువిధ తాత్పర్యములన్

వ. రాజ మాత గాంధారీ దేవి యొద్దకు బహు విదార్తులై పర్వులెత్త ఆమె యప్పుడ విదురు న్దోడ్కొని ధృతరాష్ట్రుం కడకు బోయి పాండవ పరాభవమ్మును ద్రౌపది పరిభ వమ్మును దుర్నిమిత్తోత్పత్తియుం జెప్పిన కడుంగడు భయమంది దుర్యోధనుం బిలువ బంచి–

క. పరమ పావని ద్రౌపది
దురితములకు పాలు జేస్తి్వ దుస్సహ బుద్ధిన్
తరతమ మెరుగక పాండుల
పరిభవ మది చూడ గంట్వి పాపం బనకన్

వ. ఇకనైనను వారల యందలి దురాగ్రహ ముడుగుమని కొడుకునకు నచ్చ జెప్పి సకల జన బంధు హితముగా స్వస్థత జేయం దలంచి ద్రౌపదిని రావించి శాంత వచనంబుల కోడం డ్రందరి యందున పెద్ద యంచు కొనియాడి –

క. మహనీయాత్మ గుణావన
సహనోద్ధతి ధర్మ విద్ధ సద్వినుత వనిన్
మహితోజ్వల వంశ చరిత

ఇహ పరముల జూర గొను టడెంతయు కాదే

క. ఉరుతర శీలా వనితవు

కరుణామయ సాదు లందు కడు పెద్ద వహో

వర జనితవు ధర్మ మతివి

వరమడుగుము నెద్దియైన వనితామణిరో

వ. నీ ఆభీష్టం బెద్దియో తెలుపు మన్న అప్పు డప్పాంచాలి ఇట్లనియె.

క. దురితోపశమన సంస్థవ

కురుకుల వంశ వివర్ధన కూరిమి తోడన్

వరదానము తగ నీయుము

కరుణామయ పాండ్వ దాస్య కట్టులు బాయన్

క. తనవారల మధ్యమ్మున

అనుయాయుల తోడగూడి ఆదర వృత్తిన్

జనితోద్ధతులై మెలగుచు

మునుపటిలా మెలగ నౌత ముమ్మాటి కనన్

వ. అటులనే యిచ్చితి నింకొక వరమును కోరుకొనుమన-

క. జూదమ్మున ఓడు వడ్డ అ

సాధారణ అస్త్ర శస్త్ర సంపద లెల్లన్

మోదమ్మున యిచ్చి మరియు

సాదరులై మెలగు వరము సమ్మతి నిడవే

వ. అన్నదానికి సంతోషించి వరమిచ్చి ధృతరాష్ట్రుండు వెండియు మరియొక వరము కోరుకొమ్మనిన దానికి ద్రుపద రాజ నందన నెమ్మదిగా-

క. అడిగిన వెల్లను యిచ్చుట

కడు వేడుక ఔను మీకు కురుకుల భూపా

తొడబడి క్షత్రియ జడిమలు

అడగ దగునె రెండు కంటె అమితపు కోర్కల్

వ. ధర్మ విరుద్ధనై పాపమును పొంద లేనన ధృతరాష్ట్రుండు కోడలి బుద్ధికిని ధర్మ నిరతికిని మెచ్చుకొని ధర్మ రాజాను జుల నెల్లర రావించి వారల సర్వ సంపదలతో గూడిన రాజ్యమును సహితము యిచ్చి ఒప్పించి యెప్పటి యట్ల ఇంద్రప్రస్థ పురంబు న సుఖం బుండుడని మంచి యగునని పంపుచున్–

తే. ఎల్ల ధర్మంబు లెరిగిన యేలికౌదు
వృద్ధు లైయున్న మమ్మెపుడు వదల కుండ
ప్రియము మీరగ జుచుటే ప్రియము మాకు
చేసె దుర్యోధనుండెగ్గు చెనటి యగుచు

క. నేరము నెంచరు మదిలో
దూరము పెద్దల దలచియు దుర్బుద్ధులపై
మీరిన ఉత్తమ పురుషులు
ధీరులునై నిలచి యుంద్రు తేజితు లగుచున్

వ. జూదము నుపేక్షించి నేరము చేసినవాడనైతి. దుర్యోధనాదులు చేసిన దుర్నయ మ్ములు మది వితర్కింపక భ్రాతృ ప్రేమంబున జూచునది. సర్వ ధర్మ విదుండును సమతుల్యుండును ఐన విదురు మంత్రిత్వ గరిమంబునను నీ ధర్మని యుక్తివలనను యిక్కురుకుల గౌరవ రక్షణా దక్షతలు యినుమడింప నగును. మీకు జయమగునని పాండుని రాజ్య మునందు ధర్మరాజు నునిచిన.

ఆ. ఆడుదాని వలన ఆ పాండు సుతులరు
మరల రాజ్యమొంది మహితులైరి
అన్న మాట దలప అవమాన మగుటయు
పాండవేయు కెల్ల బాధ యగుడు

వ. ఐనను పెద తండ్రి మాట వలన ధర్మ రాజార్జున దానిం పెద్దగా దలంపరైరి. కానీ భీమసేనుండు మాత్రము స్వాభి మానుండై మనమ్మున –

ఉ. వీరత గొన్నదే వసుధ విశ్వము లోనన రాజసంబగున్
ఊరక వచ్చినం గొనుట యోగ్యము కాదది భూప జాతికిన్
మారణ హోమముం జరిపి మద్భుజ శక్తిని వైరి ద్రుంచుచున్

ధీరత పోరిలో గెలువ తేజము జూపుట రాజ ధర్మమౌ

వ. నంచు కరం బూహించి కొదమ సింగము వలె చిచ్చర పిడుగై పై కెగయు నాతని కరతలంబున వారించి ధర్మ రాజు ధృతరాష్ట్ర శాసనంబున తమ్ములుం దానును ద్రౌపదీ సహితముగా కాంచన రథా రూఢులై ఇంద్రప్రస్థమున కేగుటయును ఇట దుశ్శాసను చేత అంత వృత్తాంతమును సవిస్థరముగా వినిదుర్యోధనుండు కర్ణ శకుని సైంధవులతో విచారించి తండ్రి యొద్దకు జని ఇట్లనియె.

క. శాత్రవ దాయాద్పక్షుల

మిత్రా మిత్రములరయక మేదిని  ద్రుంచన్

ధాత్రీ పాలక రిపు నృపు

నేత్ర విహీనులుగ రాజ్య నిధనుల జేయన్

వ. తొల్లి మరు న్మహితాత్ములు బృహస్పతి ఇంద్రునకు చెప్పినది కాదే. పాండవుల కెంత జేసియుం హితులము కా జెల్లునే. ఒడలంతయునుం నులిమి కంఠ బింబును నొక్కక విడిచి పుచ్చి నట్లు కార్యము దప్పించిన వారమైతిమి. మాహా పరాక్రమ వంతులైన ధర్మజానుజులు తమతమ ఆయుధములు బట్టి నిలచిన వారల నోర్వ గలుగుటసామాన్యము. కావున వారల నను ద్యూతమ్మున పరాజితులం జేయుట లగ్గగునన ధృతరాష్ట్ర డొడంబడి యుండ యిపు డింద్ర ప్రస్థమున కేగి ధర్మరాజునం దోద్దేర బ్రాతికామిని బంచిన పెద తండ్రి అను నియోగంబునను విధి నియోగ మ్మునను యెంచి కర్మానుబద్ధ బుద్ధి విశేషణులై–

తే. పాండు నందను లేవురు పడతి తోడ

హస్తి పురి జేరి కడు వేడ్క వస్తి మనగ

జూదమాడగ దిగిర యా జోదులనుచు

యెల్ల వారల హృదయాలు తెల్లనౌగ

వ. ధృతరాష్ట్ర నిర్మితంబై యున్న ఆ సభా మధ్యమ్మున యెప్పటి యట్ల సుఖోపవిష్టులై యున్నంత అభిమతాక్ష దక్షుండైన శకుని ధర్మ రాజున కిట్లనియె.

క. ధన సంపద రాజ్యమ్ములు

మునునీ వోడినవి కాన ముచ్చట దీరెన్

వినవౌ వినూత్న పందెము
అనువుగ నీవొడ్డి యాడ అద్భుత మెంతేన్

వ. ఇది అపూర్వంబైన వినూత్నం బైన పణ ప్రక్రియ. దీనియం దోడిన వారు నార చీరలు ధరించి వన భోజ్యంబులైన కంద మూలాదు ల్దినుచున్ బ్రహ్మ చర్యంబున పంద్రెండేండ్లు వనవాసమును తదుపరి జనపదముల నొక యేడు అజ్ఞాత వాసముం జేయుచు బయల్పడినచో మరల పంద్రెండేండ్లు వనవాసమును నొక యేడు అజ్ఞాత వాసముం జేయవలయు. సమ్మతమైన జూదమ్మాడుదము రమ్మన అనుద్యూతార్ధము వచ్చిన వాడనై ఆడకుండు టధర్మమని –

## ధర్మరాజు శకునితో రెండవసారి జూద మాడుట

క. సారెలు గొని తాటోటుగ
ధీరమతిం ధర్మజుండు తేజితుడగుచున్
సారెలు ద్రిప్పుచు నటునిటు
తారావళి వంక జూచి తటుకున నాగిన్

క. మామా ఆడుము అనుచును
ధీమాగా పల్కు పల్కి ధీరోద్ధతుడై
వేమారులు చింతించుచు
మూమాటికి ఒకటి రెండు ముద్దుగ దొలుపన్

క. మామా విసురుము అనుచును
ఈ మారిది చూడు మనగ యింతయు నెంతన్
జామాతలు జూడ శకుని
యీమారిది చూడుమంచు యేమర కుండన్

క. ఇదిగో మాదే గెలుపని
పదిమందియు జూచుచుండ బాధిలు మతియై
కదిసియు విసరగ సారెలు
పదిలముగా ఒకటి రెండు పడియెను వరుసన్

వ. ఇట్లు ధర్మరాజు రెండవమారు జూదమున్న ఓడు వడి శకుని మాయకు తల

వొగ్గి అనుజ స్త్రీ సహితము తమ రాజ్య భోగములు విడచి వనంబులకుం బోవసమ కట్టుటయును భీష్మ ద్రోణ ధృతరాష్ట్ర కృపాది పెద్దలందరుం కరు ణింప ధర్మరాజుతో విదురు డిటనియె.

క. ధృతి చెడి ధర్మానుజులీ
సతి తోడన అడవు లుంట సంభవ మగుటన్
అతి మెత్తన యీ కుంతియ
మతి మంతుడ మాననీయ మాకడ నుండున్

చ. అనుపమ చారులీ అనుజు లందరు ధర్మజ సోదరత్వతన్
మునుపటి యట్టుగా కలసి ముందుకు సాగుడు కార్య సాధనన్
అనువగు రీతులం వెదకి ఆదర బుద్ధుల శాంతి కాములై
కనుగొని మౌని పుంగవుతొ కాలము బుచ్చుచు ధర్మ బద్ధులై

చ. కలుమల పంట యీ చెలియ గౌరవ మెంతన మానసంబునన్
మెలగుడు ద్రౌపదాంగనతొ మెత్తని మాటల సాదరంబునన్
తలచుచు నుండగా నౌత తక్కుల మమ్ముల నెల్ల వేళలన్
అలవడు నంతకుం కఠిన యాటవి కాదుల జీవనోద్ధతుల్

వ. విశేషించి మీ కుల గురువులు ధౌమ్యుం డశేష నీతికుశలుండు. మీ క్షేమమును కోరువాడు. మీరును కృష్ణద్వైపాయనునిచే సుశిక్షితులు. పంచ భూతములు మిమ్మొ రక్షించు చుండు. వన్య క్రూర మృగముల నుండి వాయు నందనుడు మిమ్మెల్ల వేళ లా కాపాడుచుండు. అప్రమత్తులరై మెలగుచుండ నగు. పునర్దర్శనమును వీక్షించు చుండు వారము వెళ్లి రండన గురు వృద్ధానుమతిం తల్లికి మ్రొక్కిన కొడుకుల జూచి కన్నీరు నించుచు కుంతి–

సీ. అపహాస్య మెరుగని అభిమాన ధనులార
అడవుల కేగనా ఔనె యిపుడు
నయనాభిరామమౌ నవ దుకూలము మారు
నార చీరల నెట్టు నలవరింత్రు
పదిమందితో దిన పంచ భక్ష్యాన్నము గాక

కందమూలమ్ముతో కడుపు నింప
పుణ్య భాగిని మాద్రి పాండు భూవిభు తోడ
సుర లోకమున హాయి చూర గొనియె

తే. బ్రతికి యున్నాను నేనిటు పాడు బతుకు
అష్ట కష్టాలు చూడనా అనుగు సుతుల
తరమె విధిరాత తప్పింప తప్పదనుచు
కాల గతి నెంచి యెటులనో గడుప వలయు

వ. అనుచు కోడలు ద్రౌపదిం కౌగలించుకొని యేడ్చుచు

ద్వి. పుట్టి నింటికి మెట్టి నింటికి – పూత చరితవు నెంతయున్
పుట్టి యుంటివి వన్నె తేగను – దిట్టవౌచును యెట్టి విధముల
అడవి జీవన మసుర నెలవది – అబ్బురంబది ఆప్తి జూడుమ
అమ్మ వీవగు అన్నపూర్ణవు – అతిధి దేవుల నాదరంబున
అన్నపానము లన్ని జూడుమ – కన్ను రెప్పగా కాచుచుండుమ
యేవగించకు యెట్టి వేళల – యీసడించకు పతుల నెప్పుడు
అన్న కృష్ణుడు అన్ని తానై – ఉన్న వాడల మిమ్ము కావను
పతుల వెంబడి సహచరించుట – పడతి నీదగు పున్నెమమ్మ

వ. అని కొనియాడి దీవించి కుంతీదేవి విదుర గృహంబున నుండ నేగుటయును.

మ. అతి కోపాగ్నికి ఆలవాలమవుచుం ఆ ధర్మ భీమార్జునుల్
సతి గూడిం నకులానుజా సహితులై సంక్షోభనోద్యుక్తులై
ధృతి నెంతేనియు దూరుచుం జనిరి యా ధాత్రీ నరేంద్రోత్తముల్
పతియా కౌరవ దుష్టులం దునుమగా పాపాగ్ని చల్లారగాన్

ఉ. గమ్ముగ నుండగా దనదు కార్ముక వీచిక శస్త్ర జాలతన్
యిమ్మహి గూల్చగా నవదె యింతకు దీసిన మాయ జూదరిన్
మమ్మిటు జేసెనా శకుని మామను అంతము జూచు నంతకున్
నమ్మిక యిష్ట జూదమది నమ్మక బల్కిన నాల్క జీల్చుతన్

వ. అని ప్రతిజ్ఞలు గొన్న వారలై తమ తమ నిజాయుధముల్గొని హస్తి పురంబు

వెలువడు నంత ధార్త రాష్ట్రుల మందిరముల పెక్కు అశుభ సూచక శకునములు పొడ కట్టుటయును భూమి కంపించుటయును.

తే. ఆజియగు భారతావని అద్భుతముగ
పదియు మూడేండ్లు గడువనా బరగునాడు
పాప పంకిలమౌ ధాత్రి బడయు శాంతి
అనుచు పాడెను నారదుం డాకశమున

వ. ఇవన్నియు విన్న ధృతరాష్ట్రుండు విదురునిం బిలిచి ఇన్ని దుర్నిమిత్తము లకును కొడుకుల దుర్నయ దుర్బుద్ధులే కారణముగా నెంచి వగచుచు ఇంకను యెట్టి అరిష్ట ములు పుట్టునోయని చింతించుచు పాండు నందను లెత్తెరంగున అరణ్యవాసమున కేగిరని అడుగ –

## ధృతరాష్ట్రుడు పాండవులు అడవి కేగిన తీరడుగుట

చ. ముఖమున వస్త్రముం యిడుచు ముందుకు సాగెను ధర్మ బిడ్డయున్
మఖవుని సూనుడుం మరియు మారుతి నందన మాద్రి నందనుల్
సఖియయు ధౌమ్యులుం వరుస సాగిరి ముందుకు అల్ల నల్లనన్
నఖ శిఖ కోపులై గదను నస్త్రము లల్లన మన్ను చిమ్మగాన్

చ. అరిగెను పాండవాంగనయు ఆయత శక్తిని కేశ సంపదన్
విరియగ బోసుకోనయిన వింతగు రీతిగ శోక మూర్తియై
దురితులు కౌరవాధములు దుర్దశ నొందుచు జత్తురో యనిన్
మరియును ధౌమ్యుడేగె తుది మంత్రము లెల్లను వల్లె వేయుచున్

వ. అనిన విని ధృతరాష్ట్రుండు పరితాప దుఃఖిత మనస్కుడై

చ. ఉరుతర శక్తులుం మరియు ఉగ్ర రణాంగన అస్త్ర శస్త్రముల్
పర జనితాత్ములై వసుధ బుట్టిన పాండు నందనుల్
నరవర నాయకా మణులు నమ్మిన భక్తులు దైవతాంశులున్
నడచిరి అన్న దమ్ములని మత్సుతులుండిరి వైరమూనుచున్

వ. ఇటుల వగచుచున్న ధృతరాష్ట్రునకు సంజయుండిట్టు లనియె.

ఉ. అన్నియు దెల్పి నీవిటుల ఆశకు లోనై పుత్ర పక్షమై

ఎన్నియు దెల్పినం విదురు డెంతయు భీష్ములు బుద్ధి పల్కినం
నిన్నటు కార్య రూపమున నిష్కృతి తేటగ మాటలాడుచో
మిన్నక బోవునా దురిత మెంతయు చింతిల నీవు నీసుతుల్

వ. అని విన విదురుండు మరల ధృతరాష్ట్రునితో –

తే. అయిన దేదియో యిప్పటి కైన దింక
చాలు చాలించు వంచనల్ సమత వౌచు
మంచి మించగ పాండుల మరల బిల్చి
యేలుకొమ్మను రాజ్యమ్ము యేక బిగిని
సంతసమ్ముగ సౌహార్ద సత్య వచన
నీదు ధర్మమ్మె కాపాడు నిన్ను మమ్ము
కర్ణ శకునుల మాట లాకర్ణ మగుట
ఇంత ఆయెను వినువింత యింక యెంతొ

తే. అగునొ అను పల్కు ఆకర్ణమైన వినియు
వినని వాడుగ విముఖుడై విదురు పల్కు
చెనటియౌచును గుడ్డిగా చేష్ట యుడిగె
పాప గతులను కాపాడ బ్రహ్మ కగునె

వ. మరియును ధర్మ పక్షపాత విరుద్ధము కానౌత భవిష్య ద్భారత రణ ద్రష్టయైన శాంతనవుండును పాండవులకు యిష్టు డయ్యును ద్రోణాచార్యుండు పాండవపక్షమ్ము న తనకు ప్రతి వీరుండగు దృష్టద్యుమ్మునితో రణంబగుటయుం యెరింగి పాండవాగ మన మును చేయ నొల్లక కరి నగరమున ధృతరాష్ట్ర సహితులై మిన్నకుండుటయు ను, ఇట్లు పాండు నందనులు పాంచాలీ సహితులై ఇంద్రప్రస్థ పురంబున ఇరువది మూడేండ్లు జగజ్జేగీయమానులై రాజ్య పాలన చేసి ఆ శకుని పాప ద్యూత వ్యవసా యంబున పరాజితులై–

క. ఆరణ్యంబుల పాలై
ధీరోద్ధతి సత్య నిరతి ధీరులు పాండుల్
వీరాంగన ద్రౌపదితో

శూరాగ్రేసరు లరిగిరి సుస్థిర మతులై

క. అనెడు సభాపర్వ కథను
విన వైశంపాయనోక్తి విజ్ఞానుండా
జనమేజయ పాండ్వాన్వయు
డిన సన్నిభ రాజరాజ యిద్ధ చరిత్రా!

ఇది

**శ్రీశ్రీ వాణీ వరప్రసాదలబ్ధ సుకవి జనప్రియ సాధుజన విధేయ శ్రీశ్రీ కవిత్రయ స్ఫూర్తి ఆర్వేల నియోగి బ్రాహ్మణ మండపాక వంశోద్భవ వీర్రాజు పౌత్ర సూర్యప్రకాశం సత్యనారాయణాంబా తనయు విరచిత**

**-: శ్రీమదాంధ్ర మహాభారత సభా పర్వ ద్వితీయాశ్వాసము :-**



రచయిత : మండపాక చినజోగిరాజు
పుట్టినస్థలము : వడ్డాది, విశాఖ జిల్లా, ఆంధ్రప్రదేశ్
పుట్టిన తేది : 12 / 07 / 1931
ఉద్యోగము : రిటైర్డ్ టీచర్
అభిరుచులు : గ్రంధ రచన, సత్సాంగత్యము, చిత్రలేఖనము, చదరంగము, సమస్యాపూరణ, ఆశువు
బిరుదులు : కవిరాజు, శ్రీ, మహాకవి

ఇతర రచనలు సూర్యస్థుతి (నక్షత్రమాల),
వేంకటంమణా శతకము (శ్రీనివాస కళ్యాణము)
కళ్యాణ వెంకటేశ (గీత శతకము)
భువన విజయము (పద్య నాటకము)
రామాయణము (కంద పద్య కావ్యము)
శ్రీ కృష్ణ లీలా తరంగిణి
(మహాభాగవత పూర్వాంధ్ధము–పద్య గ్రంధము)
ఉత్తర హరివంశము
(మహాభాగవత ఉత్తరార్ధము–పద్య గ్రంధము)
భగవద్గీత (పద్య గ్రంధము)
కుమార సంభవము (పద్య కావ్యము)
రాఘవ పాండవీయము నకు
(రామాయణార్ధము మరియు భారతార్ధము)
జీవబ్రహ్మైక సిద్ధి (తత్వ విచారణ)
ఉపనిషద్సారము
రంగ రంగ (శ్రీ పాండు రంగ) శతకము
కాళీస్తవము (పద్యములు)
Still Alive (An Immortal)
వాణీ వీణా పాణీ శతకము
కరోనా ప్రహసనము
ఆత్మ ప్రబోధము
దుర్గా స్థుతి
భద్రకాళీ వీరభద్ర పరిణయము